# మహాభారతోపన్యాసములు

( ఉద్యోగ - భీష్మ పర్వములు )

ఆర్షధర్మప్రబోధక - పండిత

## నండూరు సుబ్రహ్మణ్యశర్మ

ఆత్మవిజ్ఞాన గ్రంథమాల

శివాలయం వీధి * సత్యనారాయణపురం

విజయవాడ-11.

## అంకితం

కలిమానవ సముద్ధర్తయై
శేషాచలమున వెలసిన



శ్రీ వేంకటరమణునకు

# విజ్ఞప్తి

*

పాఠకమహాశయులకు —

నేను ఆంధ్రదేశమున నలుబదిసంవత్సరములుగా గావించిన ఆర్షధర్మప్రచారముయొక్క సారసంగ్రహమే ఈ నా మహాభారతోప న్యాసముల ప్రచురణ ప్రయత్నము.

భారతీయసనాతనధర్మమునకు బీజభూతములైన నాలుగువేదముల యొక్క సారమునే వేదవిభాగకర్తయగు వ్యాసభగవానులు అరువది లక్షల శ్లోకములతో మహాభారత ఇతివృత్తమును రూపొందించగా అందు ఒకలక్షశ్లోకములకుపైగా మనభూలోకమున కందినది — మహాభారత గ్రంథము. మన భూలోకమున మహాభారతమును ప్రచారమునుగావించినది వైశంపాయనమహర్షి. అది పదునెనిమిదిపర్వముల గ్రంథము. ప్రస్తుతమున ఆ గ్రంథలక్ష్యములగు ధర్మార్థకామమోక్షము లను పురుషార్థములను పాశ్చాత్యదృక్పథమునగాక భారతీయ సంప్రదాయము ననుసరించి మూలశ్లోకములనే ఆధారముగాగొని నేను ఉపన్యాసరూపమున ఆంధ్రలోకమున కందించిన విషయమును ఆంధ్రు లెరుగనిదికాదు.

చాలమంది శ్రోతలు కేవల కథాసంగ్రహము మా కందించుటకాక శ్రుతిమతతర్కముతో మీరు సమాజమున కందించు ఈ ఉపన్యాసములు భావిసంతతికికూడ పనికివచ్చునట్లు ఉపన్యాసరూపముననే గ్రంథరూపము గావించుట చాల అవసరమని నన్ను ప్రోత్సహించగా నేనీ మహా భారతోపన్యాసముల ముద్రించుటకు పూనుకొంటిని. ఇది భగవత్ప్రేరితము.

ఇంతవరకు సమాజములోని ఉదారులగు దాతల సాయముననే ఆది, సభా, అరణ్య, విరాటములు అచ్చుపడి పాఠకలోకమున కందినవి.

ఇప్పుడు వెలువడిన ఉద్యోగ, భీష్మపర్వములకు రాజపోషకులైన దాతలు కొందరు ప్రోత్సహించగా మరికొందరు పోషకులై ఈకృషికి తోడ్పడినారు. రాబోవునవి ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ, శాంతి పర్వములు.

ఈ ఉపన్యాసముల ప్రచురించుటలోని నా ప్రధానాశయమేమన ఇటీవలి రచయితలు కొందరు వచనరూపమగు కథను మాత్రమే సంగ్రహించినారు. మరికొందరు నన్నయభట్టారకులయొక్కయు, తిక్కనామాత్యులయొక్కయు కావ్యకళాశిల్పమునే పాఠకలోకమున కందించుట జరిగినది. భారతీయవైదికధర్మసిద్ధాంతములు కాలాధీనములై గ్రంథకర్తలచే మార్చబడినవను ప్రథ, పాశ్చాత్యుల పరిశీలనలలోను ప్రతిబింబించగా వాటిని ఆధారముగాగొనియే నేటి పరిశీలకులును స్థూలములగు తమ భావములనే ప్రజల కందించుచుండిరిగాని, సనాతనవైదికధర్మ సామ్రాజ్యస్థాపనకై బయలువెడలిన వ్యాసభారతిని ప్రదర్శించుటలేదనుట యథార్థభాషణము కాకపోదు. ఇందుకొక్క ఉదాహరణను మీకు చూపెదను.

మహాభారతమున శ్రీకృష్ణులు నిజముగా సంధికావింప ప్రయత్నము చేయలేదని ఎందరో నాకు వారివారిభావముల వెలిబుచ్చినారు. అట్లే భారతరచనయందు కర్ణున కెంతయో అన్యాయము జరిగినదనువారును కలరు. వ్యాసహృదయమును పరిశీలింపకయే వారట్లు చెప్పుదురు. ఆంధ్రకవుల వాణి వైదికధర్మసంస్థాపనకే పాటుపడినను నేటి లోకమునకు కలుగు సంశయముల తీర్చుటకు వ్యాసభారతమును ఆధారముగా తీసుకొన్ననేగాని ఆ సంశయముల తీర్పసాధ్యము కాదు.

నేను కథావస్తువునంతను నడపుచు, మూలశ్లోకములనే ప్రధానముగావించి ఆయా సంశయస్థలములయందు వ్యాసభారతిని ఆధారముగాచూపి,

వ్యాసహృదయమును బయటపెట్టిన నీలకంఠచతుర్ధరి వ్యాఖ్యనుదాహరించి నాను. యథార్థమునకు కర్ణుడు - పాండవజ్యేష్ఠుని 'ధర్మమూర్తి'యని కొనియాడిన అమృతసూక్తి ఆంధ్రమునలేదు; వ్యాసభారతి చెప్పినది. పాండవకౌరవ దాయవిభాగమునుగురించి మనకు వివరము కావలెనన్న వ్యాసభారతమును చూచినసే పాఠకులకా సంశయము తీరును. ఇట్లెన్నియో యున్నవి. రాజనీతివిషయములును అట్టివే.

కావున ఆంధ్రలోకములోని భారతీయధర్మజిజ్ఞాసువు లెల్లరును నా ఉపన్యాసముల పఠించి, భారతీయధర్మాసక్తు లగుదురుగాక యని నా ఆర్తహృదయమును వెలిబుచ్చుచు, మా ఆర్షవిజ్ఞాన గ్రంథమాలలో ఈ మహాభారతోపన్యాసముల ప్రచురణకు తమ ఉదార విరాళముల నందించిన దాతలకు, పఠితలకును, ముద్రణలో తమ అవధులమేరకు శ్రద్ధతో సహకరించిన సాకేత ముద్రణాలయమువారికికూడ మహాభారతసారస్వ తాధిష్ఠాతయగు నారాయణుడు ఆయురారోగ్య ఐశ్వర్యముల నందించి కృతార్థులగావించుటకై ప్రార్థించుచు ఇంతతో విరమించుచున్నాను.

చివరిమనవి :

రాబోవు పర్వములకు గూడ భగవత్ప్రేరితులగు దాతలు విరాళ ముల నొసంగి భారతీయధర్మప్రతిష్ఠాపకులు కాగలందులకుగూడ నా విజ్ఞప్తి నందించుచున్నాను.

ఇతి శమ్

'ధర్మస్య జయోస్తు - అధర్మస్య నాశోస్తు - విశ్వస్య కళ్యాణమస్తు'

ఇట్లు,

— గ్రంథకర్త.

# మా గ్రంథమాల కుసుమములు

గీతాహృదయం (కర్మయోగము)

గీతాహృదయం (భక్తియోగము)

గీతాహృదయం (జ్ఞానయోగము)

ఆదిత్యహృదయము

మహాభారతోపన్యాసములు – ప్రథమభాగము.
(ఆది, సభాపర్వములు)

,, – ద్వితీయభాగము
(ఆరణ్య, విరాటపర్వములు)

,, – తృతీయభాగము
(ఉద్యోగ, భీష్మపర్వములు)

* ,, – చతుర్థభాగము
(ద్రోణపర్వము మొదలు ధర్మరాజు పట్టాభిషేకము వరకు)

* మాండూక్యోపనిషత్ప్రవచనములు

## ఆర్షవిజ్ఞాన గ్రంథమాల

సత్యనారాయణపురం – విజయవాడ – 520 011

---

* వెలువడనున్నవి.

## రా జ పో ష కు లు



శ్రీ మాటూరు గోపాలరావుగారు (రిటైర్డు చీఫ్ ఇంజనీర్),
ధర్మపత్ని శ్రీమతి తాయమ్మగారు
హైదరాబాద్ - 39.

గ్రంథ ప్రచురణ నిమిత్తము ఉదారంగా రు. 5116/- లు
విరాళంగా యిచ్చిన దాత.

# రాజపోషకులు



శ్రీ సత్తిరాజు వెంకటలక్ష్మీనరసింహామూర్తిగారు,
ధర్మపత్ని శ్రీమతి లలితాంబగారు
రామంతపూర్, హైదరాబాద్.

గ్రంథ ప్రచురణ నిమిత్తము ఉదారంగా రు. 516/- లు
విరాళంగా యిచ్చిన దాత.

## రా జ పో ష కు లు



శ్రీమతి ఊటుకూరు దుర్గమ్మగారు
మ ధి ర

గ్రంథ ప్రచురణ నిమిత్తము ఉదారంగా రు. 516/- లు
విరాళంగా యిచ్చిన దాత.

## రాజపోషకులు



శ్రీ లగిశెట్టి రత్నయ్యగారు,
వనపర్తి

గ్రంథ ప్రచురణ నిమిత్తము ఉదారంగా రు. 516/- లు
విరాళంగా యిచ్చిన దాత.

# రాజపోషకులు



శ్రీ వైద్యనాధ్ తులసీరామ్ దాపట్కిగారు,
ధర్మపత్ని శ్రీమతి పార్వతిబాయి
సిరిసిల్లా (కరీంనగర్ జిల్లా)

గ్రంథ ప్రచురణ నిమిత్తము ఉదారంగా రు. 516/- లు
విరాళంగా యిచ్చిన దాత.

రా జ పో ష కు లు



కీ॥ శే॥ శ్రీమతి

గంప వరలక్ష్మమ్మగారి

జ్ఞాపకార్థం

వారి భర్త గంప సింగయ్యగారు,

వేములవాడ (కరీంనగర్ జిల్లా)

గ్రంథ ప్రచురణ నిమిత్తము ఉదారంగా రు. 516/- లు

విరాళంగా యిచ్చిన దాత.

ఈ గ్రంథప్రచురణకు రు. 116/- లు దయచేసిన పోషకులు.



| | |
|---|---|
| శ్రీ పుత్తూరు లక్ష్మీనాథంగారు ఎ. సి. టి. ఒ | సిరిసిల్లా |
| శ్రీ గుంజా భూమయ్యగారు - శ్రీ మళయాళ సద్గురుగీతాశ్రమం | ,, |
| శ్రీ రాయంచ జగన్నాథంగారు | ,, |
| శ్రీ విశ్వనాధ్ కాశీరామ్ దావల్జీగారు | ,, |
| శ్రీ సామల రాజమల్లయ్యగారు (జూనియర్ లెక్చరర్) | ,, |
| శ్రీ రుద్ర శంకరంగారు (సర్పంచ్), శ్రీ భోగం రాజేశ్వరంగారు | ,, |
| శ్రీ దిగంబర్ నగుల్వార్‌గారు | ,, |
| శ్రీ కులికాల రాజారామ్‌గారు | ,, |
| శ్రీ ఇరికుల్ల రాజలింగంగారు | ,, |
| శ్రీ రాపల్లి రామలింగంగారు | ,, |
| శ్రీ బుడికె వెంకట రాజేశ్వర్‌గారు సూపర్‌వైజర్ పంచాయతీ సమితి | జగిత్యాల |
| శ్రీ కాసుగంటి నారాయణరావుగారు | ,, |
| శ్రీ బట్టు గోపాలమల్లేశంగారు (అడ్వకేట్) | ,, |
| శ్రీ గట్టు నారాయణగారు | ,, |
| శ్రీ కొటగిరి నారాయణగారు | ,, |
| శ్రీ బోనగిరి జగన్నాథంగారు | ,, |
| శ్రీ గౌరిశెట్టి నాగలక్ష్మి రాజంగారు | ,, |
| శ్రీ బి. హనుమంతుగారు | ,, |
| శ్రీ యస్. హిమాచలరెడ్డిగారు | ,, |
| శ్రీ కె. రాధాకిషన్‌రావుగారు (యస్. ఇ) | ,, |
| శ్రీ యన్. వి. సుబ్బయ్య చెట్టి | ,, |

| | |
|---|---|
| శ్రీ కె. చౌదరరెడ్డిగారు (కాంట్రాక్టర్) | వనపర్తి |
| శ్రీ కె. విద్యాసాగర్ ( ,, ) | మెట్‌పల్లి |
| శ్రీ కె. వెంకటేశ్వర్లుగారు | ,, |
| శ్రీ జి. మధుసూధనరావుగారు | సాతారం |
| శ్రీ జి. సుధాకర్‌రావుగారు | వెంపేట |
| శ్రీ డి. పోచయ్యగారు | ధర్మపురి |
| శ్రీమతి ఎఱ్ఱమిల్లి అన్నపూర్ణమ్మగారు | హైదరాబాదు |
| శ్రీ కొండపల్లి జగన్నాధరావుగారు, అడ్వకేట్ | ,, |
| శ్రీ జి. యస్. రెడ్డిగారు | ,, |
| శ్రీమతి దోసపాటి లక్ష్మీకాంతమ్మగారు | మధిర |
| శ్రీమతి ములకపల్లి తులిసమ్మగారు | ,, |
| శ్రీ యస్. వి. విష్ణువర్ధనరావుగారు | విజయవాడ |
| శ్రీ యన్. సత్యనారాయణగారు (ఎ. ఇ) | శ్రీశైలం ప్రాజక్టు |
| శ్రీ మాకరాజు నారాయణమూర్తిగారు | ,, |
| శ్రీ టి. విశ్వనాధంశాస్త్రిగారు | ,, |
| శ్రీ జయంతి మదనమోహన్ మాలవ్య | ,, |
| శ్రీ కమ్మిలి రామారావుగారు<br>అడిషనల్ అసిస్టెంట్ ఇంజనీర్ (ఎ.పి.యస్.ఇ.బి) | కంచిచర్ల |
| శ్రీ బొడ్ల వెంకటేశంగారు | వేములవాడ |
| శ్రీ కమటాల లక్ష్మీనారాయణగారు | ,, |
| శ్రీ అప్పసాని అంబిరాజుగారు | చోడవరం |
| శ్రీ ఘంటా చిట్టి అబ్బాయిగారు (కంట్రాక్టర్) | నల్లజర్ల (ప.గో॥ జిల్లా) |
| శ్రీ వెలంకి కొండలరావుగారు | ,, |
| కీ॥ శే॥ వెల్లంకి దొరయ్యగారి జ్ఞాపకార్థంవారి కుమారుడు<br>శ్రీ వెల్లంకి గోపాలకృష్ణయ్యగారు | ,, |
| శ్రీ దుగ్గిన గోపాలరావు సోదరులు | ,, |

ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్లో॥ నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమం
దేవీం సరస్వతీం చైవ తతో జయముదీరయేత్.

# మహాభారతోపన్యాసములు

# ఉద్యోగ పర్వము

## ప్రస్తావన

( ఉద్యోగపర్వము - దాని విశిష్టత )

మహాశయులారా !

మన కీనాటికి మహాభారతావ్యాఖ్యానమున నాలుగు పర్వములు గడచినవి. అయిదవది ఉద్యోగపర్వము.

విరాట ముత్తరాభిమన్యుల కళ్యాణఘట్టముతో ముగియగా మహాభారత రణరంగమునకు ప్రారంభమగు సంధిప్రయత్నముతో ఉద్యోగ పర్వము ప్రారంభమైనది. ఉద్యోగ మన ప్రయత్నము. దేని నిమిత్తము ప్రయత్న మనునది ప్రశ్న. సంధి ప్రయత్నమును బట్టి దీనికీ పేరు వచ్చినది. యథార్థమునకు సమర ప్రయత్నముకూడ దీనియందే జరిగినది. అయ్యేను ఇందు రాయబారములకే ముఖ్యస్థానము వచ్చినది. [illegible] భాగమున కింద ప్రాముఖ్యత లేదు. నానారసాభ్యుదయోల్లాసములగు ముఖ్యాల కథాఘట్టమంతయు విరాటమునందే ముగిసినది. కాని 'భారతే సార ముద్యోగః' అని పండితమండలి దీనికొక ప్రత్యేకతను పేర్కొన్నది.

అనగా మహాభారతమునందలి పదునెనిమిది పర్వములలో సారభూతమగు నది ఉద్యోగపర్వమని అర్థము. ఈ సూక్తి దేని నాధారముగా గొని బయలుదేరినది ? కథాభాగము దీనియందు చాల సంగ్రహమైయున్నది. పాండవులు మా రాజ్యభాగమును మాకిమ్మని అడుగుటయు నేనివ్వ దలచలేదని దుర్యోధనుడు సమాధాన మిచ్చుటయే దీనియందలి కథా భాగము. తరువాతది యుద్ధప్రసక్తియే.

మరి పండితుల దృక్పథమున ఉద్యోగపర్వము మహాభార తామ్నాయమున కంతకును సారభూత మెట్లైనది ? ఇందలి కథావైచిత్ర్యము వారి నట్లు పలికించలేదు. ఇందలి ప్రసంగములు వారి నట్లు పలికించినవి. సారగ్రాహులగు పండితుల కిందలి ప్రసంగములు రమణీయార్థ ప్రతిపాదకములు గాకతప్పవు. కావున ఉద్యోగపర్వము సారభూత మగు పర్వమైనది. కాని ఇందు కథావృత్త మసలు లేకపోలేదు. కథయే లేకున్న ప్రసంగముల కాశ్రయమే లేకపోవును. ప్రసంగము లిందు ప్రధానము. కేవలము భారతకథయేగాక ఇందు కొన్ని ఉపకథలును గలవు. నహుషునికథ, గాలవచరితము మొదలగునవి. అవి కేవల కథా భాగములోనివి గాకున్నను కథానుబంధములయ్యే నడచినవి. అది యట్లుండ ప్రసంగములును భిన్నములు గావు. ఒకే ఒక విషయము నాధారముగా గొని ఇందెందరో మాట్లాడినారు. విషయభేదము లేదు. కాని ప్రతివారి ప్రసంగమునందును క్రొత్తదనము లేకపోలేదు. అదియే 'భారతేసారముద్యోగః' అను సూక్తికి ఆధారము గావచ్చును. కావచ్చును, కాదు. ఒకే ఒక కథానుబంధములై నానాముఖములగు సంభాషణలే నడచినను ఆయా వ్యక్తుల ప్రతిభా ప్రభావముల ననుసరించి వారివారి చతురవచోవిలాసములు వినూత్న ప్రసంగములవలె కన్పట్టుటయే ఈ పర్వమందలి సారమనక తప్పదు. ఈ పర్వము ప్రసంగాశ్రయమై సార మగుట కొక్క యుదాహరణను మీకు చూపెదను.

ఉపప్లావ్యమునుండి ద్రుపదమహారాజుయొక్క పురోహితుడగు బ్రాహ్మణప్రవరుడు ధృతరాష్ట్రుని సభాస్థలియం దుపన్యసించుట జరిగినది. తరువాత శ్రీకృష్ణచంద్రులును ఆ సభావేదికపైననే ఉపన్యసించినారు. వారిద్దరును ఒకే విషయమును మాట్లాడిరి. వారి యుపన్యాస సారము పాండవుల రాజ్యభాగము పాండవుల కిచ్చుట న్యాయమని చెప్పుటే. కాని మొదటివారి యుపన్యాసమును గురించి భీష్ముడు విప్ర స్వాభావికమై యున్నదని వ్యాఖ్యానించి, గౌరవించినాడు. రెండవదగు శ్రీకృష్ణచంద్రుని ఉపన్యాసము భీష్మద్రోణాది కురువీరులనేగాక, అనేకమంది రాజశేఖరులను మహర్షులనుగూడ విస్మితుల గావించినది. ఇట్లే సంజయరాయబారముగూడ .కొన్ని చమత్కారములతో నడచినది. విప్ర స్వాభావిక మన నేమి ? జన్మసిద్ధములగు కొన్నిస్వభావములు సృష్టియందట్లే నిలిచియుండును. వాటికే జాతిస్వభావములని పేరు. జాతి ఎప్పుడును జన్మసిద్ధమే. ఒకప్పు డేజాతి యందైనను ఒక వ్యక్తియందు జాతి లక్షణములు లేకపోవచ్చును. అంతమాత్రమున జాతియందొక ప్రత్యేక ధర్మము లేదని అర్థముకాదు. పురుషుని కంఠము స్త్రీ స్వాభావికముగ ధ్వనింపవచ్చును. అంతమాత్రముచే పురుషజాతి ప్రత్యేకతను కోల్పోవదు. అట్లే స్త్రీయందును పురుషచిహ్నములు కన్పట్టిగా ఆ జాతికొక ప్రత్యేకత లేదనుట సరియగు తర్కముగాదు. ప్రతి జాతియందును అవాంతరభేదము లున్నవి. పక్షులన్నియు ఒక జాతియే అయ్యును కాకులు పేరును గ్రద్దలు పేరును గాకతప్పదు. కాకి చావగా గ్రద్దలు దానిని చుట్టుముట్టవు. కాకులే ఆ కాకినిగురించి తమ సంతాపమును తెలియజేయును. అదియే జాతిస్వభావము. అట్లే మానవజాతియందును, కొన్నిభాగములై యున్న అవాంతరజాతులకు కొన్ని ప్రత్యేక స్వభావము లున్నవని భారతీయ శాస్త్రములు చెప్పుచున్నవి. బ్రాహ్మణ క్షత్రియ జాతుల గురించి భారతమొక నిర్ణయమును చేసినది.

ఉ. నిండుమనంబు నవ్యనవనీత సమానము పల్కు దారుణా
ఖండల శస్త్రతుల్యము జగన్నుత విప్రుల యందు నిక్క మీ
రెండును రాజులందు విపరీతము గావున విప్రు డోపు నో
పం డతిశాంతుడయ్యు నరపాలుడు శాపము గ్రమ్మరింపగన్.

ఈ పద్యము ఆదిపర్వమునందలి పద్యము. నన్నయగారి కవిత, ఉదంకో పాఖ్యానము లోనిది. ఉదంకుడను బ్రాహ్మణుడు పౌష్యమహారాజు భార్య యొక్క కుండలములను గురువుగారి భార్యకు కానుకగా తీసుకొనివెళ్ళుటకు రాజుదగ్గరకు రాగా ఆ రాజు యిచ్చిన ఆతిథ్యమునందు వచ్చిన లోపమునకు బ్రాహ్మణుడలిగి రాజును శపించినాడు. రాజుకూడ బ్రాహ్మణుని శపించెను. తరువాత వారిద్దరును శాపముల త్రిప్పుకొందమని రాజును బ్రాహ్మణుడు కోరగా ఆ రాజు చెప్పినమాటయే పై పద్యము. బ్రాహ్మణోత్తమా! నీవు బ్రాహ్మణుడవు. వాక్కు కఠినమై యుండుటయు, మనసు మెత్తనై యుండుటయు బ్రాహ్మణ స్వభావము. నేను క్షత్రియుడను. నావాక్కు మృదుమధురము. మనసుమాత్రము నీవాక్కువలె నుండును. కావున బ్రాహ్మణుడవగు నీవు శాపము త్రిప్పినను నేను త్రిప్పనని చెప్పినాడు. విప్రస్వాభావికమనగా చెప్పదలచిన సత్యమును వజ్రమువలె విసరుట. క్షత్రియ స్వభావమనగా చెప్పదలచిన దానినే రసభావబంధురముగ మల్చి మాట్లాడుట. శ్రీకృష్ణుని చేసిన యుపన్యాసము రెండవకోవకు చెందినది.

కావున ప్రసంగాశ్రయమయ్యె ఉద్యోగపర్వము ప్రసిద్ధమైనది. వ్యాసభారతికి గల వయ్యారమంతయు ఉద్యోగపర్వములోని ప్రసంగముల నాశ్రయించియే ప్రదర్శితమైనదని చెప్పుట కొక ప్రత్యేకత లేకపోలేదు. భారతీయుల రాజనీతిశాస్త్రమునంతను ప్రతిపాత్రయందును ప్రదర్శితముగాగా ఆ నీతివిశారదత్వమును వ్యాసభగవానుడు చక్కని సంస్కృతవాఙ్మయమున ప్రదర్శించినాడు. కాని నీతిశాస్త్రము రెండు

విధములు. ఒకటి ధర్మము నుద్ధరించుటకై వినియోగింపబడునా, రెండవది కేవలవిషయోపభోగములకై వినియోగించు కుటిలనీతి. కాని వ్యాసవాణి కేవలము కుటిలనీతిని యుపదేశింప నుద్దేశించక కుటిలనీతి వికారముల వాగ్విలాసముల కెట్లు సమాధానముల నీయగలిగెనో, కుటిలనీతివలన వచ్చు అనర్థక మేమియో శ్రీకృష్ణధర్మనందనుల ముఖముగ ఈ యుద్యోగ పర్వము ప్రదర్శించినది. సంజయరాయబారమున ధర్మనందను డెంత గడసరియో వ్యాసభారతి వేలుపెట్టి చూపినది. అచ్చట ధర్మనీతిని ప్రదర్శించినది. ఆ ధర్మనీతియు కావ్యకళాత్మకమై పయ్యారపు నడకల నడచినది. వ్యాసభారతమున కావ్యకళాత్మకవైభవము కించిన్మాత్రమని కొందరి యభిప్రాయము. వ్యాసవాల్మీకుల రచనావిధానమున కొంత తారతమ్యము ఉండవచ్చును. అయినను వ్యాసవాఙ్మయమున కావ్య వైభవము కొరతబడలేదు. 'కవి ఋషభుల మహాకావ్య' మనినారని, నన్నయభట్టారకులు చెప్పినారు. అది సత్యము.

అత్తకోడండ్రగు కుంతీ ద్రౌపదుల కేకవాక్యతకూర్చి ఒకరి పలుకుల కెవరిపలుకులు వ్యతిరేకములుగాని ఏకైకసిద్ధాంత మెంత రమణీయముగ వ్యాసభారతి చూపినదో యొకచక్కడ చూపినాను. అది కావ్య సరణియే. అది ప్రసంగాశ్రయమే. అట్లే ఒకొక్కచోట మహర్షి వాగ్వైఖరి భారతనారీమణుల పరమాత్మకై ప్రతిప్రత్య గంభీరవాక్యసంపదలో వేదసీమంతినియై నిలచి, సత్యాదులందరిలక్షణమును వాచ్యముగకూడ ప్రకటించినది. కావున ఈ పర్వము ప్రసంగాశ్రయమయ్యే 'భారతే సార ముద్యోగః' అను పేరును బడసినది. అది యుక్తియుక్తము.

ప్రస్తుతమున ప్రసంగమునుగురించి ప్రసంగించెదను. ఎక్కువ గాదు. కొద్దిభాగము.

ప్రసంగము రెండువిధములు. ఒకవ్యక్తి మరియొకవ్యక్తితో మాటలాడుట. ఇది సామాన్యమగు సంభాషణము కావచ్చును, లేక ప్రౌఢమగు వాగ్వివాదమును కావచ్చును. ఇదియొక భాగము.

రెండవది ఒకేవ్యక్తి వేదికపై నిలచి మాటలాడుట. ఇదియు ప్రసంగమే. కాని దీనిని ఉపన్యాసమని మనము వాడుదుము. ఈ రెంటి యందును చాతుర్యము మెరయగా సత్యము నసత్యముగను, అసత్యమును సత్యముగను ఒప్పింపగలుగు నేర్పరితన మొకకళ. దీనిని తర్క శాస్త్రమున ఛలమని చెప్పుదురు. ఆ కళావైభవ మీనాడు మన రాజకీయ నాయకులం దద్భుతము. వారి యీ యద్భుతకళావైభవమే ప్రజాస్వామ్య మనుపేర మనుగడయై చెల్లుచున్నదికూడ. కాని అనాడును ఈ కళా వైశిష్ట్యముకలవారు లేకపోలేదు. సంజయ రాయబారమంతయు ఈ వాగ్వైభవమునే ప్రదర్శించినది. యథార్థమునకు సంజయుని నైపుణ్యము నంతను నేటివారు ప్రదర్శింపలేరు. సంజయుడు ధర్మమూర్తియై భక్తశిఖామణియై యుండియు ఉపప్లావ్యమున మాత్రము ఈ రెండును బహిర్గతములు కాకుండునట్లు మాటలాడినాడు. ఉద్యోగపర్వము ఈ విషయమున మనకొక యుపాధ్యాయుడు. అది యట్లుండ సత్యమునే చెప్పు చతురవాగ్విలాసములు హృద్యములై చెవులపండువ గలుగ మహనీయులనుగూడ మెప్పింపగలుగు వాక్యసరణి ఈనాడు మన రాజకీయనాయకులకు మృగ్యముకాగా అనాడు అట్టి కళామూర్తిని మన యుద్యోగపర్వము ప్రదర్శించును. అదియే కృష్ణరాయబారము.

ఈపర్వమున సంజయ రాయబార మొక ఘట్టము. కృష్ణ రాయబార మొక ఘట్టము. ఈ రెండుఘట్టములను అందరకును పరిచితములే. కాని అందరును ఎరుగని ఘట్ట మొక టీపర్వమునందున్నది. దీని నీనాటి విమర్శక శిరోమణు లెరుగరు. పాండవుల ధర్మ నిరూఢత్వము కర్ణుని ముఖముననే చాటిచెప్పిన దీ యుద్యోగపర్వమే. ప్రతిపక్ష ముఖముననే ధర్మవీరత్వము నుపదేశించుటకంటె కావ్యరీతి మరియొక టున్నదా? అంతేకాదు. రాబోవు రణరంగమంతయు ఒక మహా యజ్ఞముగ కర్ణుడు వర్ణించినాడు. ఇదియొక చక్కని వేదసారమగు

# సమాలోచనము

అది విరాటుని కొలువుకూటము. ఉపప్లావ్యమున ఉత్తరాభిమన్యుల వివాహము పూర్తికాగా మిత్ర బంధు పురస్సరముగ పాండవులు విరాట నగరమున కేతెంచినారు. విరాటుని రాజధానియంతయు నానాదేశాగత రాజబంధువులతో విరాజిల్లగా ఈనాటి కొలువుకూటమున కొంక క్రొత్తదనము చేకూరినది.

భారతీయ శిల్పకళావైభవముల సంపూర్ణముగ ప్రదర్శించుట కాలంబనములు రాజాసనములు. నాడు భారతదేశమున బంగారమునకు కొరతలేదు. నాడు రాజాసనములు బంగారు పీఠములనుట అతిశయోక్తి కాదు. రత్నగర్భయగు భరతఖండమున రత్నములకు మాత్ర మేమి కొరత? భారతీయుల ఇతిహాసములు వర్ణించిన నాటి రాజవైభవములు వర్ణనామాత్రములుగావు. భారతీయ మహర్షుల ముఖముగ సరస్వతి సత్య స్వరూపిణియయ్యే వైఖరీ వాగ్రూపమున వెలసినది.

వ్యాసభగవానులు విరాటుని సభాస్థలి నిట్లు వర్ణించినారు.

రరాజ సా రాజవతీ సమృద్ధా
గ్రహైరివ ద్యౌర్విమలై రుపేతా.

నాటి రాజాసనములు సువర్ణ వికారము లగుటయేగాక అవి మణిస్థగితములుగూడ నగుటచే, ఆ సింహాసనము లందలి మణికాంతు లును, ఆ యాసనముల నలంకరించిన మహారాజుల సౌవర్ణాంబర భూషణాదుల దివ్యకాంతులును గలసి నానావిధచిత్రవిచిత్ర వర్ణములతో వెలుగొందు గ్రహమండలములుగల సువిశాల సుందర మహాకాశమును బోలి విరాటునిసభ వెలుగొందుచున్నదని వర్ణించినారు.

ఇదియొక భావగర్భితమగు వర్ణనము. భౌతికనాగరికతను మాత్రమే చూపుట దీని యుద్దేశ్యము కాదు. అక్కడ కూరుచున్న రాజమండలమంతయు దివినుండి భువికేతెంచిన పుణ్యమూర్తులనియు, ధర్మనందనుడును శ్రీకృష్ణులును ఆ సభనలంకరించగా ఆ సభకొక విశుద్ధత్వము కలిగినదనియు వ్యాసునిభావము కావుననే పరిశుద్ధద్రవ్యమగు ఆకాశమునకును సహజకాంతుల వెలుగొందుగ్రహములకు పోల్చినారు. భగవంతుని దివ్యతేజము నానారూపములతో చేతనాచేతనములందు భాసించినను ఆ తేజమొక్కొక్కచో ప్రకాశవంతమై వెలుగొందును. అవియే భగవద్విభూతులు. నేటి మహారాజులును, వారు ధరించిన ఆభరణములును గూడ భగవానుని సన్నిధానమున అతడు ధరించిన మణిభూషణములతో గూడి, ఆతని దేహకాంతితో సహవాసమునొంది ఆ సభాస్థలి గగనమండలమైనది. కాంతులు గ్రహకాంతులైనవి. ఇక ఆ సభామంటపమలంకరించిన మహారాజుల సన్నివేశమును గమనింపుడు. ఆ కూరుచున్నవారిలో విరాట ద్రుపదులు వృద్ధభూపతులు. వీరు వయసునందే వృద్ధులు గారు. రాజవంశములందు మాన్యులుకూడ. ఆ కొలువుకూటమున వారిద్దరి యాసనములును ముందుగనే అమర్పబడియున్నవి. ద్రుపదుని ఆసనము ననుసరించి సాత్యకి ఆసనమున్నది. సాత్యకి ప్రక్కనే బలరాముడు కూర్చొనినాడు. విరాటుని సమీపమున శ్రీకృష్ణుడును ధర్మనందనుడును కూరుచుండిరి. ధృష్టద్యుమ్నుడును, భీమార్జుననకుల సహదేవులును ప్రద్యుమ్న సాంబాది కుమారవర్గమంతయు విరాటునిపుత్రులతో పంక్తి తీర్చికూర్చొనిరి. అభిమన్యుడును వారిలోనొకడై సింహాసనము నధిష్ఠించెను. ప్రద్యుమ్నాది కుమారులు యువరాజులు అయ్యును పితృమూర్తుల తేజోబలపరాక్రమములకు తీసిపోవువారు కారు.

ఉపపాండవులును ఈ సభాస్థలియందుండిరి. వారును, పాండవులకు ప్రతిబింబములయ్యే కూర్చుండిరి.

సభాస్థలియంతయు సువాసనలచే గుబాళించబడుచున్నది. అందుకు కారణ మా సభాస్థలియంతయు కుసుమసహస్రములచే కప్పబడి యుండుటేగాక, అగరుధూపములుగూడ పొగలకమ్మి యుండుటే.

అది కేవలము రాజపుత్రులయొక్కయు, వృద్ధభూపతుల యొక్కయు వినోదగోష్ఠికై ఏర్పరుపబడిన సభామంటపముకాదు.

అదియొకవిధమగు సమాలోచన కేర్పరుపబడిన మిత్రమండలి యొక్క సమావేశము. ఆ సమావేశమున ముఖ్యాతిథులై కూరుచున్నవారు విరాట ద్రుపదులు. వారిని నేటి యాలోచనాకార్యక్రమమున ప్రధాన కార్యకర్తలనియే చెప్పవలెను. నేడాలోచించదగిన విషయమేమి ? దుర్యోధనుడు పాల్పడిన అవినీతిని సత్యధర్మముల నధిష్ఠించియే తన జీవితమును గడపదలచిన ధర్మజు డెట్లెదుర్కొని ప్రపంచాభ్యుదయమును స్థాపించవలెననునదే ఈనాటి సమాలోచనలోని ముఖ్యవిషయము. స్వార్థోన్మీలితసౌహృదుడు దుర్యోధనుడుకాగా, క్షత్రియధర్మమునకు భంగమురాని శాంతి జీవనమును గడపదలచినవాడు ధర్మజుడు. విభిన్న దృక్పథములతోనున్న వారి బాంధవ్యమున కెట్లుపొత్తును కల్పింపవలె ననునదే నేడు చర్చనీయాంశమైనది.

ఆ సభాస్థలి యంతయు నిశ్శబ్దమైనది. ఒక్క ముహూర్తమాత్ర కాల మట్లు నిస్తరంగ సముద్రమువలె గంభీరముగనున్న ఆ సభాస్థలి యందు శ్రీకృష్ణులే ప్రసంగమునకు ప్రారంభకులగుట మహా భారతామ్నాయములోని ప్రత్యేకమనక తప్పదు.

ధర్మజుడు తన జీవితపథము ధర్మభంగము కాకుండునట్లును, ప్రపంచశాంతికి విరోధము రాకుండునట్లును దుర్యోధనునిపట్ల ఎట్లు వ్యవహరించవలెను ? అను విషయమును చర్చకు తెచ్చినారు.

ఈనాడు శ్రీకృష్ణుడు మాట్లాడబోవునది కేవలము పాండవపక్షము ననుసరించి కాదు.

రాబోవు ప్రపంచ మహాప్రళయమును గురించియే శ్రీకృష్ణుడు మాట్లాడబోవునది. అతడు పాండవపక్షపాతి కాడా? కాడు. అతడు ధర్మపక్షపాతి. పాండవులను వ్యక్తులపై అతనికి పక్షపాతము లేదు. కౌరవులను వ్యక్తులపై అతనికి ద్వేషము లేదు. పాండవు లాశ్రయించిన ధర్మముపై అతనికి పక్షపాత మున్నది. కౌరవు లాశ్రయించిన అధర్మముపై అతనికి ద్వేషమున్నది. అతడు భగవంతుడుగదా! అత డట్లేల గుణదోషములను గలిగియుండెను? జీవుల నుద్ధరించుటకే అతడా గుణములను స్వీకరించెను. కావున పాండవుల కర్తవ్యమును నిర్ణయించుటకై అతడు మాటలాడ నుపక్రమించినాడు. ఆ మహనీయుని పలు కెట్టిదో వ్యాసులు వర్ణించినారు.

'వాక్యం మహార్థం సుమహోదయం చ.'

శ్రీకృష్ణుని వాక్యములు అర్థగాంభీర్యమున ఉజ్జ్వలములై జీవరాశి కంతకును భావికాలమునగూడ అభ్యుదయమును చేకూర్చునవేగాని కేవలము తాత్కాలికములుగావు. భారతీయ వాఙ్మయ మెప్పుడును తాత్కాలికముగాదు. రాబోవు తరములవారి కది యుపదేశపీఠము.

శ్రీకృష్ణుని యభిప్రాయ మిట్లు ప్రారంభమైనది.

'పాండవులపట్ల దుర్యోధనుడు చూపిన అపనీతి ఎవ్వరెరుగనిది కాదు. దుర్యోధనుడు కపటద్యూతమున పాండవులను పరాభవించెనేగాని సుహృద్ద్యూతమున వారిని గెలుచుకొనలేదు. ఇది సర్వజనవిదితము. అయ్యును పాండవులు దుర్యోధనుడు గావించిన పరాభవములకోర్చి, సత్యవ్రతధురంధరులై పన్రెండు సంవత్సరముల వనవాసమును సంవత్సర మజ్ఞాతవాసమును గావించిరి. క్షమాన్వితులును ధర్మదీక్షితులు

నగు వారి వ్రతదీక్ష సమాప్తమైనది. యుధిష్ఠిరునకు అధర్మయుతములగు రాజ్యభోగము లక్కరలేదు. దేవరాజ్యమైనను అధర్మయుతమగుచో అతడు పరిగ్రహింపడు.

ధర్మార్థయుక్తం తు మహీపతిత్వం
గ్రామేపి కస్మింశ్చిదయం బుభూషేత్.

ధర్మార్థయుక్తమగు సామ్రాజ్య మొక్కగ్రామమునైనను పరిపాలించి తన నిజోచిత క్షత్రధర్మముచే జీవించుట కాతడు నిశ్చయించుకొనినాడు. కాని అట్టి ధర్మమూర్తియొక్క పిత్రార్జితమగు సామ్రాజ్యమును దుర్యోధను డాక్రమించి, పోరాటమునకు సిద్ధముకాగా దుర్యోధనాద కురువీరు లను పోరాటమున నెదుర్కొను సామర్థ్యము తనకున్నను సోదరుల యభ్యుదయమునే కాంక్షించుచు యుద్ధము నాత డిచ్ఛగించుటలేదు. యథార్థ మునకు ధర్మజుడే యుద్ధమునకు సిద్ధమగుచో దుర్యోధనుని బలమెంత ? రాజసూయమున జగచ్చక్రమునంతను పరిభ్రమించి, చతుస్సముద్ర ముద్రిత ధరామండలమున కేకచ్ఛత్రాధిపత్యము నొందిన పాండవజ్యేష్ఠ డీనాడు యుద్ధమునకు తలపడకపోవుట దుర్యోధనాదుల యందలి దయ కాక మరేమియున్నది ? ప్రపంచ కళ్యాణమునే కాంక్షించు ధర్మజు డిట్లుండ దుర్యోధనుని యూహ దీనికి విపరీతమై కయ్యమునకు కాలు దువ్వుచున్నది. వీరి శాంత మెంతయున్నను దుర్యోధనుని లోభిత్వము యుద్ధము నెట్లు కల్పించకుండును ? వీరిద్దరి యుద్ధరంగమును దేశాభ్యుద మునకు హానిని కల్పింపక తప్పదు. కావున మనమందర మిప్పుడే జ్ఞాతి వైరమును పరిష్కరించి దుర్యోధనునకును ధర్మజునకునుగూడ అభ్యుద యము కలుగునట్టి ప్రయత్నమును జేయుటవసరమనియు, అట్టి కార్య మును సాధించవలెనన్న దుర్యోధనుని అభిప్రాయమును, అతని విజ వైఖరినిగూడ కనుగొనుట కొరకు దూతను బంపుట మన కర్తవ్యమనియు, శ్రీకృష్ణులు స్పష్టపరచినారు.

ఇక్కడ శ్రోత లొక ముఖ్యవిషయమును గమనింపవలసి యున్నది. శ్రీకృష్ణు డెప్పుడును దుర్యోధనాదుల నాశమునే కోరుచున్న ఒక విప్లవనాయకుడని ఈనాటి విమర్శకులు విమర్శించుటకూడ లేకపోలేదు. ఇదియే శ్రీకృష్ణుని సంభాషణకు ప్రారంభముకదా ; ఆత డీ సంభాషణయం దేవిధమగు సిద్ధాంతమును ననుసరించినాడో మీరు ముఖ్యముగ గమనింపవలెను.

శ్రీకృష్ణుని ముఖ్యసూత్ర మిది —

పాండవులు దుర్యోధనాదుల జయింపగల సమర్థులగుట తథ్యము. దుర్యోధనుడు రాజ్య మియ్యనిచో యుద్ధము రాకతప్పదు. వారిద్దరి యుద్ధమునందును సుసంపన్నమగు నీ భరతవంశ సామ్రాజ్యమునందలి యైశ్వర్యము నష్టముకాక తప్పదు. ఐశ్వర్యమేకాదు. సేనాబాహుళ్యమును నశించును. కావున సుహృత్తులమగు మనమందరమును దేశాభ్యుదయమును కూడ దృష్టియందుంచుకొని, వీరిద్దరికిని మైత్రి గరుపుట చాల అవసరమనునదే అతని ముఖ్యసూత్రము.

శ్రీకృష్ణుని వాక్యసరణిని గమనింపుడు :

'సమేత్య సర్వే సహితాస్సుహృద్భిః'

సుహృత్తులమగు మనమందరమును రెండుపక్షములకును మేలును చేకూర్చవలెను.

ఇక్కడ 'సుహృద్భిః' అను పదముచే విరాట ద్రుపదలను అందరిని కలిపినారు. సుహృద్భిః – అస్మదాదిభిః – అని నీలకంఠీయము. 'సమేత్య' అను పదములోని సం అను ఉపసర్గను పరిశీలించినచో అది మనకు తెలియును. నీలకంఠులు చక్కగ 'సమేత్య' 'ఉభయపక్షతుల్యం' అని భావార్థమును ప్రకటించినారు. ఇప్పుడు కౌరవ నాశమును శ్రీకృష్ణుడు తలపెట్టె ననువా రేమందురు ?

కాని ఆ దూత ఎట్లుండవలెనో వర్ణించి శ్రీకృష్ణులు మాటలాడు టను విరమించినారు. ఆ దూత ఇట్లుండవలెనని చెప్పినారు.

'శుచిః కులీనః పురుషోఽప్రమత్తః॥
దూతః సమర్థః ప్రశమాయ తేషాం.

ఆ దూత ఇట్లుండవలెనట. కౌరవులవద్దకు వెళ్ళి వారివ్వదగు రాజ్యమును పాండవుల కిప్పించి, యుద్ధమును మాన్పదగు రాయబారమును చేయదగినవ్యక్తి, జన్మయం దుత్కృష్టుడై పరిశుద్ధాంతఃకరణుడై మాటాడదగిన మాటలను సమయమునందు మరవక, అప్రమత్తుడై సమర్థుడుగా ఉండవలెనట. కేవలము కార్యదక్షుడగుట ఒక్కటే చాలదట. అతడు శుచియగు మనస్సుకలవాడగుట మొదటి అధికారము. కావుననే 'శుచిః' అను విశేషణమును మొదటనే వాడినారు. కేవలము శుచి యొక్కటేకాక జన్మయం దుత్కృష్టతకూడ చాల అవసరము కావున 'కులీనః' అను విశేషణముకూడ వాడబడినది. ప్రమాదమన ఏమరుపాటు (లేక) మరపు. అది యున్నచో ఉన్న సామర్థ్యము లన్నియు అడుగంటి నట్లే. కావున 'అప్రమత్తః' అనినారు. అట్టి దూతను పంపవలెనని చెప్పినారు. కాళిదాసు మేఘసందేశమున దౌత్య నిర్వహణను నిర్వహించ దగిన మేఘుని 'జాతం వంశే భువనవిదితే' అనినాడు. జగమెరిగిన వంశమున బుట్టితివనినారు. అంతతో శ్రీకృష్ణుని సంభాషణ పూర్తి యైనది. ఆ మహనీయుని వాక్యము నందరును శిరసావహించి శభాసనినారు. ఇప్పుడు శ్రీకృష్ణుని సంభాషణయందేమి తేలినది? పాండవులు ధర్మాత్మ లనియు, పాండవుల రాజ్యలక్ష్మిని దుర్యోధను డన్యాయముగ కపట ద్యూతమున కాజేసినాడనియు, పాండవులు బలవంతులయ్యును దుర్యోధనాదులను దయతలచి, ఊరకుండిరనియు, పాండవులు వడిన పాట్ల కన్నిటికిని దుర్యోధనుడే కారణమనియు, నేటికిని దుర్యోధను డవినీతి కలవాడయ్యేయుండెననియు, ఇప్పుడుకూడ దుర్యోధనుని

జయించి, సామ్రాజ్యమును తీసికొనదగిన బలవంతులు పాండవులనియు, ఒకవేళ యుద్ధమే ప్రసక్తమగుచో పాండవులకు జయము తప్పదనియు, దుర్యోధను డిప్పుడు రాజ్య మిచ్చుచో యుద్ధము చేయ నిశ్చయించని పాండవులు ధర్మాత్ములని తేలినది.

బలరామకృష్ణు లిద్దరును సోదరులే యయ్యును వారి తత్త్వములు వేరై యుండుట సహజము కాకపోదు. శ్రీకృష్ణునకు పాండవులపై అభిమానముండగా బలరామునకు దుర్యోధనుడన్న పక్షపాత మిష్టము. పాండవు లాతనికి విరోధులా? కాదు. పాండవపక్షమున బలరాము డుదాసీనుడు. దుర్యోధనుడును భీముడును గదాయుద్ధమునం దాతని శిష్యులే. అయ్యును బలరామునకు దుర్యోధనుడన్న ప్రీతి. కారణమేమి? ఆత డదృష్టవంతుడనియు, తెలివికలవాడనియు బలరామున కొక యభిప్రాయముండి యుండవచ్చును. ఈ సభయందు పాండవులను గూర్చియు, దుర్యోధనునిగూర్చియు శ్రీకృష్ణుడు చూపిన అభిప్రాయము బలరామునకు నచ్చలేదు. దుర్యోధనుడు ధర్మజాదుల సరిజ్యావాసము చేయించె ననుమాట ఆతడొప్పలేదు. ఆతని వాద మిది —

ద్యూతపీఠమున పాచికలు పందెమొడ్డి యాడు ఉభయులకును కొలతబద్దవలె పక్షపాత రహితములై, ఆడువారి అదృష్ట దురదృష్టముల నిర్ణయించగా దుర్యోధను డేమిచేసెను? ద్యూతప్రియుడై ధర్మజుడు ద్యూతపీఠమునకు రాగా ఆతని దురదృష్టమే ఆతని నోడించినది. ఇది జరిగినదానిని గురించి బలరాముని అభిప్రాయము. ఇక వర్తమానమున జరుగబోవు దౌత్యనిర్వహణ మెట్లుండవలెను? అను విషయమును గూడ బలరాముని అభిప్రాయము ఖండించినది.

పాండవార్థియై దుర్యోధనుని వద్దకేగి పాండవులకు రాజ్యమిచ్చి యుద్ధమును విరమింపజేయునట్టి దూత దుర్యోధనునివద్దకేగి రాజ్యము నర్థించువిధానమున ఆతడు దుర్యోధనుని శాంతవచనములచే ఒప్పించవలెను

నేర్పరియై యుండవలెనేగాని పాండవబలము నుద్ఘాటించి, పాండవులకు రాజ్యమిచ్చి, వారి క్రోధము నుపశమింపచేసికొనుట నీ కర్తవ్యమని దుర్యోధనుని శాసించి పలుకరాదని దౌత్యనిర్వహణమునుగూర్చి బలరాముడు సలహానిచ్చినాడు. దీని భావమేమి? దుర్యోధను డిచ్చువాడనియు, ధర్మజాదులు పుచ్చుకొనదగినవారనియు, పుచ్చుకొనదలచినవా డెప్పుడైన తన చేతిని క్రిందనుంచువాడగుటచే బింకము చూపరాదనియు బలరాముని యభిప్రాయము. దూత ఇట్టివాడైననే యుధిష్ఠిరునకు మేలు కలుగును గాని దుర్యోధనుని ప్రకోపింపచేయు దూతవలన ధర్మజునకు మేలు కలుగదని నిర్ణయించినాడు. అంతేకాక రెండుపక్షములకును దీనిచే మేలు కలుగునని తన అభిప్రాయమును ప్రకటించినాడు. బలరాముని వాక్యము లివ్వి.

'బ్రవీతు వాక్యం ప్రణిపాతయుక్తం
కుంతీసుతస్యార్థకరం యథా స్యాత్
సర్వాస్వవస్థాసు చ తే న కోప్యా
గ్రస్తో హి సోఽర్థో బలమాశ్రితైస్తైః.
'ప్రియాభ్యుపేతస్య యుధిష్ఠిరస్య
ద్యూతే ప్రసక్తస్య హృతం చ రాజ్యం.

వెళ్ళినదూత ప్రణిపాతయుక్తుడు కావలెనట. దోసిలి ఒగ్గి రాజ్యమును యాచించవలెనట. తాను చెప్పినట్లు చేయుచో ధర్మజున కుపయోగము మొదట కలుగగా తరువాత దుర్యోధనునకును ప్రజలకునుకూడ ఉపయోగము కలుగునని నిర్వచించినాడు. ఒకవేళ దుర్యోధనుడు రాజ్యమివ్వనని పరుషముగ పలికినను వీరు కోపించుట తగదనికూడ తేల్చిచెప్పినాడు. శకునికూడ ఈ ద్యూతమునందు పాండవుల కపరాధము చేసినదేమియు లేదనియే బలరాముని వాదము. పందెమున ఓడినప్పుడెల్ల రోషము విజృంభింపగా ధర్మజుడే శకునిని కవ్వించి పందెముల పెట్టినాడుగదా!

దానియందు శకుని తప్పేమున్నది ? శకుని తప్పులేదు. కావున సామోపాయమునే ధర్మజుడు స్వీకరించుట యుక్తము.

'సంరంభమాణో విజితః ప్రసహ్య
తత్రాపరాధశ్శకునేర్న కశ్చిత్
తస్మాత్ ప్రణమ్యైవ వచో బ్రవీతు
వైచిత్ర్యవీర్యం బహుసామయుక్తం.

ఇది బలరాముని వాదము. నేడు మన సోదరులు మాటాడు మాటను నాడే బలరాముడు మాటాడినాడు. ఒకనియందు గల అనురాగము ఆతని యందు గల దోషమును చూడనివ్వదు. ద్వేషము గుణమును చూడ నివ్వదు. బలరామునకు దుర్యోధనుని యందుగల అనురాగము దుర్యోధనుని యందుగల దోషమును చూడనివ్వలేదు. సాత్యకియు శ్రీకృష్ణ బలరాములకు సోదరుడే. కాని జ్ఞాతిసహోదరులలోనివాడు. బలరాముని పక్షపాత నిర్వచనము సాత్యకి హృదయము నొక్కమారు కలవర పరచినది.

సార్వభౌమ పీఠము నధిష్ఠించిన యుధిష్ఠిరుడు దుర్యోధనుని యాచించుటయా ? ధర్మజుడే ద్యూతప్రియుడై శకునిని ఆహ్వానించెనా ? దుర్యోధన శకునులు నిర్దోషులా ? బలరాముని ఉన్మత్త ప్రలాపములనే సహించుటయా ? అన్న సాత్యకి హృదయవేదనము సాత్యకిని నిలువ నివ్వలేదు. అతివేగమున ఆసనమునుండి లేచినాడు. రోమ ముద్వెచిన ముఖమండలముతో బలరాముని మాటకు ఆతనిపై పలుకు తిరిగి సమాధాన మిట్లు చెప్పినాడు.

శ్లో॥ యాదృశః పురుషస్యాత్మా తాదృశం సంప్రభాషతే
యథా రూపోంతరాత్మా తే తథా రూపం ప్రభాషసే॥

ఎవ్వని ఆత్మ ఎట్లుండునో వాడు అట్లు మాట్లాడుచుండును. ఆత్మ శుద్ధమగుచో శుద్ధముగ మాట్లాడును. పాపాత్మ యగుచో పాపముగనే భాషించును. అంతే. కేవలము జన్మకు సంబంధించి మాటాడుట యనునదిలేదు. ఒకే ఒకచెట్టునకున్న రెండు కొమ్మలలో ఒకకొమ్మ ఫలవంతమైయుండ వేరొకటి ఫలరహితమై కాయ, పూవు, పిందైనను కలిగియుండదు. వసుదేవనందనుడైన శ్రీకృష్ణునకు సోదరు డగుటకును, ధర్మముల విచారించుటకును సంబంధ మేమున్నది ? బలరామా ! నీ వాక్యములను నేను ద్వేషించను. నీకు తగినట్లు నీవు మాటాడినావు. నీ మాటల వినువారిని మాత్రము నేను నిందించి, ద్వేషించకుండ ఉండ జాలను. సుహృద్ద్యూతమనుపేర ధర్మజుని ఆహ్వానించి, మాయా ద్యూతమున నేర్పరియైన శకుని, జూదముల కపటతంత్ర మెరుగని ధర్మజుని ఓడించగా అది ధర్మజయ మెట్లైనది ? ధర్మనందనుని గృహమందే ధర్మజునితో ఆడినచో అనాడు ధర్మజయము కావచ్చును. క్షత్రధర్మనిరతుడై ద్యూతమున కాహ్వానింపగా వెనుదిరుగనను వ్రతము గల ధర్మజుని ద్యూతమున కాహ్వానించి, పందెమొడ్డిన దొకరును పాచికలవేసిన దొకరునై ద్యూతమున చేయదగిన పాపమునంతనుచేసి జయము నొందగా అది ధర్మజుని దురదృష్టమైనదా ? అది యట్లుండ వనవాసమునుండి విముక్తులుకాగా వారి రాజ్యము వారి కిచ్చుట పణమై యుండగా అట్టి న్యాయము ననుసరించి వారి రాజ్యమును వారికివ్వని దుర్యోధనుడు నీకు ధర్మాత్ముడయ్యెనా ? ఆ దుర్యోధనుని ధర్మజుడు యాచించి రాజ్యలాభము నొందుటయా ? బలరామా ! ఇవిగో, నా నారాచములు. పుంఖానుపుంఖములై శత్రుపక్షముల చీల్చి చెండాడు నా బాణసహస్రములచే కౌరవ సామ్రాజ్యలక్ష్మిని కైవశము గావించు కొని ధర్మనందనుని పాదములపై వైచుటకు నేను సిద్ధమని ఉద్ఘాటించినాడు. అంతేకాదు, కౌరవవీరులలో అర్జును నెదిరించు మగవా

డెవ్వడని సవాలుచేసి పలికి, క్షాత్రధర్మముకాని శరణాగతి సామదాన భేదదండోపాయములను నాలుగు ఉపాయములకును సంబంధించి లేదని బలరాముడు చెప్పిన సామోపాయమును రాజధర్మశాసనమున ఖండించినాడు.

'అద్య పాండుసుతో రాజ్యం లభతాం వా యుధిష్ఠిరః
నిహతా వా రణే సర్వే స్వప్స్యంతి వసుధాతలే.

చివరకు రెండేరెండుమాటల చెప్పినాడు. ధర్మజునకు రాజ్యప్రాప్తిగాని, కౌరవులకు స్వర్గప్రాప్తిగాని రెండేరెండు మార్గములని చెప్పి, ధర్మజునకే రాజ్యమివ్వనిచో కౌరవులకు చావు తప్పదని నిర్ధరించినాడు.

శ్రోతలారా ! శ్రీకృష్ణు డట్లు సలహాదారుడై దుర్యోధనుని కడకు దూతను పంపుట అవసరమనగా బలరాముడు సామోపాయమే ధర్మజునకు శరణ్యమని సవరణను చేయగా, సాత్యకి బలరాముని వాదమును నిర్దాక్షిణ్యముగ ఖండించి, యుద్ధమునకే సిద్ధముకాగా, అగ్రపీఠము నలంకరించిన విరాట ద్రుపదుల సమావేశమునందు ద్రుపదుడు సాత్యకి పలుకుల సమర్థించినాడు. మృదు భాషణముల దుర్యోధనుడు లొంగడని ఒప్పినాడు. ఒప్పుటకాదు. దుర్యోధనునకు మృదు భాషణముల బోధించుట గోవునందు తీక్ష్ణత్వమును, గార్దభమునందు మార్దవమును చూపుటవంటిదని సోదాహరణముగ పలికి, అయ్యును సంధి ప్రయత్నమును మానుట ఎందుకని తన పురోహితునకు శ్రీకృష్ణ పరమాత్మ చెప్పిన లక్షణములు గలవని చెప్పి, ఆ బ్రాహ్మణోత్తముని ధృతరాష్ట్రుని యొద్దకు పంప నిశ్చయించినాడు. అది శ్రీకృష్ణుని యభిప్రాయమును నెరవేర్చినట్టైనది. అతదేమైన క్రొత్తసలహా నిచ్చెనా ? ద్రుపదుడు మనము సంధిప్రయత్నమును గావించినను యుద్ధము తప్పదో రాదగు మిత్రవర్గమును ఆహ్వానించుట అవసరమని శల్యుడు ధృష్టకేతువు మొదలగు రాజులకు తన దూతలచే ఆహ్వానములు పంపినాడు.

నేటి సభాసదు లెల్లరును పెండ్లికి వచ్చినవా రగుటచే వారందరును విరాటునివలన సత్కారములనంది స్వగృహముల కేగినారు. శ్రీకృష్ణ లేమైరి? ఆత డేమి తక్కువ తినెనా? ద్రుపదునిపై ననే పాండవుల కార్యక్రమమును నడుపు భారమును మోపి తానును స్వగృహమునకే పయనమయ్యెను. రాజులందరకును ఆహ్వానముల బంపుటకాగా చివరకు నన్ను పిలువుడని చెప్పి ద్వారక కేగినాడు. బ్రాహ్మణుడు హస్తినాపురి కేగగా దూతలు రాజుల నాహ్వానింప వెళ్ళినారు. మరి శ్రీకృష్ణుని యాహ్వానింప ద్వారక కెవరేగిరి? శ్రీకృష్ణుని యాహ్వానించుటకు అర్జునుడే వెళ్ళెను. అంతతో సమాలోచనల పట్టము ముగిసినది. చేయదగు ప్రయత్నముగూడ ఇతమిద్ధమని నిర్ణయమైనది.

## ఆహ్వానము

అది ద్వారకానగరమున శ్రీకృష్ణుని శయ్యాగారము. దుర్యోధనుడు తన పక్షమునకు సాయము రమ్మని అడుగుటకై శ్రీకృష్ణునివద్దకేగి, శ్రీకృష్ణుడు శయనమందిరమున నిద్రించుచుండుటచే ఆతని శయ్యా తలమునం దొక మణిమయాసన మమర్చబడి యుండగా ఆ యాసనము నధిష్ఠించినాడు. ఆ యాసనము శ్రీకృష్ణుని శిరోభాగమునందున్నది. దుర్యోధను డింకను శ్రీకృష్ణుని దృష్టియందు పడలేదు. అర్జునుడును ఆరోజుననే ద్వారక కేతెంచినాడు. ఆతడును శ్రీకృష్ణుని ఆహ్వానించుటకే వచ్చినాడు. అర్జునుడును శ్రీకృష్ణుని పడకటింటిలోని కేగి, ఆతడు నిద్ర మేల్కొనునంతవరకును భగవానుని పాదపీఠమున కూర్చొని ఆ మహనీయుని అనుగ్రహదృష్టి ప్రసారమున కెదురుచూచుచు దోసిలియొగ్గి కూరుచుండెను. శ్రీకృష్ణునకు వీరిద్దరి రాకయు తెలిసెనా? నాకు తెలియదు. ఆతడు కన్నులను మూసుకొనియుండెనుగదా! ఆ సంగతి నట్లుంచుడు. వారిద్దరట్లు తన గృహాభ్యంతరమునందుండగనే కన్నుల

తెరచినాడు. ఆతని చూపునం దెవ్వరు ముందుపడుదురు ? పాదతలమునం దున్నవారిపై నిద్రలేచిన వాని చూపు పడును. అట్లే అర్జునునిపై స బడినది. ఓహో! బావగా రెప్పుడు వచ్చిరి ? అను ఆదరవాక్యములతో నిద్ర మేల్కాంచిన కన్నులు నులుముకొనుచు దుర్యోధనునిగూడ తిలకించి, ఇద్దరకును స్వాగతవచనములతో మర్యాద గావించినాడు. తరువాతిది వారి రాకకు కారణ మరయుగోరుట. వారిద్దరిను వారిద్దరి రాకకును కారణమేమని సగౌరవముగ ప్రశ్నించినాడు. భగవానుని ప్రశ్నకు సమాధాన మిచ్చినది దుర్యోధనుడే. తా మిద్దరును ఒకే కార్యమునకు వచ్చితిమనియు, అందు తాను ముందువచ్చితిననియు, ముందు వచ్చినవారికి వారి కోర్కెను నెరవేర్చుట ధర్మమనియు వక్కాణించి, యుద్ధమునకు నీ సాయమును కోరి వచ్చితిమని శ్రీకృష్ణుని మాటలతో బంధించుచు పలికినాడు. అంతేకాదు. నీకు మే మిద్దరము సమాన బంధువులమని శ్రీకృష్ణుని తనలో కలుపుకొని తనకు సాయపడక శ్రీకృష్ణునకు తప్పదను మాటను స్పష్టపరిచినాడు.

శ్రీకృష్ణుడు తన మందహాసరోచుల ప్రసరింపచేయుచు తప్పక మీ కిద్దరకును సాయము చేతునని వాగ్దానమిచ్చి, తన సాయమును రెండు భాగములుగ విభాగించినాడు. ఆ భాగములలో ఎవరి కేది ఇష్టమగునో దానిని వారు స్వీకరింపవచ్చునట. కాని ఒక ధర్మసూత్రమును మాత్రము చెప్పినారు. ఏమది ?... ముందు కోరుకొనవలసినవాడు వయసున చిన్నవాడగుట ధర్మసూత్రమట. ఆ సూత్రమును తా నిప్పు డేర్పరచెనా ? లేదు వేదసమ్మతమని చెప్పినాడు.

'ప్రవారణం తు బాలానాం పూర్వం కార్యమితి శ్రుతిః
తస్మాత్ప్రవారణం పూర్వం అర్హః పార్థో ధనంజయః'

అప్పటి కిప్పుడు తమ తమ అవసరముల ననుసరించి శాసనముల సృష్టించు విధానము నాడులేదు. కావున ఇప్పుడు శ్రీకృష్ణుడు భావించు

తన సహాయసంపదలోని భాగమును అర్జునుడే ముందు కోరుకొనదగి యున్నదని నిరూపించి, తన బలము నిట్లు విభాగించినాడు.

తనతో సమానమగు బలముకల నారాయణ గోపాలురనువా రొక యర్బుదసంఖ్యగల సైన్యమున్నది. వారి గుంపు అంతయు ఒకభాగము. తా నొక్కడును ఒకభాగము. అందును తాను యుద్ధమును చేయడు. యుద్ధము చేయకపోవుటకాదు, బాణమును చేతబట్టడు. ఇది అతని విభాగము. ఇందెవ్వరు కావలెనో కోరుకొమ్మని అర్జునునకే ముందు స్థాన మిచ్చినాడు.

'అయుధ్యమానం సంగ్రామే న్యస్తశస్త్రోహ మేకతః
ఆభ్యామన్యతరం పార్థ యత్తే హృద్యతరం మతం.

అర్జునుడు యుద్ధమునందు పాల్గొననన్న శ్రీకృష్ణునే కోరినాడు. శ్రీకృష్ణుడా యర్జునుని దృష్టియం దెవ్వడు? నారాయణుడు. తన సంకల్పముచేతనే ఆవిర్భవించిన బ్రహ్మము

'నారాయణ మమిత్రఘ్నం కామాజ్జాతమజం నృషు
సర్వక్షత్రస్య పురతో దేవదానవయోరపి'

మానవశరీరము నాతడు ధరించవలెనని, ధరించినాడేగాని మానవమాత్రుడు కాడు అన్నదే అర్జునుని నిర్ణయము. దుర్యోధనుని హృదయ ముప్పొంగినది. శ్రీకృష్ణుని నే నపహరించితిననియే సంతసించినాడు.

'కృష్ణం చాపహృతం జ్ఞాత్వా సంప్రాప పరమాం ముదం'

ఆ సైన్యమును తీసికొని హస్తినాపురమున కేగినాడు.

దుర్యోధనుడు బలరాముని కలసెనుకాని బలరాముడు శ్రీకృష్ణుడు లేమిచే తానును దుర్యోధనుని పక్షమునందుండక, పాండవులవైపుకు కూడ వెడలక, అతడు తీర్థయాత్రల కేగినాడు.

మీ రీకథాఘట్టమున గ్రహింపవలసిదేమి ? చాల విషయమున్నది. భగవానుని సాయమును కోరి వచ్చినవారిద్దరు మన కథాభాగమునం దుండిరి. అందొకరు స్వామివారి శిరోభాగమున కూర్చొనగా రెండవవాడు పాదముల నాశ్రయించి, బద్ధాంజలియై కూర్చొనినాడు. మొదటివానియందు నేను రారాజునను అహంకారము రూపొంది, బాహ్య ప్రపంచసౌఖ్యముల నపేక్షించి, భగవంతుని భగవంతుడుగా గుర్తెరుగక, తనను తాను మరచి, భగవంతుని సాయ మపేక్షించినాడు. రెండవవాడు తాను మునిగియున్న విపత్తును దాటుటకై తన పౌరుష మెంతవరకు అవసరమో అంత ప్రయత్నమును చేయుచు, భగవానుని సాయ మపేక్షించి, అతని అనుగ్రహసంపాదనమునకై అతని పాదముల నాశ్రయించి, అంజలి ముద్రతో ఆ మహనీయుని ఆరాధించినాడు. భగవానుల చూపు ముందుగ ఎవరియందు ప్రసరించినది ? భక్తుడై నిరహంకారమున తన పాదారవిందముల నాశ్రయించిన వానిపైననే ప్రసరించినది. భగవానుని అనుగ్రహమునకై వేచియున్నవా డర్జునుడుకాగా, భగవానుని దివ్యత్వము గుర్తెరుగక కర్ణ శకుని దుశ్శాసన భీష్మాది సిరివర్యులవంటి వారివిగనే శ్రీకృష్ణుని భావించి వచ్చినవాడు దుర్యోధనుడు. దుర్యోధనుని పైనగూడ ఆ కరుణామయుని చూపు పడకపోలేదు. బెల్లమును బెల్లమని తెలియకయే పసిపిల్లవాడు నోటవేసుకొన్నను అతనికి తన మాధుర్యము నందించుటయే గుడమునకు స్వభావము. అట్లే తనదగ్గరకు వచ్చిన దుర్యోధనుని చూచినాడు.

భగవంతుని చూపు సర్వవ్యాపకము. అందరిపైనను ప్రసరించును. ఆత దందరిలో నుండెను. తాను ఎవ్వరేమి సంకల్పములతో తన నపేక్షింతురో వారివారికి తగు విధమున తన అనుగ్రహము నందించును. మన మెవ్వరిలో చేరవలెనో యోచింపుడు. దుర్యోధనునితో కూడి యున్నవలెనా ? అర్జునుని ఆదర్శము త్రిగా

గ్రహించవలెనా ? ఈ ప్రశ్నకు సమాధానమును నేనిచ్చుట కుదరదు. అయ్యును అర్జును ననుసరించుటయే ముఖ్యమని మీరు శ్రవణమునుచేయు మహాభారతము సమాధానము చెప్పుచున్నది. భగవంతుడు శబ్దబ్రహ్మ స్వరూపమున వేద శాస్త్రపురాణముల రూపమునొంది జీవులమగు మనల నుద్ధరించినాడు, అట్టి వేదశాస్త్రములసారము మహాభారతము. ఈ భారత కథ అర్జుననే ఆదర్శముగా గొమ్మని చెప్పుచున్నది.

ఇక దుర్యోధనునివైపు తిరుగుడు. దుర్యోధనునిగూడ భగవంతు డను గ్రహించకపోలేదు. ఆతనివద్ద కెవ్వరు వెళ్ళినను అత డనుగ్రహించును. దీపము ఎవ్వరికైనను తన వెలుగు నందించును. నా వెలుగును కొందరకే ఇత్తునని చెప్పదు. కాని దుర్యోధనుడేమి కోరి సంతోషించెను ? సైన్యమును కోరినాడు. ఆ సైన్య మిచ్చినందుకు సంతసించినాడు. అనగా పశుబలమునే అతడు కాంక్షించినాడు. దానినే అనుగ్రహించినారు స్వామి. జడుడై దేహాత్మబుద్ధి కలవాడు చైతన్యము నెట్లు గ్రహించును? ఎవరేమి కావలెనన్న భగవంతుడు వారు కోరిన దానినే యిచ్చును.

ఇక కథాంశమునకు పోదము.

దుర్యోధనుడు వెళ్ళగా శ్రీకృష్ణుడు అర్జును నిట్లు ప్రశ్నించినారు. యుద్ధమునందు ప్రసక్తిలేని నన్నేల కోరితి? వని. అర్జునుని సమాధానమిది;

యుద్ధరంగమున పగతుర సంహరింప నీవెంత సమర్థుడవో నేనును అంత సమర్థుడనే.

'భవాన్ సమర్థస్తాన్ సర్వా న్నిహన్తుం నాత్రసంశయః
నిహన్తు మహమప్యేకః సమర్థః పురుషర్షభ'

కాని లోకమునందు నీ కీర్తి యమోఘమై సర్వవ్యాపకము కాగా నేనును అట్టి కీర్తినే యపేక్షించి నిన్ను వరించినాను. నేను వరించుటకు ప్రత్యేకమగు కోరిక యొకటున్నది. అదేమన ? నీ సారథ్యమున నా

యుద్ధరంగమును నడపగా శ్రీకృష్ణ సారథ్యమున నేను రథికుడనై తినను కీర్తినొందుటకు నిశ్చయించుకొంటినని శ్రీకృష్ణుని సారథిగా వరించినాడు.

ఇందలి అంతరార్థమేమి ? శ్రీకృష్ణుడే తన రథమును (అనగా తనను) నడుపుటను కోరినాడు. లక్ష్మీనాథుడే తనకు ముందు కూర్చొనగా విజయలక్ష్మి తన్ను వదలి మరెక్కడికేగును ? జయలక్ష్మియు మోక్ష లక్ష్మియు కూడ తననే వరించునని అర్జునుని భావము. గీతాశాస్త్రప్రాదు ర్భావ మగుట కిది ప్రారంభోత్సవము కావచ్చును.

అర్జునుని కోరికకు శ్రీకృష్ణులు సంతసించి సారథ్యమున కియ్య కొనినారు. అంతతో వారిద్దరును పయనమై ఉపప్లావ్యమున ధర్మజుని యొద్ద కేగినారు. ఆ ఘట్టమట్లుండనిండు.

దేశదేశములందలి రాజుల నాహ్వానించుటకై ధర్మజుడు దూతలను పంపెనుగదా ! మద్రదేశాధిపతి నాహ్వానించుటకును దూత వెళ్ళినాడు. మద్రదేశాధిపతి శల్యుడు నకుల సహదేవులకు మేనమామ. అతడు అక్షౌహిణీసైన్యమున కధిపతి. ససైన్యముగ నాతడుపప్లావ్యమునకు బయలుదేరినాడు. సైన్యమంతయు వారివారి స్వదేశవేషాభరణములతో యుండిరిగాని వారి వేషములు మారలేదు. ఈ మాట వలన ముఖ్యముగ మీరు గమనింపదగినది ప్రతిదేశమును తమతమ వేషభాషలను కాపాడు కొనుట నాగరకత కాదనియే. వ్యాసులీ విషయము నెంత జాగరూకులై వర్ణించినారని —

'స్వదేశవేషాభరణాః వీరాశ్శతసహస్రశః,
తస్య సేనాప్రణేతారో బభూవుః క్షత్రియర్షభాః'

శల్యుడు బయలుదేరుట దుర్యోధనునకు తెలిసినది. శల్యు డుపప్లావ్యమున కేగు మధ్యదేశము లన్నియు తన మంత్రులచే చిత్ర విచిత్రాలంకృతముల గావించినాడు. శల్యుడు విడిసేయు ప్రదేశముల

యందు దిగుడుబావుల త్రవ్వించినాడు. చలివేంద్రముల నేర్పాటు చేసినాడు. నానావిధములగు శయ్యాసనాదుల నేర్పరింపచినాడు. దేవతలకు చేయు సత్కారముల నతిక్రమించిన ఆ యతిథి పూజావిధానము లెవ్వని ఆకర్షింపవు ? శల్యుని మహోత్సాహపూరితుని గావించినవి. ఆ సభా విధానములన్నియు ధర్మనందనుడే తన నుద్దేశించి చేసినాడని శల్యుడు భావించినాడు. ఆ యుత్సాహము నాతడు సేవకులపద్ద వెలిబుచ్చి, ఆ సమయమునందా నిర్మాత కోరినవర మిప్వదలచినాడు. రహస్యముగ డాగియున్న దుర్యోధనున కావిషయమును గూఢచారులు దెలుపగా శల్యు డివ్వదలచిన వరమునకు దుర్యోధనుడే ఎదుర నిలిచినాడు. శల్యుడు మాటదప్పునా ? దుర్యోధనుని కౌగలించుకొని తన సంతోషమును వెలిబుచ్చి, దుర్యోధనునే వరము కోరుకొమ్మని చెప్పినాడు. దుర్యోధనుడు శల్యునిమాటను గట్టిపరచి, తనకు సేనాపతి యగుటను కోరినాడు. శల్యుడట్లే వరమిచ్చి తా నుపప్లావ్యమున కేగుట నెరింగించి ధర్మజు నొద్దకు వచ్చినాడు. దైవము చాల చిత్రమైనదిగదా ! శల్యుని యూహ యంతయు తారుమారైనది. ధర్మజు డర్ఘ్యపాద్యాదివిధుల నిర్వర్తించగా ధర్మజుని పరామర్శించుట జరిగినది. నీవు తమ్ములలో శత్రువిహీనుడవై దుఃఖ విముక్తుడవు కాగలవని శుభాశీస్సుల నిచ్చినాడు. తరువాతడు : తనకును దుర్యోధనునకును జరిగిన సన్నివేశమును ధర్మజునకు తెలుపవలెను. శల్యు డాసన్నివేశమును ధర్మజున కెట్లు తెలుపవలెను ? తెలిపినాడు.

యథార్థమునకు ధర్మజుడా సంఘటనకు విచారమును వెలిబుచ్చ వలెనుగదా ? ధర్మజుడు విచారము నొందలేదు. ఒక వరమును కోరినాడు.

'సుకృతం తే కృతం రాజన్ ప్రహృష్టేనాంతరాత్మనా
దుర్యోధనస్య యద్వీర త్వయా వాచా ప్రతిశ్రుతం'

నీవు చాల మంచిపని చేసినావు. నిజమునకు సంతోషసమయమునం దిచ్చిన వరదానము ఉత్కృష్టమైనదే. వాచా పలికిన ప్రతిజ్ఞను నెరవేర్చ

దగినదే కాని నాకొక్క వరమిమ్మని అర్థించినాడు ధర్మజు డేమి వరము కోరునో శల్యుడేమి యెరుగును ? కాని ధర్మజుడు శల్యునకొక సత్యమును చెప్పినాడు. ఏమది ?

'రాజన్నకర్తవ్యమపి కర్తుమర్హసి సత్తమ'

రాజా ! నేను కోరుకొను వరము నీవాచరించదగినది కాదు. అయ్యును నేను కోరుచుంటినని పలికినాడు. ఆ సమయమున శల్యు డాతనికి అడ్డుచెప్పలేదు. కావున శల్యునకు తాను కోరుకొను వరము నిచ్చుట సమ్మతమని ధర్మజుకు తెలినది.

కర్ణార్జునులకు ద్వంద్వయుద్ధము రాగా కర్ణునకు నీవు సారథివిగాక తప్పదు. ఆ సమయమున అర్జునుని నీవు పరిపాలించుమని కోరి ఆ పరిపాలనావిధానము నిట్లు చెప్పినాడు :

'తేజోవధశ్చ తే కార్యః సౌతేరస్మజ్జయావహః'

కర్ణునకు నీవు తేజోవధను గావించవలెనని కోరినాడు.

ధర్మజుడిట్టి వరము కోరుట ధర్మమా ? అనకుడు. శల్యుడు ఇవ్వదలచ అతడు కోరుటలో తప్పేమున్నది ? రాజు జయముకొరకు నీతిని ఉపయోగించుట రాజధర్మము.

తేజోవధయన ఉత్సాహము పైదై యుద్ధమునకు బయలుదేరు రథికునకు నిరుత్సాహవాక్యములతో అతని యుత్సాహమును భంగము చేయుట. ఈ పని సారథియగువాడు రథికునకు చేయదగినది కాదు. కావుననే 'అకర్తవ్యమపి' చేయరానిదైనను చేయవలసినదిగా కోరినాడు. వరదాన మిచ్చుటకు అంగీకారమును తెలిపిన శల్యుడీ ఘాతుకకృత్యమును చేయుటయా ? మానుటయా ? శల్యు డుత్సాహముతో అంగీకరించినాడు. తప్పక చేతునని వాచా పలికినాడు. అంతమాత్రముతో ఊరుకొనలేదు. ఇదియేకాక ఇంకేమైన నీవు కోరుచో ఆ కోరికను నెరవేర్చుటకు నాకెట్టి సందేహమును లేదని నొక్కి వక్కాణించినాడు.

'యచ్చాన్యదపి శక్ష్యామి తత్కరిష్యామి తే ప్రియం'
కర్ణాదులవలన వచ్చిన దుఃఖముల నీవు సహించుట సామాన్యమగు కార్యముగాదని ఓదార్చి, జీవితమునందు రావలసిన దుఃఖములను దేవతలైనను అనుభవింపవలసినదేనని దేవేంద్రుని రాజ్యభ్రష్టతను గురించి చెప్పి, శచీదేవియు దేవేంద్రుడును గూడ పడరానిపాట్ల ననుభవించి, అంతమున శుభమునొందిరని ఆ యుపాఖ్యానమును చెప్పినాడు. ఈకథను విన్న నీవు పట్టాభిషిక్తుడవగుదువని ఆ యుపాఖ్యాన ఫలమును చెప్పి శల్యుడు దుర్యోధనునివద్దకు వెళ్ళినాడు.

శల్యుడు ధర్మజునకు చెప్పిన కథను మీకు సంగ్రహముగ చెప్పెదను. ఈ కథకు వృత్రాసురవధ యని పేరు.

## వృత్రాసురవధ

త్వష్ట ప్రజాపతిపుత్రుడు విశ్వరూపుడు. అతడు మూడు శిరస్సులు కలిగియుండుటచే ఆతనికి త్రిశిరసుడనికూడ పేరు. ఆతడొకప్పుడు స్వర్గము నాక్రమింప ఘోరమగు తపస్సునుచేయ మొదలిడినాడు. ఆతని తపస్సు దేవేంద్రునకు భయము కల్పించగా దేవేంద్రు డాతని తపస్సును భంగముకావింప అచ్చరమిన్నలను పంపినాడుగాని వారికా విశ్వరూపుడు వశము కాలేదు. దేవేంద్రు డేమిచేయవలెను ? శత్రువృద్ధిని అతడు సహించలేదు. భేదోపాయము దేవేంద్రునకు సిద్ధించలేదు. దండోపాయమే ఇంద్రునకు శరణ్యమైనది. వజ్రాయుధముచే ఆ విశ్వరూపుని శిరముల ఖండించినాడు. అతిఘోరమగు విశ్వరూపుని మరణము త్వష్టప్రజాపతిని బాధించకుండునా ? త్వష్టప్రజాపతి దేవేంద్రునిపై మండిపడి వృత్రుడను రాక్షసునొకనిని తన దక్షిణాగ్నినుండి తీసి మంత్రశక్తిచే సృష్టించినాడు. వృత్రాసురు డతిభయంకరుడు. మహాశక్తి సంపన్నుడై దేవతల బాధ పెట్టగా దేవేంద్రుడాతనితో యుద్ధమున కేగవలసివచ్చినది. వృత్రుడత్యంత

బలశాలి. వృత్రు డొక్కమారుగా దేవేంద్రుని మ్రింగి గంతులు వైచి నాడు. ఇప్పుడు దేవత లేమిచేయవలెను ? దేవతలప్పుడు వృత్రాసురునిపై జృంభక మనుదాని నొకదానిని ప్రయోగించినారు. జృంభకమన ఆవులింత. అంతతో వృత్రుడు తన శరీరము నంపొక బద్ధకమురాగా ఆవలించినాడు. దాని నాధారముగా గొని దేవేంద్రుడు ఆతని ముఖమునుండి బయటపడి నాడు. మొత్తముమీద వృత్రుని జయించుటకు దేవేంద్రునకు శక్తి చాల లేదు. విష్ణువు ఉపాయశాలి. దేవతలందరును విష్ణువును వేడగా కాల నిరీక్షణమునకై వృత్రునితో సఖ్యమును చేయుడని దేవతలకు సలహానిచ్చి నాడు. దేవతలట్లే వృత్రునితో మిత్రత్వమును సంపాదించి, ఆతని చంపుటకు కాలమును నిరీక్షించుచుండిరి. ఇట్టి యుపాయములకే నీతి యని పేరు

వృత్రుడు తపస్సుచేసి అనేకవరములను సంపాదించినాడు. పగలు చావడు. రాత్రికాల మాతని చంపలేదు. సజీవములేవియు ఆతనిని చంప లేవు. నిర్జీవములగు ఆయుధములును చంపజాలవు. తడివస్తువులు పొడి వస్తువులుకూడ ఆతనిని చంపలేవు. పంచభూతములలో ఏ భూతముచేతను ఆతడు చావకుండ వరములున్నవి. కావున దేవేంద్రుడాతని నెట్లు చంపుదునా ? అని ఆలోచించుచుండెను.

అది ఒకనాటి సంధ్యాకాలము. దేవేంద్రునకా సమయమునందొక ఆలోచన కలిగినది. నురుగు ఆర్ద్రముకాదు శుష్కమును కాదు. పగలు రాత్రి కానిది సంధ్య కావున ఈ నురుగునందు నా వజ్రాయుధమునుంచి కొట్టిన వీడు చచ్చునని భావించినాడు. వృత్రుడు దేవేంద్రుడు తన్ను చంపునేమోనన్న భయమును వహించుటలేదు. ఆ ఫేనమయమైన నురుగుతో వృత్రాసురుని కొట్టినాడు. వజ్రాయుధముతో బాటిని ఆ నురుగునందు అదే సమయమున విష్ణుశక్తి ప్రవేశింపగా ఆ వజ్రాయుధము వృత్రుని సంహరించినది. అంతతో లోకకంటకుడగు రాక్షసుడు చావగా ఒకటి

పోయినట్లు ప్రజలు సంతసించినారు. దేవేంద్రుని దేవతలందరు పూజించగా ఇంద్రుడు శ్రీమహావిష్ణువును పూజించి సంతసించినాడు. కాని దేవేంద్రునకు రెండు పాపములు చుట్టుకున్నవి. విశ్వరూపుని చంపగా నాటి బ్రహ్మహత్యయు, నమ్మినవాడగు వృత్రాసురుని చంపగా నేడు మిత్రద్రోహమును బ్రహ్మహత్యయుగూడ దేవేంద్రుని ఆవరించినవి. ఎవ్వరికైనను కర్మవిపాకము తప్పదుగదా ? అంత దేవేంద్రుని తేజమస్తమించినది. స్వర్గరాజ్యము నాతడు పాలింప సమర్థుడు కాలేదు. స్వర్గసీమను వదలి అంతర్ధానముగుటయే ఆతనికి శరణ్యమైనది. ఎక్కడనో దాగినాడు. స్వర్గమున ప్రభువెవ్వడు ? రాజులేని రాజ్యమైనది. దేవతలందరును కలసి రాజునొకని గూర్చుకొనదలచినారు. ప్రజలెన్నుకొన్నను ధర్మమూర్తి నెన్నుకొనవలెను గదా !

నహుషుడు భూలోకమునందొక ధర్మమూర్తియగు చక్రవర్తి. దేవతలందరును ఆతని స్వర్గమునకు ఇంద్రుని స్థానమునందుంచ దలచినారు. కాని నహుష డొప్పలేదు. మీ తేజము గొప్పదిగదా ! మనుజుడను నేనెట్లు మిమ్ముల పాలింతును ? అని. అప్పుడు దేవతలందరును వానికొక వరమిచ్చినారు. ఆతని యెదుటి కెవ్వరువచ్చిన వారి తేజము నహుషునకే వచ్చును. అంతతో వారు తేజోహీనులగుదురు. ఆ వరమున కాతడు సంతసించి ఇంద్రుని సింహాసనము నధిష్ఠించెను.

ఇప్పుడు నహుషుడు క్రొత్త దేవేంద్రుడు. స్వర్గభోగములన్నియు ఆతని స్వాధీనములైనవి. శచీదేవిమాత్ర మాతని స్వాధీనము కాలేదు. స్వర్గము రాజ్యము కనక జయించినవానికి వచ్చును. భార్య వ్యక్తికి సంబంధించినది. కావున జయించినవానికి పరాజితుని భార్య చెందదు. స్వర్గసీమలో అభ్యంతరగృహములతోపాటు శచీదేవియు తన స్వాధీనము కాదగినదేనని అధికార మదోన్మత్తుడగు నహుషుడు తలచినాడు. ఆమె కప్పుడు దిక్కెవ్వరు ? బృహస్పతియే. బృహస్పతిని శరణు వేడినది.

అతడామె కాశ్రయమిచ్చినాడు. ప్రస్తుతమున బృహస్పతి నహుషుని మంత్రిగదా ? అయ్యును అతడు ధర్మమును తప్పలేదు. దేవతలు మాత్రము నహుషునకు భయపడి శచీదేవిని నహుషునకు ఒప్పచెప్పమని నారు. అతడొప్పలేదు. కాని శచీదేవికొక ఉపాయమును చెప్పినాడు. నీవు నహుషుని యొద్దకేగి, కాలాంతరమున నిన్ను వరింతునని చెప్పుమని నాడు. శచి అట్లే చేసినది. పశుబలమును బుద్ధిబలమెదుర్కొనును. నా భర్తయగు దేవేంద్రు డేమయ్యెనో తెలియగనే నేను నిన్నే వరింతునని చెప్పి, నాటి ఆపత్కాలమును తప్పించుకున్నది. ప్రస్తుతమునందామె బృహస్పతియొద్దనే యున్నది.

దేవతలకు కష్టసమస్య లెదురైనప్పుడు వారు విష్ణువు నాశ్రయింతురు. దేవతలందరును విష్ణువునొద్దకేగినారు. పూర్వపు దేవేంద్రుడు బ్రహ్మహత్యను బాపుకొని మరల స్వర్గము నధిష్ఠించు టెట్లు ? అని విచారించినారు. వేదములు తప్పనిసరియై పాప మాచరించియు దుష్టుల శిక్షింపవలసివచ్చినప్పుడు ఆ పాపము నాచరించియైనను దుష్టుల శిక్షించి, ఆ పాపపరిహారమును గావించుకొనుటకు రాజులను అశ్వమేధ యాగము చేయ విధించినవి. కావున నన్నుద్దేశించి దేవేంద్రు డశ్వమేధ యాగము చేయగా అతని బ్రహ్మహత్య వదలునని శ్రీమహావిష్ణువు సలహా నిచ్చినారు. దేవతలు వెంటనే దేవేంద్రునున్న చోటికేగి, అశ్వమేధమును చేయించి అతని పాపమును పాఱద్రోలినారు. మరి ఆ పాపము వసించుటకు స్థానమెక్కడ చూపవలెను ? భూమియు, ఉదకమును, చెట్లును, స్త్రీలును ఆ పాపమును పంచుకొనునట్లు వారిని ప్రార్థించి, వారికి వారు కోరిన వరముల నిచ్చినాడు దేవేంద్రుడు. ఆ పాపము వారి నెట్లు ఆశ్రయించినదనగా — భూమికి చౌడు, నీటికి నురుగు, వృక్షములకు జిగురు, స్త్రీలకు రజస్సను రూపముల వారి నాశ్రయించినది. భూమికి త్రవ్వినను పూడుట యను వరమును, నీటికి ప్రతివస్తువును

పవిత్రము గావించుటను, చెట్లకు ఎవరు నరికినను మరల చిగురుచు శక్తి కలుగునట్లును, స్త్రీలకు గర్భధారణసమయమందును వారు కామానుభవము చెందుచో ఆ గర్భము పతనము కాకుండునట్లును, వారు కోరుకొనగా ఆ వరముల నిచ్చినాడు దేవేంద్రుడు. అంతతో దేవేంద్రుని బ్రహ్మహత్య రూపుమాసినది. కాని నహుషుని తేజము నాతడు తిరస్కరించి స్వర్గ పీఠము నెక్కజాలకపోయినాడు. కావున దేవేంద్రుడు మరల ఆ యవమానమునకు అంతర్ధానమై యుండుట తప్పలేదు.

శచీదేవి నహుషునకు చెప్పిన కాలము దగ్గరపడినది. తానిప్పు డేమి చేయవలెను? రాత్రికాలమున ఉపశ్రుతియను దేవతా ధ్యానమును చేసినది. ఉపశ్రుతి అను దేవత సందేహ నివారణను గావించును. శచీదేవి చేసిన ఆ ధ్యానమునకు ఉపశ్రుతి సాక్షాత్కరించినది. నేను ఇంద్రుని దర్శింతునా? అను సందేహమును బాపినది. నీకు ఇంద్ర దర్శనమును నేను చేయించెదనని శచీదేవిని ప్రయాణము గావించినది.

సముద్రమధ్యమునం దొక ద్వీపము. ఆ ద్వీపమునం దొక సరస్సు. ఆ సరస్సు నూరు యోజనముల పొడుపును, అంతే వెడల్పును కలిగియుండగా ఆ సరోవరమధ్యమునం దొక పద్మమున్నది. ఆ పద్మనాళమునందలి విశుద్ధ తంతువునందు దాగినాడు దేవేంద్రుడు. ఆ ప్రదేశమునకే ఉపశ్రుతి శచిని తీసుకుపోయినది.

శచీదేవికి ఆ క్షణమొక యదృష్టకాలము. తన భర్తను దర్శించినది. పాతివ్రత్యప్రభావ మెంత గొప్పది! దేవేంద్రు డాశ్చర్యచకితుడై ఈ రహస్యస్థలమును నీవెట్లు గ్రహించితివనగా ఉపశ్రుతి ప్రభావము నుగ్గడించినది. దేవేంద్రుడు శచియొక్క రాకకు కారణ మడిగినాడు. నహుషుని చరిత్రను భర్తకు తెలిపినది. దేవేంద్రున కొక చక్కని ఆలోచనవచ్చినది. సప్తమహర్షులను వాహనముల గావించి, వారి భుజ స్కంధముల నధిరోహించి వచ్చుచో నిన్ను వరింతునని చెప్ప వలసినదిగా సలహా నిచ్చినాడు. ఒక్కక్షణమున శచి స్వర్గసీమ కేతెంచినది.

నహుషుడు శచీదేవికొరకై నిరీక్షించుచున్న సమయ మిది. సకాల మునవే నహుషునకు శచి దర్శనమిచ్చినది. మందస్మితవదనారవిందుడైన నహుషుడు శచిని సమీపించినాడు. కాని శచీదేవి తన కోర్కె నొకదానిని నెరవేర్ప వాంఛించినది. పూర్వమునందున్న నాభర్త ఎక్కు వాహన ములు సామాన్యములే యగుటచే, నీ వధిరోహించు వాహన ముత్కృ ష్టము కావలెనని చెప్పి సప్తమహర్షుల భుజముల నధిరోహించి నావద్దకు రమ్మని కోరినది. అధికార దుర్వినీతుడగు నహుషున కదియొక లెక్కయా ? అట్లే చేతునని మహర్షులను ఏడుగురను తనను మోయుటకు రమ్మని ఆజ్ఞాపించినాడు.

అంతలో ...

బృహస్పతి దేవగణములతో ఇంద్రునియొద్దకేగి, ఇంద్రు డింతకు పూర్వము నెరవేర్చిన మహత్కార్యముల జ్ఞాపకమునకు తెచ్చి అతనికి ధైర్యమును పురిగొల్పినాడు. నహుషున కింత బలమెట్లు వచ్చినదో ఇంద్రునకు తెలియదు. ఇప్పుడు బృహస్పతి నడిగినాడు. బృహస్పతి దేవేంద్రునకు నహుషుడు ఎవవిని దర్శించిన వారి తేజము నపహరించు శక్తిని దేవతలిచ్చిరిగావున నీవు నహుషుని ఎదుటకు రావద్దని చెప్పుచుండగా, దిక్పాలకు లాప్రదేశమున కేతెంచి ఇంద్రుని వారుగూడ స్తుతించినారు. నహుషు డెట్లు రాజ్యభ్రష్టు డగునో ఉపాయ మాలోచించి, నన్ను మరల స్వర్గపీఠము నలంకరించునట్లు చేయుమని ఇంద్రుడు దిక్పాలురను కోరగా వారు వల్లెయనినారు. నహుషుడు స్వర్గరాజ్యమును పాలించు కాలము సమాప్తము కావచ్చినది. లోకపాలురు నహుషుని రాజ్యభ్రష్టుని గావింప నాలోచింపసాగినారు.

సప్తమహర్షులలోనివారే అగస్త్యమునీంద్రులు. అదృష్టకాలము ఆసన్నముకాగా ఆ పుణ్యఫలమును ఫలింపజేయు కారణ సామగ్రియు

తనంత తానై కర్తను సమీపించును. దేవేంద్రుడును, దిక్పాలురును కలసి ఆలోచించు ప్రదేశమునకే అగస్త్యమునీంద్రులును దైవికముగవచ్చి దేవేంద్రుని, ఇంద్రా! దైవకృపచేత నహుషుడు రాజ్యభ్రష్టు డయ్యెననియు నీకు స్వర్గరాజ్యము ప్రాప్తించినదనియు తెలిపినారు. నహుషుడు యుద్ధము లేకయే రాజ్యభ్రష్టు డెట్లయ్యెనని మహర్షిని ప్రశ్నించగా అగస్త్యమునీంద్రు డీట్లు చెప్పినాడు —

సప్తమహర్షులును నహుషుని మోయుచు శ్రమనొంది యుండి, నహుషునిట్లు ప్రశ్నించినారు. ఆ ప్రశ్న వేయుటయం దొక్క సప్తర్షులే గాక, దేవర్షులును, బ్రహ్మర్షులునుగూడ గలరు. వేదములందు చతుర్ముఖుడు గోమేధయాగమున పశుమారితమగు ప్రోక్షణసంస్కార మంత్రములను చెప్పెనుగదా! అవి నీకు ప్రమాణములా? కావా? అని సంశయముగ ప్రశ్నింపగా ఆ మంత్రము లప్రమాణములని వచించినాడు. అంతతో మహర్షులు నహుషుని పై వధర్మముగ పలికితివనియు, మాకు ఆ మంత్రములు ప్రమాణములనియు వాదించగా వాగ్వివాదము పెరిగినది. ఆ వాదమున నహుషుడు నన్ను తన కాలితో తాకినాడు. నేను కోపించి, బ్రహ్మర్షులకు పూర్వమునుండియు ప్రమాణములైన మంత్రములను నీ వప్రమాణ మనుటయు మహర్షులను యానముగా చేయుటయు నను పాపముచే నీ యదృష్టము భ్రష్టమైనదని వచించి, ఈక్షణముననే పదవీభ్రష్టుడవై పదివేల సంవత్సరములు అజగరరూపమున ఉందువుగాక యని శపించితినని చెప్పినాడు.

ఇంద్రా! నీవిక రాజ్యమునకు రమ్మని దేవతలును అగస్త్యాది మునీంద్రులును ఇంద్రుని ప్రార్థింపగా దేవేంద్రుడు శచీదేవితోగూడి స్వర్గరాజ్యము నలంకరించినాడు.

మహాశయులారా ! మన కథాభాగ మెక్కడయున్నది ?

శల్యుడు ధర్మజుతో ఇంద్రుని రాజ్యభ్రష్టతయు, ఆతడు తిరిగి స్వర్గరాజ్యమును పొందిన విధానమును చెప్పుటలో నుంటిమి. ఈ కథా వస్తువునుచెప్పి, శల్యుడు నీవును ఇంద్రునివలె రాజ్యప్రాప్తి యగునని ఆశీర్వదించి, ఈ కథను విన్నవారికి జయము కలుగునని నాడు ఫలశ్రుతిని వినిపించిన విషయమునే మీకు సంగ్రహముగ చెప్పుదునని ఆ కథా విశేషమును చెప్పినాను.

కాని మీ రీకథయందుకూడ కొన్ని ముఖ్యవిషయములను గమనించవలెను.

ఈకథయందు శత్రువును పరిమార్చి, రాజ్యమును నిలబెట్టవలె నన్న రాజు పాపమునకు తల ఒగ్గియైనను శత్రుమారణమును చేయవలె ననునది ముఖ్యవిషయము. తరువాత స్త్రీల రజోదోషమును సామాన్య మగు రక్తస్రావముగ నేటి స్త్రీపురుషులు భావించుట తప్పు. ఆ రక్తమునం దొక ప్రత్యేకమగు దోషమున్నట్లు వాత్స్యాయనులు కూడ తమ అభిప్రాయ ముల నిచ్చియున్నారు. నేటికిని బహిష్టైనస్త్రీలు పుష్పలతలదగ్గర కేగుచో ఆ రక్తమునందలి దోషము ఫలపుష్పములను నాశముచేయుట కలదు. కావుననే ఆ స్త్రీలను భారతీయులు దూరముగ యుంచుట జరుగుచున్నది. ఆ విషయము లట్లుండ ఈ కథయందొక పరమార్థతత్వమున్నది.

వృత్రాసురుడన మనలను ఆవరించిన అజ్ఞానము. దేవేంద్రుడన జ్ఞానము. అధ్యాత్మికమగు ఆత్మజ్ఞానము చేతగాని, అజ్ఞానాంధకారము నశించదు. అట్టి జ్ఞానియగువాడు తనద్వారా పుత్రాదులను వదలి ఏకాంతవాసము నందుటయే దేవేంద్రుడు దాగియుండుట. అట్టి మహనీయుల సహకారము లోకమున కవసరముగాగా స్వార్థభోగములలో బడిన నహుషుని పదభ్రష్టుని గావించుటకై దేవతలు ప్రయత్నముచేసి,

దేవేంద్రుని స్వర్గసీమకు తీసికొనివచ్చినారు. ఇంద్రుడును వారిచే స్తోత్రము చేయబడి లోకసంగ్రహమునకై మరల లోకయాత్రయందు ప్రవేశించినాడు. 'లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి' అను గీతాసూక్తి ననుసరించి జ్ఞానులును లోకవ్యవహారమున చరింతురని ఆ కథ బోధించినది. ఇది వృత్రాసురవధలోని అంతరార్థము. తరువాతి కథ.

## సేనాసన్నివేశము

శల్యుడు దుర్యోధనుని వద్దకేగగా ధర్మజునివైపుకు కొందరు రాజులు తమ సేనాబలములతో తరలి వచ్చినారు. సాత్యకి, అక్షౌహిణీ సైన్యముతో వచ్చినాడు. అట్లే ధృష్టకేతువు; ఇతడు చేదిదేశమున కధిపతి. సహదేవుడు; ఇతడు జరాసంధుని కొడుకు. పాండ్యరాజు, ద్రుపదుడు, కేకయు లన్నదమ్ము లైదుగురు, పార్వతేయుడను రాజును పాండవులకు బలమును చేకూర్చిన రాజులు. వీరందరును అక్షౌహిణీ సైన్యములతో వచ్చుటచే పాండవులకు ఏడుఅక్షౌహిణీల బలము చేకూరినది. ఇట్లే దుర్యోధనునకు బలము వచ్చినది. దుర్యోధనుని సైనికబలము పాండవులకంటె నాలుగక్షౌహిణులధికమయ్యే యున్నది. అతని బలము పదకొండు అక్షౌహిణులు.

భగదత్తుడు, భూరిశ్రవుడు, శల్యుడు, కృతవర్మ, హార్దిక్యుడు, జయద్రథుడు, సుదక్షిణ, కాంభోజులు ఇద్దరు, నీలుడు, కేకయులు, విందానువిందులు. వీరు పదకొండుమందియు, వారివారి మిత్రవర్గములతో దుర్యోధనునకు సాయమైరి.

ఇది ఇట్లుండ మన మొక్కమారు హస్తినాపురమున కేగుదము.

ధృతరాష్ట్రుని సభామంటప మీనాడు వీరరసప్రధానమై యున్నది. పదకొండు అక్షౌహిణుల సైన్యము నాకు చేకూరగా భీష్మద్రోణకర్ణ-కృపాశ్వత్థామలు నా పక్షమునందుండ నాకేమి కొరత? పాండవులకు

భాగమందించి, నేనేల రాజ్యమును సగభాగముగ చేసికొనవలెను? అఖండభారత మంతయు నా యొరచేతనే యుండవలెను అన్నదే దుర్యోధనుని నిశ్చయము. దుర్యోధనుని నిశ్చయి మెప్పుడును ఇదియే. మరి ద్రుపద పురోహితుడగు బ్రాహ్మణుడు హస్తినాపురమున కేల పంపబడెను? బ్రాహ్మణుని ధృతరాష్ట్రునొద్దకు పంపుటయం దొక రహస్య మిమిడియున్నది. దుర్యోధను డీ దౌత్యమునకు వశుడై రాజ్య మిచ్చునని కాదు. అచ్చటి సైనికుల హృదయపరివర్తనము చాల అవసరము. భీష్మద్రోణకర్ణకృపాశ్వత్థాముల హృదయములు కూడ బ్రాహ్మణుని ప్రబోధమున మారిపచ్చును. పాండవులవైపు తిరుగ వచ్చును. అట్లు భీష్మాదులు మారుటో మరల వారి నందరను ఏకాభిప్రాయమునకు వచ్చునట్లు చేయవలెనన్న దుర్యోధనునకు కొంత కాలవిళంబము తప్పదు. సైనికులును మారిపచ్చును. ఆ కాలవిళంబన సమయమున పాండవులు సైన్యములను కూర్చుకొను ప్రయత్నము చేసుకొనవచ్చును. లేక యుద్ధప్రయత్నములలోని భాగములను నావకాశముగ పూర్తిచేసుకొనుట కవకాశమున్నది. మీరు పంపిన దూత అందుకు సమర్థుడు. ఈ విషయమునంతను ద్రుపదుడు పురోహితునకు చెప్పి పంపినాడు — బ్రాహ్మణోత్తమా! నీవు యోధుల మనస్సు లందు భయమును గొలుపుటకును భీష్మద్రోణాదుల హృదయములు గట్టిగ పాండవులవైపుకే తిరిగి మనస్సులు పాండవులవైపు దృఢమైయుండుటకు ప్రయత్నించవలెనని చెప్పినాడు. ఇంతేకాక నీ ప్రబోధముచే ధృతరాష్ట్రుని బుద్ధి ధర్మముపైపుకు తిరుగుటకుగూడ నవకాశముగలదని ద్రుపదుడు చెప్పినాడు. ఇదిగో శ్లోకములు :

భవాంస్తు ధర్మసంయుక్తం ధృతరాష్ట్రం బ్రువన్ వచః
మనాంసి తస్య యోధానాం ధ్రువమావర్తయిష్యతి.

అమాత్యేషు చ ఖిన్నేషు యోధేషు విముఖేషు చ
పునరేకత్రకరణం తేషాం కర్మ భవిష్యతి.
ఏతస్మిన్నంతరే పార్థాః సుఖమేకాగ్రబుద్ధయః
సేనాకర్మకరిష్యంతి ద్రవ్యాణాంచైవ సంచయం.
విద్యమానేషు చ స్వేషు లంబమానే తథా త్వయి
ఏతత్ప్రయోజనంచాత్ర ప్రాధాన్యేనోపలభ్యతే.

కావున బ్రాహ్మణుడచ్చటికి వెళ్ళి, చేసిన కార్యముగూడ ఇదియే. బ్రాహ్మణునకు ధృతరాష్ట్రుని సభయందు మాట్లాడుట కవకాశము కల్గినది. విదురుడు తన మాటకే ఎత్తాపి పలుకునన్న దృఢవిశ్వాసమేగాక, బ్రహ్మ విదుడగు నా బ్రాహ్మణుడు ధర్మమును చెప్పుటయందు జంకులేనివాడునై మాట్లాడినాడు. ధృతరాష్ట్రుడా బ్రాహ్మణునకు పాద్యార్ఘ్యముల నిచ్చి గౌరవించుట కాగా బ్రాహ్మణుడు ప్రప్రథముననే సేనానాయకులనే సంబోధించి మాట్లాడినాడు. అతని యుపన్యాస మిట్లు నడచినది.

## పురోహితుని దౌత్యము

'రాజధర్మము సనాతనము. ఇది ఒకనాడు ఒక వ్యక్తిచే ఏర్పడినది కాదు. ఈ ధర్మమెరుగనివారును ఈ సభయందులేరు. అయ్యును నన్ను మీ సమక్షమున మాటాడుట కనుమతించి, మాటలాడవలసినదిగా కోరిన కోరిక ననుసరించి నేను మాటలాడుట జరుగుచున్నది.

ధృతరాష్ట్ర పాండురాజుల సౌదర్యము జగద్విదితము కావున వారిద్దరకును ఈ రాజ్యముపైగల హక్కు సమానమేనను మాటకు సందేహ మెవ్వరికుండును ? అట్లు పాండవ కౌరవులకీ రాజ్యలక్ష్మి ననుభవించుటకు సమానమగు హక్కు కలిగియున్నను ధృతరాష్ట్రుడా హక్కును పాండునందనుల కందించకయే వారణావతమున కంపినాడు.

సేనానాయకులారా !

ధృతరాష్ట్రుడు వారి పితృభాగ్యమును వారి కందించకపోవుట యటుండ దుర్యోధనుడా పాండవుల ప్రాణములనుగూడ బలిగొని సామ్రాజ్యలక్ష్మిని తన వశము గావించుకొన యత్నించినాడు. కాని వారు మృత్యువాతమున బడలేదు. అఖండ భారత సామ్రాజ్యలక్ష్మికి పాండవులపై కాంక్షకలిగినది. వారి యుపారి బలపరాక్రమములు రాజ్యలక్ష్మిని మోహింపజేయగా రాజసూయము నడచినది. ఆ రాజసూయము దుర్యోధనునకు విషాదఘట్టముకాగా దుర్ద్యూతము నడచినది. రాజ్య మపహరింపబడినది. అడవులకు తరుముట జరిగినది. వారి జీవితము పండ్రెండు సంవత్సరములు అరణ్యమున గడపగా మాతృగర్భప్రవేశము వలె సంవత్సరకాల మజ్ఞాతవాసమున గడచినది. కాని నేడు వారా దుర్భర విషాదఘట్టముల నన్నిటిని పూర్వజన్మయందలి క్లేశము లనునట్లు మరచి ధార్తరాష్ట్రులతోడి పొందునే కాంక్షించుచుండిరిగాని యుద్ధమునకు ముందడుగు వేయుటలేదు. అట్లు యుద్ధమునకు దూరమగుండుటకు కారణము జగత్కల్యాణమును మనసునం దడుకొనియేగాని వేరు కాదు. ఒకవేళ వారు యుద్ధమునకే దిగుచో వారి బల మిట్లున్నది —

నేడు యుద్ధోత్సాహమున పరుగు పరుగున వచ్చిన రాజలోకమంతయు ఒకగుంపు. సాత్యకిభీమసేననకులసహదేవులు నలుగురును ఒక గుంపు. అర్జును డొక్కడొక్కడె యొకత్తు.

రాజలోకమంతయు ఏడక్షౌహిణుల బలము. భీమసేనసాత్యకినకులసహదేవులు నలుగురును వేయి అక్షౌహిణులు. అర్జును డొక్కడు పదకొండు అక్షౌహిణుల బలము. ఇది పాండవుల సేనాబలము. ఇం దర్జును డొక్కడే కౌరవబలమగు పదకొండక్షౌహిణులను బలిగొనగలుగగా అతనికితోడై బలపరాక్రమముల తుల్యుడై మంత్రరహస్యమునం దగ్రగణ్యుడై జగద్వ్యాపారతంత్ర మంతయు తన యందే నడుకొన్న కృష్ణుడచ్చటనే యుండెను.

మేధావులారా !

కౌరవపక్షపాతమున రణరంగమున జొచ్చు మీరందరును బ్రతికి బయటపడు టెట్లు ? ఊహించుకొనుడు. దీనికి మార్గము ధర్మము ననుసరించి వారి రాజ్యమును వారి కిచ్చుటేతప్ప వేరొక మార్గములేదు.

ఇది బ్రాహ్మణుని యుపన్యాసము.

బ్రాహ్మణుని యుపన్యాసమునం దర్జునునితో శ్రీకృష్ణుని కలుపుచు 'బుద్ధిమత్వం చ కృష్ణస్య' అని వ్యాసు లొక్క-పలుకుతో శ్రీకృష్ణుని వర్ణించినారు. తిక్క-నామాత్యు లీ బుద్ధిమత్వమను పదమును మ॥ 'వివిధోపాయపరాయణుండు.........' అను పద్యమున చక్క-గ వ్యాఖ్యానించిరి.

కురువృద్ధుడగు భీష్ము డాసభయందే యుండెనుగదా ! ఆతడు బ్రాహ్మణుని యుపన్యాము ముగియగా పూజ్యభావమున గౌరవించుచు ఆ విప్రున కిట్లు సమాధాన మిచ్చినాడు—

విప్రసత్తమా ! పాండవులు దైవబలభవ్యులై శ్రీకృష్ణ సాయము నంది, నేడు సంధికై యత్నించుట మాకు చాల ప్రశంసనీయమైన విషయము. పాండవులనుగూర్చి మీరు పలికిన పలుకులును సత్య దూరములు కావు. బ్రాహ్మణ స్వభావముచే నీ వాక్యము తీక్ష్ణమయ్యెను నీవు నుడివినట్లు వారి పైతృకమగు రాజ్యలక్ష్మిని వారు పొందదగియే యుండిరిగాని అందుకు సందేహము లేదు. నీవు వచించినట్లు ధనుంజయు నెదుర్కొ-ను వీరు డీ భూఖండమునగాదు స్వర్గసీమను పాలించు వజ్ర ధరు డెదురైవచ్చినను విజయు నెదుర్కొ-న లేడనుట త్రికాల సత్యము. ఇది భీష్ముని వాక్యసరణి.

'అపి వజ్రధరస్సాక్షాత్ కిముతాన్యే ధనుర్భృతః
త్రయాణామపి లోకానాం సమర్థ ఇతి మే మతిః.

శ్రోతలారా!

భీష్మ నిర్ణయము యథార్థమునకు సత్యదూరము కాదు. కాని ఆ సభయందున్న కర్ణునకు కర్ణకఠోరమైనది. కర్ణుడు మండిపడినాడు. ఆతడు తన చూపును తన రాజగు దుర్యోధనునివైపుకు త్రిప్పి, భీష్ముని పలుకులకు సమాధాన మిచ్చినాడు. ఏమని? పాండవుల పట్ల దుర్యోధనుని తప్పు రవ్వంతయు లేదని. దుర్యోధనునికొరకై శకుని జూదమాడగా ఓటువడిన పాండవుల యరణ్యవాసము సక్రమమై లేక పోవుటచే దుర్యోధనుడు రాజ్యమివ్వలేదు. ఇందు దుర్యోధనుని తప్పేమి? అని. ఇదియే వారి పాతపాట. భీష్మ దుత్తరగోగ్రహణమున చేసిన నిర్ణయమును మంట కలిపినదే ఈమాట. దీనిని మీరు మరువకూడదు.

పాండవుల యజ్ఞాతవాస వత్సరము సక్రమమై నడవగా, రాజ్య మివ్వకుండుటకు అడ్డుపెట్టిన దుర్యోధనుని వాక్యమునే ఈనాడాతని మిత్రసత్తముడు బలపరిచినాడు. అంతతో కర్ణుని సంభాషణ ముగియ లేదు. పాండవులదే దుర్నయమని ఆతడు తేల్చినాడు. పాంచాల మత్స్య భూపతుల బలము నాధారముగా గొని మూర్ఖముగ యుద్ధమునకు పాండవులు దిగగా పిరికితనమున దుర్యోధనుడు రాజ్యమిచ్చు ననుకునిరేమో! నాల్గవవంతు రాజ్యమైనను ఇచ్చువాడు కాడని కర్ణుడు నిర్ణయించినాడు. ఇక అర్ధరాజ్యము సంగతి చెప్పెడిదేమున్నది?

బలమాశ్రిత్య మత్స్యానాం పాంచాలానాం చ మూర్ఖవత్
దుర్యోధనో భయాద్విద్వన్న దద్యాత్ పాదమంతతః.

అంతేకాదు, దుర్యోధనుడెటువంటి త్యాగియో, ధర్మమూర్తియో కర్ణుడు నిర్ణయించినాడు.

'ధర్మత స్తు మహీం కృత్స్నాం ప్రదద్యాచ్ఛత్రవేపి చ'

ధర్మపూర్వకముగ ఇవ్వవలసివచ్చుచో శత్రువులకైనను ఈ భూమండల మిచ్చునట. అటులైన పాండవుల కెందుకీయడు ? మరల వనములకేగి ప్రతిజ్ఞను నెరవేర్చుచో పాండవులకైనను దుర్యోధనుడు తప్పక రాజ్య మివ్వగలడని కర్ణుడు ఆ బ్రాహ్మణునకు సమాధాన మిచ్చినాడు. చివరకు కర్ణునిమాట ఏమి ?

అథ తే ధర్మముత్సృజ్య యుద్ధమిచ్ఛంతి పాండవాః
ఆసాద్యేమాన్ కురుశ్రేష్ఠాన్ స్మరిష్యంతి వచో మమ.

నే నింత చెప్పినను వినక ధర్మమును పారద్రోలి పాండవులు యుద్ధమునకే వచ్చుచో వా రాయుద్ధమువలన వచ్చు ఫలము ననుభవించు నప్పుడు నన్ను తలచుకొందురని తన పరాక్రమమును వర్ణించినాడు కర్ణుడు.

కర్ణుని ప్రతాపము భీష్మునకు క్రొత్తకాదు. ఆతనికి సమాధాన మెట్లు చెప్పవలెనో భీష్ము డెరుగును. కర్ణున కొక్కమారు ఉత్తర గోగ్రహణమును జ్ఞాపకము చేసినాడు. నాటి యుద్ధమునం దర్జును డొక్కడేనని ఎత్తిపొడిచి నేడు నీ వూహించు యుద్ధమున సైనికబలమును శ్రీకృష్ణుని సాయమును కలదనుటను నీ వూహించుకొన్నచో ఇట్లు మాటాడవని చివాట్లుపెట్టి, మనకందరకును బ్రాహ్మణుడు వచించినట్లు చేయ విషయమున చావు తప్పదని ఘంటాపథముగ జవాబిచ్చినాడు. చివాట్లుపెట్టిన శ్లోకమున కనువాదమున్నది ఆంధ్రమున.

కింను రాధేయ వాచా తే కర్మతత్ స్మర్తుమర్హసి
ఏకఏవ యదా పార్థః షడ్రథాన్ జితవాన్ యుధి.

తిక్కనామాత్యుల అనువాద మిది —

ఉ॥ చిక్కని పోటుమానిసి విసీ వినువారలు నవ్వ నేమిగా
నెక్కుడు మాటలాడెద వహీన పరాక్రమశాలి యర్జునుం

డొక్కడ యార్వురన్ మనల నుగ్రరణంబున గెల్చె నిన్న నే
డిక్కడ బల్కెడిన్ గెలిచెదీ వతవిన్ మన రాజుకొల్వునన్.

ప్రస్తుతమున బ్రాహ్మణుడు చెప్పినట్లు రాజ్య మివ్వకున్నచో మన కందరకును చావు తప్పదని నొక్కి చెప్పిన భీష్ముని పలుకు ఆంధ్రభారతమున లేదు.

నచేదేవం కరిష్యామో యదయం బ్రాహ్మణోబ్రవీత్
ధ్రువం యుధి హతాస్తేన భక్షయిష్యామ పాంసుకాన్.

ఘాటుగ చెప్పిన భీష్ముని పలుకు ధృతరాష్ట్రుని కదిలించినది. కర్ణుని నిందించి, భీష్ముని శాంతపరచి, ధృతరాష్ట్రుడు పాండవులవద్దకు సంజయుని పంపుదునని చెప్పినాడు. ఇంతవరకు తేలినదేమి ? పాండవులకు రాజ్య మిచ్చుటయను విషయము చాల విచారణీయాంశమని ధృతరాష్ట్రుడు తేల్చినాడు. అదియే తేలినది. ఇక సంజయుడు పాండవుల కడకేగి ఏమిచెప్పునో తేలపలెను.

ఆ సభయందే సంజయున కాహ్వానమందినది. సంజయుని ప్రయాణము రేపు.

ఈనాటికి మన యుపన్యాసము సమాప్తము.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# సంజయు రాయబారము

ఉద్యోగపర్వ ప్రవచనమున కిది రెండవరోజు. నిన్నటిరోజున పాండవుల కర్తవ్య మాలోచించిన శ్రీకృష్ణులును ద్రుపద మహారాజును సంధిప్రయత్నమును, దానితోపాటు యుద్ధసన్నాహమునుగూడ చేయుట అవసరమని తెల్చినారు. రెండుపక్షములవారును యుద్ధమునకై తమ తమ ప్రయత్నములను కొనసాగించగా పదకొండు అక్షౌహిణులు దుర్యోధనున కును ఏడు అక్షౌహిణులు పాండవులకును బలము చేకూరినవి. కాని పాండవులు యుద్ధమును చేయుటకే నిశ్చితులై లేరు. సంధి ప్రయత్నము విఫలమగుచో యుద్ధమును కొనసాగింప సైనికబలమును చేకూర్చు కొనినారు. నిన్న ద్రుపద పురోహితుడు హస్తినాపురమునకేగి పాండవులు తమకు రాదగిన రాజ్యభాగమును తమ కిచ్చుచో యుద్ధప్రయత్నమున లేరనియు, కౌరవులు పాండవులకు వారి రాజ్యము వారి కిచ్చి మన్నించుట యుక్తమనియు, సభాముఖమున చెప్పగా ధృతరాష్ట్రుడు సంజయునిచే పాండవులకు సందేశమంపుదునని బ్రాహ్మణుని సత్కరించి పంపినాడు. ఇది నిన్నటి కథాంశము.

నేటి కథాంశము సంజయరాయబారము.

ధృతరాష్ట్రుడు సంజయుని పిలచి ఉపప్లావ్యమున కేగవలసినదిగా ఆజ్ఞాపించినాడు. సంజయు డుపప్లావ్యమున కేగి నెరవేర్చవలసిన కర్తవ్యము నువదేశించినాడు.

పాండవుల కాతడు రాజ్య మిచ్చుట హుళక్కి. ఆ విషయము సంజయునకు నిర్ణయము కాగూడదు. భీష్మద్రోణులకును స్పష్టము కారాదు. సంజయు డిప్పుడేమి చేయవలెను ? ధర్మనందనుడు యుద్ధమును

విరమించునట్లు చేయవలెను. ఇది సంజయుని కర్తవ్యము. ధృతరాష్ట్రుడు సంజయున కీవిషయమును మృదు మధుర గంభీర వాక్యసరణితోడనే యుపదేశించినాడు. కాని సంజయు డొకవేళ యుద్ధమును ప్రకోపింపజేయు నేమో యను సందేహము ధృతరాష్ట్రునకు లేకపోలేదు. కావుననే సంజయునితో మాటాడునపుడును పాండవుల నిందించక పాండవుల ధర్మహృదయమును మెచ్చుకొనుచు, ధర్మజుని తపః ప్రభావ సంపన్నత్వము నుగ్గడించుచు, తన పుత్రుల దుర్వ్యసనిత్వమును నిందించుచు, పర్యవసానమున ధర్మజుడు యుద్ధమును విరమించుకొని భిక్షాజీవనమునైనను జేసి, తన బిడ్డల బ్రతికించునట్లు చెప్పి రమ్మని పంపినాడు. ధర్మజుడు శాంతమూర్తియు, త్యాగియు గావున ఆతడు రాజ్యమును వదలి మరల అరణ్యముల కేగునేమోయని ధృతరాష్ట్రుని ఆశాభావము. ధర్మజుడు యుద్ధము చేయకున్నను ఆతడు మనస్సునందు తన పుత్రులను శపించినను తన బిడ్డలు నశింతురేమో యను భయ మాతనికి లేకపోలేదు.

కావుననే శాంతవచనముల ధర్మనందనుని శాంతింపజేయుమని సంజయుని బ్రతిమాలి పంపినాడు. యుద్ధమును మాత్రము ప్రకోపింప చేయవద్దని సంజయునకు చివరిమాటగా కూడ చెప్పినాడు.

'న మూర్ఛయేద్యన్న చ యుద్ధహేతుః'

అనగా వారి క్రోధము మరింత పెరుగునట్లు మాత్రము చేసి రావద్దని ప్రాధేయపడినాడు. ఇది ధృతరాష్ట్రుని సందేశము.

మహాభారతమున సంజయు డొక ప్రధానమగు పాత్ర. ఈతని తండ్రి పేరు గవల్గణుడు. ఇంతకన్న ఇతనిని గురించిన చరిత్ర భారతము నందు కనబడదు. ఇతడు పరమభాగవతోత్తముడు. ఈతని రాయబార మొక యపూర్వ రమణీయమగు వాగ్వైఖరితో నడచినది. ఈతని రాయబారమును రెండుభాగములుగ విభజించవలెను. ధృతరాష్ట్రుడు

పంపగా ఉపప్లావ్యమున ధర్మనందనుని సమీపమునం దాతడు మాటలాడు టొక భాగము. ఉపప్లావ్యమునుండి వచ్చిన తరువాత ధృతరాష్ట్రుని కొలువుకూటమున ధృతరాష్ట్రు డుపప్లావ్యము నందలి విషయముం బ్రశ్నించగా ఆతనికి సమాధాన మిచ్చునప్పటి ఘట్ట మొకభాగము. ఆ భాగముల రెంటిని మన మొకవిధముగ భావించుచో ఏభాగమున కాభాగము ఒకదాని కొకటి మిన్నయైయుండి భావుకుల భావముల కాశ్చర్యమును కలిగించు ననుటలో సందేహములేదు.

ఉపప్లావ్యమునం దాతడు మాట్లాడునప్పుడు ధృతరాష్ట్ర పక్షము నవలంబించిన కౌరవపక్షపాతి యనియే మనకు నిర్ణయమగును. ఉపప్లావ్యమునుండి వచ్చి ధృతరాష్ట్రుని కొలువుకూటమునం దాతడిచ్చిన సమాధానము లాతని ధర్మనిరూఢత్వమును, పరమభాగవతత్వమును వేనోళ్ళ చాటును.

ఇప్పుడు మీరు తెలిసికొనబోవునది సంజయుని వాక్చాతుర్యమును వినబోవునది ఆతని యుపన్యాసమును.

సంజయుని రథము హస్తినాపురమునుండి బయలుదేరినది. ఉపప్లావ్యమునందలి ధర్మజుని యాస్థానమునకు చేరుకున్నది.

అది ధర్మనందనుని కొలువుకూటము. శ్రీకృష్ణచంద్రు లక్కడనే యుండిరి. భీమార్జున నకుల సహదేవులును ద్రౌపదియుగూడ ఆ సభా మంటపము నలంకరించియే యుండిరి.

సంజయుడు రథమును దిగినాడు. ధర్మనందనుడు ప్రభువుగదా! రథమును దిగునది తడవుగా సంజయుడు ధర్మజుని పాదపీఠమునకు ప్రణమిల్లినాడు. ప్రణమిల్లుటే కాదు. ఆదరపూర్వకముగ సంజయుడే ధర్మనందనుని ముందుగ పలకరించినాడు. ఎంతకాలమునకో లభించిన ధర్మనందనుని సందర్శనము సంజయునకు సంతోష మేల కలిగించకుండును! తరువాత ధృతరాష్ట్రు డడుగమన్న కుశలవార్తలను ధర్మజు

నకు సందేశములుగ అందించినాడు. సంజయుడు ధర్మజునికందించు ప్రతి చిన్నపలుకును తాను చెప్పబోవు యుద్ధవిరమణకార్యమునే సూచించును. ఆతని మొదటి మాటను గమనింపుడు.

అనామయం పృచ్ఛతి త్వాం౽జాతశత్రో
వృద్ధో రాజా ధృతరాష్ట్రో మనీషీ.

ధర్మజా ! వృద్ధభూపతి నీ క్షేమము నారసిరమ్మని నన్ను పంపినాడని మొదటిమాటగా చెప్పినాడు.

ఈతని భావమేమి ? ధృతరాష్ట్రుని వార్ధక్యమును ధర్మజుని ముందు బెట్టి, ఆతని మనస్సును కరిగింప యత్నించినాడు. తరువాతి కుశలప్రశ్న మరీ చిత్రముగ అడిగినాడు.

ధర్మజుని సోదరులనందర వరుసగ పేర్కొని ద్రౌపది కొక ప్రత్యేకతను కల్పించి ధర్మజుడు ముందుగనే యుద్ధమునకు సన్నద్ధుడై యున్నటుల మాట్లాడినాడు. చూడుడు—

'కచ్చిత్ కృష్ణా ద్రౌపదీ రాజపుత్రీ
సత్యవ్రతా వీరపత్నీ సపుత్రా
మనస్వినీ యత్ర చ వాంఛసిత్వమి-
ష్టాన్ కామాన్ భారత స్వస్తికామః

ఈ శ్లోకమున ద్రౌపదికి కొన్ని విశేషములు వాడబడినవి సంజయునిచేత. రాజపుత్రీ, సత్యవ్రతా, వీరపత్నీ, మనస్వినీ శబ్దములను సార్థకముగ వాడినాడు. అంతేగాక, నీ యభ్యుదయమునకై నీవేమి కోర్కెల కోరు కొనుచుందువో అవన్నియు క్షేమమేనా ? యనినాడు చివరిపాదమున. ఇందు ధర్మజుడు యుద్ధసన్నద్ధుడగుటను ఎక్కడ సూచించెనందురా ? ద్రౌపదికి వాడిన విశేషణములలో రాజపుత్రీయను విశేషణమున తన్నవ మానించిన దుర్యోధనాదుల క్షమించుట యసంభవమని సూచించి ఆమెలోని ధైర్యసాహసములకు, వీరపత్నియు, వీరపుత్రియు నగుట

సకారణముగ ప్రతిపాదించినాడు. కావున నీవొకవేళ యుద్ధముకాదను కున్నను ద్రౌపది ప్రేరేపించుటచే మీరు యుద్ధమునకు సిద్ధమైయుండిరేమో నని ధర్మజునిపై యుద్ధోద్యమము నారోపించినాడు. అంతేకాని ద్రౌపది ప్రేరణచేత నీవు యుద్ధమునకు సిద్ధమైతివని వాచ్యముగ అనలేదు. అట్లే రథ గజ తురగ పదాతులను మాటను ఎత్తకుండ ధర్మజుని యుద్ధోద్యమ మును సూచించినాడు. అభ్యుదయకాముడై రాజపుత్రుడు ఏ కోరికల కోరుకొనునో ఆ కోర్కెలు ఫలించుటను గురించి ప్రశ్నించినాడు. రాజు కోరుకొనునవి రథగజతురగాదులే గదా ! అవి క్షేమమేనా అనినాడు.

'యత్ర చ వాంఛసిత్వం ఇష్టాన్కామాన్ భారత స్వస్తికామః'

ఇందు 'ఇష్టాన్ కామాన్' అను పదమున రథగజతురగ పదాతులు సూచించబడినవి. నీలకంఠు లిట్లు భావార్థమును తెలిపినారు.

'ఇష్టాన్కామాన్ - గజరథాదీన్ వాంఛసి, తేసర్వేకుశలినః' అని సమన్వయించి విశేషార్థమును సూచించినారు.

ఇట్లే సంజయునిగూడ ధర్మజుడు కొన్ని కుశలప్రశ్నల నడుగక పోలేదు. ఆ ప్రశ్నలలోకూడ ధర్మజుని వాణి అతి గంభీరమై నడచినది. మా పెదతండ్రిగారి యనుగ్రహముచే మేమందర మిట్లు క్షేమముగనే యున్నామని చమత్కరించినారు.

నిన్ను చూడగా మా పెదతండ్రిని చూచినట్లే యున్నదని సంజయుని ఆదరించి పలికినాడు. ఆ మాటలలోని భావమేమి ? ధృతరా ష్ట్రుని సంగతి సంజయు 'డెరిగినవాడగుటచే అతడు మా మరణమును కోరినను మేముమాత్రము ఇడుమల గడచి క్షేమముగనే యుంటిమని ధృతరాష్ట్రుని కపటప్రేమను ధ్వనించినాడు. అంతేగాక సంజయుడు చెప్పబోవు మాటలేవియోగూడ నీవు మా పెదతండ్రిని స్మృతికి తెచ్చు చుంటి వనుటలోనే తేల్చినాడు. ఇట్లే ఇంకను ధర్మజుని కుశలప్రశ్నల లోని చమత్కారములను చెప్పెదను చూడుడు —

ధర్మజుని కుశలప్రశ్న లివ్వి —

సంజయా ! మా కురువృద్ధగు తాతగారు క్షేమమేనా ? వారిమాట చెల్లుచుండెనా ? వారికి మాపై నగల ప్రేమ పూర్వమువలెనే యుండెనా ?

కర్ణుని మంత్రిత్వమును కొనసాగించుచు మందబుద్ధియగు సుయోధనుడు కుశలిష్ఠై యుండెనుగదా ?

బ్రాహ్మణులకు మే మిచ్చియిచ్చిన అగ్రహారములను ధన సంపదలను పూర్వమువలెనే యున్నావా ? లేక దుర్యోధనుని స్వాధీనమైనవా ?

దుర్యోధనుడు ఘోషయాత్రకై అరణ్యమునకు రాగా నాడు భీమార్జును లాతని రక్షించుట నెప్పుడైన దుర్యోధనుడు స్మరించు చుండెనా ?

భీష్మద్రోణకృపాశ్వత్థాము లేమైన మమ్ములను దోషులనుగా భావించుచుండిరా ? హస్తినాపురమందలి పెద్ద లేమనుచుండిరి ?

ధర్మజుని ప్రశ్నలను వింటిరా ? అందొక ప్రశ్నలోని చమత్కారమును చెప్పెదను వినుడు.

మేమిచ్చిన అగ్రహారములను బ్రాహ్మణులనుండి కాజేసెనా ? అను మాట కర్థమేమి ? దుర్యోధనుని దురాశను చెప్పక చెప్పినాడు. ఇక్కడనే సంజయుడు తన వాక్చాతుర్యమునంతను చూపినాడు. అతని సమాధాన మిది —

ధర్మజ ! ఎంతటి కుమతులైనను బ్రాహ్మణుల కిచ్చిన దానము లనుకూడ అపహరింతురా ? నీ వనునంత లోభికాడు దుర్యోధనుడు. కాని మీవల్ల అతడు దుర్మార్గమును చేసెననుట కెట్టి సంశయమును లేదనినాడు. దీనిచే దుర్యోధనుని పాత్రను చక్కగ పోషించుచు ధర్మజునకు కోపము రాకుండచేసినాడు. దుర్యోధనుని పాత్ర కెంతయో

మెరుగు దిద్దినాడు. దుర్యోధనుడు త్యాగికూడనట. శత్రువులయందుకూడ దయచూపునట. దుర్యోధనుడేకాదు, బ్రాహ్మణద్రవ్యముల నెంత కుమతులైన అపహరింతురా ? అని ఎదురుప్రశ్నను వేసి, దుర్యోధనునిపై అంత దోషమును మోపవద్దని మనవిచేసినట్లు మాట్లాడినాడు. దుర్యోధనునిలో తప్పులేదని నే ననను. కాని సహజముగ లోభికాడు. జ్ఞాతి శత్రుత్వమున మీకు మాత్రము ఘోరము చేసెనని ఒప్పుకొనినాడు.

యద్యుష్మాకం వర్తతే సౌనధర్మ్యం
అద్రుగ్ధేషు ద్రుగ్ధవత్తన్న సాధు.

దోషము నొప్పుకొనుచు ఎదుటివాని మనస్సును రంజింపజేసి, తన భావమును ఎదుటివానికి నచ్చచెప్పుట యొకపద్ధతి. ఆ పద్ధతినే సంజయు డవలంబించినాడు. 'సౌనధర్మ్య' మనగా ఘాతుకకృత్యము. మీరేమియు అపకారము చేయని పుణ్యపురుషుల నాతడు హింసించెనని యొప్పుకొని ధర్మజుని ప్రశంసను కలిపి, దుర్యోధనుని దోషమును చూపినాడు. ఇది సంజయునిలోని వాక్చాతుర్యము. మరొక్కమాట—

దుర్యోధనుని దోషము నొప్పుకొనునప్పుడు ధృతరాష్ట్రుని కూడ కలిపినాడు. 'మిత్రధ్రుక్స్యాత్ ధృతరాష్ట్రస్సపుత్రః' కారణ మేమి ? నీ పెదతండ్రితో సహా వారందరును నీకు అపకారమే చేసినారని స్ఫురింప జేసి, వారు పాపాత్ములగుట సత్యమేయైనను నీవు మొదటినుండియు వారి మిత్రద్రోహ కృత్యముల నెట్లు సహించితివో నేడును నీ వట్లే సహించదగిన ధర్మాత్ముడవని యుద్ధశాంతిని ప్రోత్సహించినాడు. మిత్ర శబ్దమును వాడి, అది యట్లుండ సంజయుడు ధర్మజుని సంబోధించుటలో 'అజాతశత్రో ! ' అని సంబోధించును. నీవు శత్రువు లేనివాడవని స్తుతించుచు మాట్లాడును. మాట్లాడుటకాదు. అత డిచ్చు సమాధానములలో ఒక ఘట్టమున ధర్మరాజు హృదయమును కరగించుటకై ప్రయత్నించిన

ప్రయత్నము మరొకటున్నది. ధృతరాష్ట్రుని అవస్థ యెట్లున్నదో చూపినాడు.

న చానుజానాతి భృశం చ తప్యతే
శోచత్యంతః స్థవిరోఽజాతశత్రో.

పాపము ! మీ పెదతండ్రి ఏమిచేయును ? కొడుకు తన మాటను విననందుకు చాల బాధపడుచుండెననియు, ముసలితనమునం దిట్టి దురవస్థ ధృతరాష్ట్రునకు వచ్చినదనియు, ఆతని దురవస్థను తీర్చవలసినవాడవు నీవే ననియు చూపించి ధర్మజుని యుద్ధమునుండి శాంతింప యత్నించినాడు. కాని మాటలో మాటను కలిపి 'నచానుజానాతి' ధృతరాష్ట్రుడు సంధి కొప్పుటలేదనికూడ చెప్పినాడు. ఆ మాటను ప్రత్యేకముగ చెప్పక ధృతరాష్ట్రుని అవస్థను వర్ణించుచు అందులో కలిపినాడు. ఇదియే సంజయుని చాతుర్యము.

ఇదంతయు సంజయుని సంభాషణాభాగము. తరువాతది యుపన్యాసము. అది వినదగినవారిని కొందరి నొక్కచోగూర్చి, వారందరి మధ్యమునను వాక్రుచ్చవలెను.

శ్రీకృష్ణుడును భీమార్జున నకులసహదేవులునుగూడ ధృతరాష్ట్రుని యభిప్రాయము వినదగినవార లగుటచే సంజయుడు వారందరు వినుచుండగా మీ పెదతండ్రి మాటల వినిపింతునని ధర్మజుని కోరినాడు.

వారంద రెక్కడైన దూరదేశమునం దుండిరా ? సంజయునకు వారంద రక్కడే యుండిరని తన సోదరులును శ్రీకృష్ణుడేకాక 'కొల్వున గల యట్టి సర్వజనులున్ వినుచుండెదరయ్య విన్న నేమని చెప్పబంచె అది యంతయు చెప్పు' మని సంజయుని మాటను నొక్కిపలికినాడు ధర్మజుడు.

యత్తే వాక్యం ధృతరాష్ట్రానుశిష్టం
గావల్గణే బ్రూహి తత్సూతపుత్ర.

నాకు చెప్పిన విషయమేగదా ! ధృతరాష్ట్రుని హృదయము ? అంతకంటె మా పెదతండ్రి వారికి ప్రత్యేకముగచెప్పుమన్న దేమున్నది? అయ్యేను వారికికూడ విన్పింపుమని తెల్చిపలికినాడు. వారందరిక్కడే యుండిరని ధర్మజుడు పలికిన పలుకులోని భావమును సంజయుడు గ్రహించకపోలేదు. గ్రహించినాడు. అయ్యేను తన బాధ్యతను నెరవేర్చవలెను.

## సంజయుని యుపన్యాసము

సంజయుని కర్తవ్య మిప్పుడు చాలపెద్దది. మీ కిచ్చునదేమియులేదు. మీ రడుక్కొని తినుటయే మి జీవితమున కొక యలంకారము. మీ రథ గజ తురగ పదాతుల సంపదనంతను దుర్యోధనుని చేతబెట్టి త్యాగశీలురు పాండవులను యశశ్చంద్రికలు దిగంతముల వ్యాపించగా మీ రడవుల తిరుగాడినను మీ జీవితమున కలంకారమేననియు, మీకు దక్కదగు సిరి యదియేననియు చెప్పి యొప్పింపగల నేర్పరితనమును తానిప్పుడు చూపవలెను. అదియు పాండవుల నొప్పించుటకాదు. ఆ సభ నలంకరించిన పెద్ద లందరిచే పలికింప ప్రయత్నింపవలెను. వేయేల ? సంజయుడు తన యుపన్యాసమున పొర్లును దంచి బియ్యము చూపవలెను. అదియు ధర్మజుని నమ్మించవలెను. భీమార్జునుల హృదయముల త్రిప్పవలెను. విరాటద్రుపదులు శబా సనవలెను. శ్రీకృష్ణుడును తలనూపవలెను. ధృతరాష్ట్రి డెంతభారమును తలపై మోపి సంజయుని పంపినాడు !

అయ్యేను వాగ్వైభవమును చూపగల నేర్పరుల కిదియొక యాట వలెనుండును.

సంజయుడు సభావేదికకు వినయావనతుడై వచ్చినాడు. ప్రప్రథమముగ ధర్మజుని సంబోధించినాడు. భీమార్జున నకుల సహదేవు లను శ్రీకృష్ణచంద్రుని, విరాటద్రుపదులను వేర్వేరుగ వారి వారి నామముల నిర్వచించి సంబోధించినాడు. ధృష్టద్యుమ్న సాత్యకులపంక

తిరిగి, వారినికూడ తన మాటల వినుట కాహ్వానించినాడు. వారందరును తమ తమ చూపులను తనవైపుకి త్రిప్పగా మాటలాడ నారంభించినాడు.

మహనీయులారా ! నే నిప్పుడు చెప్పబోవునది కౌరవుల వైభవమునకు తరుగురాని యమూల్య సందేశము గావున మీరందరును సావధాన మనస్కులై వినుటకు ప్రార్థించుచుంటినని తన యుపన్యాస సారమును సంగ్రహముగ చెప్పినాడు.

సర్వే వాచం శృణుతే మాం మదీయాం
వక్ష్యామి యాం భూతిమిచ్ఛన్ కురూణాం.

నే నందించబోవు సందేశము కౌరవసంతతికి ఎడతెగని సంపద నందించగలది గావున మీరందరును నా మాట కొక స్థానమునిచ్చి వినవలయునని ప్రార్థనాపూర్వకముగ పలికినాడు.

ఉపన్యాసకుడు శ్రోతల నభిముఖుల గావించుకొను తెఱగిదియే. ఇందు నా స్వార్థమేమియులేదు. క్షత్రియజాతి కంతకును మేలును చేకూర్చు నావాణిని నిష్పక్షమ్యముగ వినుడు సావధానమనస్కులై వినుడని శ్రోతల దృష్టులను తనవైపుకు త్రిప్పుకొనినాడు. అందు 'కురు' పదమునువాడి, తాను చెప్పబోవునది దుర్యోధనుని హితమేయైనను కురు సంతతి కంతకును మేలని చమత్కరించి పలికినాడు.

సింహాసనాసీనులగు రాజమండల మంతయు సంజయునివైపుకు చూడ్కుల నిగిడ్చినారు.

సంజయు డిప్పుడు చెప్పదలచిన ముఖ్యాంశమేమి ? ధృతరాష్ట్రుడు యుద్ధశాంతినే కోరుచుండెననియు మీరును యుద్ధమును విరమింపుడనియు చెప్పవలెను. ఈ విషయముల నెంత చక్కగ ప్రారంభించినాడో చూడుడు —

శమం రాజా ధృతరాష్ట్రోఽభినందన్
అయోజయత్ త్వరమాణో రథం మే.

ధృతరాష్ట్రుడు ఎక్కడ యుద్ధము పొసగి రాజలోకమునకు హాని కలుగునోయని భీతిల్లి మీరు చెప్పి పంపిన విప్రవాక్యము నాధారముగా సంగ్రామరంగమునకు పాండవుల సభిముఖుల కాపద్దని అతివేగముగ రథము నాయత్తము గావించి నన్ను బంపినాడు. ఎట్టి పట్టమునందును ధృతరాష్ట్రుడు యుద్ధమును కాంక్షించుటలేదు. తమ్ముని బిడ్డలగు పాండవులాతని పలుకుల నాదరించు టెంతయు సమంజసముగదా!

మీరు తలపెట్టిన యుద్ధమును విరమించుట కిది యొకవిధము. ఇదికాక మీ చరితమును మీరు తిరిగిచూచుకొన్నను మీరు యుద్ధమునకు పూనుకొనుట తగినపని కాదు.

పాండవేయులారా! మీ జీవితములు క్షత్రజాతికంతకు శిరోధార్యములు. మీ రూపసౌభాగ్యములతోబాటు దయ మీకు ఉగ్గుపెట్టిననాటి వెన్న. వంకరలేని నడకలు మీకు శిరోభూషణములు. లజ్జయనునది మీకు పెట్టని నగ. కార్యాకార్య నిశ్చయముగావింప దక్షులు. ఇట్టి విశుద్ధగుణసంపదచే వన్నెగాంచిన మీ పరిశుద్ధ జీవితమునకు మీరీనాడు తల బెట్టినయుద్ధసన్నాహము శుభ్రవస్త్రమునందంటిన అంజనబిందువని సోదాహరణముగ చెప్పినాడు. మూలములోని శ్లోకమును గమనింపుడు.

'ఉద్భాసతే హ్యంజన బిందువత్త

చ్ఛుభ్రే వస్త్రే యద్భవే త్కిల్బిషం వః'

మూలశ్లోకములోని భావములనే తిక్కన ఆంధ్రావళి మోదమంద తెనుగున పలికినారు. ఉదాహరణకు తన వయనమునుగురించి సంజయుడన్న

'అయోజయత్వరమాణో రథం మే' అను దానినే

'నన్నిట ప్రియంబున బంచెదునప్పు నాకు దే

రెంతయు వేడ్క దాన వెరవేర్పడ జెప్పుచు బన్నిబంచె'— అని తెనిగించినారు. శ్లోకమున 'త్వరమాణః'అను విశేషణమునువాడి వ్యాసులు ధృతరాష్ట్రుని ఆతురతను ఆతనికిగల యుద్ధశాంతియొక్క ప్రాముఖ్యతను

సూచించినారు. పాండవులను ప్రశంసించు శ్లోకమున వారిగుణములను వ్యాసులు ప్రత్యేకించగా 'మీ యట్టి సర్వధర్మజ్ఞులు' అని తిక్కన సంగ్రహించినారు. తెల్లనిబట్టపై యంటిన మసివంటిది నేటి మీ యుద్ధ రూప పాపమను యుపమానమును పరిశీలింపుడు.

శుద్ధవస్త్రమునందు కొట్టవచ్చినట్లు కానబడి ఆ వస్త్రముయొక్క శుద్ధత్వమునంతను తుడిచిపేసినట్లు పాండవులు పుట్టిననాటినుండియు నడుపుకొన్న శుద్ధజీవితమునందు నేటికళంకము వ్రేలుపెట్టి చూపదగినదై యుండుననని చక్కని ఉపమానమును ప్రపంచించినాడు సంజయుడు. ఇందు అంజనబిందువను ప్రయోగమెంతయు స్వారస్యమును చేకూర్చినది. సూక్ష్మమగు బిందువుకూడ విశాలమగు వస్త్రమునందలి తెలుపును హరించునట్లే ఈహీనకార్యమొక్కటే మీ వెలుగునకు కళంకము కాగలదని సూచించినది. అనగా నీ విప్పుడా మసిని తుడిచిపేయగల సమర్థుడవనియు, దానిని తుడిచివేయుట నీకొక లెక్కకాదనియు, నిమిత్తముగ వచ్చిన దీనిని తుడిచివేయుమనియు, ఆ నిమిత్తముగూడ దుర్యోధనుని వలన కలిగినదేగాని ధృతరాష్ట్రునియందేమియు లేదనియు, ధృతరాష్ట్రుడు దుర్యోధనుని నిందించుచునే యుండెననియు, అయ్యును కొడుకును వారించుట అతనికి చేతయగుటలేదనియు, మీ వంశమునకు వచ్చు మచ్చను సమర్థుడవగు నీవు తుడిచేవేయుట అవసరమనియు ధర్మజు నుద్దేశించి బోధించినాడు. ఈ భావమునే తిక్కనామాత్యులను వర్ణించినారు.

ఆ. మడుగు జీరయిందు మసిదాలినట్లు మీ
సత్కులమున గల్మషంబు కౌర
వేంద్రు కతన బొందె నింతయు బాపంగ
నీవ నేర్తు కార్యనిపుణహృదయ.

మూలమునందు వాడబడిన కిల్బిషపదమెంతయు సార్థక్యమగు పదము కాగలదు. యుద్ధము చులకనగు కార్యముకాదు. యుద్ధము నీకొక మహా

పాపమునంటగట్టుము. అంతపాపము నేల చేయుదువు? నీవు పుణ్యమూర్తివి. నీకు ధర్మరాజను పేరున్నది. కావున పాపము నొతిగట్టుకొనవద్దని ధర్మజు నుద్దేశించి కిల్బిషపదము వాడబడినది.

ఇంతవరకు యుద్ధము హింసాకాండ యగుటచే పాపహేతువని నిర్ణయించినాడు. ఇక లౌకికదృష్టిని చూచినను యుద్ధమువలన ప్రయోజనము లేదని నిరూపించుట ప్రారంభించినాడు.

యుద్ధమునందలి జయాపజయములు దైవాధీనములు. జననాశము తప్పదు. అందును మీరు దండెత్తునది పరరాజులపై కాదు. జ్ఞాతుంపోరితము. మీ తాతలును వారి తాతలును ఒక్కరే. మీ రిప్పుడు నిలబడబోవు రణరంగమున నిలుచువారు మీ బంధువులును, గురువులును, స్నేహితులునుగదా! వారందరు చచ్చుట తప్పదు. ఒకవేళ మీకు జయము కలిగినను మీ రనుభవించు సుఖమేమున్నది? దయాపయోనిధీ! యుద్ధమును మానుము. అని తన ధోరణిని మరియొకవైపుకు మళ్ళించినాడు. మీరు జయించలేరని నేను చెప్పను. మీబల మత్యుదగ్రము. నాకు తెలియును-అని ధర్మజు నొక్కమారు హిమపచ్ఛిఖరము నెక్కించ ప్రారంభించినాడు.

ఇచ్చట కేవలము ధర్మజుని బలమును వర్ణించుటేగాదు; దుర్యోధనుని బలమునుగూడ సంజయుడు వర్ణించినాడు. ఆ రెండు వర్ణనలను మీకు ఆంధ్రభారతమునుండియే అందించి తరువాత ఆ వర్ణనల భావమును మీకు విశదీకరింతును.

సంజయునిచే పాండవ బల మిట్లు వర్ణింపబడినది.___

ఉ. పెట్టనికోట నీకు హరి భీముడు నర్జునుడున్ రణంబునం
దొట్టినమంట లాకొలదియోధుల సాత్యకియున్ విరాటుడుం
జుట్టపుమేరు వుగ్ర రణశోభితుడీ ద్రుపదుండు నిన్నా ని
ట్టట్టన వచ్చునే సురల కైనను నొల్లవు గాక చివ్వకున్.

ఇక కౌరవబలము.

ఉ. ద్రోణుడు భీష్ముడుం గృపుడు ద్రోణసుతుండును గర్ణశల్యులుం
బ్రాణము లాసుయోధనునిపాలివి యంద్రు నిజానుజన్ముల
క్షీణపరాక్రముల్ సుతులజేయుట బాహ్లికసోమదత్తు లా
స్థాణున కైన నోడరు విశంబె జయింపగ వారి నేరికిన్.

శ్రోతలారా ! సంజయుని వాక్యసరణిని గమనింపుడు —

రాజ్యరక్షణమునకై రాజులు కోటలను నిర్మించుట సహజము. కాని ధర్మజా ! నీకు మాత్రము నిర్మింప నక్కరలేకయే తనంతట తానై యవతరరించిన కోట శ్రీహరియని వర్ణించి, ఇది శత్రుమూకలకు వశముగాని యావరణమని ధర్మజు నొక్కమారు హిమవచ్ఛిఖరమున కూర్చుండబెట్టి, పట్టము గట్టినాడు. దానికితోడు భీమార్జునులను రణరంగమున జ్వాలాభీలముగ చరింతురని యుద్ధమునం దెదురులేని బలపరాక్రమములు గలవని ధర్మజున కొక సువర్ణకవచమును బహూకరించి, నీ బరువునంతను మోయుటకు ద్రుపదుడు మేరుపర్వతమువలె నుండెనని చెప్పి, సాత్యకి విరాటులను ప్రత్యేకముగ బలదర్పితుల గావించి, దేవతలకైనను నిన్ను తేరిపారచూడ సామర్థ్యములేదని పాండవపక్షమును వర్ణించినాడు. అదేనోట, కురుబలమునుకూడ వర్ణించుట జరిగినది.

భీష్మద్రోణ కృపాశ్వత్థామ కర్ణాది వీరయోధులందరును తమతమ ప్రాణములనొడ్డి, యుద్ధరంగమున నిల్వగా సాక్షాత్పరమేశ్వరుడే వారిని డీకొన జాలడనగా మీరు మాత్ర మా వీరశిఖామణుల గెలుతురని నియమమేమున్నది ? అనినాడు.

ఇప్పుడు సంజయు డేమిచేసినాడు ? మీరు కౌరవులను జయింతురన్న నమ్మకము లేదని భయపెట్టినాడు. ఇందు చిత్రమేమన : నీకు జయము కలుగునను నమ్మకము లేదని చెప్పదలచియు, పరపక్షబలమును

వర్ణించి, అంతకంటె నీ బలము తరుగై యున్నదిగాన నీ కపజయమని చెప్పుటకు సాహసింపక, పాండవబలమునే వర్ణించి కౌరవపక్షవర్ణనమున పాండవులకు భయముగొలిపి మీకు జయము కలుగునను నమ్మకమేమను నట్లు తేల్చినాడు. ద్రుపదపురోహితుడు వాచ్యముగనే కౌరవపక్షము బలహీనమై యున్నదని చెప్పినాడు. ఇదియే వక్తలలోని తారతమ్యము. 'పెట్టనికోట' యను పద్యమునకు మూలమిది :

'కో హ్యేవ యుష్మాన్ సహ కేశవేన
సచేకితానాన్ పార్షతబాహుగుప్తాన్
ససాత్యకీన్ విషహేత ప్రజేతుం
... ... ... ... ... ... ...'

ఇట్లే రెండవశ్లోక మున్నది —

**ఇంతతో** సంజయు డాగలేదు. యుద్ధముచేసి, రాజ్యమును తీసుకొన దగినవారు మీరుకారు. మీ రాజవంశమున కిది మర్యాదకాదని ఉద్ఘాటించినాడు.

కథం హి నీచా ఇవ దౌష్కులేయాః
నిర్ధర్మార్థం కర్మ కుర్యుశ్చ పార్థాః.

దుష్కుల సంజాతులగు నీచుల కార్యము యుద్ధమని సామాన్యం కొట్లాటవంటిదానినిగా రాజధర్మమగు యుద్ధమును చిత్రీకరించి చూప గలిగినాడు. ఆ మాట మాటుకాగా రక్తసిక్తమగు యుద్ధభూమిని నేను చూడజాలనని తన జాలిగుండెను బయటపెట్టి, దయారసమును వలక బోయుచు చేతులు మోడ్చి, అక్కడున్న పెద్దలనందరను శరణు వేడినాడు చూడుడు — '... ... కృతంజలిశ్శరణం వః ప్రపద్యే'

ఆంధ్రభారతమున

ఉ. ప్రొక్కెద వాసుదేవునకు మోడ్చెద జేతులు సవ్యసాచికిం
దక్కటి మిత్రబాంధవహితప్రియమంత్రి వయస్యకోటికిన్

క్రుక్కుచు విన్నవించెద నసూయలు దక్కి యనుజ్ఞఁ జేయు డీ
యిక్కరుణాకరున్ శరణ మే పడి వేడెద ద్రోణశాంతిఁకిన్.

తాను యుద్ధమును విరమింపజేయుమని చెప్పుటగాదు. భీష్మాదుల కును ఈ యభిప్రాయము లేదని చెప్పినాడు.

'ఏతద్రాజ్ఞో భీష్మపురోగమస్య
మతం యద్వశ్శాంతిరిహోత్తమా స్యాత్'

ఇంతవర కిది సంజయుని వాక్ప్రౌఢిమ.

మీరిక ధర్మజుని విశిష్ట వాక్ప్రసూనము లెట్లు వికసించి గుబాళించునో చూడుడు —

ధర్మజుని పలుకులు తనకు తోచిన మాటలుగావు. తన అంతర్యామి ప్రబోధించిన ప్రబోధములుగావు. వేదమాత నోటినుండి వెడలివచ్చిన మధురధర్మనీతికి వ్యాఖ్యానములు. నేలవిడిచి ధర్మజుడు సాము చెయ్యడు. శాశ్వతమగు భారతీయసిద్ధాంతమే అతని ధర్మపీఠమున కాధారము.

ధర్మజుడు సంజయునకు సమాధాన మిచ్చుటకు తన సంభాషణ నెక్కువగ పెంచలేదు. సంజయుని ప్రతివాక్యమును పరిశీలింపుచునే వినినాడు. సంజయుని సంభాషణలోని ముఖ్యాంశములు మూడు. రెండంశములు స్పష్టములై వినబడగా మూడవ అంశము అంతర్గర్భితమై సంజయుని యుపన్యాస వాగ్వైఖరియందు దాగియున్నది.

1) మొదటివిషయము ధర్మజుడే యుద్ధమునకు ముందుగ సిద్ధమైన ట్లారోపించుట.

2) రెండవది భీష్మాది కురువీరుల బలము నీ బలమునకు తులదూగి యుండుటచే యుద్ధమున నీకే జయమను మాటకు తావులేదనుట.

3) మూడు : భీమార్జున నకుల సహదేవుల ప్రోద్బలమే నిన్ను యుద్ధమునకు ముందడుగు వేయించుచున్నదిగాని లేకున్న నీవు దయామయుడవే ననుట.

ఈ మూడు విషయములను ధర్మజుడు చక్కగ ఖండించినాడు. మొదటివిషయమును ఖండించుటకు సంజయుని సూటిగ ప్రశ్నించినాడు. ఆ ప్రశ్నయే సంజయుడు యుద్ధమునుగూర్చి చెప్పిన యుపోద్ఘాతము నంతను ఖండించినది.

ధర్మజుని ప్రశ్న యిది —

'కాం ను వాచం సంజయ మే శృణోషి
యుద్ధైషిణీం యేన యుద్ధాద్బిభేషి'

సంజయా! నీవు ఏ యుద్ధమును పురస్కరించుకొని నన్ను భయపెట్టుచుంటివో ఆ యుద్ధ విషయము నెప్పుడైన నా ముఖమునుండి వెలువడినట్లు వింటివా? నీవే చెప్పుమని సంజయునే సూటిగ ప్రశ్నించినాడు.

ధర్మజుని ప్రశ్నవలన సంజయున కేమి సమాధానమందినది?

యుద్ధమును గురించిన ప్రసక్తియే నాకులేదు. నేను కోరునది నా పైతృకమగు భాగమే. నా భాగము నా కందుచో నేనేల యుద్ధమునకు దిగుదును? యుద్ధము ప్రసక్తమైనగదా; యుద్ధములోని గుణదోషముల పరిశీలించుట? మా కీయవలసిన రాజ్యభాగమీయక నన్ను యుద్ధమునకే దింపదలచిన మీ రాజుహృదయమునవనే యుద్ధము రూపొందియున్నట్లు నీ యుపోద్ఘాతము రుజువుచేయుచున్నదని ఆ ప్రశ్న సమాధానమిచ్చినది. యుద్ధప్రసంగము నే నెన్నడును చేయలేదని నేను చెప్పుటకాదు; రాజు పక్షమున మాటాడు నీవే చెప్పుమని సవాలు చేసినది. అంతతో ధర్మజు డాగలేదు. సంజయా! నీవేదో తెలివిగ మాటాడితివిగాని యుద్ధముచేసి రాజ్యమును సంపాదించుటకంటె యుద్ధములేకయే రాజ్య మబ్బుకొనుట తేలికయని ఎవరెరుగరు! నాకును తెలుసునని యుద్ధదోషములనుద్ఘాటించిన ప్రసంగము నంతను గోట త్రుంచినాడు.

న కర్మ కుర్యాద్విదితం మమైతత్
అన్యత్ర యుద్ధాద్బహు యల్లఘీయః.

అంతేకాదు సంజయుడు చేసిన పనినికూడ బయటపెట్టినాడు. ఏమది? పొగడుటను మాటుపెట్టి యుద్ధమునకు భయపెట్టితివని. దానికిని సమాధానమిచ్చినాడు. ఏమని? భీష్మ ద్రోణ కర్ణ దుర్యోధనులకును మిగిలినవారికిని అర్జునుడుతప్ప వేరొక ధనుర్ధరుడు లోకమునలేడని తెలుసునని స్పష్టముగ చెప్పినాడు. ఇదిగో మూలము.

కర్ణశ్చ జానాతి సుయోధనశ్చ
ద్రోణశ్చ జానాతి పితామహశ్చ
అన్యేచ యే కురవస్తత్ర సంతి
యథార్జునాన్నాస్త్యపరో ధనుర్ధరః.

ఇంతతో రెండువిషయములకు సమాధాన మందినది.

మరొక చక్కని సమాధానము నిచ్చినాడు.

ధర్మము చెడకుండునట్టియు, లోకసమ్మతమగునట్టియు పనులనే బుద్ధిమంతుడు చేయునని చెప్పి, భీమార్జున నకుల సహదేవు లట్టివారేగాని కయ్యమునకు కాలుదువ్వువారు కారని తేల్చిచెప్పినాడు. అనగా మేమెవ్వరమును యుద్ధమును కోరుటలేదని అర్థము. ఇది మూడవది. ధర్మరహితముగ ప్రతిపక్షులు మాటాడుచుండ ఎవరిమాటయైనను లోకసమ్మతము శాస్త్రాధారమై యుండవలెనని సరిదిద్దినాడుకూడ.

'ధర్మాదహీనం యుష్య లోకస్య పథ్యం.

అనగా నా యుద్ధము స్వార్థముగాదని తేల్చి, ధర్మమని వేలుపెట్టి చూపినాడు.

ఇవన్నియు ఇట్లుండ గొప్పసవాలు వొకదానిని చేసినాడు. మేము దుర్యోధనుడు చేసిన అపకారములు నన్నిటిని పారద్రోలి ఇంతవరకు

సహించిన సంగతి నీ వెరిగినదేగదా ; నీవు చెప్పితివిగావున ఇప్పుడును శాంతినే కాంక్షించి, ఇంద్రప్రస్థమునే రాజధానిగా గొని మేముండగా హస్తినాపురమును దుర్యోధనుడే ఏలుకొనునట్లుగ ఏర్పాటు చేయుము - అనినాడు.

'శాంతిం గమిష్యామి యథా త్వమాత్థ
ఇంద్రప్రస్థే భవతు మమైవ రాజ్యం
సుయోధనో యచ్ఛతు భారతాగ్ర్యః.

ఈ విషయమునే తిక్కనార్యులు మూడు పద్యములలో ధర్మజుని పలుకులను వర్ణించినారు.

ఇట్లు ధర్మజుడు సమాధానమీయగా సంజయున కేమి తేలినది ? రాజ్యభాగమీయనిచో యుద్ధము తప్పదని తేలినది.

ఇప్పుడా సంజయుడు చెప్పవలసిన దొకమాట యున్నది. వారు రాజ్యమీయకున్నను నీవు యుద్ధము మానుటేయుత్తమని.

దానికై యాతడు ధైర్యము నవలంబించినాడు. వేదాంతమును ప్రారంభించినాడు. జీవిత మనిత్యము. కావున కీర్తి శరీరమును సంపాదింపమని యుద్బోధించినాడు. స్వల్పకాల జీవనమునకై యుద్ధమునం దిందరిని చంపి, రక్తాన్నమును భుజించుటకంటె శాంతజీవనమునకై భిక్షాన్నము మేలని — సన్యాసధర్మములోని యుత్కృష్టతను చక్కగా వర్ణించి, మీరొక భిక్షాపాత్రను సంపాదించుకొమ్మని సూటిగ చెప్పినాడు. ధర్మార్థకామములలో ధర్మమునకై అర్థమును వదలుట శ్రేయస్కరమని ఉపనిషత్సిద్ధాంతమును వైరాగ్యముతోడిదైన మోక్షపురుషార్థమును ఏకరువు పెట్టినాడు. మీ బాల్యజీవితమున భిక్షాజీవనము మీరు చేసితిరిగదా! దానినే ఇప్పుడవలంబించుచో ఇహలోకసౌఖ్యములు కొరతబడినను పరలోకసౌఖ్యములు శాశ్వతమని చెప్పుచు, నీవు యీ ధర్మపూర్వకమగు

మాటల చెవినిబెట్టి అర్హుడవని స్తుతించినాడు. దుర్యోధను డిందుకు అర్హుడుకాడని చెప్పినాడు. క్షమయను గుణము నీ సొమ్మని చెప్పినాడు. నీవు జ్ఞానయోగివి కమ్మని ఉపదేశించినాడు.

'భైక్షచర్యామంధకవృష్ణిరాజ్యే
శ్రేయో మన్యే న తు యుద్ధేన రాజ్యం.

శ్రోతలారా ! అంధకవృష్ణిరాజ్యములో భిక్షమెత్తుకొనుట మేలట. సంజయు డిప్పుడేమి చెప్పెను ? అహింసా సిద్ధాంతమును చెప్పెను. హింసాజీవనము నింద్యమనెను. మీరీ ఘట్టమున జాగరూకులై వినవలెను. ధర్మజుడు దీనికి సమాధానములు చెప్పుచున్నాడు.

ఇప్పుడు ధర్మజుడు చెప్పబోవునది భారతీయ సిద్ధాంతము వినుడు :

ఈ ఘట్టమున ఆంధ్రభారతమునుండియే ధర్మజుని సమాధానమును వినిపింతును. సంజయుని సంబోధించి చెప్పుమాట యిది —

చ. ......ధర్మువు లట్ల యుండి బో
దను లరయంగ వచ్చిన నధర్మములై చెడు గొన్ని ధర్మవ
ర్తనములు గాక తోచి తుది ధర్మములై చను గొన్ని కర్మముల్.

కొన్ని ఆచరణలు ధర్మమువలె కన్పట్టి పండితులు విమర్శింపగా ఆ పనులు అధర్మములని తేలగలవు. కొన్ని ఆచరణలు అధర్మమువలె మన బుద్ధికి గోచరించినను ఆ యాచరణలు విమర్శనీయములై అనగా పండితులచే పరిశీలింపబడినవై ధర్మములే కాగలవు. సంజయా ! నే నిప్పుడు ధార్తరాష్ట్రులు భాగమును పంచక మమ్ముల నిట్లే మరల అరణ్యముల కేగమన్నచో యుద్ధమునకు సిద్ధమగుట ధర్మశాస్త్రాచార్యుల దృక్పథమున ధర్మమేయగునుగాని హింస కానేరదని ధర్మజుడు సమాధాన మిచ్చినాడు.

ఇదియే భారతీయత. కార్యాకార్య వివేకమును పండితులపైనుంచి వారు విమర్శించి నిర్ణయించినదే ధర్మమని ఆచరించుట భారతీయత. కాని

ఒక ముఖ్యమగు ప్రశ్న ఇప్పట్టున లేకపోలేదు. ఏమది? ఆ పండితు లీ విషయమును దేని నాధారముగాగొని పరిశీలింపవలెను? ధర్మజుని ఆశయమేమి?

శ్రోతలారా! బంగారమును పరిశీలింపవలసివచ్చినప్పుడు బంగారమువలె కన్పట్టు లోహఖండమును చూపి, ఇది బంగారమువలె కనబడుచున్నదిగాని ఇది బంగారముకాదు. అని చెప్పు విజ్ఞుడు దేని నాధారముగాగొని చెప్పును? అతని కన్నులును, అతని బుద్ధియే అతని కాధారమా? అట్లైనచో ఆ కన్నులును, ఆ బుద్ధియు అందరకునుకలవు గదా! ఆ బంగారమును పరిశీలించుటకు ఆ విజ్ఞుడు పరిపిడిరాయిని, ద్రావకమును ఆధారముగాగొని బంగారము నా రాతిపై రుద్ది, ద్రావకమున వేసి పరిశీలించును. అట్లే ధర్మమును నిర్ణయించుటకు పండితుల కాధారము కావలెను. వారికి ఆధారమేమి? వేదశాస్త్రములు. వాటిని ఆధారముగాగొనియే పండితులు పరిశీలింపవలెను. అట్లు పండితులు పరిశీలించుచో నేను యుద్ధము చేయుట హింసగాదనియు, అది క్షత్రియులకు జాతి ధర్మమనియు ధర్మజుడు సంజయునకు సమాధాన మిచ్చినాడు.

'సంగ్రామంబు రాజులకు ధర్మం బవుం గాదని నీవ చెప్పుము'

అని సంజయునే ఎదురుప్రశ్నవేసి సమాధాన మిచ్చినాడు. వేదములలోని ప్రతివిషయమును ప్రతివారును నిర్ణయించునది కాదని చెప్పుటకు, శ్రీమన్నారాయణుని యవతారమగు శ్రీకృష్ణుని చూపినాడు. 'మనల శాసింప వాసుదేవుండు గలండు' అని; 'ఇతని బుద్ధియ సమస్త పురుషార్థమ్ము' అని శ్రీకృష్ణుని సాక్ష్యముతో శిష్టాచారమును చెప్పినాడు.

కాని మీరు నన్నొక ప్రశ్న వేయుదురు. భారతీయుల ధర్మ నిర్ణయమును మూఢముగా చేయుటయేనా? తర్కమునకు స్థానమున్నదా? అని. తర్కము వేదసమ్మతము కావలెనని భారతీయత చెప్పును. కేవల

తర్కమును ఒప్పదు. ధర్మాధర్మములు వేదశాస్త్ర శాసనబద్ధములుగాని కేవల తర్కబద్ధములుగావు దీనికి మీకొక యుదాహరణ నిచ్చెదను.

కొందరు కలసి ఒకనిని హత్యచేసినారు. ఆ హత్య ఋజువుకాగా న్యాయస్థానాధిపతి వారికి మరణశిక్షను విధించినాడు. న్యాయస్థానము నందలి సేవకు లాతనిని హత్యచేసినారు. మన బుద్ధితో విచారించిచూని హత్యచేసిన వారెట్లు నేరస్థులో న్యాయస్థానమున ఈ నేరస్థులను ఉరి తీసినవారును, ఉరిశిక్షను విధించి వీరిని ఉరితీయుమని ఆజ్ఞాపించినవాడును, వీరిని ఉరిదీయుట న్యాయమని వాదించినవారును నేరస్థులెందుకు కాకూడదు? ఆ నేరస్థులే న్యాయాధిపతి నిట్లు ప్రశ్నించుచో వారి కాతడిచ్చు సమాధానమేమి? కేవల తర్కమున సమాధానము లేదు.

విధినిషేధములు, లేక పుణ్యాపాపములు శాసనములచే నేర్పడునే గాని శబ్దప్రమాణమగు శాసనమే లేకున్న మంచిచెడు లనునవి లేవు. కావున న్యాయాధిపతి సమాధాన మిట్లు చెప్పును.

నేను నిన్ను చంపమని ఆజ్ఞాపించుట శిక్షాస్మృతి ననుసరించిగాని నా యిష్టప్రకారము కాదు. నీవు నీ శత్రువును శిక్షాస్మృతి ననుసరించి హత్య చేయలేదు. నీ ద్వేషముపైన ఆధారపడి చేసినావు. కావున నీవు దోషివి. నేను కాను. రాజాజ్ఞను పరిపాలించిన ధర్మముకూడ నాకు దక్కును. అట్లు దుర్మార్గులను శిక్షించినందుకు నాకు న్యాయశాఖకూడా ప్రత్యేకగౌరవము నిచ్చునని చెప్పును. కావున నేను చేసినది హింసకాదు. నీవుచేసినది హింస అని చెప్పును. అంతేకాదు. యుద్ధభటుడు యుద్ధమున ఎదిరివానిని కాల్చిచంపుచో నేరముకాదు. అతడే బయటచంపుచో తప్పక నేరము కాగలదు గదా! అదంతయు శాసనాధీనమేగాని తర్కమున సమాధానము కుదరదు.

మన మహాభారత అరణ్యపర్వమున ధర్మవ్యాధుడను ఒక కసాయివాడు కౌశికుడను బ్రాహ్మణునకు హింసాహింసస్వరూపమున బోధించినాడు. దానిని మీ కీ ఘట్టమున చెప్పుట అవసరము.

కౌశికుడను బ్రాహ్మణుడు బాల్యముననే మాతాపితరులసేవను వదలి అరణ్యమున తపస్సు ప్రారంభించినాడు. కొంతకాలమున కాతనికి తన తపస్సు ఫలించినదని తెలినది. ఎట్లు ? ఒక కొంగ తన నెత్తిపైన రెట్టవేయగా దానివంక కన్నులెఱ్ఱజేసి చూచినాడు. అంతలో ఆ కొంగ క్రిందపడి చచ్చినది. అదియే తన తపస్సునకు పక్వావస్థను తెలిపినదని నిర్ణయించుకొనినాడు. అది యట్లుండ ఒకనాడీతడు ఒకగ్రామమునం దొక గృహస్థుగృహమునకు భిక్షకేగగా ఆ యిల్లాలు తన భర్తయలసి సొలసి ఆకొనివచ్చుటచే అతని సేవగావించి, తరువాత ఈ బ్రాహ్మణునకు భిక్ష తెచ్చినది. అహంకారపూరితుడగు నీ బ్రాహ్మణుడు ఆమెపై కోపింపగా ఆమె నేను కొంగను కానని సమాధానమిచ్చినది. అంతతో ఆ కౌశికుని అహంకారము అస్తమించి, ఆమెకాళ్ళకు మ్రొక్కి, అమ్మా నీవు నా సంగతి నెట్లు తెలిసికొంటివని ప్రశ్నించినాడు. ఆమె మిథిలానగరము నందున్న ధర్మవ్యాధుని వద్దకు వెళ్ళమన్నది. అతడట్లే వెళ్ళినాడు.

ధర్మవ్యాధుడు మాంసవిక్రయమును చేయును. అతడు మృగములను చంపడు. చంపితెచ్చినవారిదగ్గర కొని అమ్మును. అది అతని జీవన విధానము.

కౌశికు డాతనివద్దకు వెళ్ళినాడు. కౌశికుడు కొంతదూరమం దుండగనే ఆ బ్రాహ్మణుని కలసి, నిన్ను పతివ్రత పంపినదగదా ? అని ప్రశ్నించగా బ్రాహ్మణుడు చకితుడై అతనివలన అనేక ధర్మములను వినినాడు. అందులోని భాగమే అహింసాధర్మము. అహింస యనుదానిని అత డిట్లు నిర్వచించినాడు —

మ. హలికుం డెంతయు నోజతో దునగ సీరాగ్రంబునం జోకి ప్రా
ణు లనేకంబులు సచ్చు హింస యది యౌనో కాదో పే యేల మ
ర్త్యులు నేలం జరియించుచో జదములం ద్రొక్కంబడుం బెక్కు జం
తులు హింసావిధి గాదనంగ వశమే దోషజ్ఞయూహింపుమా.

చ. సలిలము నుర్వి యాకసము సర్వము జంతుమయంబు గావునం
గలుగు నవశ్యమున్ సకలకర్మములందును హింస హింసకుం
దొలగిన దేహయాత్రయును దుర్ఘటమైనటు లుండు నింతయుం
దలపరు హింస పేయ మని తారు చరింతురు గొంద రిమ్మహిన్.

తే. హింస పేయనివాడు లేడీజగమున
నొక్కడైనను దమ తమ యోపినట్లు
హింస తెఱువున కెడగల్గి యేగవలయు
నదియ చూపె యహింసనా యతిశయిల్ల.

వ॥ ధర్మంబు బహుప్రకారంబై యుండు దదీయ సూక్ష్మగతి దురవ
బోధంబు గావున శ్రుతి ప్రమాణంబులవలనను వృద్ధాచార విదర్శ
నంబులను నెఱింగికొనునది.

ఇప్పుడు ధర్మజుడు నేను చేయు యుద్ధము ధర్మబద్ధమేగాని హింసకాదని చెప్పిన సమాధానము దేనిపై నాధారపడినదో తెలిసినదా? వేదశాస్త్రములు చెప్పిన వర్ణధర్మముపైన యాధారపడి ధర్మరూపము నొందినది.

తరువాతది శ్రీకృష్ణుని సమాధానము. మీ రీతని సమాధానము నెంత జాగరూకులై పరిశీలింపవలయునో మీరే యోచింపుడు.

ఆతని మొదటిమాట యిది ___

*అవినాశం సంజయ పాండవానాం
ఇచ్ఛామ్యహం భూతి మేషాం ప్రియం చ

తథా రాజ్ఞో ధృతరాష్ట్రస్య సూత
సమాశంసే బహుపుత్రస్య వృద్ధిం'

ధృతరాష్ట్రుని కుటుంబముపై తన కేమియు ద్వేషము లేదనియు, వారు పుత్రపౌత్రులతో వృద్ధినొందుటే నాకు ఇష్టమనియు, పాండవుల క్షేమమును కోరినట్లే వారి క్షేమమును కోరుదుననియు చెప్పినాడు.

తరువాత-సంజయా! నీవు పాండవులకు చెప్పిన శాంతివచనములు నాకును సమ్మతములేనని సంజయునితో ఏకీభవించినారు. అనగా యుద్ధశాంతినే నేనును చెప్పుచుంటినిగాని వేరుమాటను చెప్పుటలేదని పలికినారు. అంతేకాదు. ధర్మజుడు చెప్పునదికూడ యుద్ధశాంతియేగాని వేరుకాదని ఒక నిర్ణయమును చేసినారు.

'కామో హి మే సంజయ నిత్యమేవ
నాన్యద్బ్రూయాం తాన్ ప్రతి శామ్యతేతి
రాజ్ఞశ్చ హి ప్రియమేతచ్ఛృణోమి
మన్యే చైతత్పాండవానాం సమక్షం'

(రాజ్ఞః-యుధిష్ఠిరాచ్చ ఏతదేవ శృణోమి. అహం చ ఏతన్మన్యే మానయామి.) మరి శ్రీకృష్ణుడును, ధర్మజుడును శాంతినే కోరగా ధృతరాష్ట్రుడు యుద్ధశాంతికై సంజయుని పంపగా యుద్ధమెట్లు ప్రసక్తమైనది? అదియే చిత్రము. శ్రీకృష్ణుని తరువాతి సమాధానమేమియో వినుడు —

పైమాటలను మాట్లాడి ధర్మజుడు నీవు చెప్పినట్లు శమము దుష్కరమని చెప్పినాడుగదా! శమము కుదరకపోవుటకు ధర్మజుడు ప్రతిపాదించిన కారణమును నీవు గమనించితివా? అని సంజయుని సూటిగ ప్రశ్నించినారు శ్రీకృష్ణులు. ఆ ప్రశ్నకు సంజయుడు సమాధానమీయుటకు శాస్త్రాధారముండవలెను. రాజులకు సంగ్రామము ధర్మమా?

అధర్మమా ? అన్న ధర్మజుని ప్రశ్నకు సమాధానమే నేటి యుద్ధావసరమని శ్రీకృష్ణులు యుద్ధనిర్ణయమును గావించినారు. సంజయుడు మౌనము వహించకతప్పలేదు.

శ్రీకృష్ణులు సంజయునకు చెప్పు సమాధానమున మాకైనవలయు నొకదానిని పలికినారుకూడ. ధనుర్వేదము దేనికి సృష్టించబడినది ? దాని నెవరు సృష్టించిరి ? ఏ కాలమున సృష్టించబడినది ? అను ప్రశ్నలను తాను సృష్టించుకొని ఇంద్రుడు ఈ ధనుర్బాణములను దొంగములను శిక్షించదగు రాజుకొరకు సృష్టించినాడని చెప్పినారు.

'ఇంద్రేణైతద్దస్యువధాయ కర్మ
ఉత్పాదితం వర్మ శస్త్రం ధనుశ్చ'

అంతతో ఊరుకొనలేదు. అట్టిదొంగలను శిక్షించుట రాజునకు పుణ్యమనికూడ చెప్పినారు. ఆ దొంగలముతాయే దుర్యోధనాదులని చెప్పి, యథార్థమునకు దుర్యోధనాదులు దొంగలా ? అను ప్రశ్నకు శ్రీకృష్ణులు సమాధాన మిట్లు చెప్పినారు.

దొంగతనము చేయువారు రెండువిధములుగ నుందురు. ఒకరు రాత్రి కాలమున చేయుగా రెండవవారు బలాత్కారముగ వగలే చేయుదురు. దీనిని వర్ణించి, దుర్యోధనాదులు బలాత్కారముగ రాజ్యాపహరణము చేయుటయు, స్త్రీని అవమానించుటయు అను దుర్మార్గమును చేసిన ముతాగనుక వారిని చంపుట ధర్మజునకు పుణ్యమని శాస్త్రము ఉద్ఘోషించుచున్నదని స్పష్టపరచినారు.

'తత్ర పుణ్యం దస్యువధేన లభ్యతే
సోఽయం దోషః కురుభిస్తీవ్రరూపః'

ఈ పనిని రాజగువాడు తప్పక చేయవలెను. కర్మనుమానగూడదు. సంజయా ! నీవు చెప్పిన సన్యాసధర్మము తప్పు.

ధర్మజుడుచేయు యుద్ధము స్వార్థపూరితమై ఆశాబంధమునకు కట్టుబడిచేయు యుద్ధముగాదని నిర్ణయించి, తరువాత పాండవ కౌరవుల మైత్రిని గురించి వివరించినారు శ్రీకృష్ణ లీషట్టమున -

పాండవ కౌరవుల మైత్రిని ఎంత మనోహరముగ చెప్పినారో తెలియునా? మూలమును ఆంధ్రానువాదమును ఒకేవిధముగ నున్నవి. ఆంధ్రభారతములోని పద్యమును మీకు వినిపింతును.

మ. ధృతరాష్ట్రుండును బుత్రులున్ వనము కుంతీనందనుల్ సింహముల్
మతి నూహింప నసింహ మైన వనమున్ మర్దింతు రెందున్ వనా
వృతవృత్తంబులు గానిసింహములకున్ వేగంబ చేటొందు గా
న తగం బొందుట కార్య మీయుభయము న్సంతుష్టిమైనున్కికిన్.

ధృతరాష్ట్రుని కుటుంబము వనము. పాండవులు సింహములు. సింహములచేత వనము సురక్షితమగును. అనగా సింహములున్న వనములోని కెవ్వరును ప్రవేశించి వనమును ఛేదించరు. వనముకూడ సింహముల నివాసమున కిరువై సింహముల రక్షించును. వారిద్ద రిట్లు ఒకరి కొకరు సహాయమునొంది యుండుట మంచిదని చక్కగ చెప్పినారు. శ్రీకృష్ణుని చివరిమాట యిది —

స్థితాః శుశ్రూషితుం పార్థాః స్థితాః యోద్ధుమరిందమాః
యత్కృత్యం ధృతరాష్ట్రస్య తత్కరోతు నరాధిపః.

సంజయా! పాండవులు ధృతరాష్ట్రునకు పాదసేవ చేయుటకు సిద్ధమయ్యేయుండిరి. ఎప్పుడు? వారి భాగము వారి కిచ్చుచో. కాని పక్షమున శత్రుమర్దనులగు పాండవులు యుద్ధసన్నద్ధులైకూడ యుండిరని మీ రాజునకు చెప్పి, ఇందేది యభిమతమో దాని నాచరింపుమనివాడు, అంతతో సామదానభేదదండములతోగూడి, వేదశాస్త్ర సమ్మతమగు శ్రీకృష్ణుని వాక్యసరణి పూర్తియైనది.

సంజయునికార్యము పూర్తియైనది. అతడు హస్తినాపురమున కేగవలెను. కాని ధర్మజాదుల యనుమతిని తీసికొనవలెనుగదా ! ధర్మజుని సమీపమున కేగినాడు. ధర్మజా ! నేను సెలవు తీసికొందునను మాటతో ధర్మజుని యనుమతి పూర్తియగును గదా ! అట్లుగాక ధర్మజుని క్షమాపణ వేడుకొనినగాని సంజయునకు తృప్తి కలుగలేదు. కారణమేమి ? తాను చెప్పినది బిచ్చమెత్తుకొమ్మనిగదా ! ఆ పలుకు యథార్థమునకు తన నిశ్చితాభిప్రాయముకాకున్నను అతని హృదయమును కలత నొందించక పోలేదు. అంతేకాదు. అది ధృతరాష్ట్రుడు చెప్పినమాటగా అర్థము కాగూడదు. కావున సంజయుడిట్లు క్షమాపణ చెప్పినాడు ధర్మజునకు.

'కచ్చిన్న వాచా వృజినం హి కించిత్
ఉచ్చారితం మే మనసోఽభిషంగాత్'

నే నావేశముచేత మాటలాడిన మాటలేమైన యున్నచో క్షమింపుమనినాడు; అట్లే భీమార్జునులను నకుల సహదేవ సాత్యకులను, విరాట ద్రుపదులను శ్రీకృష్ణునికూడ. సవినయముగ తన పయనమున కనుజ్ఞ గైకొనినాడు.

ధర్మజుని దృష్టియందు సంజయుడు విదురుని వంటివాడే. సంజయునితోని వాక్యములం దావేశము లేదని పరిగణించి, ధృతరాష్ట్రాదులకు తన అభిప్రాయమును స్పష్టముగ తెలిపినాడు.

ధర్మజుని వాక్యసరణి వాగ్దేవి ధరించిన ముత్యాలసరము.

అవిస్థలం వృకస్థలం మాకందీం వారణావతం
అవసానం భవత్వత్ర కించిదేకం చ పంచమం.

సంజయా ! రాజ్యములోని ఏకభాగమైనను నాకు చాలును. నాలుగు ఊళ్ళను నా తమ్ములకిచ్చి, నాకేదైన ఒకగ్రామమును ఇమ్మని దుర్యోధనునకు చెప్పుమనినాడు. ఆ గ్రామముల పేర్లివి — అవిస్థలము, వృకస్థలము, మాకందీ, వారణావతము. అయిదవది ఏదైనను సరియే. అది

నాకు.—అని చెప్పినాడు. అంతేకాక, వచ్చిన సైనికులందరును రణరంగమున బలికాదగు తమ జీవితములు నేడు భూమిపై నిల్చినవను మహోత్సాహముతో వారు తమతమ గృహముల కేగునట్టి యుచితరీతి సమసరించునట్లు కూడ దుర్యోధనుడు యత్నించుట అవసరమని సంజయునకు తన దివ్యసందేశము నందించినాడు ధర్మజుడు. ఇంతకంటె ధర్మజుని కర్తవ్యమేమున్నది ? యుద్ధశాంతిని చేకూర్చుటకు. ఇది ధర్మజుని అసామర్థ్యము కాదు. దుర్యోధనుడు దీనినట్లే అర్థముచేసుకొనగలడని ధర్మజునకు తెలియును. కావున చివరకీ మాటనుకూడ చెప్పినాడు.

అలమేవ శమాయాస్మి తథా యుద్ధాయ సంజయ
ధర్మార్థయోరలం చాహం మృదవే దారుణాయ చ

శాంతికిని యుద్ధమునకుగూడ నేను సిద్ధమైయుంటినని చివరి మాటగా సంజయునకు చెప్పినాడు. ఇంతతో ఉపప్లావ్యము నందలి సంజయరాయబారము ముగిసినది. తరువాతి కథ ఏమి ?

సంజయునకు తగు సత్కారములనిచ్చి, సత్కరించి పంపినారు పాండవులు.

సంజయుని రథము హస్తినాపురమువైపుకు మళ్ళినది.

ఇక మనము సంజయుని యమూల్య వాక్యసరణి హస్తినాపురమునందెట్లు నడచినదో పరికించవలెను.

సంజయుడు హస్తినాపురమున కేగునప్పటికి సాయంకాలమైనది.

ధృతరాష్ట్రున కుపప్లావ్యమునందలి విశేషము లన్నిటిని పూసగ్రుచ్చినట్లు చెప్పుట కవకాశ మీనాడు లేకపోయినది. అయ్యును సంజయుడేవియో కొన్నిమాటలను ధృతరాష్ట్రున కెరింగించకయే అతడు తన నిజగృహమున కేగలేదు.

సంజయుని రథము సరాసరివచ్చి రాజసౌధమువద్దనే ఆగినది. అది ధృతరాష్ట్రుని నిజమందిరము. సంజయుడు గృహాంతర్భాగమునకేగి,

ద్వారదేశమున నిలచియుండు దౌవారికుని ముఖముగ ధృతరాష్ట్రి భూవిభు నకు తన రాకను తెలుపగా సంజయునిరాక కెదురుచూచుచున్న ధృత రాష్ట్రి దతి శీఘ్రముగ సంజయుని కంతఃపురప్రవేశమున కనుజ్ఞ నిచ్చినాడు.

సంజయుని త్వరగ ప్రవేశపెట్టుమన్న అజ్ఞను శిరసావహించిన దౌవారికుడు సంజయుని లోనికంపగా, తన కంఠస్వరమును తెలుపుచు ధృతరాష్ట్రినకు తన నిజనామమున అభివాదనము గావించినాడు సంజ యుడు. 'సంజయోహం భూమిపతే నమస్తే' తరువాత...

తానెక్కడనుండి వచ్చెనో అచ్చటి వారి యోగక్షేమములను దెలుపుచు, సంగ్రహముగనైనను అచ్చటి వారి యభిప్రాయమును తెలియ జేయుట దూతయొక్క కర్తవ్యము.

సంజయు డట్లే చేసినాడు. ముందు ధర్మజానకు ధృతరాష్ట్రిని కుటుంబముపై గల సుహృద్భావమును చక్కగ ప్రకటించినాడు. అట్లు ప్రకటించుటయందే ధర్మజాని గుణసంపదనుగూడ కలిపి, తన్నాదరించిన ఆదరమునుగూడ వివరించినాడు. మొదటిమాటయందే వారి దోష మేమియు లేదని పక్కాణించి, నీవు పంపిన రాయబారమును గురించి దిద్దుకొనవలసినవాడవు నీవేనని సూచించినాడు. ఇదియే సంజయుని మాటలలోని నేర్పరితనము. సంజయుడు ధృతరాష్ట్రినకు నివేదించిన మొదటి నివేదన మెట్లున్నదో తిక్కనామాత్యుని తేటమాటలతో వినిపింతును.

ఉ. దేవర పంపగా జని యుధిష్ఠిరువిం గని వచ్చినాడ నా
భూవిభు డప్రమేయగుణపూజ్యుడు మీకు నమస్కరించె సం
భావనసేసె నా కిచటిబంధులనెల్ల దలంచె మీసుఖ
శ్రీవిభవంబులన్ సుతులవేమము సన్నదిగెం బ్రసన్నుడై.

సంజయుని మాట ధృతరాష్ట్రునకు కొంత ప్రియము కల్పించి తాము కూడ పాండవుల యోగక్షేమమునే చింతించుచుంటిమని మెత్తని మాటలతో సంజయుని మనసును రంజింపజేయుచు, ధర్మజాదులయొక్క క్షేమ మడిగినాడు. ధర్మజునకు అజాతశత్రువను పదమునే ధృతరాష్ట్రుడు వాడును. పైన సంజయుడు ధర్మజునకు 'యుధిష్ఠిర' పదమును వాడగా, ధృతరాష్ట్రుడు అజాతశత్రుపదమును వాడి క్షేమమడుగుటను మనము గమనింపవలెను. తాను రాజ్యమివ్వకుండ యుద్ధశాంతి ధృతరాష్ట్రునకు కావలెను. మూలమునందును ఆంధ్రానువాదమునందునుకూడ అట్లే వాడబడినవి.

అంతేకాక సంజయు డుపప్లావ్యమునకు వెళ్ళివచ్చినందుకు ప్రశంసించుచు ధర్మజాదుల క్షేమ మడిగినాడు ధృతరాష్ట్రుడు. ఆతడు జోలపాటల పాడుటలో ఆరితేరిన వ్యక్తి.

అభినంద్య త్వాం తాత వదామి సంజయ
అజాతశత్రుం చ సుఖేన పార్థం
కచ్చిత్ స రాజా కుశలీ సపుత్రః
సహామాత్యస్సానుజః కౌరవాణాం.

ముందు సంజయుని ప్రశంసించి, తమ్ములతోను తన అమాత్య గణముతోను అజాతశత్రువు క్షేమమేనా ? అని అడిగినాడు. ధృతరాష్ట్రుని ప్రశ్న యనంతరమున సంజయుని సమాధాన మిట్లున్నది. ముందు ధర్మజుని స్వరూపస్వభావముల వర్ణించినాడు.

ఉ॥ మానుషశక్తి యెల్లడు సమంచితదైవమ యీది యుండు నీ
పైన యతండు పుణ్యమును బాపము బెట్టినవాడు నీవు నీ
సూనువశంబ కాని యొకచొప్పుదలంపవు కర్ణసౌబలా
ధీనము గార్యనిశ్చయము దెల్లము నీమత మొప్ప దేమియున్.

సంజయుడు సత్యమును చెప్పదలచి ధృతరాష్ట్రునకు నిర్మొగమాటముగ చెప్పినాడు. ధృతరాష్ట్రున కాతడు భయపడలేదు. సంజయుడు, విదురుడు మొదలగువారు కిర్తువిపలె రాజునొద్ద బ్రతుకుతెరువునకు మాత్రమే వచ్చినవారు కారు.

ధృతరాష్ట్రా! ధర్మజుని దృష్టియందు స్థిరమై అతిచంచలమైన భౌతికలక్ష్మియే లేదు. అతడు మానుషశక్తికి స్థానమివ్వక దైవరూపమగు ధర్మమునకే అగ్రస్థానమునిచ్చి, ధర్మదేవత నాధారముగా గొనినాడు. నీవు చేయు పాపము పండునంతవరకును కాలనిరీక్షణము చేయుచున్నాడు. వారి రాజ్యమును వారికి పంచియిచ్చి పుణ్యము కట్టుకొందువో లేక వారి భాగ మివ్వక పాపమునే మూటకట్టుకొందువో ఆ భాగమును నీపైననే యుంచినాడు. నీవు మాత్రము పుత్రవ్యామోహమునకు వశమయ్యే యుంటివిగాని నీకు పుణ్యమునన పొక్కటికలదను మాటయే యున్నట్లు భాసించుటలేదు. దుర్యోధనునకున్న మంత్రిసత్తములు కర్ణశకునులు. వారు కార్యనిశ్చయము చేయువారైయుండ ధర్మనందనునకు స్థానమెక్కడ? అని ధృతరాష్ట్రుని అభిప్రాయమును బయటపెట్టినాడు. పాండవుల క్షేమమును మాటలతో ప్రశంసించుచుంటివని స్పష్టపరచినాడు. అంతతో ఊరకొనలేదు. నీ వొక్కడవే కొడుకుల గంటివా? అని బిడ్డలగనుటొక్కటే పరమార్థము కాదని నీచులగు పుత్రుల ననుసరించుటను గట్టిగ ఖండించినాడు. పురుషార్థపరులుగాని పుత్రులకు బుద్ధి చెప్పనేరని తండ్రివి నీవేనని ఒక్క విసురు విసరినాడు. నీ కుటుంబమును గురించి ప్రజ లేమనుకొనుచుండిరో యనునది నీకు లేకపోయినను మన మహారాజును ప్రజ లిట్లు నిందించుచుండిరే అన్న బాధగల నా చెవులు దిబ్బెడలు వేయుచుండెనని తన బాధను వెళ్ళబోసినాడు. వేయేల? ఆనాడు ధర్మజు డుపేక్షించవలసిన దేమియు లేదని చెప్పుటకు ఒక్కమారుగ దుర్ద్యూతవేదికపైన పుట్టిన అగ్నిజ్వాలల

మపేక్షించిన నీవు నీ కొడుకు బ్రతుకు నెట్లు చూడనేర్తువని నీ పుత్రుల చావుకు నీవే కారణమన్నట్లు ఘంటాపథముగ మాట్లాడినాడు. ఇంతకును ధర్మజుడు యుద్ధమును చేయుటయే నిశ్చయించెనా ? శాంతిని ఒప్పెనా? అనునదేమి తెలినది ? అదేమియు నిర్ణయముగ తేలలేదు.

ఆ విషయమును ధృతరాష్ట్రిడు గట్టిగ అడిగెడివాడే మోగాని అంతతో నా ఒడలు నొచ్చుచున్నవని చెప్పి ఇప్పుడు ప్రొద్దుపోయినదని నీ కొడుకులును, నీకొడుకుల స్నేహితులును, నీ అప్తులును బంధువర్గము కూడియుండగా రేపు సభాస్థలియందే ధర్మజుని అభిప్రాయమును వివరింతునని వెళ్ళినాడు.

చ. అనయము నొచ్చుచున్నయవి యంగము లెల్లను వేగ వచ్చుట
న్మనము వశంబుగాదు జననాయక ప్రొద్దును బోయె నిప్పుడే
బనివిని రేపు పుత్రులును బంధులు నాప్తులు నీవు నేర్పడన్
విన మనకార్య మంతయు సవిస్తరతం దగ విన్నవించెదన్.

ధృతరాష్ట్రిన కారాత్రి రెప్పలు మూతపడి నిద్రపట్టలేదు. చిత్తము చింతాక్రాంతమై ఆతని నిలవనిచ్చుటలేదు. సంజయుని ప్రతి పలుకును ఆతని కొక శల్యమై బాధింపగా అందును ఒక ముఖ్యమగు మాట ధృతరాష్ట్రిని మరింత బాధపెట్టుచున్నది. ఏమది ?

స త్వాం గర్హే భారతానాం విరోధా
దంతో నూనం భవితాయం ప్రజానాం
నో చేదిదం తవ కర్మాపరాధాత్
కురూన్ దహేత్ కృష్ణవర్త్మేవ కక్షం.

నీవు పాండవులకు రాజ్యమే యివ్వనిచో అరణ్యమునం దొక్క పొదయందు పుట్టిన నిప్పు ఆ వనమంతను కాల్చివైచునట్లు నీయం దుద్భవించిన పాపాగ్ని అనగా నీ అపరాధము మీ కురువంశమునేగాక

సామాన్య ప్రజానీకమునుకూడ తగలపెట్టగలడని ఘాటుగ చెప్పి వెళ్ళినాడు. ఒకవిధముగ విచారించుచో ధర్మజుని విశుద్ధత నెంత చక్కఁగ చెప్పెనో అంత వివరముగ నీ పుత్త్ర పాపాత్ముఁడవై తివని చీదరించి పలికినాడు.

ఈ ఘట్టమున వ్యాసవాణి ధర్మజుని గురించి చక్కని వర్ణనను గావించినది సంజయుని ముఖమున.

అజాతశత్రుస్తు విహాయ పాపం
జీర్ణాం త్వచం సర్ప ఇవాసమర్థాం
విరోచతే హార్య వృత్తేన వీరో
యుధిష్ఠిర స్త్వయి పాపం విసృజ్య.

ఈ శ్లోక మొక యనర్ఘ రత్న రాజము. భారతీయాధ్యాత్మిక రహస్య మొకటి ఈ శ్లోకమున నిగూఢమై యున్నది. భారతీయశాస్త్రములు చెప్పు పుణ్యపాప ఫలానుభవము లతిసూక్ష్మములు. ఒక మహనీయుని మన మెన్నడైన స్తుతించియున్నచో అతని పుణ్యఫల మొకప్పుడు మనకు సంక్రమించును. అట్లే ఒకరిని ఏదో యొక నైమిత్తిక సంబంధమువ నిందించితిమేని అతని పాపఫలముకూడ మనకు సంక్రమించునట. భారతీయాధ్యాత్మిక రహస్యముల వెల్లడించు నొక ఉపనిషద్రత్న మిట్లు చెప్పుచున్నది. జ్ఞానియగువాడు తన సహజస్వరూపమును గుర్తెరిగి, తాను కర్తృత్వభోక్తృత్వములు కలిగియున్ననాటి పుణ్యపాపఫలముల నొక్కమారు విదలించగా అతని పుణ్యఫలము అతనికి సంబంధించిన సుహృత్తును పొందునట. అనగా ఆ జ్ఞానియగువానిని గుర్తెరిగి అతని యుత్కృష్టత నభినందించినవాడు సుహృత్తు. అట్టి సుహృత్తును పొందును. అతని ధనము జ్ఞాతుల నాశ్రయించును. అతని పాపఫలము అతనిని నిందించిన వారి కడకేగును. ఆ ఫలానుభవములు మన కెట్లు

తెలియుననగా ఆకస్మికమగు అనంద మొకప్పుడు మన మనుభవించు చుందుము. ఆ యానందమునకు మనకు కారణముండదు. అట్లే దుఃఖము కూడ ఆకస్మికమై వచ్చును. ఆ యనుభవములు పైన చెప్పినవాటికి సంబంధించినవి. (తస్యపుత్రాదాయ ముపయంతి, సుహృదః సాధుకృత్యాం ద్విషంతః పాపకృత్యాం) ప్రస్తుత విషయమేమి? ధర్మజుడు పాము కుబుసమును వదలగా ఆ కుబుసము పాము నాశ్రయింప అసమర్థమై దానినుండి విడివడినట్లు ధర్మజుని పాపఫలము నాతడు వదలగా ఆ ఫలము ఆతనిని ద్వేషించు నీ యనుభవమునకు వచ్చునని చెప్పుచు ఆతడు కుబుసమును వదలిన సర్పమువలె స్వచ్ఛత నొంది స్వరూపస్థితి నొందిన జ్ఞానివలె విశుద్ధుడై యుండెనని ధృతరాష్ట్రునకు తెలిపినాడు. చూచితిరా సంజయు డెంత చక్కగ ధర్మజుని వివరించినాడో!

ఆంధ్రమున 'మానుషశక్తి యొల్లడు' అన్న పద్యభావ మిదియే గావచ్చును.

ఆతడు పలికిన పలుకుయం దొక శ్లేషకూడ యున్నది. 'కృష్ణవర్త్మేవ కక్షం' ఇక్కడ కృష్ణవర్త్మ యనగా అగ్నియని సామాన్యార్థముకాగా అర్జునుడను అర్థముకూడ స్ఫురించునట్లు సంజయుడు ఆ పదమును వాడినాడు.

(కృష్ణవర్త్మ=కృష్ణ ఏవ వర్త్మ మార్గ ఇవ సుఖప్రాపకః యస్య స కృష్ణవర్త్మా-అర్జునః) శ్రీకృష్ణుడే ఎవ్వనికి సుఖప్రాపకుడగు మార్గదర్శియో అట్టి అర్జునుడు యుద్ధమును మానడని సూచించి వెళ్ళినాడు. ధృతరాష్ట్రున కిది యొక శల్యమైనది. నిద్రపట్టలేదు. అర్ధరాత్రికాగా విదురుని పిలిపించినాడు. విదురుడు వచ్చినాడు. తన బాధను విదురునకు చెప్పికొనక తప్పలేదు. సంజయుని రాకను చెప్పి, తన కిప్పుడు నిద్రపట్టుటలేదని చెప్పికొనెను.

విదురుడు సంజయుని తాకిలోనివాడేగదా! మనుజునకు నిద్ర పట్టకపోవుటకు కొన్ని కారణములను చెప్పి, అందు నీ వెవ్వరిపై యుంటివని ప్రశ్నించినాడు. దీనిని 'ప్రజాగరపర్వ'మని యందురు. ఇందున్నదంతయు నీతి. విదురనీతియని దీనిని వాడుదురు. ఇదిగాక ఈ రాత్రియే సనత్సుజాత మహర్షివారు వచ్చి తత్వబోధను చేయగా మొత్తము పదునాలుగు అధ్యాయముల గ్రంథమైనది. నేడు మన ఉపన్యాసమున కొన్ని సూక్తులను మాత్రమే మీ కందించి నేను ముందు కథకు పోదును. విదురుడు ధృతరాష్ట్రు నిట్లు ప్రశ్నించినాడు.

బలవంతుడగు శత్రువు తనపై యుద్ధమును ప్రకటించగా బలహీనుడగువానికి నిద్రపట్టదు. అట్లే తన ధనమునంతను కోలుపోగా నిద్రపట్టదు. కాముకునకును, దొంగతనము చేయుటలందసవానికి నిద్ర పట్టదు.

ఈ కారణములలో నీ వెవ్వరిపై యుంటివని ప్రశ్నించినాడు.

ధృతరాష్ట్రు డేమనును? సంజయునివలన ధర్మజుని అభిప్రాయము తెలియకపోవుటచే చింతిల్లుచుంటినని తెలిపినాడు. కావున నా మనోవేదనను తీర్చునట్టి సుభాషితముల నేమైన చెప్పుటకై నిన్ను పిలిపించితి నని చెప్పగా, విదురుడు ధర్మజుని యుదార గుణగణముల వర్ణించి అతడు నిన్నుగురించి అపకార మేలతలచునని సమాధానమిచ్చె: నీవు నీ పుత్రుల దుర్మార్గమును సహించి, వారిత్రోవను నడచుట యుక్తముగాదని నిర్మొగమాటముగ సత్యమును చెప్పినాడు. తన కిష్టములేని విషయమును మాట వరుసనుండి తప్పించుటలో అందెవేసిన చేయి ధృతరాష్ట్రునిది. సంజయుడు అచ్చటివిషయముల రేపు చెప్పుదునని చెప్పినాడు. అతని విషయమును విన్నతరువాత మనసమాచరించదగినదానిని తప్పక యాచరింతమని విదురు నాదంబరచి, మనసును రంజింపచేయు నీతివిశేషముల తెలుపుమనగా అతడు పండితుడన నెట్టివాడో వర్ణించుచు కొన్నినీతుల నిట్లుపదేశించినాడు.

శ్రుతం ప్రజ్ఞానుగం యస్య ప్రజ్ఞా చైవ శ్రుతానుగా
అసంభిన్నార్యమర్యాదః పండితాఖ్యాం లభేత సః.

శాస్త్రము బుద్ధివైశద్యము ననుసరించగా బుద్ధివైశద్యము శాస్త్రము ననుసరించవలెను. ఆ రెండును శిష్టాచారమునకు భిన్నములు గాకుండు నట్లు సమన్వయము చేయగలిగినవాడు పండితుడను పేరు నొందుట కర్హుడు.

అకామాన్ కామయతి యః కామయానాన్ పరిత్యజేత్
బలవంతం చ యో ద్వేష్టి తమాహుర్మూఢచేతసం.

తనను ప్రేమించనివారిని ప్రేమించుచు తన్నాదరించి గౌరవించు వారిని వదలుకొని బలవంతుల ద్వేషించుచుండువాడు మూఢుడు. విదురుడు చెప్పు ప్రతిమాటయందును ధృతరాష్ట్రుని దోషముల నుద్ఘాటించుచునే చెప్పినాడు.

దగ్గరకు చేర్చరాని కర్ణుని గౌరవించుచు తనయందతిగౌరవము నుంచిన పాండవుల ద్వేషించుచు, బలవంతులగు పాండవులపై శత్రు భావమునొందుటయను ధార్తరాష్ట్రిల మూఢత్వమును ప్రకటించినాడు.

ఇట్లే మరొక్క విషయమును వివరించినాడు.

'ఏకయా ద్వే వినిశ్చిత్య త్రీంశ్చతుర్భిర్వశే కురు
పంచ జిత్వా విదిత్వా షట్ సప్తహిత్వా సుఖీభవ.

ఇది సంఖ్యావాచకమున చెప్పిన శ్లోకము (1) (2) (3) (4) (5) (6) (7)—ఒకదానిచేత అనగా బుద్ధిచేత 2) కార్యాకార్యముల నిశ్చయించి 3) శత్రుమిత్ర ఉదాసీనులను 4) సామ దాన భేద దండోపాయములచే వశము గావించుకొని 5) పంచేంద్రియములగు త్వక్చక్షు శ్రోత జిహ్వా ఘ్రాణముల జయించి, 6) సంధి, విగ్రహ, యాన, ఆసన, ద్వైదీభావ సమాశ్రయణములను రాజనీతివిషయముల నారింటి నెరిగి, 7) స్త్రీ, ద్యూతము, పానము, వేట, వాక్పారుష్యము (కఠినముగ మాటలాడుట)

దండపారుష్యము (తక్కువతప్పునకు ఎక్కువ శిక్ష విధించుట) అర్థదూష ణము (ధనసంచయమును చేయులేక వ్యర్థముగా ఖర్చుపెట్టుట) అను సప్త వ్యసనముల తగులకయుండువాడు సుఖవంతుడగును. దీనిని ఆధ్యాత్మిక ముగ కూడ సమన్వయము చేయవచ్చును. పైన ఒకటి యన బుద్ధిని గ్రహించినాము. ఇక్కడకూడ అంతియే. కార్యాకార్యములనుచోట నిత్యా నిత్యవస్తువిచారము గావించగా, కామ క్రోధ లోభములను శమ, దమ, తితిక్ష, శ్రద్ధలను గుణములచే నిగ్రహించి, ఆకలి, దప్పిక, శోకము, మోహము, జరా, మృత్యువులను ఆరింటిని ఎరిగి వైరాగ్యవంతుడై, ఇంద్రియ పంచకమును, మనోబుద్ధులను వదలి స్వస్వరూపమున వెలు గొందుచు నిజమగు ఆత్మసుఖమును బడయవలెనని భావము. ఇట్లనేక నీతుల నుపదేశించినాడు.

ఇద్దరు మానవుల మెడయందు రాతినిగట్టి, వారిద్దరను నీటియందు వదలవలెనట. వారిద్దరెవరనగా, ధనవంతుడై యుండియు దాత కానివానిని, దరిద్రమునొందియు, తపస్వి కానివానిని అట్లు చేయవలెనట. ఇట్లు నీతుల నుపదేశింపగా కొంతరాత్రి గడచినది. చివరకు ధృతరాష్ట్రుడు–

'న చోత్సహే సుతం త్యక్తుం యతో ధర్మస్తతో జయః'

విదురా! నేను పుత్రుని వదలలేను. ధర్మమెటున్న అటు జయము కలుగు నని పలికినాడు. తరువాతకూడ కొంత ప్రసంగము నడచినది. ధృతరా ష్ట్రుడు మృత్యువనునది కలదా ? లేదా ? అని ప్రశ్నించినాడు. ఆ ప్రశ్నకు తావెక్కడ ? ఉపనిషత్తులు మృత్యువనునది లేనేలేదనిచెప్పగా, సత్యవంతుని ప్రాణమును యముడువచ్చి, తీసుకొని వెళ్ళినట్లు చరిత్ర చెప్పుచున్నది. దీని విషయమేమని ప్రశ్నించగా కేవలమగు పరమార్థ మును నీకు చెప్పుటకు నే నర్హుడనుకానని విన్నవించి, సనత్సుజాత మహర్షివారిని విదురు డాహ్వానించగా వారు వచ్చి తత్వము నుపదేశిం

చుట జరిగినది. ఆ మహనీయుడు ప్రమాదమే మృత్యువని ఉపదేశించినాడు. అనగా మృత్యువనునది ఆత్మజ్ఞానము కలుగనంతవరకును కలదనియు, ఆత్మజ్ఞానోదయము కాగా మృత్యువు లేదనియు నిర్ణయించినారు. మోహమే మృత్యువు. మోహము తొలగగా మృత్యువు లేదు. మోహము తన నిజరూపమును మరపించును. ఆ మరచుటే మృత్యువు. పెద్దపులివలె మృత్యువున కొకరూపము లేదు.

"ఉభే సత్యే క్షత్రియైతస్య విద్ధి
మోహాన్మృత్యుస్సంమతో౽యం కవీనాం
ప్రమాదం వై మృత్యుమహం బ్రవీమి
తథా ప్రమాద మమృతత్వం బ్రవీమి.

సనత్సుజాత మహర్షివారి ఆత్మబోధతో తెల్లవారినది. మునీంద్రు లంతర్ధానము కాగా విదురుడును స్వగృహమున కేగినాడు.

అది ప్రాతఃకాలము. కౌరవుల సభాస్థలి కలకలలాడ బ్రొచ్చినది. మహారాజవర్గమంతయు సంజయునిరాకకై ఎదురుచూచుచుండగా సంజయుడును సభాస్థలిని ప్రవేశించినాడు. సువర్ణపీఠముల నలంకరించిన భీష్మ ద్రోణ కర్ణ కృపాశ్వత్థామాది వీరవరుల సభామధ్యమున నేడుప ప్లావ్యమునందలి విశేషముల ప్రకటించవలెను. సంజయుడట్లే ప్రకటించుట కుపక్రమించినాడు. ఆ యుపక్రమ మిట్లు నడచినది—

ధర్మనందనుడు పెద్దలందరకును అందించమని చెప్పిన ధర్మజుని అభివాదనలను పూజ్యులగువారలందర కందించినాడు. తమ తోటివారి కందించమనిన సుహృద్భావములనుగూడ మిత్రబృందములకును తోటివారలకు కూడ అందించి, కనిష్ఠులకు ధర్మనందనుని ఆశీస్సులను చెప్పినాడు. ఇక పాండవుల యభిప్రాయ విశేషములను వివరించవలెను. వాటిని తెలుప నుపక్రమించినాడు. కాని ధృతరాష్ట్రుని యభిప్రాయము: సంజయుడు సరాసరి వారి యభిప్రాయముల సభ్యులకు తెలుపుటకాదు.

అక్కడివారి అభిప్రాయములను ప్రత్యేక ప్రత్యేకముగ తానడుగదలచి నాడు. కావున సంజయుని సంభాషణంతయు ధృతరాష్ట్రుని ప్రశ్నలపై నాధారముగొనియే జరిగినది.

ధృతరాష్ట్రుని బుద్ధిపై శద్య మసామాన్యము. అతడు పాండవ పక్షమున బల మెట్లున్నది? పాండవులేమైన యుద్ధమునకు వెనుకంజ వేయుచుండిరా? వారి సైనికబల మెట్లున్నది? ఆత్మబల మెట్లున్నది? దైవబలమేమైన తప్పియుండెనా? జూదమునాటి దురదృష్టమే నేడును వారిని వెంటనంటి యున్నదా? అచ్చటి సేనానాయకు లెవ రెవరెంత దృఢబుద్ధితో నుండిరి? రణరంగమున కుత్సాహవంతులై దుముకు చుండిరా? లేక ధర్మజుని ప్రోత్సాహమున యుద్ధాభిముఖులై యుండిరా? అం దిప్పుడు యుద్ధమునకు ప్రోత్సహించుచున్న దెవరు? ధర్మజుడు తమ్ములను ప్రోత్సహించుచుండెనా? లేక తమ్ములే ధర్మజుని ప్రోత్సహించుచుండిరా? కృష్ణుడు వారి యెడల యెట్లుండెను? మన పక్షమునందుగల భీష్మ ద్రోణ కర్ణాది వీరవరుల యపార బలసంపదల దలచి ధర్మజు డేమైన యుద్ధమునకు వెనకాడుచుండెనా? శ్రీకృష్ణు డేమనుచుండెను? భీమార్జున నకుల సహదేవులు ప్రత్యేక ప్రత్యేకముగ తమ తమ పరాక్రమముల తెలిపిరా? మన పక్షమునందున్న బలాఢ్యుల నెవ రెవరిని ఆ పక్షము వా రెవరెవ రెదుర్కొనదలచిరి? అను అనేక విషయములను గ్రహించి, పరపక్షమునం దేమైన బలహీనత కలదా? అను సంశయమును తీర్చుకొనదలచినాడు. పాండవుల కర్ధరాజ్య మిచ్చుట కాదు, అయిదూళ్లైనను ఇవ్వకుండ అఖండ మహీమండల సామ్రాజ్య మంతయు తన బిడ్డలకే దక్కుటకేమైన సావకాశమున్నదా? అన్న విషయ మాతని కిప్పుడు తేలవలెను. అందుకై ప్రప్రథమముననే అర్జును డేమనెనని ప్రశ్నించినాడు.

అర్జునుని గురించియే అతడు ముందేల ప్రశ్నించెను ? అనునది ప్రశ్నయే. యుద్ధమంతయు అర్జునుని పరాక్రమముపైననే ఆధారపడి యున్నది. కావున అర్జునుని వాఙ్మయమే అతనికి ముందుగ కావలెను. అర్జును డేమనెను ? అని సామాన్యముగ ప్రశ్నించక మూలమున అర్జునునకు ధృతరాష్ట్రుడు మూడు విశేషణములను వాడినాడు. 'యుధాం ప్రణేతా' 'దురాత్మనాం జీవితచ్ఛిత్' 'మహాత్మా' అనునవి.

'ధనంజయస్తాత యుధాం ప్రణేతా
దురాత్మనాం జీవితచ్ఛిన్మహాత్మా'

అర్జునుడు లోకైకవీరుడు. అతని శూరత్వము దుర్మార్గమైనదికాదు. దుర్మార్గుల నాశము గావించునది. అతడు మహానుభావుడు. అట్టి ధనంజయు డేమనెను ? అనినాడు. తన ప్రశ్నలోని అంతరార్థము సంజయున కర్థము కాకూడదు. పాండవులు మహానుభావులను భావమే ధృతరాష్ట్రున కుండెనని సంజయుడు భావించవలెను ; అట్లే వినువారలుకూడ. తాను మాత్రము అర్జునుడు యుద్ధమునకే దూకుచుండెనా ? శాంతి నేమైన కోరుచుండెనా ? కర్ణుని తలచిన యుద్ధభీరుత్వమేమైన అతనికి కలిగెనా ? అను అంశములను పరికించవలెను. అంతేకాదు. అన్నదమ్ములయం దభిప్రాయ భేదము లుండెనా ? అను విషయముకూడ ధృతరాష్ట్రునకు కావలెను.

సంజయుని సమయస్ఫూర్తి యపారము. ధృతరాష్ట్రుని హృదయమత డెరుగనిదిగాదు. అర్జునుడు తనకు చెప్పిన ఘాటుమాటలనే ధృతరాష్ట్రునకు చెప్పదలచినాడు. ధృతరాష్ట్రు డేమైన బాగుపడి సంధికి ఒప్పునేమో యనియే సంజయుని ఆశాభావము. ధృతరాష్ట్రుని భావముల కన్నిటికిని తగినట్లే సమాధాన మిచ్చినాడు.

సంజయు డీ ఘట్టమున అర్జునుని వాక్యములు ముఖ్యముగ వినవలసినవాడు దుర్యోధనుడని దుర్యోధనుని సంబోధించినాడు.

'దుర్యోధనో వాచమిమాం శృణోతు'

కారణమేమి ? కర్ణుని బలపరాక్రమములకు మురిసిపోవు దుర్యోధనుడు అర్జుననిమాట వినుట చాల యుపకరించును. కావున దుర్యోధనుని ప్రత్యేకించినాడు. ఇక అన్నదమ్ములయం దేమైన భేద భావము లంకురించెనా ? అను సందేహమును తీర్చుటకై అర్జునుడు ధర్మజుని యనుమతిపైనను, శ్రీకృష్ణుని యొప్పుదలతోడనే మాట్లాడెను గాని అతడొక్కడై తన అభిప్రాయము నివ్వలేదని స్పష్టపరచినాడు.

'యుధిష్ఠిరస్యానుమతే మహాత్మా
ధనంజయః శృణ్వతః కేశవస్య'

ఇక్కడ సంజయుని ముఖముగ వ్యాసవాణి అర్జునుని మహానుభావత్వమునుగూర్చి స్పష్టము గావించినది. అర్జునుడు ధర్మదేవతకును, భగవంతునకు మధ్యనుండి తన పలుకులు వారి పలుకులే నని మాట్లాడుటను అర్జునునకు వాడిన 'మహాత్మా' అను విశేషణము తెలిపినది. సంజయు డావిషయమునే కౌరవ సభామధ్యమున స్పష్టపరచినాడు అర్జునుని 'మహాత్మా' అని వర్ణించుటతో.

ఇక అర్జును డేమైన కర్ణుని బలపరాక్రమములను తలచిగాని, తమ పక్షమునకంటె కౌరవపక్షమునగల బలాధిక్యతను తలచిగాని యుద్ధమున కేమైన వెనుకంజ వేసెనా ? అనునది తెలపవలెను. సంజయుని సమాధానము నందు ఆవిషయమును ముందుగనే తేల్చినాడు.

అవోచదాత్మం యోత్స్యమానః కిరీటీ
మధ్యే బ్రూయా ధార్తరాష్ట్రం కురూణాం.

ప్రస్తుతమున కౌరవుల నాశ్రయించియున్న కౌరవ సామ్రాజ్యలక్ష్మి పాండవులపై పుకే తన చూపును మళ్ళించినదని చెప్పుటకై సంజయుడు 'కిరీటీ' అను పదముచేత అర్జునుని చెప్పి, ఆ లక్ష్మివైభవము వారడు మీవలె హీనముగ ద్యూతాదికార్యములచే సంపాదింప తలచలేదని చెప్పుటకు 'యోత్స్యమానః' యుద్ధోన్ముఖుడై మాట్లాడెనని చక్కగ తెలిపినాడు.

అంతేకాక ఆతడు నేను చెప్పవలసినమాటలను ఏకాంతముగ చెప్పుదునేమో యని భావించెనేమో కురువీరులమధ్య దుర్యోధనునకు చెప్పవలసినదని కంఠోక్తిగ చెప్పినట్లు స్పష్టపరచినాడు.

'మధ్యేబ్రూయా ధార్తరాష్ట్రం కురూణాం'

కర్ణుని పేర్కొనెనా? కర్ణుని పేర్కొనకుండ అత డెందు కుండును? కర్ణునకు రోజులు దగ్గర కొచ్చినవని నిర్ణయించి, నాడు సభా మధ్యమందు దాడిన దుర్భాషలను జ్ఞాపకము చేయుచు, ఆ పాపాత్ముడును మూఢుడును అగు సూతపుత్రునకుగూడ నా మాటను వినిపింపమనినాడు. కర్ణునకుగల యుద్ధవ్యసనమునుగూడ పలికి, కాలపురుషుని లెక్కయందాతని ఆయుర్దాయము పూర్తియైనదనిగూడ నొక్కిచెప్పినాడు.

'మందప్రజ్ఞః కాలపక్వోతిమూఢః'

అంతతో అర్జునుడు తన మాటలను వినిపింపదగినవారిని సమాప్తము గావింపలేదు. మేము పాండవులను పొడిచివేతుమన్న సైనిక వర్గమున్నదిగదా? వారికికూడ నామాటలను వినుపింపుమనినాడు. ఊరక వినిపించుమనుటకాదు. 'సమగ్రముగ వినిపించుసుమా!' అని ఉద్ఘాటించినాడు.

'యే వై రాజా పాండవా యోధనాయ
సమానీతాః శృణ్వతాం చాపి తేషాం
యథా సమగ్రం వచనం మయోక్తం.

అర్జునునిమాటల నన్నిటిని దేవేంద్రునివలె పాండునందనుని చుట్టుముట్టి తీర్చిదిద్ది కూరుచున్న సృంజయాది వీరవర్గమంతయు ఉత్సాహమున వినుచుండిరని సంజయుడు అచ్చటి సన్నివేశము నంతను వర్ణించినాడు.

ఇంతవరకు అర్జునుడు తనమాటల నెవరెవరికి తెలుపమనెనో వారి వారిని సంబోధించినాడు. ఆతడేమనెనో సంజయుడింతవరకు చెప్ప లేదు. ఇప్పుడాతడు అర్జునుని సందేశముల నందించపలెను.

అర్జునుడు తనతో మాట్లాడునప్పుడాతని ముఖకవళి కెట్లుండెనో గూడ వర్ణించి అర్జునుడు మాట్లాడిన మాటలను వర్ణించినాడు. వక్తయైన అట్టివాడే.

అర్జునని కనుదోయి ఎఱ్ఱతామరలవలె భాసించగా ముఖమండల మున వీరరస ముప్పొంగగా గాండీవి యిట్లు మాట్లాడెనని ధృతరాష్ట్రుని గుండెలు గుభేలుమనునట్లు అర్జునుని చిత్తరువును తెరపై నిలిపి, ఆతని వీరరస వాక్యసరణి ఎట్లు నడచినదో వినిపించినాడు. అర్జునుడు దుర్యోధ నునకీ విధమగు సందేశ మందించెనట.

సంధి కుదరక యుద్ధమే ప్రసక్తమగుచో మా కోరికల నీవే సఫ లము గావించినట్లు చెప్పుమనినా డర్జునుడని పలికినాడు. కారణమేమి ?

హంసతూలికా తల్పమున పరుండి సుఖింపదగు ధర్మనందనుడు కఠినకాంతారభూమిపై బరుండి దుఃఖక్లేశము ననుభవించగా గలిగిన నా మనస్తాపమును రాబోవు రణరంగమున దుర్యోధనుని దీర్ఘనిద్ర నొందించి తీర్చుగొందునని ప్రతిసగావించి, అదియే మా కోరికల దుర్యో ధనుడు సఫలముగావించుటయని అర్జునుని భావమును తెలిపి, జరుగబోవు యుద్ధరంగము నందలి దృశ్యము నిప్పుడే చూపినాడు సంజయుడు. ఇంతతో అర్జునుని సందేశము సమాప్తమైనదా ? కాలేదు.

అర్జునుని వాక్యసరణి చాలయున్నది. భీమ నకుల సహదేవులెట్లు యుద్ధరంగమున వీరవిహారముల సలుపుదురో ప్రత్యేకప్రత్యేకములుగ వర్ణించి, అప్పుడుగాని దుర్యోధనుడు రాజ్యమిచ్చువాడుగాడని కూడ దుర్యోధనుని మూర్ఖత్వమునకు అర్జునుడు విచారమును వెలిబుచ్చినట్లు

సంజయు డుద్ధతుడై సభాసదుల కెరుకపరచినాడు. ఆ వర్ణనలలో భీముని విహారమును మాత్రము తిక్కనగారి ఆంధ్రవాణితో మీకు వినిపింతును.

మ॥ గద సారించుచు నంత్యకాలవిచలత్కాలాకృతిన్ భీముడు
న్మదమాతంగచయంబు నుగ్గుగ లసన్నానారథవ్రాతముల్
చదియన్ భూరిహయవ్రజంబు పొడిగా సంరంభతుంగాంగుడై
కదియం జూచి బలే సుయోధనుడు భాగం బిచ్చు రాజ్యంబునన్.

భీముని గదాదండ ప్రహారముల పొడిపొడికాదగు రథ గజ తురగ పదాతుల వర్ణించుట యటుండ వ్యాసభారతమున ధర్మనందనుని చూపుచే కూడా కౌరవసంతతి నెట్లు హతమార్చునో వర్ణించబడియున్నది. ఆ శ్లోకము మీకు వినిపింపక తప్పదు. భారతశ్రవణమున కేవలపాత్రచిత్రణమును, కథాగమనమందలి సౌందర్యమునే తిలకించుటగాదు. వ్యాసభారతి భారతీయుల వైదికవిజ్ఞానము నెట్లుచూపినదోగూడ గ్రహించినప్పుడే భారత శ్రవణఫలము మీకు దక్కును. కేవలమగు చరిత్రనే దృష్టియందుంచుకొనుట మానవత్వము కాదు. శాశ్వతమగు మోక్షపురుషార్థమును కూడ మనసునందుంచుకొని భారతమును చూచుట మానవతయగును. అర్జునుడు ధర్మజుని యసామాన్య పరాక్రమమును వర్ణించిన శ్లోకమిది -

కృష్ణవర్త్మేవ జ్వలితః సమిద్ధః
యథా దహేత్ కక్షమగ్నిర్నిదాఘె
ఏవం దగ్ధా ధార్తరాష్ట్రస్య సేనాం
యుధిష్ఠిరః క్రోధదీప్తోన్వవేక్ష్య.

జ్వలితుడును సమిద్ధుడును అగు కృష్ణవర్త్మ (అనగా అగ్నిహోత్రుడు) వేసవికాలమున అరణ్యములోని పొదల దహించినట్లు ధర్మనందనుని క్రోధోద్దీప్త వీక్షణములు ధార్తరాష్ట్రుని సేనాసమూహమును దహించినగాని ధార్తరాష్ట్రుడు రాజ్యభాగ మివ్వడని వర్ణించినాడు. ఇది శ్లోక తాత్పర్యము ఈ శ్లోకములోని ప్రత్యేకత ఏమన — అగ్నికి

'కృష్ణవర్త్మ' పదము వాడబడినది. అంతేగాక ఆ కృష్ణవర్త్మ (అగ్ని) సమిద్ధుడును జ్వలితుడుగా కూడ వర్ణింపబడినాడు. కృష్ణవర్త్మ, సమిద్ధ, జ్వలితపదములు వైదికములై ఇక్కడ సార్థకతను చేకూర్చినవని నీలకంఠులు వ్యాఖ్యానించినారు. ఆ సార్థకత ఏమనగా ఇక్కడ అగ్నికి వాడిన కృష్ణవర్త్మపదము లౌకికమగు అగ్నిపరముగాక యజ్ఞకుండము లందు దీక్షితులచే ఆరాధింపబడు పవిత్రమూర్తియగు అగ్నిని చెప్పు చున్నదని తెలిపినారు. వైదికమగు యజ్ఞసంబంధాగ్నినిగా గ్రహించుచో వచ్చిన ప్రయోజనమేమి ? అట్లు పదమును గ్రహించుట కాధారమేమి ? అనుచో సమిద్ధ, జ్వలిత, పదములు విశేషణములై ఆ యగ్నిని చెప్పుచున్నవనినారు. ఎట్లనగా తైత్తిరీయబ్రాహ్మణమున, కాండ-2 ; ప్రపాఠకము-1 ; పన్నము-10. అందు అగ్నికి కొన్ని అవస్థావిశేషము లున్నవనియు ఒక్కొక్క అవస్థయందా యగ్ని ఒక్కొక్క రూపమున చెప్పబడుననియు వర్ణితమైనది. ఆ రూపములకు 'పశురూపము'లని పేరు. అట్టి అవస్థలో గార్హపత్యమునుండి ఆహవనీయమున ప్రతిష్ఠింపబడుఅగ్నికి 'ఉద్ధరితాగ్ని'యని పేరు. అప్పుడా యగ్నిపొగతో ఆహవనీయమునం దుండగా రుద్రుడను 'పశువు' పేరు పొందును. అనగా ఆ అగ్ని రోదనమును కల్పించుశక్తికలదై యుండును. అట్టి అగ్నివంటి ధర్మజుని వీక్షణము ధర్మనందనుడు మీ సేనపై ప్రసరించగా ఆ యగ్నియందు వ్రేల్చు యజ్ఞసమిధలవలె నీ సైన్యము దగ్ధమగునని అర్జునుడు పలికినట్లు వ్యాఖ్యానించినారు. ఆ ఆహవనీయాగ్నియందు సమిధలనుంచగా మరల ఆ యగ్ని కొన్నిరూపాంతరముల నందును. మొదట యజ్ఞసంబంధమగు సమిధల కుప్పనుంచగా ఆ ఇధ్మను ముట్టగనే వచ్చు అగ్నియొక్క రూపమును జ్వలితాగ్నియని వర్ణించి, (కొంచెముగావచ్చు జ్వాల) ఆ జ్వలితాగ్నికి ఆదిత్యుడను పశురూపము కలుగునని వేదము చెప్పినది.

అట్టి అగ్నియొక్క అవస్థావిశేషమునే ఇక్కడ వ్యాసులు 'జ్వలిత' అను విశేషణమున తెలిపినాడని నీలకంఠులు వ్యాఖ్యానించినారు. తరువాత ఆ యగ్ని ఇధ్మసమిధలను సంపూర్ణముగ దగ్ధముగావింప ప్రదీప్తమై జ్వలించును. అనగా బాగుగామండి ఆ సమిధలనన్నిటి నొక్కమారు దగ్ధముగావించును. అట్టి ప్రదీప్తాగ్నినే ధర్మజునియందుకూడ ఉపమించినారు వ్యాసులు. 'క్రోధదీప్తః' అని. అనగా శబ్దబ్రహ్మరూపమున వెలుగొందు ధర్మమూర్తియను అగ్ని, కౌరవసైన్యమను సమిధలను దగ్ధముగావించుటలో భస్మాంతముగ కాల్చివేయునని వ్యాసుని భావము. ఇంతవివరణము గావించి మిమ్ములను బాధపెట్టుట దేనికనగా వ్యాస భారతము వైదికముగాని కేవలలౌకికము గాదని చెప్పుటకే. ఇతిహాసములు వేదోపబృంహణములు

(నీల. వ్యా. వస్తుతస్తు అగ్నిహోత్రే వస్వాదిసప్తస్వరూపోఽగ్నిః శ్రూయతే యదగ్నిముద్ధరతీత్యనువాక్యే తత్రకృష్ణవర్త్మేతి అన్వర్థ సంజ్ఞాతః ధూమాయన్ రౌద్రోగ్నిరుచ్యతే. జ్వలిత ఇతి కించిత్ప్రదీప్తః సమిద్ధఇతి సర్వతోదీప్తః దగ్ధా ధక్ష్యతి)

ఈ విషయము లిట్లుండ మరొక్కవిషయమును గట్టిగ స్మరించినాడు. అగ్నిదత్తమగు రథము, గాండీవము, దేవదత్తమగు శంఖము నావైయుండ అగ్నిదత్తమగు రథమునకు శ్వేతాశ్వముల బూన్చి శ్రీకృష్ణుని సారథ్యమున దేవదత్త పాంచజన్యము లను శంఖద్వయ మొక్కమారుగ భూమ్యాకాశముల మారుమ్రోగునట్లు పూరించుచు కపిధ్వజము మెరయగా మేమిద్దరమును యుద్ధరంగమున ప్రవేశించగా మందబుద్ధియగు దుర్యోధను డప్పుడు తపించునని చెప్పి, తాను ప్రాత స్సంధ్యను నిర్వర్తించిన తరువాత ఒకానొక బ్రాహ్మణుడు నాకీ రాబోవు యుద్ధమును చెప్పి, నా దిగ్విజయమును వాక్రుచ్చినారనికూడా చెప్పినాడని సంజయుడు నిర్ణయించి, అర్జునుని మాటలను ముగించినాడు.

ఇంతలో భీష్ముడు కల్పించుకొని - కృష్ణార్జునులు, నరనారాయణు లను ఋషిపర్యాలనియు వారిద్దరును యుద్ధరంగా మనకు కన్పట్టినను ఒక్కటే తేజము రెండు రూపముల చరించుచున్నదనియు బ్రహ్మలోక మున వీరిద్దరిని గురించి, దేవేంద్రుడు బ్రహ్మనడుగగా ఆ చతుర్ముఖుడు వీరు భూభారహరణార్థమై అప్పుడప్పు డవతరించుచుందురని చెప్పెననియు కాలకేయాది రాక్షసుల నాశము గావించిన అర్జునుడు నారాయణుని తేజములోనివాడే ననియు వారికి నీవు ఎదురుతిరిగి బ్రతుకజాలవనియు ఇది నారదుడొకప్పుడు చెప్పెననియు చెప్పి, వారిద్దరును ఇప్పుడు ఏక రథస్థులై సర్వనాశనమును గావింపగా అప్పుడు నా మాటను స్మరింతు వనియు చెప్పినాడు. ద్రోణుడును భీష్ముని వాక్యమును బలపరచగా ధృతరాష్ట్రుడు వారి మాటలను తప్పించి సంజయుని మరల ధర్మజుడు మన సైన్యములను గురించి ఏమనుకొనుచుండెను, ఆతని కెవ్వరు ముఖ్యులై యుద్ధమును నడిపింపదలచిరని ప్రశ్నించినాడు.

సంజయున కా ప్రశ్న ఆశ్చర్యమును కలిగించినది. ఆశ్చర్యము కలుగుటకాదు. మూర్ఛ నొందించినది. సంజయు డాసభయందే మూర్ఛ పడినాడు. విదురుడు సంజయుని సంగతి ధృతరాష్ట్రునకు చెప్పగా ఉపప్లావ్యమునందలి పాండవుల పలుకులేమైన సంజయుని గాభరా పెట్టినవేమోనని యనినాడు. అంతలో సంజయునకు మెలకువ రానే వచ్చినది. సంజయుని మూర్ఛ నొందించినది పాండవుల సంభాషణ కాదు. పాండవబలము తెలసికూడా ధృతరాష్ట్రు డిట్లు మూర్ఖుడై ఎవరినిగాని మనపై ధర్మజు డెత్తివచ్చునను ప్రశ్న ఆతనిని మూర్ఛనొందించినది. అటు పక్షము ననుగ్రహించుచున్న శ్రీకృష్ణుని మరచుట ధృతరాష్ట్రుని దురదృష్టము. ద్రోణుని వధకై పుట్టిన ధృష్టద్యుమ్నుని మరచెనా? భీమార్జునుల పరాక్రమము లెన్ని స్థలములందో ఎన్నోమారులు తన పుత్రుని పరాభవింపగా అవి తెలసియు ఈతడు నన్నిట్లడుగుచుండెనే యని

ఆతనికి మూర్ఛవచ్చినది. మూర్ఛనుండి లేచిన సంజయుడు ధర్మజు డెవరినిగొని మనపై దండెత్తునన్న ధృతరాష్ట్రుని ప్రశ్నకు సమాధానముగ అందున్న బలవంతుల వర్ణించినాడు. ఆ వర్ణనలం దతి ముఖ్యములై యున్న భీమార్జునుల వర్ణనలను తిక్కనగారి వాఙ్మయములో మీకు వినిపించుచున్నాను. ఇట్టి భీమునిగొని ఎత్తి వచ్చునట.

మ. బకవిధ్వంసి జటాసురాంతకు హిడింబప్రాణహారిణు గీ
చకనిర్మూలనకేళిలోలు సమరోత్సాహైకశీలప్రవ
ర్తకు నాగాయుతసామ్యకీర్తితబలోదగ్రుం బ్రతివ్యూహదా
హకు భీముం గొని వచ్చు ధర్మజుడు బాహాటోపముం జూపగన్.

మ. అట మిన్నందిన యట్టివానిపొడ వెంతన్నట్లు ఫాలాక్షు నె
క్కటికయ్యంబున గన్న ఫల్గును భుజాగర్వంబు లెక్కించు టం
తటివానిం గొని ధర్మసూతి సమరోత్సాహంబుమై నెత్తి వ
చ్చుటకుం గొంగునె వీపు నక్కనయి నిల్చుంగాక మీసైన్యముల్.

ఆకాశము నంటియున్నవాని పొడవును కొల్చుటవంటిది అర్జునుని పరాక్రమమని చెప్పి, అంతటివానిని గొనివచ్చును ; ధర్మజుడని చెప్పగా, ధృతరాష్ట్రుడు కొంతసేపు భీమార్జునుల పరాక్రమమును తలచి ఏడ్చుట జరిగినది. కాని సంజయుడు ఆ యేడుపు కిది కాలము కాదని మందలించగా ఆ సమయమున దుర్యోధనుని బిలిచి, పాండవుల సామర్థ్యమును వర్ణించి, సంధిని ఒప్పుకొమ్మని చెప్పినాడు.

దుర్యోధనుడు మూఢనమ్మకములు గలవాడుకాడు. పాండువులు దేవతాతేజములు గలవారన్న మాత్రమున దుర్యోధనుడు నమ్మునా? దేవతల కీరాజ్య లోభ మెందుకుండును? దేవతలనగా లోభాదిగుణముల కతీతులై యుండవలెనుగదా? పాండవులును మనవంటి రాజులేకదా? ఆ ఘట్టమున భీష్మాదివీరులు మనపక్షమునం దుండగా నీ కట్టి యధైర్య మెందుకని తండ్రిని గట్టిపరచినాడు. అంతతో ధృతరాష్ట్రుడు మరల

ధైర్యము వచ్చినది. సంజయు దిక్కుముఖుండై మరల నొక ముఖ్యమగు ప్రశ్నను ప్రశ్నించినాడు. ఏమనగా :

'యదజ్ఞాతాం మహాత్మానౌ వాసుదేవధనంజయౌ'

కృష్ణార్జును లిద్దరును కలసి ఏమనిరని. అనగా ఇంతవరకు అర్జును నొక్కనిని విడిగా అడిగి, ఇప్పుడు వారిద్దరును కలిసికొని ఏమనిరని అడిగినాడు.

ప్రశ్నయం దొక ప్రత్యేకత లేకపోలేదు ...

కృష్ణార్జునులలో భేదభావమేమైన యున్నదేమో తెలుసుకొందమని అడిగినాడు. ఈ పట్టమున సంజయుని సమాధానము భారతీయాధ్యాత్మికతా సార సంగ్రహము. సంజయునకు శ్రీకృష్ణునిపై గల అత్యంత గాఢాను రాగ మీ సమయమున సంజయుడొసంగు సమాధానమున స్పష్టము కాగలదు. శ్రోత లత్యంతజాగరూకులై సంజయుని సమాధానమును వినుట ముఖ్యాతిముఖ్యమనక తప్పదు. సంజయు డిట్లనినాడు.

ధృతరాష్ట్రా ! జాగరూకుడవై వినుము. కృష్ణార్జును లిద్దరును ఒక్కచోటున్న సమయముననే నేను వారి యభిప్రాయమును తెలిసికొన గోరి వెళ్ళినాను. కాని ముందు నీకు వారేమనిరో చెప్పుటకంటె వారిద్దరే ప్రదేశమునందెట్టి యాకృతులతో వారి దర్శనమును నా కిచ్చిరో చెప్పెద నని చెప్పుచు సంజయుడు తన సమాధానమును మొదలుపెట్టినాడు.

'శృణు రాజన్ యథా దృష్టౌ యథా కృష్ణధనంజయౌ
ఊచతుశ్చాపి యద్వీరౌ తత్తే వక్ష్యామి భారత.

ధృతరాష్ట్రా !

అది అర్జుని ఏకాంతవాసగృహము. ఆ గృహాభ్యంతరమునకు నకుల సహదేవులైనను వెడలరు సరిగదా : అభిమన్యునకుగూడ ఆ యభ్యంతరగృహమునకు ప్రవేశములేదు. భీమ యుధిష్ఠిరుల సంగతి

చెప్పెడిదేమున్నది? అట్టి ప్రదేశమునకు నా కనుజ్ఞనిచ్చినారు కృష్ణార్జునులు. ఫణిహారులవలన వారి అజ్ఞనుగైకొని నేను శిరమునువంచి, అడుగులచప్పుడుచేయక వినయావనతుడనై, నా చిత్తము నేకాగ్రముగావించుకొని, వారి పాదములపై దృష్టినిలిపి, ఆ గదియందు ప్రవేశించితిని.

ఆ గదియందనేక రత్నకంబళులు, కూర్చొనుట కిరువైన ఆసనములును అమర్చబడియుండగా, బహురత్నసమాకీర్ణమై సువర్ణపర్ణవిరాజమానమైయుండు ఒకే ఒక మహాసనముపై కృష్ణార్జును లిద్దరును కూరుచుండిరి. వారి మేనులు చందనగంధముచే మైపూతలు పూయబడి, వారిద్దరి కంఠసీమలును పూలమాలలచే విరాజిల్లుచుండెను. వారిద్దరును దివ్యాభరణ భూషితులయ్యే యుండిరి. అది వారి విలాసమందిరము గదా! వారిద్దరును అచ్చట కాంతాసమేతులయ్యే ఒకే ఆసనము నధిష్ఠించి కూర్చొనినారు. శ్రీకృష్ణుని యర్ధాంగి సత్యభామయు, ద్రౌపదియు ఆ మందిరమునం దప్పుడున్న కాంతలు. మహాత్ముడగు శ్రీకృష్ణుని పాదారవిందములు అర్జునుని తొడపైనను సత్యభామ తొడపైనను గూడ చాచుకొనబడియుండగా అర్జునుని పాదములు ద్రౌపది యుత్సంగముల నానియున్నవి.

'అర్జునోత్సంగగౌ పాదౌ కేశవస్యోపలక్షయే
అర్జునస్య చ కృష్ణాయాం సత్యాయాం చ మహాత్మనః'

ధృతరాష్ట్రా! కృష్ణార్జునుల యైకమత్య మెట్లున్నదో గమనించితివా? వారిద్దరును విభేదబుద్ధులు కారు. వారిద్దరి తేజ మొక్కటే. ఉపాధులు రెండు. నేనా గదిలోని కేగగా వారు కూరుచున్న ఆసన సమీపమందలి పాదపీఠమును అర్జునుడు నాకొసంగెను. నేను వారిచ్చిన గౌరవమును శిరసావహించితినేగాని ఆ పాదపీఠమున కూర్చొనలేదు. ఆ పీఠమును చేతతాకి, నేలపైననే కూర్చొంటిని. ఆ సమయమున నా

కడిన పాదపీఠమునుండి తొలగించుకొన్న అర్జునుని అరికాళ్ళయందలి శుభరేఖలు నా కంటబడినవి. వారిద్దరును తరుణవయస్కులు. ఆజానుబాహులు. బృహద్వపులు. విశాల వక్షులు. దండార్హుల దండించ భూమిపై అవతరించిన అవతారమూర్తులు. వారిద్దరి నేకాసనగతులై యుండుట చూడగానే నంతకుమున్నెన్నడును ఎరుగని భయ మొకటి నన్నావేశించినది.

'ఏకాసనగతౌ దృష్ట్వా భయం మాం మహదావిశత్'

సృష్టియంతయు నంతను పరిపాలించు శ్రీమహావిష్ణువును తెనయై శ్రీశ్రీకృష్ణుడును, స్వర్గసీమను పాలించు దేవేంద్రునకు సమానమైవిలసిల్లు అర్జునుడును - వీరిద్దరింత స్నేహపాశము పెనవేసుకొనియుండ మందబుద్ధియగు దుర్యోధనుని కేల బుద్ధి లేదు? - అనిపించినది భీష్మద్రోణులీ దుర్యోధనుని రక్షింపగలరా? కర్ణుని యర్థరహిత వాక్యములను దుర్యోధనుడు నమ్ముటయా? ధర్మజుని సంకల్పము తప్పక నెరవేరును. సందేహములేదని నిర్ణయించుకొంటిని.

వారు అన్నపానముల నాకు తగు సత్కారముల గావించినారు. నేను దోసిలిని శిరస్సునందుంచుకొని, ఆ మహనీయులను తమ దివ్య సందేశముల ధృతరాష్ట్ర భూపతికి నందించుట నా పని యంటిని.

అర్జునుడు శ్రీకృష్ణ పాదారవిందములకు నమస్కరించి వినమ్రుడై తన బాహుదండమును చాచి, అనవరతము నారి సారింపగా కాయ గాచిన గురుతు, చేతికొక యమూల్యాలంకారము కాగా అట్టి చేత నన్ను చూపి, సందేశమిచ్చుట కుద్బోధించినాడు శ్రీకృష్ణులను.

శ్రీకృష్ణుడంత దిగ్గున లేచి, ఆ నవసలిలనీరదశ్యాముని యొడలి యందలి దివ్యభూషణాంబరము లాతని కొక వినూత్నాలంకారమును గూర్పగా దుందుభి మ్రోగునట్లు రవళించుచు మృదుమధుర గంభీర స్వరముతో తన యమృత సందేశము నందించినాడు. తనకంటె జ్యేష్ఠులగు భీష్మద్రోణులకును, మీకును అభివాదనల చెప్పుమనినారు. తన

కంటె చిన్నవారికి తా నందించు కుశలముల నందింపుమనినారు. ఈ పలుకులును నావి, అర్జునునివికూడా యనినారు. ధార్తరాష్ట్రుల కిప్పు డొక విపత్కాలము వచ్చినదని గట్టిగపలికినారు. విపత్కాలమన ఇది మృత్యుకాలమేనని వ్రాక్రుచ్చినారు. మృత్యువు వారిని సమీపించి మ్రింగు లోపలనే వారు తీర్చుకొనదగిన కోరికల తీర్చుకొనుట మంచిదిగాని, ఇంకను కొంతకాలము బ్రతుకుదుమను నాశచే కాలయాపన చేయవద్దని చెప్పినారు. తమ తమ బిడ్డలనందర నొక్కచోచేర్చి పొందవలసిన ఆనందము నిప్పుడే పొందుట మంచిదనియు, రాబోవు జన్మలకై దానముల నేమైన పాత్రుల కిచ్చుకొన నిచ్చగలిగినచో వేగముగ నాపాత్రుల కిచ్చుకొనుటయు, ఒకవేళ బిడ్డలనేమైన కని ఆనందించదలచినచో ఆ కార్యమునుకూడ నెరవేర్చుకొనుట యావసరమునియు తమ ఇష్టమిత్రుల తోటి ప్రియమోద ప్రమోదముల ననుభవించుటకు త్వరపడుడనియు గట్టిగ చెప్పినారు. ఈమాటల నన్నిటిని చెప్పి, తానొక ఋణభారమును మోయుచుంటిననియు ఆ ఋణ మంతకంతకు పెరిగి పెద్దదికాగా తాను తీర్పజాలని స్థితికి వచ్చుననియు, ఆ ఋణము నిప్పుడే తీర్చుకొనుటకై అర్జునుని ముందిడుకొని నేను వచ్చుచుంటిననియు చెప్పినారు. ఆ ఋణ మేమి ? ఆయనకు అప్పుపెట్టిన ఆ ధనవంతు డెవరు ? అనగా శ్రీకృష్ణులు నాడు నీ హస్తినాపురమున ధార్తరాష్ట్రులు కపటద్యూత మంటప నిర్మాణము గావింపగా దానికి నీ వొడంబడగా పాండవుల రాజ్యమును దుర్ద్యూతమున నీ పుత్రులు హరింపగా సభాస్థలియందు ద్రౌపదిని పరాభవించుటకై ప్రయత్నించిన దుశ్శాసనాదుల ఘోరకృత్యమును నివారింప సమర్థులుగాక భర్త లైదుగురును సత్యపాశబద్ధులై గుడ్లు వప్పు చెప్పగా తానెక్కడో సముద్రమధ్యమున ద్వారకయందున్నను, ఆర్తురాలై కన్నీరు మున్నీరుగా కార్చుచు గోవిందా ! యని తన్ను పిలిచినదట. అది యీగగరాని అప్పుకాగా దానిని తీర్చుకొనుటకై

తాను వచ్చునట. ద్రౌపదికి తాను ఋణపడుటచే ఆ ఋణవిమోచన గావించుటే - పాండవుల కర్ధరాజ్య మివ్వనినాడు కురుక్షేత్ర సంగ్రామ రంగమున ధార్తరాష్ట్రులను హతమార్చుట జరుగునని ఉద్ఘాటించినారు. ఒక్కడైన అర్జునుని గాండీవమునకు సమాధాన మివ్వనేరక విరాట నగరమునుండి పారివచ్చిన మీ కౌరవ రారాజు నా సాయమొంది వచ్చు అర్జునుని ఎదిరించుటయా? ఒక మూఢుడు తన రెండుచేతులతో భూఖండము నెత్తివేయగలనని చెప్పుటవంటిదే దుర్యోధనుడు పాండవుల గెలిచి రాజ్యము గొనుటయని; దుర్యోధనునిది మూర్ఖవాదమని ఉద్ఘాటించినారు.

'మద్ద్వితీయం పునః పార్థం కః ప్రార్థయితు మిచ్ఛతి'

దేవరా! ఇది కృష్ణార్జునుల ఏకాంతవాణి యని చెప్పినాడు.

శ్రోతలారా! సంజయుడు కృష్ణార్జునుల యంతర్గృహ విశేషము లను ధృతరాష్ట్రున కెరింగించెనుగదా! దానినుండి మన మేమి గ్రహించవలెను?

కృష్ణార్జును లిద్దరును, సత్యభామాద్రౌపదీ సమేతముగ తమ బిడ్డలను తమ కనిష్ఠసోదరులనుగూడ చొరవివ్వని యంతర్గృహమున ఏకాసనగతులై భేదములేని చెలిమితో వసించిన ఘట్టమొక భాగము. అట్టి ఏకాంత గృహమునకు సంజయునకు ప్రవేశమిచ్చి మాటాడుట మరియొకభాగము. ఈ రెంటిని కలిపినచో మనకొక విషయము తేలును. ఏమది? పరాకాష్ఠనొందిన భక్తియు, పరాకాష్ఠ నొందిన మైత్రియు ఒక్కటే యని తేలును. పరాకాష్ఠ యననేమి? ఇద్దరు ఇద్దరుగాకాక ఒక్కటే యగుట. పరాకాష్ఠ నొందిన మైత్రి యననేమి? రెండు అంతఃకరణలకు మధ్యభాగమునం దేవిధమగు సందేహమును చొచ్చుట కవకాశములేని ఇద్దరు మిత్రుల మైత్రియందే, మిత్రత్వధర్మము

పరిపూర్ణమై మైత్రియొక్క పరాకాష్ఠను ప్రదర్శించగలదు. అట్టిదే భగవంతునకు, భక్తునకు గల సంబంధము. భక్తిశాస్త్రమున జీవేశ్వరులు మిత్రులు. ఒకరి ఏకాంతగృహములోనికి మరియొకరు రాకూడదను నియమ మామిత్రులకు లేదు. తనకంటె వేరై దేహసంబంధమున బంధువులగువారు తన అభ్యంతరగృహమున ప్రవేశింప లజ్జ యడ్డు వచ్చును.

తన ఆత్మయే వీ రసవారి కలయికయందు పరిమితభాగము లేదు. అచ్చట మాయజగత్తు లేదు. చిన్మయమగు ఆనంద ఘనమే ఒక సరస్సు కాగా అందలి తరంగములే ఈ యాప్తమిత్రులు. ఈ యాప్తమిత్రులే ఆశ్రయాశ్రయీ భావమున భగవంతుడు భక్తుడు నను పేర బరగు చుందురు పరమ భాగవతోత్తముని పరిశుద్ధాంతఃకరణము ఆ యప్రాకృతు డగు భగవంతుని యాభ్యంతర గృహములోనికి జొచ్చి, అం దాత డనుభవించు మహాలక్ష్మి విలాసముల దర్శించి, ఆ యప్రాకృతమూర్తుల లోని దివ్యలీలా విశేషములం దొక్కట శృంగార లీలావైభవమునుకూడ దర్శించి, ఆ యప్రాకృతరసానందానుభవమున సమాధి నొందదలచుచో భగవానుని అభ్యంతర గృహమునం దీ భక్తశేఖరునకు అవకాశము లేకపోలేదు. అట్లవకాశము లేక అభ్యంతర మున్నచో పోతనామాత్యులు అల వైకుంఠపురములో ఆ మూలనున్న సౌధాంతరాభాగమునకేగి, ఆ మహాలక్ష్మి కుచోపరి చేలాంచలమును చేతపుచ్చుకొన్న సంగతి నెట్లు చూడగలడు ?

అది యట్లుండ బలిచక్రవర్తిదగ్గరకు భూదానమునకై వచ్చిన మాణవకోత్తముని ముగ్ధహస్తము అలవైకుంఠపురమునం దొకప్పుడు శృంగార క్రీడామందిరమున లక్ష్మీదేవి పాదములకు ప్రణమిల్లి ఆమె యనుగ్రహమును సంపాదించుకొని పొలయలుక తీరిన ఆ పద్మాక్షిణి కపోలముల తాకి, ఆ మగువ పాలిండ్లపైకేగి, నూత్నమర్యాదం జెందిన దని భాగవత కవిశేఖరు డెట్లు చెప్పగలడు ?

వీరి భాగమిట్లుండనిండు. పరమహంస పరివ్రాజకులై, రజ్జువునం దారోపితమైన సర్పమునువలె జగత్తునొక్క శబ్దోచ్చారణమున తొలగించిన శంకరులు నృసింహాని యుగ్రరూపమునుగూడ శృంగార రసమూర్తిని గావించి, లక్ష్మీ లసత్కుచ సరోరుహ రాజహంసను గావించి, ఆత్మారాములై రమించినారు. కావున భగవంతునకంటె వేరులేని చెలిమే అర్జునుని అంతర్గృహ వర్ణనమును, సంజయుని వారి విలాసమందిరమున ప్రవేశింపజేయుటయు భక్తపారతంత్ర్యమను భక్తిశాస్త్రమును ప్రకటించును. ఈనాటి యుపన్యాసమున ముఖ్యముగ మీరు జ్ఞప్తియం దుంచుకొనదగిన భగవానుని సూక్తి ఇదియే. అది ద్రౌపదిని గురించి శ్రీకృష్ణులు పలికిన పలుకు —

'ఋణమేతత్ప్రవృద్ధం మే హృదయాన్నాపసర్పతి
యద్గోవిందేతి చుక్రోశ కృష్ణా మాం దూరవాసినం'

ఈ శ్లోకము శ్రీకృష్ణుడు ద్రౌపది నాడు ఆర్తితో భర్తలను వదలి తనను గోవిందా ! అని పిలిచిన పిలుపు తన హృదయమునుండి వెడలుట లేదట. ప్రతిక్షణమునందును ఆ ఆర్తనాదమే తనను కలచివైచు చున్నదట. భగవానుని ఈ సందేశము నెవ్వరును మరువరాదు.

తరువాతికథకు పోదము.

శ్రీకృష్ణుని వాక్యసరణి అట్లు నడవగా ధృతరాష్ట్రుడు దుర్యోధనుని బిలచి, సంధిని ఒప్పుమని చెప్పినాడు.

'శమో మే రోచతే నిత్యం పార్థైస్తాత న విగ్రహః
కురుభ్యో హి సదా మన్యే పాండవాన్ శక్తిమత్తరాన్'

కారణ మేమనగా కురువులకంటె పాండవులే బలవంతులు కనుక యట; గమనించితిరా! ధృతరాష్ట్రుని హృదయమును ? వారు బలవంతులు కనుక సంధి యొప్పవలెనట. ధర్మముచేగాదు.

భయపడిన ధృతరాష్ట్రునకు దుర్యోధనుడు మరల ధైర్యమును చేకూర్చినాడు. ఏమని? వారు అంత సమర్థులగుచో పదమూడు సంవత్సరము లేల అరణ్యములం దిడుమల పడుదురు? భీష్మ ద్రోణాదుల కెన్ని అస్త్రములు తెలియునో అవన్నియు నాకు తెలియును తండ్రీ, నీవేల భయపడుదువు? అని శపథము చేయుచు పాంచాల సృంజయులను సాత్యకి శ్రీకృష్ణులతో కూడ నేను జయింతునని గట్టిగ చెప్పగా కర్ణుడు దుర్యోధనుని బలపరిచినాడు. భీష్మ ద్రోణాది మహావీరవరు లందరు చూచుచుండగనే పాండవులను నేను జయించగలనని భార్గవాస్త్ర ప్రభావమును వర్ణించినాడు. అంతతో భీష్మునకును కర్ణునకును వివాదము వచ్చి, శ్రీకృష్ణ సంరక్షితుడగు అర్జునుని చేతిలో నీకు చావు తప్పదని పలికినాడు. కర్ణుడు భీష్ముని పలుకులకు సహించలేదు. వెంటనే భీష్ముడు యుద్ధమునుండి విరమించినగాని నా ప్రభావమును చూపనని కర్ణుడు శపథము గావించినాడు.

భీష్ముడు నవ్వి, దుర్యోధనా! మీ స్నేహితుని సహనమును గుర్తించితివా? నేనే ముందుండి యుద్ధము సాగింతునని చెప్పి, ఇంతలో విరమించినాడు. ఇదియే నీ స్నేహితుని సత్యప్రతిన యని వెక్కిరించి, భీమునిచేత కౌరవసైన్యమునకు చావు తప్పదని చెప్పుచు, తన విషయమును మాత్ర మిట్లు నిర్ణయించినాడు. నేను వేనకు వేలుగాగల రాజవరుల చంపుదుననినాడు.

దుర్యోధనుడు కర్ణపక్షపాతి. కావున భీష్మునితో నేను మీపైన ఆధారపడి లేనని దృఢముగ చెప్పి, తన విశ్వాస మిదయని ప్రకటించినాడు.

నాహం భవతి న ద్రోణే న కృపే న చ బాహ్లికే
అన్యేషు చ నరేంద్రేషు పరాక్రమ్య సమారభే
అహం వైకర్తనః కర్ణో భ్రాతా దుశ్శాసనశ్చ మే.

నేను కర్ణునిపైననే ఆధారపడినానని భీష్మునకు సమాధాన మిచ్చినాడు.

దానితో పెద్దరాజునకు కొంత ధైర్యము కలిగినది.

ఆ సమాధానమును విమర్శించుకొని అందించగా ధృతరాష్ట్రునకు మరల ధైర్యము సన్నగిల్లినది. అంతలో కృష్ణునితరువాత అర్జును దేమైన పలికెనా ? అని మరల సంజయుని అడిగినాడు. అర్జును డేల పలకడు ? పలికినాడని సంజయుడు సమాధానమిచ్చి, అతని పలు కెంత ఘాటైయున్నదో వినిపించినాడు—

శరాగ్నిధూమే రథనేమి నాదితే
ధనుస్స్రువేణాస్త్రబలప్రసారిణా
యథా న హోమః క్రియతే మహామృధే
సమేత్య సర్వే ప్రయతధ్వమాదృతాః

అని చెప్పినాడట.

యుద్ధమొక యజ్ఞమని చెప్పి, యజ్ఞమునందు శాస్త్రము నాధారముగా గొని ఎట్లు సుక్స్రువములతో నేయి హోమము చేయబడునో అదేవిధముగ అస్త్రముల నాధారముగా గొని గాండీవమను స్రువముతో రాజుల నందరినీ హోమము చేయుదునని చెప్పినాడు. తన అక్షయతూణీరమునుండి ప్రయత్నము లేకయే బాణములు తలెత్తి చూచుచున్నవనికూడ చెప్పినాడు.

అతని మాటలతో ధృతరాష్ట్రునకు మరియొక సందేహ మంకురించినది.—దుర్యోధనుడు, గదాదండముతో యుద్ధముచేయువాడు, నాతో సమానుడు లేడని చెప్పెను ; కర్ణుడు—దెబ్బకు నేను అర్జునుని జయింతు—నని చెప్పుచుండెను ; భీష్మాదులు, పాండవబలమును వర్ణించుచుండిరి. చిత్తము విచిత్రమై యుండెను. కావున సంజయుని చివర కొక ప్రశ్నను వేసినాడు.

'సంజయా! నీవు మా రెండు బలముల నెరుగుదువుగాదా! — మా బలమునందున్నవారిలో జ్యేష్ఠుడును, పాండవబలమున కనిష్ఠుడును ఎవ'రని ప్రశ్నించినాడు.

సంజయున కొకవిధముగ విసుగు వచ్చినది. 'నేను నీకు సమాధానము చెపదలచలే'దని సమాధాన మిచ్చినాడు.

కారణమేమైన చెప్పవద్దా?...చెప్పినాడు- నీ వసూయాగ్రస్తుడవని.

మరి ఎవరికి చెప్పదలచెను?

'వ్యాసులును, గాంధారియు వచ్చుచో చెప్పెద'నని చెప్ప, నంతలో వ్యాసులు రానే వచ్చినారు. గాంధారియు వచ్చినది. వ్యాసభగవానులు సంజయునితో - ధృతరాష్ట్రు డేమి యడిగినను చెపవలపినదిగా ఆజ్ఞ నిచ్చినారు. అప్పుడు సంజయుడీపలుకు పలికినాడు. ఇది సర్వవేదసారము.

'ఏకతో వా జగత్కృత్స్న మేకతో వా జనార్దనః
సారతో జగతః కృత్స్నా దతిరిక్తో జనార్దనః
భస్మకుర్యా జ్జగదిదం మనసైవ జనార్దనః
న తు కృత్స్నం జగచ్ఛక్తం భస్మకర్తుం జనార్దనం'

శ్రీకృష్ణుడు జగత్కారణుడని నిర్ణయించినాడు. కార్యజాత మంతయు కారణముకంటె తక్కువయను శ్రుతినే సంజయు డిక్కడ ఉదహరించినాడు. 'అత్యతిష్ఠ ద్దశాంగులం'. భగవంతుడు జగత్తునకంటె అధికుడు. శ్రీకృష్ణుడు తలచుచో జగత్తునంతను భస్మముచేయగలడు; జగత్తు శ్రీకృష్ణు నేమియు చేయలేదు - అని శ్రీకృష్ణుడు భగత్స్వరూపు డని చెప్పుటతో ముగించక; శ్రీకృష్ణుడు పాండవులవైపునం దుండుటచే వారికే జయమని తేల్చినాడు. భగవంతుడగు శ్రీకృష్ణునకు పక్షపాత మెందుకు? అతడు ధర్మపక్షమునందుండు నని చెప్పెను.

'యతస్సత్యం యతో ధర్మో యతో హ్రీ రార్జవం యతః
తతో భవతి గోవిందో యతః కృష్ణ స్తతో జయః'

సత్యధర్మము లెచ్చట గలవో, త్యాగ మెచ్చట నుండునో ; అచ్చటనే శ్రీకృష్ణ డుండును. ధృతరాష్ట్రా ! అర్జునునకు జయము తప్పదనినాడు.

సంజయునకింత భక్తి శ్రీకృష్ణునియందు ఎట్లు కలిగినది ? అను సందేహము ధృతరాష్ట్రున కావహించినది. ఆ విషయమునే అడిగినాడు.

ఇప్పుడు సంజయుడు చెప్పు సమాధానము సర్వోపనిషత్సారము.

ధృతరాష్ట్రా !

'మాయాం న సేవే భద్రం తే న వృథా ధర్మమాచరే
శుద్ధభావం గతో భక్త్యా శాస్త్రాద్వేద్మి జనార్దనం'

శ్రోతలారా ! ఈశ్లోక వ్యాఖ్యానము చాల ముఖ్యమైనది.

జీవుడు తరించు మార్గ మెద్దియో వ్యాసభగవానులు సంజయుని ముఖముగ నిర్వచించినారు. భగవంతుని జేరి దుఃఖమును బాపుకొనదలచిన వానికి ఆచరణయోగ్యములగు మూడు మార్గములున్నవి— కర్మ, భక్తి, జ్ఞానములు. ఆ మూడు మార్గములలో మొదటిది కర్మమార్గము, రెండవది భక్తి, మూడవది జ్ఞానము. ఈ మూడు మార్గముల నవలంబించుటకును భగవంతుని మాయాపరిణామునకు చిక్కుకొననివాడే కావలెను. ఆ మాయను దాటవలెనన్న నిష్కామకర్మను ఆచరించవలెను. ఆ మాటను సంజయుడు తన అనుభవమును ఆదర్శముగా నిచ్చి చెప్పినాడు. 'న వృథా ధర్మ మాచరే' – వృథాధర్మ మనగా కామ్యకర్మ. నేను ఫలమునుద్దేశించి భగవంతుని ఆరాధించను. పరిశుద్ధ భావముతో శాస్త్రానుశాసనముల ననుసరించి భగవంతునిచేరు నుపాయమును తెలిసికొంటినని చెప్పినాడు. శాస్త్రమును నమ్మనివాడు భగవంతుని గుర్తెరుగలేదు.

'జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి' అన్న గీతా సూక్తిని మీరు జ్ఞాపకముచేసికొనుట అవసరము.

ఇంతతో సంజయుని సంభాషణ పూర్తియైనది.

ధృతరాష్ట్రుడు మరల దుర్యోధనుని బిలిచి—దుర్యోధనా !

'హృషీకేశం ప్రపద్యస్వ జనార్దనం'

శ్రీకృష్ణుడు భగవంతుడు. ఆయనను ఆశ్రయించమని చెప్పినాడు.

దుర్యోధను డనెనుగదా !...

శ్రీకృష్ణుడు ఈ జగత్తునంతను దగ్ధముచేయగలుగుచో అర్జునునితో ఏల మిత్రత్వము నొందును ? అని ప్రశ్నించినాడు.

తరువాత గాంధారి దుర్యోధనునకు బోధించినది.

అయ్యును దుర్యోధనుడు వినలేదు ...

ధృతరాష్ట్రుడు మారలేదు ...

ఇంతతో సంజయరాయబార ఘట్టము సమాప్తమైనది.



# శ్రీకృష్ణ రాయబారము

మహాశయులారా!

మన మహాభారత ప్రవచనమునం దీనాటి ఘట్టము శ్రీకృష్ణ రాయబారము. నిన్న సంజయ రాయబారము ముగిసినది. వసుదేవ నందను డీనా డొక శాంతిదూతయై హస్తినాపురమున కేగవలెను.

సంజయుని ప్రబోధముచేత ధృతరాష్ట్రుని హృదయ మిసుమంతయు మారలేదు. దుర్యోధనునే యనుసరించినది. మన ఉపన్యాసమున కిది మూడవరోజు.

జీవుల పూర్వజన్మవాసనలు చాల చిత్రమైనవి. భగవంతుని మాయను దాటి, ఆ బ్రహ్మణ్యుని చేరవలెనన్న మహోత్కృష్ట వంశముల జన్మించుటగాని, విద్యావయోధనములుగాని కారణములుగావు. భగవంతుని మాయ సంజయుని క్రీగంటనైనను చూడలేకపోయినది. ఆతడు భగవంతుని మాయను దగ్గరకు రానివ్వలేదు. భగవంతుని మాత్రము దగ్గర జేర్చుకొనెను. నేను మాయను సేవించను అను పలుకు నిన్న సంజయుడు పలికినాడు. ఆతని మాట మనకు మరువరానిది. పరమభాగవతోత్తముడగు సంజయు డెన్నియోవిధముల పాండవుల ప్రభావమును శ్రీకృష్ణుని దైవత్వమును ధృతరాష్ట్రున కెరింగించెను. కాని ధృతరాష్ట్రుడు భగవంతుని మాయను దాటలేకపోయెను. ఆతని మాయా ప్రభావముచే కలిగిన మోహ మా ధృతరాష్ట్రుని వదలలేదు. పుత్రేషణ ఆతనిని వెంటనంటినది. కావున ధృతరాష్ట్రునకు దుర్యోధనుని అనుసరణము తప్పలేదు.

'ఎంతచదువు చదివి ఏ పీతి విన్నను
హీనుని గుణంబు మానలేదు
బొగ్గు పాలగడుగ బోవునా మలినంబు
విశ్వదాభి ... ... '

అది యట్లుండ ఈనాటి రాయబారకథాంశములోని ముఖ్యవిషయము లేమి?

ఒకటి రాజగువానికి శత్రువులతోటి యుద్ధము ఆసన్నముకాగా ఆతదేమి చేయవలెననునది.

రెండు జీవునకు కలిగిన సంసారభయమునుండి విముక్తుడు కావలెనన్న ఆత డెవ్వరి నాశ్రయించవలెను? ఇవి ముఖ్యవిషయములు.

రాజగువానికి శత్రువులతోటి యుద్ధ మాసన్నముకాగా ఆత డెంత సమర్థుడైనను తా ననుభవింపదగు ఐశ్వర్యము శాశ్వతము కావలెనన్నచో విషమఘట్టములందు తన నెదుర్కొను సమస్యలను తానే స్వయముగ నిర్ణయించుకొనక, సుహృద్వర్యులతో విచారించి నిర్ణయించుకొనుట ఆతని కర్తవ్యము. ఇది శ్రీరామాయణ మహాకావ్యమున 'విభీషణ శరణాగతి' యను ఘట్టమున రాఘవేశ్వరుల పలుకు.

'సుహృదాహ్యర్థకృచ్ఛ్రేషు యుక్తం బుద్ధిమతా సతా
సమర్థేనాపి విద్రేష్టుం శాశ్వతీం భూతిమిచ్ఛతా'

ప్రస్తుత కథాంశమున ధర్మజున కొకవిధమగు ఘట్టము ఎదురైనది.

దుర్యోధనాదులను యుద్ధమునం దెదుర్కొనుటయా? మానుటయా? యుద్ధమును చేయుటయందు కొన్ని దోషములును, మానుటయందు కొన్ని దోషములును ధర్మజుని దృక్పథమునందున్నవి.

ఆ సందేహములను తీర్చి, కర్తవ్యమును నిర్ణయింపదగు మంత్రి వర్యులు శ్రీకృష్ణులే. శ్రీకృష్ణుడు ధర్మజునకు మంత్రి. ఆప్తమిత్రుడు.

భగవంతుడు ఆప్తబంధువు. కావున అతనిని సమీపించి నేటి తన కర్తవ్యమును ఆలోచింప నిశ్చయించినాడు ధర్మజుడు.

యథార్థమునకు ధర్మనందనుడు శ్రీకృష్ణుని మంత్రిగ గ్రహించి తన కర్తవ్యము నాలోచించెనా? లేక రాయబారమును నడుపు దూతగ గ్రహించి మాకును, కౌరవులకును మధ్య దౌత్యనిర్వహణము గావింపుమని అర్థించెనా? లేక భగవంతునిగ గ్రహించి శరణాగతు డయ్యెనా? అను విషయములు మన రాయబార కథాంశమున చర్చనీయాంశములు.

ఈ ప్రశ్నలకు సూత్రప్రాయముగ మీ కందించు సమాధానము లివ్వి—

ధర్మజుడు శ్రీకృష్ణుని భగవంతునిగ గ్రహించి శరణాగతు డయ్యెను. మంత్రిగ గ్రహించి సలహాను కోరెను.

ధర్మనిర్ణేతగ గ్రహించి, తన కర్తవ్యధర్మము నెట్లు నెరవేర్చవలెనో చెప్పుమనెను. దూతయై వెళ్ళి మాకు సంధి యొనర్పుమని ధర్మజుడు ప్రత్యేకముగ కోరలేదు. శ్రీకృష్ణుడు తానే దౌత్యనిర్వహణను గావించుటకు హస్తినాపురమున కేగెదనని చెప్పినారు.

ధర్మజుడందుకు ప్రప్రథమముగ అంగీకరింపక, శ్రీకృష్ణుని ధీరోదాత్త గాంభీర్య వీర్యపరాక్రమముల ప్రకటించు వాక్యసరణిని విని అతని దౌత్యమునకు ధర్మజు డొప్పుకొనినాడు. వ్యాసభారతము నందలి కథాసరణి యిట్లే నడచినది. కథకుపోదము....

## శరణాగతి

అది శ్రీకృష్ణ నివాసమందిరము. ఆ మందిరాభ్యంతరముననే ధర్మజ భీమార్జున నకులసహదేవులును ద్రౌపదియుకూడ వసించియుండిరి. వారి కానాడేవేవియో కొన్ని కుశలప్రశ్నలు నడచినవి. తరువాతది ప్రధానమగు ధర్మజుని గోష్ఠి.

ఈనాటి శ్రీకృష్ణరాయబార కథాంశమున ధర్మజు డొక ఆర్తుడు. అతడు ఆపత్సముద్రమున మునిగి దరిగానక శ్రీకృష్ణభగవానుని ఆశ్రయించిన ధర్మజిజ్ఞాసువుగూడ.

ధర్మము చాల సూక్ష్మమైనది. ధర్మనిర్ణయము గావలసి వచ్చుచో సమర్థుడగు ఒకనిర్ణేత కావలెను. అతడు బ్రహ్మవిదుడు కావలెను.

శబ్దబ్రహ్మమగు వేదవేదాంగము లా నిర్ణేతకు ఆశ్రయములు కావలెను.

దుర్యోధనుని నిమిత్తముగా గొని నేడొక ఘోరసంగ్రామ రంగమును ధర్మజు డెదుర్కొనవలసి వచ్చినది. యథార్థమున కా ఘోర సంగ్రామరంగమున దుమికి జ్ఞాతి సుహృద్బాంధవుల హతమార్చి సామ్రాజ్యలక్ష్మిని చేతబట్టుట కాతని కిష్టములేదు. కారణమేమి ? ఆ రణ రంగము భరతవంశమునకు బలిపీఠము గావచ్చును. ఒక్క భరతవంశము నకేగాదు. భరతఖండమునగల రాజవంశములన్నియు ఆ రణరంగమున మృత్యుముఖమున కేగవలెను. ధర్మజుడు గొప్ప అహింసావాది. కాని క్షత్రియజాతి యుద్ధముననే జీవించవలెనన్న సనాతన భారతీయ సిద్ధాంతమున కాతడు కట్టుబడినవ్యక్తి. ధర్మపాశమును త్రెంచి తన ఆత్మనిశ్చయమునకే స్థానమిచ్చుట అతని అభీష్టముకాదు. వేదశాసనముల కాతడు కట్టుబడి యుండియే ధర్మనందను డయ్యెను. గాని కేవలము యముని పుత్రుడగుటచేత మాత్రమే కాదు. కావున అతడు తన ఆత్మ విశ్వాసమే ధర్మమని అనుకొనక ధర్మజుడు శ్రీకృష్ణుని శరణు పొందినాడు.

శరణాగతి ఆరువిధములని భక్తిశాస్త్రము చెప్పును. ఆ యారింటిలో భగవంతుడు నన్ను తప్పక రక్షించగలడను విశ్వాసమునూ, ఆ విశ్వాసముతో 'స్వామి! నన్ను తప్పక రక్షింపు'మని వేడుటయు ననునవి చాల ముఖ్యములు.

మన కథాఘట్టమున ధర్మజుడు శ్రీకృష్ణునితో తన క్లిష్టసమస్యను గురించి ఎట్లు మాటాడ ప్రారంభించెనో చూడుడు —

'అయం స కాలస్సంప్రాప్తః మిత్రాణాం మిత్రవత్సల
న చ త్వదన్యం పశ్యామి యో న ఆపత్సు తారయేత్'
'యథా హి సర్వాస్వాపత్సు పాసి వృష్ణీనరిందమ
తథా తే పాండవా రక్ష్యాః పాహ్యస్మాన్ మహతో భయాత్'

తా॥ మిత్రవత్సలుడవగు హే! కృష్ణా! నీ మిత్రులను రక్షింపదగు కాలము సంప్రాప్తమైనది. ఈ సమయమునందు మాకు వచ్చిన ఈ ఆపత్తులనుండి రక్షింపదగువానిని నీకంటె వేరొకని కానము.

శత్రుమర్దనా! నీ వవతరించిన వృష్టివంశీయుల నెట్లు ఆపదలనుండి కాపాడి రక్షించితివో అట్లే ఈ పాండవులును నీకు రక్షణీయులు. కావున మమ్ముల నుద్ధరింపుము. మాకు వచ్చిన ఈ మహా భయమునుండి కాపాడుము.

పై శ్లోకముల తాత్పర్యమును వింటిరిగదా! పాండవజ్యేష్ఠుని వాఙ్మయమునం దేమి ఇమిడియున్నది? తా మొక ఘోరవిపత్సముద్రమున మునిగియుంటిమనియు, ఆ యాపదవలన కలుగు మహాభయమును తొలగించి మమ్ముల రక్షించువాడు వేరొకడు లేడనియు, శ్రీకృష్ణుని ప్రాధేయపడుట మనకు గోచరించినది. ఇదియే శరణాగతి. ధర్మజుని పలుకులలో ఆపత్తు, మహాభయము అను మాటలు మనకు గమనార్హములు. ఆ రెంటినుండియు తరింపజేయువాడు వేరొకడు లేడను మాట పై రెండుపలుకులకును కొలికిపూసవలె యున్నది. ఆపన్నివారకుడును, మహాభయ నివారకుడును అగువాడు భగవంతు డొక్కడే. కాని ఇచ్చట ధర్మజు డనిన ఆపదయేమి? మహాభయమెద్ది? అనునది ప్రశ్న.

సామాన్య దృక్పథమునుండి చూచుచో మే మీ యుద్ధమునుండి తరించుటెట్లు? మాకెట్లు విజయము చేకూరును? అను భావమే మనకు గోచరించును. అంతమాత్రమగు భావమే ఈ పలుకులయం దిమిడిలేదు.

దుర్యోధనునితో యుద్ధము చేయివలసివచ్చుట ఆపద. మహాభయ మేమి? యుద్ధము గావింపక ఉపేక్షించినచో క్షత్రియ ధర్మమునకు హాని వచ్చును. ధర్మహాని కలుగుచో సంసారమునుండి విముక్తులమగుట అసాధ్యము. కావున కౌరవులతోడి యుద్ధములేకయే మాకు అర్ధరాజ్య మైనను ప్రాప్తించుట కుపాయమును చెప్పుటగాని, యుద్ధమే వచ్చుచో ఆ యుద్ధరంగమున ధర్మజయము నందించుటకుగాని నీవుతప్ప వేరొకడు లేడని ధర్మజుడు భగవానుని అర్థించినాడు. ఇచ్చట వాడిన మహాభయ మను పదమునకు జనన మరణ ప్రవాహరూపమగు సంసారమునియే అర్థము. ఆ సంసార తరణమును కావించునదియే కర్మయోగము. కావుననే గీతాశాస్త్రమున 'స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్' అను శ్లోకమువద్ద 'మహతోభయాత్' అను పదమునకు భాష్యకారులగు శంకరు లిట్లు వ్యాఖ్యానించినారు –

'సంసార జన్మ మరణాది లక్షణాత్'

కావున ధర్మజునివలెనే మన జీవితసమస్యల నెదుర్కొనవలసి వచ్చినప్పుడు మనము ఇట్లే భగవంతుని శరణు పొందవలెను. మన కిక్కడ కృష్ణుడు లేడుగదా? అందురా! వేదశాస్త్రములే శ్రీకృష్ణుడు. వేదములు శబ్దబ్రహ్మము. మన మాచరింపదగు కర్మను నిర్ణయించదగినవి అలౌకిక శబ్దరూపమున వెలసిన వేదములు. ఇదియే కర్మయోగమునం దంతర్భూతమగు భక్తి. భక్తియోగమున భగవంతు డొక్కడే నాకు శరణ్యమని నమ్మిన భక్తుడు దీర్ఘశరణాగతి నొందును. సంసారమున కూలిపోవు తన నుద్ధరింపుమని – పాహి! పాహి! – అని భగవంతునితో మొరబెట్టుకొనును. కావుననే ధర్మజుడు 'పాహి' అను పదమును

వాదినాడు. భక్తివిశిష్టుడగువాడు గావించు శరణాగతి భగవంతుని బంధించు దీర్ఘ పాశము. శరణాగతి సూత్రముచేత బద్ధుడగు భగవంతుడు అటు నిటు కదలలేక నిలిచిపోవును. కారణమేమి? అతడు ప్రేమ స్వరూపుడు. భక్తి నవనీతము వంటిది. నవనీతమన్న అతని కిష్టము. భగవంతుడు తన హృదయమును విప్పిచెప్పిన అమృతసూక్తి నొకదానిని మీకందింతును.

చ॥ చలమున బుద్ధిమంతులగు సాధులు నాహృదయాంబురీల దొం
గిలికొనిపోవుచుండుదు రకిల్బిషభక్తి లతాచయంబులన్
నిలువగ దట్టికట్టుదురు నేరుపుతో మదటంఘ్రికై వడిన్
వలలకు జిక్కి భక్తజనవత్సలతం జనకుందు తాపసా.

శ్రీకృష్ణుడు సాక్షాన్నారాయణుడు. ధర్మసంస్థాపనకై అవతరించిన అవతారమూర్తి. 'ధర్మమున కాత డాధారము. ఇదియే వ్యాసమునీంద్రుని పరమలక్ష్యము. ఈ లక్ష్యముననే మహాభారత రచన సాగినది.

భాగవతకృష్ణుడు వేరు, భారతకృష్ణుడు వేరు, అనువారు కొందరు గలరు. భాగవతకృష్ణుడు దేవుడై చిత్రించబడగా భారతకృష్ణుడు రాజకీయ నాయకుడుగా చిత్రించబడినాడని వారి వాదము. వ్యాసవాల్మీకులచే - రామ, కృష్ణావతారములు చిత్రించబడలేదు. తన మాయాప్రభావముచేత జగత్తునే చిత్రించిన చిత్రకారుని దివ్యాంశములే రామ కృష్ణావతారములు.

'ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా' (గీత)

ప్రతి కల్పమునందును చక్రమువలె తిరుగుచు వచ్చు త్రేతా ద్వాపరములందు భగవాను డా పేర్లతో అవతరింతుననియు, నా అవతార ముల కాధారము నా మాయయే ననియు గీతలో వారి దివ్యవాణి. ప్రకృతమున ధర్మజుని శరణాగతి కా భగవాను డేమి సమాధానమిచ్చిరో చూతుడు —

'అయ మస్మి మహాబాహో బ్రూహి యత్తే వివక్షితం
కరిష్యామి హి తత్సర్వం యత్వం వక్ష్యసి భారత'

"హే మహాబాహో :' అని ధర్మజుని సంబోధించి, నీ వేమి చెప్పినను దానిని చేయుటకు సిద్ధమైయుంటినని అభయ మిచ్చినాడు. ధర్మజుని హే మహాబాహో, అని సంబోధించుటలోని అంతరార్థమేమి ? నీవు దేనికిని భయపడనక్కరలేదు. ఒకవేళ యుద్ధము చేయవలసివచ్చినను నీకే జయము కలుగునని తన సంబోధనయందే సూచించినారు శ్రీకృష్ణులు.

ఆత డట్లు పలికినతోడనే సంధికార్యమును నెరవేర్ప నీవు హస్తినాపురమున కేగుమని శ్రీకృష్ణుని ధర్మజు డడుగలేదు. శ్రీకృష్ణులు నీ వనుకొన్న విషయము నంతను నిర్వచింపుమని మాత్రము పలికినారు. కావున ధర్మజుడు తన అభిప్రాయము నంతను చక్కగ విమర్శించి గుణదోషముల నన్నిటిని ధర్మబద్ధమగు తర్కముతో వివరించినారు.

## ధర్మజాదుల అభిప్రాయప్రకటనము

మహాభారత కథాప్రపంచమున నేటి మహనీయుల సన్నివేశ మొక మహత్తరమగు ఘట్టము. శ్రీకృష్ణుని అధ్యక్షపీఠమునం దుంచి ధర్మజాదులు తమ తమ అభిప్రాయములను శ్రీకృష్ణున కెరింగించినారు. అందు మొదటిది ధర్మనందనుని సంభాషణము.

ధర్మజుని హృదయమిది —

సంజయు డుపప్లావ్యమున చెప్పినట్లు రాజ్యమును వదలుకొనుట ఆతని అభిమతముకాదు. రాజ్యము కావలెను. యుద్ధము మాత్ర మాతని కిష్టములేదు. కౌరవులేమైన మారి తమ కయిదుఊళ్ళు యిచ్చినను రాజ ధర్మమునకు కొరతలేని జీవితమును గడపవచ్చునని ఆతని హృదయము. ఇది ఎట్లు నెరవేరును ? కౌరవుల హృదయమును మార్చదగు మహనీయు

డొకడు హస్తినాపురమున కేగి, ధర్మప్రబోధము గావించుచో ధృతరాష్ట్రుని హృదయము మారునేమోయని ధర్మజుడు అభిప్రాయ పడినాడు. ఆ విషయమునే శ్రీకృష్ణునకు విన్నవించినాడు. మొదట తాను రాజ్యము నెందుకు వదలదలచలేడో నిరూపించినాడు.

## ధనము – దాని అవసరము

ధర్మార్థ కామములను మూడు పురుషార్థములలో ధర్మము అరాధ్య దైవమై యుండవలెననునది పరమసిద్ధాంతము. కాని ఆ ధర్మము అర్థము లేనిదే నెరవేరదు. కారణ మేమి? ధర్మము యజ్ఞ–దాన–తపముల రూపమున నెరవేరును. అందు యజ్ఞదానములు దక్షిణల నిచ్చినగాని నెరవేరవు. దక్షిణావిరహితమగు యజ్ఞము ఫలించదు. కావున ధర్మము నుద్ధరించుటకు ధనము ముఖ్యము. ధనఫలములేనివాడు ఈ లోకమున బ్రతికియు జీవచ్ఛవమువలె మండునేగాని జీవిత లక్ష్యములను నెరవేర్పజాలడు. కావున కృష్ణా! ధనము చాల ముఖ్యము అని ధనముయొక్క అవసరమును నొక్కి వక్కాణించినాడు.

ఇది ధర్మజుని సూక్తి —

'ధనమాహుః పరం ధర్మం ధనే సర్వం ప్రతిష్ఠితం
జీవంతి ధనినో లోకే మృతా యే త్వధనా నరాః'

తరువాత రాజ్యము భ్రష్టముగాగా తనకు వచ్చిన దారిద్ర్యబాధను గురించి శ్రీకృష్ణునకు విన్నవించుకొనినాడు. ఆ ఘట్టమున ధనము లేనివాడు బ్రతికియు చచ్చినవా డెట్లయ్యెనో తననే ఆదర్శముగ చూపినాడు.

'ఇతో దుఃఖతరం కిన్ను యదహం మాతరం తతః
సంవిధాతుం న శక్నోమి మిత్రాణాం వా జనార్దన'

తల్లియగు కుంతిని, విదురాది మిత్రవర్గమునుగూడ పోషించుట కసమర్థుడనై యుండుటకంటె దుఃఖమేమున్నదని ప్రత్యక్షమై కన్పట్టు గార్హస్థ్య ధర్మలోపము ధనాభావముననే వచ్చినదని చెప్పి ధర్మలోపము రాకుండుటకే ధనము తన కవసరమని స్పష్టపరచినాడు.

తరువాత ధార్తరాష్ట్రులయొక్క నడవడికను గురించి మాట్లాడినాడు. ఆ ఘట్టమున ధర్మజుడు ముఖ్యముగ ధార్తరాష్ట్రుల యందలి లోపమును గురించి వివరించునప్పుడు వారియందు ప్రధానమై కన్పట్టు దోషగుణము లోభిత్వమని వక్కాణించినాడు. ఆ లోభిత్వము మానవుని అధఃపతనము గావించుటలో ముఖ్యాతిముఖ్యమగు దోషగుణ మని ఉద్ఘాటించినాడు. ధర్మజుడు లోభిత్వమగు గుణమును గురించి ఇట్లు వర్ణించినాడు —

లోభము - దాని పరిణామము

'లోభః ప్రజ్ఞానమాహంతి ప్రజ్ఞా హంతి హతాహ్రియం
హ్రీర్హతా బాధతే ధర్మం ధర్మోహంతి హతశ్రియం'
'స తదాత్మాపరాధేన సంప్రాప్తో వ్యసనం మహత్
నేంద్రాన్ గర్హయతే దేవాన్ నాత్మానం చ కథంచన'

లోభమను గుణము మానవుని ప్రజ్ఞను నాశముచేయును. (ప్రజ్ఞ అనగా ధర్మాధర్మ వివేకము) ప్రజ్ఞలేనివానికి లజ్జ ఉండదు. అనగా లోకమర్యాదను పాటించడు. అట్టివాడు ధర్మమును కోల్పోవును. ధర్మము నశించగా పుణ్యఫలము లేకపోవుటచే దారిద్ర్యము వచ్చును. లోభమను గుణముచే వచ్చుదారిద్ర్యము తన చేతులతో తాను సంపాదించుకొన్నదే నను భావము ఆ అవివేకునకుండదు.

అందుచే అతడు తనకు దేవతలు దరిద్రమును కల్పించిరని ఆక్రోశమునొంది, ఆ క్రోధావేశమున దేవతలను నిందించును. పెద్దలవ

దూరును. సేవకులపై చికాకుపడును. స్నేహితులను వదలుకొనును. క్రోధావేశమున మునుగును. అంతతో ఆతడు చేయరాని పనుల నెన్నియైన చేయును. ఆ పాపకర్మలచే జీవితమంతయు కలుషితముగాగా చివరకు నరకకూపమున బడును. కావున అట్టివారికి ధర్మప్రబోధము అవసరము.

## ప్రబోధము - దాని అవసరము

పాపాత్ముడు మహనీయుల ప్రబోధముచే ప్రజ్ఞాన్వితుడై కన్నుల దెరచి, శాస్త్రములయందు విశ్వాసము కలవాడై ధర్మము నాశ్రయించును. ఆత డాశ్రయించిన ధర్మము, వానికి లోకమర్యాదను పాటించు లజ్జయను ఉత్తమగుణమును కల్పించును. అనగా నేను చేయు ఈ అకార్యమునకు లోకు లేమందురు ? అను విమర్శ ఆతని కుదయించును. ఆ విమర్శచే ఆతడు పాపము నాచరించడు. పాపరహితునకు లక్ష్మి అభివృద్ధియగును. లక్ష్మీవంతుడగువాడు ధర్మముల నాచరించుచు ఆ ధర్మాచరణవలన ఆత్మశాంతిగలిగి ఇక పాపమునందు ప్రవర్తించడు. ఇది ప్రబోధమువలన కలుగు ప్రయోజనమని ధర్మజుడు వర్ణించినాడు. శ్లోకము లివ్వి —

'తస్య ప్రబోధః ప్రజ్ఞైవ ప్రజ్ఞాచక్షు స్తరిష్యతి
ప్రజ్ఞాలాభే హి పురుషః శాస్త్రాణ్యేవాన్వవేక్షతే
శాస్త్రనిష్ఠః పునర్ధర్మం తస్య హ్రీరంగముత్తమం
హ్రీమాన్హి పాపం ప్రద్వేష్టి తస్య శ్రీరభివర్ధతే
శ్రీమాన్ స యావద్భవతి తావద్భవతిపూరుషః
ధర్మనిత్యః ప్రశాంతాత్మా కార్యయోగవహస్సదా
నాధర్మే కురుతే బుద్ధిం న చ పాపః ప్రవర్తతే'

తరువాత ధర్మజుడు దరిద్రమునందుకూడ శీలభ్రష్టుడు కానివాడు పాపకార్యముల నాచరించడనియు, ఆత డాదరిద్రముచే నరకమును

పొందదనియు చెప్పి, తృప్తియను గుణమే మానవుని తరింపచేయునని తెల్పి, దానికి తననే ఉదాహరణగ చూపినాడు.

'తదిదం మయి తే దృష్టం ప్రత్యక్షం మధుసూదన
యథా రాజ్యాత్ పరిభ్రష్టో వసామి వసతీరిమాః'

ఓకృష్ణా ! నేను రాజ్యభ్రష్టుడనై దరిద్రము వచ్చినను ధర్మమునకే కట్టుబడి పదమూడు సంవత్సరములనుండియు జీవితమును గడపుచుండుటే గాక నేడుకూడ అయిదు గ్రామముల నిచ్చినను తృప్తినొందుటకు సిద్ధమై యుంటినని తన రాజ్యావసరమును గురించిన విషయ మంతతో విరమించినాడు.

తరువాతది యుద్ధప్రస్తావనము.

## యుద్ధము - అందలి దోషములు

యుద్ధము దోషభూయిష్ఠము. యుద్ధమున శాంతిలేదు. జయాప జయములకు నిర్ణయములేదు జయముకూడ అపజయముతో సమానము కాగల అవకాశమే యుద్ధమునం దున్నదిగాని జయలక్ష్మీ పాణిగ్రహణ సౌఖ్య మిసుమంతయు జయమునొందినవా డనుభవించునది లేదు. కారణ మేమి ? యుద్ధోద్యమమున కంతములేదు. తరతరములకును ఆ యుద్ధవైర మల్లే జ్ఞాతులమధ్య చెలరేగుచు దీర్ఘవైరమై వర్ధిల్లును. ఒకవేళ రాబోవు తరముల కీవైరము తలయెత్తకుండునట్లు చేయుట కవకాశము కలదుగదా, అన్నచో నేటి వైరుల రూపుమాపుటేకాక ఆయా వంశాంకురములను కూడ మొలకలెత్తనివ్వని ఘోరపాపమునకు ఒడిగట్టవలెనేగాని అంత కంటె వేరుమార్గ మేమున్నది ? అదియునుగాక నేటి నా యుద్ధోద్యమమున మొదటిఘట్టము జ్ఞాతివధయు, గురు, వృద్ధ, బాంధవ వినాశమును ఎదురై నిలువ ఈ మహాఘోరసంగ్రామరంగమును కొనసాగించు టెట్లు ? కృష్ణా, ఈ యుద్ధమునకు నా మనము ముందుకు దూకుటలేదని శ్రీకృష్ణునకి

యుద్ధదోషముల నుద్ఘాటించి, చివర కాతడు యుద్ధము కుక్కల కొట్లాట వంటిదనికూడ కఠినముగ చెప్పి, ధర్మార్థకామములకు భంగము రాకుండ రాజ్యము వచ్చువిధానము శాంతియుతమై యుండుట తన అభిప్రాయమని వాక్రుచ్చి, పర్యవసానమున రాజ్యము వచ్చుటకు రెండుమార్గము లున్నవనియు : అందు ఒకటి రౌద్రమగు యుద్ధము గావించుటయు, రెండవది శాంతియుతముగ సంధికి ఒడంబడి రాజ్యసుఖముల ననుభవించుటయు – ఆ రెంటియందును శాంతియుతమగు రాజ్యానుభవమే నా ముఖ్య సంకల్పముగా భావించుచుంటినేగాని రౌద్రరూపమగు యుద్ధము నకు నా మనస్సు ముందంజ వేయుటలేదని స్పష్టపరచినాడు.

తత్ర నః ప్రథమః కల్పో యద్వయం తే చ మాధవ
ప్రశాంతాశ్శమభూతాశ్చ శ్రియం తామశ్నువీమహి.

కాని యీ ఘట్టమున యుద్ధము దోషభూయిష్ఠము కావున యుద్ధమును విరమించుటే నా యభిమతమని మాత్రము తన నిర్ణయమును చెప్పలేదు. మరి ఏమి తేల్చినాడు ? తేల్చదగినదానినే తేల్చినాడు. రాజ్యము రాకున్నచో యుద్ధము తప్పదనియే తేల్చినాడు. కాని ప్రయత్నము ముఖ్యము.

'సర్వథా యతమానానా మయుద్ధ మభికాంక్షతాం
సాంత్వే ప్రతిహతే యుద్ధం ప్రసిద్ధం నాపరాక్రమః'

యుద్ధము లేకుండ రాజ్యము రాదగిన సామదానభేదముల నుపయోగించినను రాజ్యము రానిచో యుద్ధముతప్పదు. అయ్యును యుద్ధ శాంతికిచేయు ప్రయత్నము మాత్రము చాల ముఖ్యమని దృఢమగు తన అభిప్రాయమును వెలిబుచ్చెనేగాని ఆ ప్రయత్న మెవ్వరు చేయవలెను ? అను నిర్ణయమును మాత్రము ధర్మజుడు తన ముఖముగ చెప్పలేదు.

యుద్ధమును గురించి ఆలోచింపక అనాదరమును చూపుచో శత్రువులకు నా బలహీనతయే కన్పట్టుటవలన రాజ్యము రాదనియు,

యుద్ధము చేయుచో కులక్షయము తప్పదనియు, మా పెదతండ్రి మాకు పూజ్యుడేయైనను పుత్రునకు వశుడై రాజ్యము నివ్వకపోవుటను గురించి నే నేమిచేయవలెనో నాకు తోచకున్నదనియు వెతను జెంది నీవే నిర్ణయింపుమని శ్రీకృష్ణునిపైన భారముంచినాడు. అనగా ధర్మభంగము కాని రాజ్యప్రాప్తికి మార్గమును నిర్ణయించుట శ్రీకృష్ణునకు వప్పచెప్పి, గాఢమగు శరణాగతిని పొందినాడు. ఇవిగో మూలశ్లోకములు —

తత్ర కిం మన్యసే కృష్ణ ప్రాప్తకాలమనంతరం
కథమర్థాచ్చ ధర్మాచ్చ న హీయేమ హి మాధవ.
ఈదృశేఽత్యర్థకృచ్ఛ్రేఽస్మిన్ కమన్యం మధుసూదన
ఉపసంప్రష్టుమర్హామి త్వామృతే పురుషోత్తమ.
ప్రియశ్చ ప్రియకామశ్చ గతిజ్ఞః సర్వకర్మణాం
కో హి కృష్ణాస్తి నస్త్వాదృక్ సర్వనిశ్చయవిత్సుహృత్.

ఇప్పుడు మీకు నేను వినిపించిన శ్లోకము లమూల్యాలంకారము లగు భావగర్భితములైన ప్రబోధములు. ముందీశ్లోకముల తాత్పర్యమును గమనింపుడు.

హే కృష్ణ! మాధవ! అని భగవానుని సంబోధించి, మా ఆపత్కాల మెట్టిదో నీకు విన్నవించితినిగదా! మే మీకాలమున ధర్మార్థముల నతిక్రమించకుండ మేము చరించదగు మార్గమును నీవే నిర్ణయింపుమని మొదటిశ్లోకమున వేడికొనినాడు శ్రీకృష్ణుని.

రెండవ శ్లోకమున హే మధుసూదన! అని సంబోధించి, ఇటువంటి మహత్కృచ్ఛ్రము అనగా అర్థదారిద్ర్యము మాకు సంప్రాప్తింపగా మే మెవ్వరి నాశ్రయించి ఈ సమస్యను పరిష్కరించు కొనగలమో చెప్పుమని ప్రశ్నార్థకముగ వచించి వేరొక ఏ పురుషుడు ఈ సమస్యను పరిష్కరించువాడు లేడని పురుషోత్తమా! అని సంబోధించి నీవే మాకు శరణ్యమనినాడు.

మూడవ శ్లోకమున తమకును శ్రీకృష్ణునకును గల సంబంధమును వర్ణించుచు శ్రీకృష్ణచంద్రుని పరిపూర్ణ స్వరూపమును పేర్కొనినాడు.

ఆతని స్వరూప మిదియట —

ప్రియుడట, ప్రియకాముడట. సమస్తకర్మలయొక్కయు గతుల నెరిగినవాడట. ఇట్టి యర్హతలుగలవాడు వేరొక పురుషు డెవ్వడుగలడు ? కృష్ణా! యని సంబోధించి నీవు మాకు సుహృత్తువని తమకును శ్రీకృష్ణునకును గల సంబంధమును నిర్ణయించినాడు. ఇప్పుడు మీకు నేను వచించినది శ్లోకములలోని సామాన్యమగు తాత్పర్యము. కాని ఈ శ్లోకములయందు శ్రీకృష్ణుని సంబోధించు ప్రతి సంబోధనయందును ప్రత్యేకప్రత్యేకములగు భావములు లేకపోలేదు.

మొదటి శ్లోకమున తమకు సంభవించిన ధర్మార్థములకుగల పరస్పర వైషమ్యము నెట్లు తొలగింతువో అని, నీవు లక్ష్మీపతివి గావున నీకొక్కనికే ఇది సులభసాధ్యమని ప్రతిబంధక నివృత్తిని గావించు కృష్ణపదమును, మాధవ పదమును ప్రయోగించినాడు — హే కృష్ణ! హే మాధవ! అని.

రెండవ శ్లోకమున దేవతలను సైతము స్వర్గరాజ్యాద్యపహరణములచే బాధించు రాక్షసుల పరిమార్చిన పురుషోత్తముడవు నీవని హెచ్చరించి, దుర్యోధనాది దుష్టరాక్షసుల పరిమార్చి, ధర్మసామ్రాజ్యమును స్థాపించదగు ఈ కష్టకాలమున మా కర్తవ్యమును నిర్ణయింపదగువా రెవ్వరుగారు : నీవే నిర్ణేతవని శ్రీకృష్ణుని యవతార ప్రయోజనమును చక్కగ వివరించినాడు.

మూడవ శ్లోకమున భగవానుని యథార్థస్వరూపమును 'ప్రియ' పదముచే వ్యాఖ్యానించి, నీ సచ్చిదానందస్వరూపము నారాధించువారికి కోరదగువాడవు నీ వొక్కడవేగదా! అని 'ప్రియకామః' అనుపదమును ప్రయోగించినాడు. అంతేకాదు : సర్వకర్మలకును ఆధారము నీవేనని తా

మిప్పు డాచరించవలసియున్న యుద్ధయజ్ఞ మెట్లు ప్రాయశ్చిత్తాదికములు లేకుండ నడవవలెనో తెలుపుచు, అట్టి హింసాపూరితమగు కర్మను మాత్రమే చేయుటకాక, శాంతియజ్ఞముకూడ నీ యారాధనమే కావున యుద్ధము లేకుండ రాజ్యము రాదగిన మార్గమేమైనయున్న మాకు కల్పింపుమని ప్రాధేయపడినాడు. అంతేకాదు ; జీవుల నుద్ధరింపదగు వేదశాసనములన్నియు నీరూపమే గావున నీవాక్కుడవే సర్వనిశ్చయముల గావించువాడవని, 'సర్వనిశ్చయ విత్' అను పదమును వాడి, చివరకు సర్వానర్థపరం పరలను నిర్మూలించు సుహృత్తు వేదమొక్కటేనని, మాకు నీవే సుహృత్తువని తమకును శ్రీకృష్ణునకునుగల సంబంధమును స్పష్టపరచినాడు. ఇక్కడ మీకొక వేదవాక్యమునుకూడ వినిపించు చున్నాను.

'య స్తిత్యాజ సఖి విదగ్ం సఖాయం
న తస్య వాచ్యపి భాగో అస్తి'

ఇది ధర్మజుని శరణాగతి. ఇంతతో ధర్మజుడు మౌనముద్రను దాల్చగా తరువాతది శ్రీకృష్ణుని అభయ ప్రదానము.

'నీవే తప్ప నితః పరం బెరుగ మన్నింపం దగున్ దీనునిన్'

అని శరణన్న ధర్మజున కాత డందించిన అభయ ప్రదానమును గమనింపుడు

'ఉభయోరేవ వామర్థే యాస్యామి కురుసంసదం'

ధర్మజా ! మీ యిద్దరకును సంధింపజేయుటకై నేనే హస్తినాపురమున కేగెదనని తనపైననే భారమును వైచుకొని సమాధాన మిచ్చినాడు. సామాన్యముగ సమాధాన మిచ్చుటకాదు. తాను నిర్వహించ బోవు సంధికార్యము సఫలమై యుద్ధములేకయే నీకు నిష్కంటకమగు రాజ్యము వచ్చుచో ఆ మహాపుణ్యము నాకు దక్కును. మీరును, కౌరవ సృంజయ పాంచాలాది రాజమండలముగూడ ఆ కురుక్షేత్ర సంగ్రామ

రంగమున బలికాకుండయుండు మహాభాగ్యము నాకు దక్కినచో అది నా మహాభాగ్యము ధర్మజా ! అని తాను నిర్వహించబోవు ఆ సంధికార్య మొక మహోత్కృష్ట పుణ్యకార్యమని భావించినట్లు కూడ ధర్మజున కెరింగించినారు.

'శమం తత్ర లభేయం చేద్యుష్మదర్థమహాపయన్
పుణ్యం మే సుమహద్రాజన్ చరితం స్యాన్మహాఫలం'

శ్రీకృష్ణు డట్లు అభయప్రదానము గావింపగా ధర్మజు డిట్లనెను ;
కృష్ణా ! నీ వా కౌరవసభకు దూతవై వెళ్ళుటకు నా మనసు ఒప్పుట లేదని సమాధాన మిచ్చెను. కారణము ; అచ్చట జేరిన క్షత్రమండల మంతయు దుర్యోధనుని వశమునం దున్నదేగాని, ధర్మపక్షమున చేరిలేదు. దుర్యోధనుడు నీమాటను లెక్కచేయడు. నీకు ద్రోహము ఏ రూపమున నైనను జరుగవచ్చును. నీకు అపకారము కలుగగా వచ్చు దేవేంద్ర పదవియైనను నా కక్కరలేదు-అని సకారణముగ శ్రీకృష్ణుని ప్రయాణము నాత డంగీకరించలేదు.

'న మమైతన్మతం కృష్ణ యత్వం యాయాః కురూన్ ప్రతి
సుయోధనః సూక్తమపి న కరిష్యతి తే వచః
సమేతం పార్థివం క్షత్రం దుర్యోధనవశానుగం
తేషాం మధ్యావతరణం తవ కృష్ణ న రోచతే
న హి నః ప్రీణయేద్ద్రవ్యం నదేవత్వం కుతస్సుఖం
న చ సర్వామరైశ్వర్యం తవద్రోహేణ మాధవ'

ఇప్పుడు ధర్మజుని సమాధానమునందు మన కేమర్థమైనది ? శ్రీకృష్ణు నొక సామాన్య మానవుడని భావించియే శ్రీకృష్ణుని పయనమున కాత డొప్పకపోయెనని మన కర్థమైనది. శ్రీకృష్ణుడు భగవంతుడే యని ధర్మజుడు దృఢముగ నమ్మియున్నచో కౌరవసభయందు దాతనికి ప్రమాదము

కలుగునేమోయన్న భయ మా ధర్మజున కెట్లు కలుగును? పైన ధర్మజుడు శ్రీకృష్ణుడు భగవంతుడనియే శరణుపొందెనని చెప్పిన నా యుపన్యాసమునకును ధర్మజుని యీ సమాధానమునకును సంబంధము లేనట్లు స్పష్టమగుచున్నది. ఒకవేళ ధర్మజు డూరక మాటమాత్రముగ అట్లు పలికెనేగాని వేరుగాదని సమాధాన మిచ్చినను మీరు తృప్తులుగారు. ధర్మజుని పలుకులు సామాన్యములని త్రోసివేయుట యుక్తమా? కాదు; కావున ధర్మజుని సమాధానమునం దేదియో అంతరార్థమున్నది.

భారతీయ ఇతిహాసములలోని కథాభాగము ఆధ్యాత్మిక లౌకికము లను రెంటిని ఏకైకమార్గమున నడిపించు నన్నమాటను మరచి మహాభారత రామాయణాది గ్రంథములను పరిశీలింపరాదు.

ధర్మజునకు శ్రీకృష్ణునియందు భగవంతుడను బుద్ధి మఱుగువడి అట్లు మాటాడలేదు. ఆ పరమాత్మయందలి ప్రియత్వము వీకు ప్రమాదము గలుగు సురరాజ్యమైనను నా కక్కరలేదనిన మాటయందు ధారాళమై యున్న ఆ ధర్మనందనుని ప్రేమ స్పష్టమైనది.

భక్తులకు భగవంతునియందుగల ప్రేమరసముయొక్క మార్దవము లోకోత్తరము.

గోపకాంతలు శ్రీకృష్ణ చరణారవిందములయందలి సౌకుమార్యము నెంత లోకోత్తర వాఙ్మయమున ప్రకటించిరో మీకు వినిపించెదను.

శ్రీకృష్ణుడు శరద్రాత్రియందు గోపకాంతలతో విహరించుచు అత దంతర్థానమయ్యెను. అతడు ఆ బృందావనమునందే తిరుగుచుండెనని భావించి వారి బాధ నిట్లు ప్రకటించినారు.

'అరవిందంబులకంటె కోమలములై యందంబులై యున్న నీ
చరణంబుల్ కఠినంబులై మొనయు మా చన్నుంగవల్ మోవగా
నెరియంబోలు నటంచు బొక్కుదుము నీ యీ కర్కశారణ్యభూ
పరిసంచారము కృష్ణ నీ ప్రియులకుం బ్రాణవ్యథం జేయదే'

భగవత్పాదారవిందముల యందలి సౌకుమార్యమును కనుగొన్న గోపకాంతలకే ఆ బాధ మెరుకపడునుగాని సామాన్య మానవలోక మందుకొనతగినది కాదు. అట్లే శ్రీకృష్ణుడు హస్తినాపురమునకు పయనముకాగా నాతుచ్ఛరాజ్య సంపాదనమునకు ఈ మహానీయుని పంపి కౌరవుల దుర్నయమునకు తీమవును వప్పచెప్పుటయా ? అను భావము ధర్మజుని వాక్యములయందు నిగూఢముగ దాగియున్నది. అది లౌకికముగ చూచుచో ఒక బుద్ధిశాలిదుని శత్రుసామ్రాజ్యమునకు పంపగా వారీతని బంధించుచో వచ్చునష్టమును భావించుటకూడ కనుపించును. ఇదియు యుక్తమే. సీతాన్వేషణమున కేగు వానరులలో అంగదుడు లంక కేగుటకు జాంబవంతు డొప్పలేదు. హనుమంతుడు నాకంటె బలహీనులు వానరులం దెవ్వరును లేరని సీతకు సమాధాన మిచ్చినాడు. అనగా బలహీనులనే దూతలుగ బంపుదురని చెప్పినాడు. ప్రధానము పరమార్థమున కివ్విగా కృష్ణునియందలి ప్రేమయే ధర్మజుడు శ్రీకృష్ణుని నివారించుటకు కారణము. సామాన్యమున నీకచ్చట ప్రమాద మేమైన కలుగునేమోయని శంకించుటయైనది.

శ్రీకృష్ణుడు జగదంతర్యామి. ధర్మజుని హృదయ మాతని కర్థము గాదా ? తనకేమైన దుర్యోధనాదులు ప్రమాదము కల్పింతురన్న ధర్మజుని యూహకు తగిన సమాధాన మందించినాడు. భగవానుని ముఖముగ ఆ సమాధానమందుకొను హృదయముకూడ ధర్మజునకు లేకపోలేదు. శ్రీకృష్ణుని సమాధాన మిది —

ధర్మజా ! ధార్తరాష్ట్రుల పాపత్వమును నే నెరుగుదును. కాని సింహము గర్జించగా నీచమృగములా ప్రదేశమున నిలువనేరవుసుమా ? వారేమైన నన్ను గురించి వక్రముగ వర్తించుచో ఆ క్షణముననే కురు సంతతి భస్మము కాగలదని తన శక్తినిచెప్పి, ధర్మజునకు ధైర్యమును పురిగొల్పినాడు.

'అథచేత్త్రవర్తేత మయి కించిదసాంప్రతం
నిర్దహేయం కురూన్ సర్వానితి మే ధీయతే మతిః'

కౌరవులు తన కేమి దుర్నయము చేయుదురని శ్రీకృష్ణుడూహించెను ? 'అసాంప్రతం' చంపుటగాని, బంధించుటగాని వారు చేయుచో తాను చేయు క్రియను నిర్ణయించినాడు. అనగా లయకారుడను నేనే అయి యుండగా వారు నన్నేమి చేయగలరని స్పష్టపరచినారు శ్రీకృష్ణులు. అంతతో ఈ ఘట్టమున ధర్మజునకు శంకతీరినది.

కాని శ్రీకృష్ణులు రాయబారమున కేగు సందర్భమున ధర్మజునకొక ప్రశ్న యుదయించవచ్చును ; కాక మనకును ఉదయించవచ్చును. ఏమది ?—దుర్యోధనుడు పాపాత్ముడు. మనము సంధికేగినను అది జరుగనిపని అని తెలిసియు సంధిపేయుట కేల బయలుదేరుట ?— అని. రాబోవు ఈ ప్రశ్నను ఆధారముగా జేసికొని శ్రీకృష్ణు లందించిన సమాధానము శ్రీకృష్ణుని లక్ష్యమును స్పష్టపరచును. శ్రీవారి సమాధానమును వినుడు—

న జాతు గమనం పార్థ భవేత్తత్ర నిరర్థకం
అర్థప్రాప్తిః కదాచిత్స్యాత్ అంతతోవాప్యవాచ్యతా.

ధర్మజా ! కేవలము సంధి కుదురుననియే నేను పయనమును సాగించుట లేదు. ఇందు వేరొక ముఖ్యప్రయోజనమును కలదు. ఏమందువా ?-సంధి కుదిరిన కుదరవచ్చును. కాకున్నను పాండవులు సంధిప్రయత్నము చేయకయే యుద్ధరంగమున నిలిచిరను నిందతొలగుటకూడ ఇందు ముఖ్యప్రయోజనము కాగలదు. కావున నా పయనము చాల ముఖ్యమనినారు.

చూచితిరా ! భగవానుని సమాధాన మెంత లోకయాత్ర ననుసరించినదో ! ధర్మజునకు ఆ మహనీయుని సమాధానము నచ్చినది. శ్రీకృష్ణుడు ప్రయాణము సాగించుటకు మంగళాశాసనము నందించినాడు.

'కృతార్థం స్వస్తిమంతం త్వాం ద్రక్ష్యామి పునరాగతం'

హస్తినాపురమునుండి వెళ్ళినకార్యమును చక్కగా నెరవేర్చుకొని క్షేమముగా తిరిగివచ్చుటను చూతునని వయోధర్మమున పెద్దయగు తాను ఆశీస్సుల నిచ్చినాడు.

ఇక తన లక్ష్యమేమియో రాయబారికి స్పష్టముచేయవలెను. స్పష్టముచేయుటేగాదు; రాయబారియొక్క అర్హతననుసరించి, అతనికి ఆ కార్యనిర్వహణమునకు సంపూర్ణస్వాతంత్ర్యమునుగూడ యిచ్చి పంపవలెను. ముఖ్యదూతయగువాడే అట్టి సంపూర్ణస్వాతంత్ర్యము నొంది కార్యమును సాధింప సమర్థుడగును. ముఖ్యదూతకు 'నిసృష్టార్థు'డని పేరు. రెండవవానికి 'మితార్థు'డను పేరు. శ్రీకృష్ణు డిక్కడ ముఖ్యదూతయై పాండవులకు, ముఖ్యప్రాణమునకు కూడ ఆధారభూతుడై వెలసినాడు. కావుననే ధర్మజుడు చివరకు తన నిర్ణయమును చెప్పునప్పుడు శ్రీకృష్ణునకును తమకునుగల సంబంధమునుకూడ వర్ణించి, కార్యభారము నంతను శ్రీకృష్ణునియందే మోపి తన లక్ష్యమును స్పష్టపరచినాడు.

ప్రథమమున శ్రీకృష్ణునకును తమకును గల సంబంధమును, అసలుదూతయగు శ్రీకృష్ణభగవానుని యర్హతలను ధర్మజుని ముఖముగ వ్యాసభారత మెట్లు వర్ణించినదో మీకు వినిపింతును ——

ధర్మజుడు శ్రీకృష్ణునకు సంగ్రహముగ తన లక్ష్యమును ముందు స్పష్టపరచినాడు.

'విష్వక్సేన కురూన్ గత్వా భరతాన్ శామయన్ ప్రభో
యథా సర్వే సుమనసః సహ స్యామ సుచేతసః'

హస్తినాపురమునకేగి, భరతవంశీయుల శమింపచేసి, మేము అందరమును సుహృద్భావమున మెలగునట్లు చేయుమని సంధికార్యమునకే స్థానమిచ్చుచు నీవు మాకు ఆత్మబంధువువైయుండుటచే మాకు ఏది శ్రేయోదాయకమో దానిని నీవు నెరవేర్చుకొని రమ్మని పరిపూర్ణ స్వాతంత్ర్యమునిచ్చి పంపినారు.

తమపై శ్రీకృష్ణునకుగల స్వాతంత్ర్య మెట్టిదోకూడ ధర్మజుడు చక్కగ నిరూపించినాడు. దౌత్యనిర్వహణమునకుగల ప్రత్యేక గుణ సంపద శ్రీకృష్ణునియందు ఎట్లు పరిపూర్ణమైయుండెనోగూడ ధర్మజుడు విశదీకరించినాడు.

శ్రీకృష్ణునకు తమపైగల స్వాతంత్ర్యము ఇన్నిరూపములతో వెలసినదట — శ్రీకృష్ణుడు తమకు సోదరుడట ; స్నేహితుడట ; అర్జునకును తనకును ప్రియుడైయుండెనట ; అంతేకాక - అణుమాత్రమైనను శంకించుటకు తావులేని సుహృత్తట.

'భ్రాతా చాసి సఖా చాసి బీభత్సోర్మమ చ ప్రియః
సౌహృదేనావిశంక్యోసి స్వస్తి ప్రాప్నుహి మాతయే'

ధర్మజుడు శ్రీకృష్ణుని చుట్టరికమును ఇన్నిరూపములలో వర్ణించెను గదా ! ప్రత్యేక ప్రత్యేక సంబంధములను వర్ణించుటలోని అంతరార్థమేమి ?

భగవంతుడు సోపాధికుడు, నిరుపాధికుడుగూడ. సోపాధికుడనగా రూపనామములతోగూడి ఆరాధించదగువారికి సేవ్యమానుడై ఆరాధింపబడుట. రెండవది రూపనామములతోగాక అనుభవరూపమున వెలుగుచుండుట.

సోదర, స్నేహ సంబంధములు సోపాధికములుకాగా అర్జునునకును తనకును ప్రియుడై యుండెనను పదము నిరుపాధికము. అనగా కేవలమగు ఆత్మకు ప్రియమని వాడినాడు. అట్టి పరమాత్మయే ఇక్కడ సుహృత్తుకాగా ధర్మజునకు శంక ఎక్కడిది ? శంకారహితమగు దూతయే సంధికార్యమున కేగునప్పుడు అతనికి సర్వస్వాతంత్ర్యమును ఇచ్చి పంపవలెను. కావున ముందు శ్రీకృష్ణుని నిజరూపమును వర్ణించి తరువాత దౌత్యనిర్వహణకు అర్హమగు దూతలక్షణమును ధర్మజుడిట్లు వర్ణించినాడు —

'అస్మాన్ వేత్థ పరాన్ వేత్థ వేత్థార్థాన్ వేత్థ భాషితుం'

దౌత్య నిర్వహణ గావించువానికి ఇరుపక్షములవారి సంగతులును తెలిసియుండుట చాల అవసరము. అంతేకాదు. కార్యమును బొత్తుపరచు సమర్థతకూడ ముఖ్యము. అట్లు కార్యమును సాధించువానికి వాక్చాతుర్య ముండవలెను. చాతుర్యమనగ కేవలము చమత్కారముగ హాస్యరసము ట్టిపడున ట్లుపన్యసించుటకాదు. వాక్మాధుర్యమును పద గుంభనయు, తాత్పర్యము స్పష్టమగునట్టి వాక్యనిర్మాణమును కలిగి, శ్రోతల హృదయము నాకర్షించుచు, సత్కార్యముల పిదక పరపక్షమునం దుండు విద్వద్వర్యుల హృదయముల నైతమును మార్పదగు నైపుణ్యముగ మాట్లాడుటకు వాక్చాతుర్యమని పేరు. ధర్మజు డీవిషయమును చక్కగ వివరించినాడు పైశ్లోకమున.

అస్మాన్ వేత్థ - మమ్ముల నెరుగుదువు. అనగా మా జీవిత లక్ష్యమేమియో నీకు తెలియును. పరాన్ వేత్థ - కౌరవుల లక్ష్యమునుగూడ నీ వెరుగుదువు, వేత్థార్థాన్ - కార్యముయొక్క స్వరూపమును నీకు తెలియును. వేత్థభాషితుం - సామ దాన భేద దండోపాయములలో ఏ యుపాయము నాశ్రయించి ఆ సమయమున మాటాడవలెనో వాగ్రూపుడ వగు నీకు తెలియనిదికాదు. కృష్ణా ! ఏది మాకు హితమని నీకు తోచునో దానినే సుయోధనునికడ మాటాడుము.

'యద్యదస్మద్ధితం కృష్ణ తత్తద్వాచ్యః సుయోధనః'

అనగా సంధియొనర్చి, యుద్ధమును మాన్పినను, క్షత్రియధర్మ మగు యుద్ధమే శ్రేయమని నీకు తోచినను, ఆ రెంటికిని నేను సమ్మతింతునని పరిపూర్ణస్వాతంత్ర్యము నిచ్చినాడు ...

ఈ శ్లోకానువాదమే ఆంధ్రభారతమునందలి పద్యము.

క. మమ్మెరుగు దెదిరి నెరుగుదు
నెమ్మి యెరుగు దర్థసిద్ధి నెరి యెరుగుదు వా
క్యమ్ముల పద్ధతి నెరుగుదు
పొమ్మెవ్వడ నేను నీకు బుద్ధులు సెప్పన్.

ఇది యిట్లుండ ధర్మజు డొక విచిత్రమగు విషయమునుగూర్చి శ్రీకృష్ణునకు చెప్పినాడు. ఆమాట ధర్మజుడు యుద్ధమున కెంతదూరమునందుండెనో తెలుపును. చూడుడు—

కృష్ణా!
యద్యధర్మేణ సంయుక్తముపపద్యేద్ధితం వచః
తత్తత్కేశవ భాషేథాః సాంత్వం వా యదివేతరత్॥

దుర్యోధను డొకవేళ అధర్మమునే అవలంబించి, అర్ధరాజ్యము నివ్వదగు మాకు అయిదూళ్ళ నిత్తునన్నను ఒప్పుకొనమని చెప్పినాడు. అంతేకాదు; ఒకవేళ మరల జూదమాడి గెలుచుకొమ్మన్నను సరియే. అందుకును నేను సిద్ధమయ్యేయుంటిని. ఏది ఏమైనను యుద్ధముచేయుటకు మాత్రము నా మనస్సు ఒప్పుటలేదని స్పష్టపరచినాడు. అధర్మముతో కూడిన సాంత్వము అయిదూళ్ళనిచ్చుట. ఇతరమగు అధర్మము జూదము.

(అధర్మేణ సంయుక్తం, సాంత్వం నః రాజ్యార్ధార్హాణాం పంచ గ్రామ దానేన. అధర్మేణ ఇతరత్ ద్యూతేనైవ రాజ్యప్రత్యాదానం —నీ.కం)

కాని శ్రోతల కిక్కడ ఒక అనుమానము రావచ్చును. జూదము అధర్మముగదా? ధర్మజుడు మరల దాని కెట్లు ఒడంబడెను? అని. హింసాకాండకంటె అధర్మమైనను ద్యూతమును భరించుట యుక్తమని ధర్మజుని హృదయము. మొదట ఓడెనుగదా! ఇప్పుడు దానికేల ఒడంబడెను? బృహదశ్వమహర్షి వారివలన అక్షతత్త్వమును తెలిసికొనెను. కావున దానికికూడ ఒప్పుకొనెను.

ఆంధ్రభారతమునుండి కూడ మీకు ధర్మజుని సందేశము నందింతును...

చ. మనమున బక్షపాతగతి మాదెస మానుము ధర్మనీతిప
ర్తనముల రెండుదిక్కులహితంబును బెంపును గల్గునట్టి చా
ప్పున విదురాది సజ్జనులబుద్ధికి రా నుచితంబుతోడి మె
ల్పున బరుసందనంబునను భావను లెల్ల నెరుంగ నాడుమీ

చ. తగవున లోక రాజు లెపిదంబులు పల్కనయేని సైచి యొ
ప్పుగ విలుమీ గురుత్వము ప్రభుత్వమునుంగలపెద్దవారిమా
ట గౌనమి యాసుయోధనుకడన్ విలువన్ మన మెల్ల గౌరవం
బుగ గురువృద్ధుపల్కు దలపుం జన నిచ్చిన మెచ్చరే జనుల్

మ. సుతువాడై వినయంబు పేకొనక యేచొప్పుందగం జెప్ప కా
ధృతరాష్ట్రుండవివిలిజేసినను సంధింపంగ రా దంచు వే
గ తెగం బారకు తెంపు సేయునెడ లోకం బెల్ల మెచ్చంబ్రకా
శితధర్మస్థితి నొంది మామనము నిశ్చింతంబుగా జేయుమీ.

ఇంతవరకు ధర్మజుని అభిప్రాయమంతయు శ్రీకృష్ణునకు విన్నవించుట జరిగినది. మరి ధర్మజుని సంభాషణకు సమాధానమేమైన శ్రీకృష్ణులొసంగిరా ? అనునది చాల ముఖ్యమగు ప్రశ్న. శ్రీకృష్ణు లిప్పుడు చెప్పబోవునది ధర్మజుని మాటలకు సమాధానముకాదు. సిద్ధాంతవాక్యములనే కొన్నిటిని ధర్మజున కందించినారు.

## శ్రీకృష్ణుని సమాధానము

ధర్మజుని సంభాషణయందు రెండంశములను శ్రీకృష్ణులు ముఖ్యముగ గ్రహించుట జరిగినది.

ఒకటి ఆ పక్షమున భీష్మద్రోణాదులుండగా మనకు జయము కలుగునను నమ్మకములేదను హృదయదౌర్బల్యము.

రెండు గురువృద్ధ బాంధవుల వధించి పాపమునకు ఒడిగట్టుకొందునేమో యన్న సంశయము. ఈ రెండువిషయముల నాధారముగా గొనియే శ్రీకృష్ణులు ధర్మజునకు సిద్ధాంతరూపమగు సలహా నిచ్చినారు.

ధర్మజుని హృదయదౌర్బల్యమును ముందు తొలగించవలెను. కావున—ధర్మజా ! నేను సంజయుని మాటలను వింటిని ; నీవిప్పుడు చెప్పు మాటలనుకూడ వింటిని. నీబుద్ధి ధర్మమునే ఆశ్రయించగా కౌరవుల హృదయము వైరము నాశ్రయించియున్నదని చెప్పి, సంధికార్యము సఫలమగుచో నూటికినూరుపాళ్ళను సర్వజనసమ్మతమై, నే వెడలుట సఫలము కాగలదు. కాని సంధి విఫలమగుచో మాత్రము యుద్ధము పాపభూయిష్ఠమను నీ యభిప్రాయమును మార్చుకొనుట చాల అవసరమని నొక్కి వక్కాణించినారు.

యుద్ధము క్షత్రియజాతికి స్వధర్మము. యుద్ధమున చంపదగు బంధువర్గమును గురించికూడ జాలితలచరాదు. క్షత్రియుడు యుద్ధవిషయమున జూపు దయార్ద్రహృదయము పుణ్యమును బుట్టించదు. పాపమునే పుట్టించును ఈ సిద్ధాంతమునే ముందు ధర్మజునకు మనసున నాటినారు.

'స్వధర్మః క్షత్రియస్యైష కార్పణ్యం న ప్రశస్యతే'
'విక్రమస్వ మహాబాహో జహి శత్రూన్ పరంతప'

రెండవది— క్రూరులగు దుర్యోధనాదులకు నీమీద ఏమాత్రముకూడ దయ లేదను విషయమును ఘాటుగచెప్పి, దుర్యోధనాదులయందుగల బంధుదృష్టిని చక్కగ మరల్చినారు. ధర్మజున కిచ్చిన సలహాలో శ్రీకృష్ణుని చివరి వాక్యము లివ్వి.

'యాత్వా చాహం కురూన్ సర్వాన్ యుష్మదర్థమహాపయన్
యతిష్యే ప్రశమం కర్తుం లక్షయిష్యే చ చేష్టితం'
కౌరవాణాం ప్రవృత్తిం చ గత్వా యుద్ధాధికారికాం
నిశమ్య వినివర్తిష్యే జయాయ తవ భారత'

'సర్వథా యుద్ధమేవాహమాశంసామి పరైస్సహ
నిమిత్తాని హి సర్వాణి తథా ప్రాదుర్భవంతి మే'

ధర్మజా! నేను కౌరవులకడ కేగి నీ కార్యమును పొత్తుచేయుటకయ్యే ప్రయత్నింతును. అచ్చటి వారి మాటలనుబట్టియు, వారి చేష్టలనుబట్టియు ఆలోచించి, నీకు జయముకలుగుటకయ్యే మరలెదననినారు కృష్ణులు. అదిగాక శకునము లనేకములు యుద్ధమునే సూచించుచున్నవిగాని భూలోకమందలి రాజపుత్రుల జీవితములను భూమిపై నిలుచునట్టివిగ చూపట్టుటలేదు. మనయోధులు యుద్ధమునకే సిద్ధమైరి. వేయిమాటలేల శతవిధముల యుద్ధము రాకతప్పదని తోచుచున్నదని విరమించినారు. ఇంతతో ధర్మజుని సంభాషణ ముగిసినది. తరువాత భీముడు తన అభిప్రాయమును శ్రీకృష్ణునకు తెలిపినాడు.

## భీముని అభిప్రాయము

'యథా యథైవ శాంతిస్స్యాత్ కురూణాం మధుసూదన
తథా తథైవ భాషేథా మాస్మయుద్ధేన భీషయేః

కం॥ సమరంబు గలుగు ననుచును
మము వెరపింపంగ వలదు మాధవ నీ వా
కుమతి యగు ధార్తరాష్ట్రుడు
శమించు కార్యంబు నడపు సౌజన్యమునన్.

ఇది భీముని పలుకు. ధార్తరాష్ట్రులపై ప్రతినిత్యమును కటకటలాడు భీముడు యుద్ధమును విరమింప యత్నింపుమని యభిప్రాయమునిచ్చినాడు.

భీముని మాటకు, శ్రీకృష్ణుని ముఖమండలమున చిరునవ్వు మొలకెత్తినది. ఆ చిన్నినవ్వును నవ్వుచునే భీమునిట్లు పలుకరించినాడు.

కృ - భీమసేనా ! నీవేమైన కలగని మేల్కాంచితివా ?

భీ - లేదులేదు. నేను మేల్కొనియే యుంటిని.

కృ - నేను నమ్మటలేదు. అగ్నిపర్వతము మంచుకొండయైనట్లు నీవు మాటాడుటచే యుద్ధము సందేమైన అపజయసూచకమగు కల గంటివేమోయని నా యూహ.

భీ - చిన్ననాటినుండియు నా పరాక్రమము నెరిగిన నీకా అట్టి సంశ యము ? యుద్ధమన్న నా గదాదండమునకు పండుగ.

కృ - అటులైన దుర్మదాంధులగు ధార్తరాష్ట్రులతోటి శాంతి నేల కోరు చుంటివి ?

భీ - మా యన్న ననుసరించితిని. అంతియేగాని నేను పిరికివందనై అట్లు మాట్లాడితి ననుకొంటివి కాబోలు !

ఇదిగో ! నా బాహుద్వంద్వము. నేను యుద్ధరంగమున నిలవగా చండప్రచండమగు నా దోర్దండముమధ్య నిరికిన చరాచర ప్రపంచము కూడ నానుండి తప్పించుకొనజాలదు. భళిభళీ ! యనినాడు.

కృ - యథార్థము యథార్థము భీమసేనా ! నీ వంతవాడవే. నిజమునకు రాచబిడ్డలకు వచ్చు నానార్థములను, కీర్తియుగూడ విరోధి విజయముననే చేకూరగలవు. నీవు రాబోవు యుద్ధమునకు జడిసి అట్లంటివని నిజముగ తలచి హాస్యమునకుమాత్రమే అట్లు పలికితిని. అదియుగాక, నేనును అర్జునుడును యుద్ధరంగమున నిలువగా అప్పుడు నీ సాయము మాకు కావలెననిగూడ నేను విన్ను అడుగుటకు నీవు తగినవాడవుగదా ! నామాట కేమైన కోపించితివా ?

భీ - యుద్ధరంగమున మీ రిద్దరును దర్పోద్ధతులై చరించగా మేమంద రమును ఎత్తున నిలిచి మీ పరాక్రమమును చూచెదముగాక.

భీముడు నీ పట్టిపట్టి మాటలకు కోపించువాడు గాదు. నీ పలుకులతో నాకేమి పని ? యుద్ధమే వచ్చుచో నాడా రణరంగమున గుంపులు గుంపులుగా నిలుచు పద గజ తురగంబుల మ్రగ్గు గావించు నా విర్వీర్య పరాక్రమము ఏ రూపము ధరించగలదో నీవే చూడగలవు.

కృ - నీ విప్పుడు చెప్పినదానికంటె రెట్టింపు చేయగల సమర్థుడవు. నే నెరుగుదును. పోయి వచ్చెద. సంధికి యత్నించెదను. కానిచో యుద్ధమునకు నీవే కుదురు. ఏమందువు ?

భీ - శాంతికై యత్నింపుము. యుద్ధము వచ్చుచో ధార్తరాష్ట్రుల పరిమార్చెదముగాక.

ఇంతతో బకమర్దన మురమర్దనుల సంభాషణ ముగిసినది.

కృష్ణ బ్రహ్మము భీముని హృదయమునం దంకురించిన శాంతి బీజమును ఏరివేసి, యుద్ధోత్సాహమును కల్పించి అర్జునుని యభిప్రాయము నందుకొనినారు.

## అర్జునుని అభిప్రాయము

పార్థుని యభిమతమును సందియే. అర్జునుడు శ్రీకృష్ణున కిచ్చిన అభిప్రాయమున దైవపౌరుషేయములలో పురుష ప్రయత్నమునకే తావిచ్చి, పురుషుడు గావించు ప్రయత్నమును దైవము సఫలముజేయును గాన కృష్ణా ! నీవు సంధి యొనర్పబూనుచో సంధి కుదరకపోవుట యను నది యుండదని తెల్పినాడు.

ఉ. నీవొనరింప బూనినపనిం గములోదర కిడువుట్టునే
కావనినట్లు యుండి యవు గార్యము లట్లగుటం బ్రయత్న సం
భావన పేత పౌరుషముపద్ధతి తత్ఫలసిద్ధి వొందుచో
దైవము తోత్పడన్ వలయు తథ్యము రెండును నీవినోదముల్.

అంతతో యూరుకొనక నీవు ఎట్లు చేసినను దానికి మే మొదంబడుదుమని ఒప్పికొనినాడు. నీవు మాకు గురువువని సవినయముగ చెప్పినాడు.

శమం తైస్సహవా నో౽స్తు తవ వా యచ్చికీర్షితం
విచార్యమాణో యః కామః తవ కృష్ణ స నోగురుః

అర్జునుని యూహాకు శ్రీకృష్ణు డిట్లు సమాధానమిచ్చినారు.

పార్థా! కౌరవ పాండవుల సంధికొరకే నేను ప్రయత్నించెదను, అయ్యును అది సఫలమగుట నాచేతియందు లేదు. దైవపౌరుషేయముల రెండును మిశ్రమములయ్యే యుండునుగాని కేవలపౌరుషేయమునకు తావులేదు.

వ్యవసాయకుడు భూమిని దున్నును. విత్తునాటును. కాని ఆ క్షేత్రమున నాటినబీజము ఫలించుటకై వర్షము కావలెను. ఆ వర్షము దైవాధీనము. దైవ, మానుషములు రెండును లోకమును నడుపునేగాని పౌరుషమొక్కటేకాదు. ఇది సిద్ధాంతమని సమాధానమిచ్చి, సంధికొరకై నేను ప్రయత్నమును తప్పక చేతును. దైవముచేయు కార్యముమాత్రము నాకు సాధ్యమైనది కాదు. అని గట్టిగ చెప్పినారు శ్రీకృష్ణులు.

ఇవిగో మూలశ్లోకములు.

'దైవే చ మానుషే చైవ సంయుక్తం లోకకారణం
అహం హి తత్కరిష్యామి పరం పురుషకారతః
దైవంతు న మయా శక్యం కర్మ కర్తుం కథం చన.

ఆంధ్రానువాదము—

చ. వెరవున లావునం గృషికి వేయువిధంబుల మేలొనర్చినన్
దొరకొనునే ఫలంబు దరితోదగు వర్షములేకయున్న నె
ప్పురుసున లెస్స సేసినను బౌరుషముల్ ఫలించుటెల్ల నా
దరణమునం బ్రసన్నమగు దైవముచేతన చూవె ఫల్గునా.

తరువాత తన అభిప్రాయమును శ్రీకృష్ణున కెరింగించినవాడు నకులుడు. ఆతడు తన అభిప్రాయమును శ్రీకృష్ణున కిట్లు విన్నవించినాడు —

మాధవా ! ధర్మజ్ఞుడును వదాన్యుడునగు మాయన్న ధర్మజుడు మాటాడిన అన్నిరకములగు మాటలను వింటివి. వినుట గాదు. ఆతని మాటలకు తగు సమాధానములనుగూడ నందించితివిగదా ? తరువాత మా భీమసేనుడును అర్జునుడును తమతమ భావములను నీకు వ్యక్తముచేయగా వారికిని తగినరీతిని సమాధానముల నందించితివి. ధర్మజుడు యుద్ధ శాంతికే ప్రధానస్థానము నివ్వగా, భీముడును ఆతనినే అనుసరించినాడు. అందు ధర్మజునకు యుద్ధశాంతిని గూర్చిన మాటలగనే సమాధానమిచ్చి, భీమునికి బాహువీర్యమునుగురించి యుపన్యసించితివి. అట్లే మా అర్జునుడు సంధినిగురించి నొక్కివక్కాణించి నీవు చేయ నిశ్చయించిన సంధి తప్పక కుదురగలదని పలుకగా, దైవము తోడ్పడవలెనని సమాధాన మిచ్చితివి. నేనును నా మతమును చెప్పెదను. కాని మేమిప్పుడు నీకు చెప్పిన అభిప్రాయములుగాని, నీవు మాకు చెప్పిన సమాధానములయందు ఉన్న అభిప్రాయములుగాని ఒక నిర్ణయమునకు దగినవి కాదనుట నిశ్చయము. కారణమేమందువా ? మా మా అభిప్రాయములన్నియు ఒకే ఒక నిర్ణయమును చేయక లక్ష్యభేదములచే అభిప్రాయములను భేదించినవి. ధర్మజుడు వంశనాశమగుటకు భయపడినాడు. భీమార్జును లాతనినే యనుసరించిరి. నాకును ఒకవిధముగ మనసు మెత్తనై దుర్యోధనుని యందు దయ పొడముచున్నది. మానవుని మనస్సెప్పుడును ఒకేఒక రీతిగనే యనుసరించదుగదా ! దుర్యోధనునకును మాయందు బాల్యము నాటి భావములే నేటికిని దృఢమై యుండునను మాటెక్కడున్నది? మేమీ నాడు బలముకలిగియుండుటను తెలిసికొని మారియుండవచ్చును. "అన్యథా చింతితో హ్యర్థః పునర్భవతి సోన్యథా. అనిత్యమతయో లోకే నరాః పురుషసత్తమ'' కావున సంధి కుదరవచ్చునని నా యూహ. ఇంత వరకు మా యూహలన్నియు కలసినను ద్రౌపదియూహ ధర్మనందనునితో

ఏకీభవింపజాలదు. కారణమేమందువా ? కారణభేదముచే వారిద్దరికిని అభిప్రాయములు భేదించినవి.

'తస్మిం స్తస్మిన్నిమిత్తే హి మతం భవతి కేశవ'

వంశముయొక్క వినాశమునుమాత్రమే ధర్మజుని దృక్పథమునందుండగా వాడు సభాస్థలియందు పరాభవింపబడిన ద్రౌపది హృదయమున సంధికి తావెక్కడిది ? ద్రౌపది తప్పక యుద్ధమునే కోరుకొనును. ద్రౌపది యనుభవించిన బాధకును, ధర్మజుని బాధలకును చాల తేడాయున్నది. అదియే వారి భేదాభిప్రాయములకు కారణము. కావున మేమందరమును చెప్పిన అభిప్రాయములను నీ వంగీకరించుటయు, మామా అభిమతముం ననుసరించి మాకు నీవు చెప్పు సమాధానములను సంధినిగాని, యుద్ధమును గాని నిర్ణయింపజాలవు. నీవు నిర్ణయము గావించుటకు ఆధారము కౌరవులతో మాటాడునట్టి సమయమున దుర్యోధనుడుండు ఉనికియు, అతడు చెప్పు సమాధానములను ఆధారములై యుద్ధమా ? సంధియా అనుదానిని నిశ్చయించగలవు. కావున హే పురుషోత్తమా ! మా అభిప్రాయములపై ఆధారపడక కౌరవేంద్రుని సభయందు నీకు తోచిన విధమున కాదగిన కార్యమును నిర్ణయింపుమని సలహానిచ్చినాడు.

ఇది నకులు డిచ్చిన సందేశములోని ప్రధాన శ్లోకము.

'ప్రాప్తకాలం మనుష్యేణ క్షమం కార్యమరిందమ'
'యత్ప్రాప్తకాలం మన్యేథాః తత్కుర్యాః పురుషోత్తమ'

మానవు డెప్పుడైనను కాలానుసరణముగ కార్యమును సాధించుట యుక్తము గావున నీవు సభాస్థలియందు మాటాడునప్పటి సందర్భము ననుసరించి, యుద్ధమో, సంధియో నెరవేర్పుమని తన నిర్ణయమును చెప్పినాడు. ఆంధ్రమునగూడ ఈ భావమే యున్నది.

'నీవు పోయినప్పుడ యా కార్యంబు పక్కనగు'

తరువాతవాడు సహదేవుడును, సాత్యకియు. వారిద్దరిసందేశములును ప్రత్యేక ప్రత్యేకములై లేవు. సహదేవునే సాత్యకి యనుసరించి, అతనిని బలపరచినాడు. వారిద్దరితో సైనికులును సేనానాయకులునుగూడ ఏకీభవించి వా రిద్దరను బలపరిచినారు. ఈ ఘట్టమున పాండవులైదుగురిలో నలుగురొక్కటికాగా అయిదవవాడగు సహదేవుడొక్కడు ఒక్కడై శ్రీకృష్ణునకు సమాధాన మిచ్చినాడు.

'సహదేవుని మాట చాలఘాటైనది
యదేతత్కథితం రాజ్ఞా ధర్మ ఏష సనాతనః
యథా చ యుద్ధమేవస్యా త్తథా కురుకార్యమరిందమ'

సహదేవున కీఘట్టమున విమర్శింపదగిన ఘట్టమేమియులేదు. యుద్ధమునకు సిద్ధము కమ్మని దుర్యోధనునితో చెప్పుటే నాయభిమతమని స్పష్టపరచినాడు. అంతేకాదు.

ఆతని అభిప్రాయ మిదియట —

ధర్మజుడు అనుసరించినది సనాతన ధర్మమైనను నేను యుద్ధమునే కాంక్షించుచున్నాను. భీమార్జునులు ధర్మమునే యనుసరించదలచినను నేను ధర్మమును వదలి యుద్ధమును చేయదలచినాను. సంధికి ప్రసక్తియే లేదు. వింటిరా ? సహదేవుని భావమును ; ఇక్కడ మీకొక సందేహము కలుగవచ్చును.

సహదేవుడు క్రోధపూరితుడై ధర్మమును వదలెనేమో? - యని. అతడు ధర్మమును వదలుదునన్నమాటను మనము పరిశీలింపవలెను. ధర్మజుడు ఆశ్రయించిన వంశవిచ్ఛేదమునుగురించిన ధర్మమును వదలినాడు. అంతియే. అసలు ధర్మమును వదలి మాట్లాడలేదు. దుష్టులను శిక్షించుటయే ధర్మమను వంశ ధర్మము నాశ్రయించినాడు. శ్రీకృష్ణునితో మాట్లాడునప్పు డొకమాటను చెప్పినాడు.

ఏకీభవింపజాలదు. కారణమేమందువా ? కారణభేదముచే వారిద్దరికిని అభిప్రాయములు భేదించినవి.

'తస్మిం స్తస్మిన్నిమిత్తే హి మతం భవతి కేశవ'

వంశముయొక్క వినాశమునుమాత్రమే ధర్మజుని దృక్పథమునందుండగా నాడు సభాస్థలియందు పరాభవింపబడిన ద్రౌపది హృదయమున సంధికి తావెక్కడిది ? ద్రౌపది తప్పక యుద్ధమునే కోరుకొనును. ద్రౌపది యనుభవించిన బాధకును, ధర్మజుని బాధలకును చాల తేడాయున్నది. అదియే వారి భేదాభిప్రాయములకు కారణము. కావున మేమందరమును చెప్పిన అభిప్రాయములను నీ వంగీకరించుటయు, మామా అభిమతముల ననుసరించి మాకు నీవు చెప్పు సమాధానములను సంధినిగాని, యుద్ధమును గాని నిర్ణయింపజాలవు. నీవు నిర్ణయము గావించుటకు ఆధారము కౌరవులతో మాటాడునట్టి సమయమున దుర్యోధనుడుండు ఉనికియు, ఆతడు చెప్పు సమాధానములను ఆధారములై యుద్ధమా ? సంధియా అనుదానిని నిశ్చయించగలవు. కావున హే పురుషోత్తమా ! మా అభిప్రాయములపై ఆధారపడక కౌరవేంద్రుని సభయందు నీకు తోచిన విధమున కాదగిన కార్యమును నిర్ణయింపుమని సలహానిచ్చినాడు.

ఇది నకులు డిచ్చిన సందేశములోని ప్రధాన శ్లోకము.

'ప్రాప్తకాలం మనుష్యేణ క్షమం కార్యమరిందమ'

'యత్ప్రాప్తకాలం మన్యేథాః తత్కుర్యాః పురుషోత్తమ'

మానవు డెప్పుడైనను కాలానుసరణముగ కార్యమును సాధించుట యుక్తము గావున నీవు సభాస్థలియందు మాటాడునప్పటి సందర్భము ననుసరించి, యుద్ధమో, సంధియో నెరవేర్పుమని తన నిర్ణయమును చెప్పినాడు. ఆంధ్రమునగూడ ఈ భావమే యున్నది.

'నీవు వోయినప్పుడ యీ కార్యంబు సక్కనగు'

తరువాతవాడు సహదేవుడును, సాత్యకియు. వారిద్దరిసందేశములును ప్రత్యేక ప్రత్యేకములై లేవు. సహదేవునే సాత్యకి యనుసరించి, ఆతనిని బలపరచినాడు. వారిద్దరితో సైనికులును సేనానాయకులునుగూడ ఏకీభవించి వా రిద్దరను బలపరచినారు. ఈ ఘట్టమున పాండవులైదుగురిలో నలుగురొక్కటికాగా అయిదవవాడగు సహదేవుడొక్కడు ఒక్కడై శ్రీకృష్ణునకు సమాధాన మిచ్చినాడు.

'సహదేవుని మాట చాలఘాటైనది.
యదేతత్కథితం రాజ్ఞా ధర్మ ఏష సనాతనః
యథా చ యుద్ధమేవస్యాత్తథా కురుకార్యమరిందమ'

సహదేవున కీఘట్టమున విమర్శింపదగిన ఘట్టమేమియులేదు. యుద్ధమునకు సిద్ధము కమ్మని దుర్యోధనునితో చెప్పుటే నాయభిమతమని స్పష్టపరచినాడు. అంతేకాదు.

ఆతని అభిప్రాయ మిదియట —

ధర్మజుడు అనుసరించినది సనాతన ధర్మమైనను నేను యుద్ధమునే కాంక్షించుచున్నాను. భీమార్జునులు ధర్మమునే యనుసరించదలచినను నేను ధర్మమును వదలి యుద్ధమును చేయవలచినాను. సంధికి ప్రసక్తియే లేదు. ఏంటిరా ? సహదేవుని భావమును ; ఇక్కడ మీకొక సందేహము కలుగవచ్చును.

సహదేవుడు క్రోధపూరితుడై ధర్మమును వదలెనేమో? — యని. ఆతడు ధర్మమును వదలుదునన్నమాటను మనము పరిశీలింపవలెను. ధర్మజుడు ఆశ్రయించిన వంశవిచ్ఛేదమునుగురించిన ధర్మమును వదలినాడు. అంతియే. అసలు ధర్మమును వదలి మాట్లాడలేదు. దుష్టులను శిక్షించుటయే ధర్మమను వంశ ధర్మము నాశ్రయించినాడు. శ్రీకృష్ణునితో మాట్లాడునప్పు డొకమాటను చెప్పినాడు.

'కథం ను దృష్ట్వా పాంచాలీం తథా కృష్ణసభాగతాం
అవధేన ప్రశామ్యేత మమ మన్యుస్సుయోధనే'

శత్రువు కల్పించిన అంతటి యవమానమును సహించి, క్రోధమును చల్లార్చుట క్షత్రధర్మము కాదు. వధార్హమగు నా ఆతతాయిని వధించక నా క్రోధము చల్లారదు అని గట్టిగ చెప్పినాడు. పాంచాలిని సభ కీడ్చి వలువల వల్చుటకంటె దోషమేమున్నది? తరువాతవాడు సాత్యకి.

సాత్యకి వచన మిది —

'సత్యమాహ మహాబాహో సహదేవో మహామతిః'

సహదేవుడు సత్యమునే పలికెనని సహదేవుని బలపరచి, కృష్ణా! నాటి పాంచాలి యవమానమును తలచితివేని నీవును యుద్ధమునే నిర్ణయింతువనినాడు. అంతతో వీరలోక మంతయు తమ తమ వీరాలాపములతో సాత్యకిని ప్రశంసించుట జరిగినది. వారి ప్రశంసలే కాదు. యుద్ధోత్సాహమును రెట్టించు భేరీభాంకారాదికములు మిన్నుముట్ట మారుమ్రోగినవి.

తరువాతది ద్రౌపది సందేశము.

## ద్రౌపది సంభాషణము

ద్రౌపదీ ధర్మనందనుల సంభాషణ లీఘట్టమున చాల ముఖ్యములు. ధర్మనందనుని అభిప్రాయములోని సారాంశమేమియో ఒక్కమారు మరల మీముందుంచి తరువాత ద్రౌపది సంభాషణలోని విశేషములను చెప్పెదను.

ద్రౌపదీ ధర్మనందను లిద్దరును భగవంతునే శరణుపొందిరి. అయ్యును వారి లక్ష్యములు మాత్రము భిన్నములు.

ధర్మజుని లక్ష్యమిది —

ఏ కొంచెమైన అర్థము ప్రాప్తించుచో నేను యుద్ధమును మాని జీవయాత్రను గడుపుకొందునన్నది ధర్మజుని దృక్పథము. దానికయ్యే శ్రీకృష్ణుని శరణుపొందినాడు.

ద్రౌపది దృక్పథమునం దర్థములేదు. బ్రతుకు తెరువునకై ప్రాకులాడుట ఆమె లక్ష్యముకాదు. రాజధర్మమునకు ధర్మజుని అభిప్రాయము విరుద్ధమని ఆమె సిద్ధాంతము. అహింసా ప్రధానమగు జీవనమును గడపుచు మోక్షైకపురుషార్థమునే తన దృక్పథమునం దుంచుకొనదగినవాడు బ్రాహ్మణుడుగాని రాజుకాదు. రాజగువాడు ధర్మార్థ కామమోక్షములను చతుర్విధ పురుషార్థములలో ధర్మపురుషార్థ మునే ప్రధానముగా గావించుకొనవలెను.

అర్థకామము లాతని దృక్పథమునందు ప్రధానములై ఉండ కూడదు. కావుననే శ్రీరామచంద్రు డొకమాటను చెప్పినాడు.

'స్నేహం దయాం చ సౌఖ్యం చ యది వా జానకీమపి
ఆరాధనాయ లోకస్య ముంచతో నాస్తి మే వ్యథా'

రాజు దుష్టశిక్షణ గావించవలసి వచ్చినప్పుడు రాజ్యలోభమునుగాని కామసుఖమునుగాని మనస్సునం దుంచుకొనరాదు. కావున సీతను, లక్ష్మణుని, రాజ్యసౌఖ్యమునుకూడ వదలి లోకారాధన చేతుననినాడు.

రాముడు సీతను నిండుచూలాలుగ నున్నప్పుడు చేసిన త్యాగము ఈ సూత్రముపైననే ఆధారపడినది.

ఇక ద్రౌపది సంభాషణను పరిశీలింపుడు. ద్రౌపది యుద్ధమునే నిర్ణయించినది. ఆమె దృక్పథమున రాజగువాడు ఆచరించవలసిన ధర్మమే యున్నదిగాని అర్థము ననుసరించిన ధర్మము నామె యనుసరించలేదు.

రాముని సిద్ధాంతమును మరొక్కమాటతో కూడ మీకు చెప్పవలసి యున్నది.

రాముడు కైకతో ఇట్లు చెప్పినాడు —

'నాహమర్థపరోదేవి లోకమావస్తుముత్సహే
విద్ధి మాం ఋషిభిస్తుల్యం కేవలం ధర్మమాస్థితం'

తల్లీ ! నేను అర్థమునకై ప్రాకులాడువాడను కాను ; ధర్మమే నా దృష్టియందున్నది- అనినాడు. ధర్మైక శరణ్యులగు ఋషులతో తనను పోల్చినాడు. అనగా ఋషులు మోక్షధర్మమునే అనుసరించినట్లు నేను రాజధర్మమునే అనుసరింతునని అర్థము. కావున రాక్షస సంహారమునకై అడవికి వెళ్ళినాడుగాని కౌసల్య ఎంత చెప్పినను అతడు రాజ్యమునం దుండలేదు.

ప్రకృత కథాంశమునకు వత్తము.

ప్రకృత కథాంశమున ద్రౌపది సంభాషణము రెండువిధములుగ నడచినది.

కొంతదూరము తాను కూరుచున్నచోటునుంచే మాటాడినది. తరువాత శ్రీకృష్ణుని సమీపించి వీడిన క్రొమ్ముడిలోని ఒక భాగమును ఎడమచేత బట్టుకొని శ్రీకృష్ణుని ముందటనుంచి శోకము పొంగిపొరలగా కన్నీటిధారల కార్చి యుద్ధోద్యమమును పురిగొల్పినది.

ఈ ఘట్టమున ద్రౌపదిపాత్ర వీరరసము నెంత యొలికించినదో కరుణరసమునుగూడ అంత ప్రవహింపజేసినది. భక్తిరసమును అట్లే విస్తరింపజేసినది. ఆమె దీనాలాపములు భగవానుని కరగించినవి. ఆమె వీరాలాపములు రణరంగమును నిర్మింపజేసినవి. శ్రీకృష్ణ దేసమయము నందును విస్మరింపరాని దుర్యోధనాదుల యపరాధ ఘట్టములను గురుతు చేసి, వ్రేలుబెట్టి చూపినది శ్రీకృష్ణునకు.

భారతీయ విజ్ఞానమును ప్రదర్శించుటలో మొదటిదై వెలసిన రామాయణ మహాకావ్యము నందలి కథానాయికయగు సీతాకాంత ఎట్టిదో భారతమున ద్రౌపదియు అట్టిదే.

రామాయణమున సీత కథానాయికయై దుర్భర దుఃఖముల ననుభవించి రావణునిచే గలుగు లోకకంటకత్వమును ఎట్లు తొలగించినదో ద్రౌపదియు ద్వాపరాంతమున స్వార్థోన్మీలితసౌహార్దులగు దుష్ట రాజ మండలమును హతమార్చి లోకకళ్యాణమును కల్పించినది.

సీతా మహాసాధ్వియొక్క శోకాగ్నియే లోకవ్యాప్తమగు రావణుని దౌష్ట్యమును దహింపగా, నేడు ద్రౌపది శోకాగ్ని కౌరవసంతతిలోని దౌష్ట్యమును దహింపవలెను. కావుననే కౌరవులతోడి సంధికై జరిగిన ధర్మజాదుల సంభాషణయంతయు ద్రౌపది శోకాగ్నిని రగుల్కొల్పగా ఆ శోకాగ్నిచే తప్తమగు హృదయముతోడనే శ్రీకృష్ణునకు తన అభిప్రాయమును తెలిపినది. వ్యాసభారతిని తిలకింపుడు :

'రాజ్ఞస్తు వచనం శ్రుత్వా ధర్మార్థ సహితం హితం
కృష్ణా దాశార్హ మాసీనం అబ్రవీచ్ఛోక కర్శితా'

ధర్మజుని వాక్యసరణియం దెక్కడను యుద్ధమునకు ప్రసక్తి లేదు. ధర్మార్థములు మాత్రము అతని వాఙ్మయమున రూపొందినవి. అనగా రాజ్యములోని కొంతభాగమైనను వచ్చుచో యుద్ధ మెందుకు ? సుఖ భోజనమున కాలము గడపవచ్చును. అని తేల్చిచెప్పిన వాక్యసరణి ద్రౌపది హృదయమును కాల్చివైచినది. కారణమేమి ? ధర్మజుని సిద్ధాంతము ప్రకారముగ తానొక సాధారణ రాజపత్ని కావచ్చును. పట్టమహిషియగుటకు స్థానము లేదు. అది యట్లుండ కౌరవసభయందు తనను కాల్చివైచిన పరాభవాగ్నిలోని రవ్వయైనను యుధిష్ఠిరుని తాకి ఆతనికి వేడి నివ్వలేదని ద్రౌపదికి స్పష్టమైనది. భీముని క్రోధాగ్ని సంపూర్ణముగ చల్లారినది. అర్జునుని పరాక్రమముగూడ ధర్మజునే

యనుసరించినది. నకులుడును వారితో ఏకీభవించినాడు. ఆమె దృక్పథమున సహదేవుడును సాత్యకియే తన పరాభవమును స్మరించిన వ్యక్తులు.

కావుననే ఆమె శ్రీకృష్ణునితో విన్నవించు విన్నపము సాత్యకి సహదేవుల వాక్యములను పూజించుటతో ప్రారంభమైనవి. వారి వీర రసోచిత వాగ్వైఖరిని ఆమె గౌరవించినది. తన సిద్ధాంతము ధర్మజుని సిద్ధాంతముతో ఏకీభవించక దక్షిణోత్తరధృవములవలె వేరైనవి. ఈ రెండు సిద్ధాంతములలో శ్రీకృష్ణుదేసిద్ధాంతము ననుసరించును ? అనిన శ్రీకృష్ణుని నిర్ణయ మామె కక్కరలేదు. తన హృదయమును శ్రీకృష్ణుని ముందుంచి తన పరితాపమును తీర్పుమని శరణు వేడుటయే ద్రౌపదిలక్ష్యము. అంతే కాదు. భీమార్జునుల మేల్కొలుపవలెను. క్షత్రియ జాతియందావిర్భవించిన ఇల్లాండ్రెవ్వరును భరింపరాని యవమానమును భరించుటతో తన యిల్లాలికి పదమూడుసంవత్సరములు గడవగా నేడా పరాభవాగ్ని జ్వాలల యందు పూర్ణాహుతిగావింపదగిన దుర్యోధనాదుల దుర్భర దుష్కృత్యముల సహించి, వంశవిచ్ఛేదమను భయమునకు గురియై నిజవంశోచిత వీరవృత్తమును స్మరింపని ధర్మజునితో తమ్ములు ముగ్గురును ఏకీభవించుటయు, శ్రీకృష్ణుడు శాంతిమూతయై హస్తినాపురమునకు వెడలెదననుటయు నను ఘట్టము ద్రౌపదికి శోకాశ్రువుల జలజలరాల్పగా భరింపరాని ఆవేదనతో ఆమె సంభాషణ ప్రారంభమైనది.

సంధి పనికిరాదు. యుద్ధమే చేయవలెను. అన్నది ఆమె సిద్ధాంతము. సంధి నెందుకు చేయరాదు ? యుద్ధమునే ఎందుకు చేయవలెను ? అను ప్రశ్నలకు సమాధానముగ ఆమె సంభాషణ ఇట్లు నడచినది.

'అప్రథానేన రాజ్యస్య యది కృష్ణ సుయోధనః
సంధిమిచ్ఛేన్న కర్తవ్యం తత్ర గత్వా కథంచన'

ఆమె మొదటిమాట ఏమనగా సుయోధనుడు రాజ్యమివ్వకుండ సంధిని కోరుచో ఎప్పుడును అట్టి సంధిని ఒప్పుకొనవద్దన్నది.

సంధియన రాజ్యమును ఇవ్వవలెనుగదా ? రాజ్య మివ్వకుండ సుయోధనుడు సంధినెట్లు కోరును ? ఇదియొక చిత్రమగు మాట. సుయోధనుడు రాజ్యమును పంచి యివ్వకనే సంధి కోరవచ్చును.

ధర్మజుడింతకు పూర్వము శ్రీకృష్ణునితో సంధి ఒడంబడికను గూర్చి ఒకవిధమగు సావకాశము నిచ్చినాడు.

(1) అయిదుఊళ్ళు విచ్చినను సంధికి ఒప్పెదమని ;

(2) చివరకు ఆతడు మరల జూదమునకువచ్చి గెల్చుకొన్నచో రాజ్యము తీసుకొండని చెప్పినను సరియే మేము సిద్ధమని చెప్పినాడు. రాజ్యమివ్వకుండ ఈ రెండుభాగములలో ఏ భాగమునైనను సుయోధను డనుసరింపవచ్చును. అయిదూళ్ళనిచ్చి యుద్ధమును మాన్పవచ్చును. లేదా మరల శకుని ఆధారముగాగొని జూదము నకు పిలువవచ్చును. అట్టి ఘట్టమున సంధికి ఒప్పుకొనవద్దన్నది.

ఇక్కడ రాజ్యమన ద్రౌపది హృదయమేమి ? అర్ధరాజ్యమా ? సంపూర్ణమగు రాజ్యమా ? అని ప్రశ్న రావచ్చును.

ద్రౌపది హృదయమిది —

ధర్మజాదులు స్వార్జితముగ సంపాదించిన రాజ్యమున్నది. పిత్రార్జితమగు రాజ్యమున్నది. పిత్రార్జితమగు రాజ్యమున దుర్యోధనునకు హక్కులేదు. వీరి స్వార్జితమగు రాజ్యము కపటద్యూతమునందు అపహరింప బడినది. ఈ రెండు రాజ్యములను యివ్వకుండ అయిదూళ్ళనిచ్చి, సుయోధనుడు సంధి యనవచ్చును. ద్రౌపది మాటాడిన రాజ్యమను మాటకు ఈ రెండు రాజ్యములనని అర్థము.

ద్రౌపది మాటాడిన మాటయందు మరియొక స్వారస్యమున్నది. సంధిని వద్దనుటకు 'నకర్తవ్యం' అన్నది. కర్తవ్యత్ ప్రత్యయము విధ్యర్థకము. విధ్యర్థకమగు కర్తవ్యత్ ప్రత్యయముచే సంధికార్యమున రాబోవు అనర్థములన్నిటిని సూచించి సంధిని నివారించినది.

సామదానము లనునవి వ్యర్థములా? కాదు ఆ కార్యక్రమ మిదివరకే జరిగిపోయినది. కావుననే ఆ ప్రసక్తినిగూడ తెచ్చియే సమాధానమిచ్చినది.

ఇది దుర్యోధనునిపై దండెత్తదగిన కాలమే నన్నది. సామమను నది బాల్యమునుండియు చూపుచున్న ఉపాయమేగనుక దానికి కాలము తీరినది. దానము విషయమునకూడ సంజయునితో అయిదూళ్ళు ఇమ్మని చెప్పుట జరిగినది. ఇక చూపదగినది దండమేగాని వేరొకటి లేదు. ఈ మాటనే ఇట్లు చెప్పినది.

'సామ్నా దానేన వా కృష్ణ యే న శామ్యంతి శత్రవః
యో క్తవ్య స్తేషు దండః న్యాజ్జీవితం పరిరక్షతా'

స్వధర్మముచే జీవింపదగురాజు సామదానములచే లొంగని శత్రువుపైన దండమే ప్రయోగించి, సామ్రాజ్యలక్ష్మిని సంపాదించి జీవింపవలెననునదే ధర్మమన్నది.

ఇదియు విధిపూర్వకమగు సందేశమే. ఇక్కడకూడ కర్తవ్యత్ ప్రత్యయమునే వాడినది. ప్రస్తుతమగు ద్రౌపది సందేశమంతయు విధ్యర్థక బోధకమయ్యే నడచినది.

కాని ఆ దండ మెట్లుండవలెను? దానికి కాల మెప్పుడు? దేశ కాలముల గుర్తించక దండమును విధింపరాదుగదా? అను ప్రశ్నలకు కూడ చక్కని సమాధానము నిచ్చినది.

దుర్యోధనాదులు ఆతతాయిలు. (అనగా గూండాలు. విష ప్రయోగములు, గృహదహనములు మొదలగువాటిచే శత్రువులను పీడించువారికి ఆతతాయులని పేరు.)

దుర్యోధనాదులు ఆతతాయిలు గావున వారియందు మరణదండమునే విధించవలెను. అట్టి మరణదండనకు కాలయాపన చేయరాదు. అతిశీఘ్రముగనే విధించవలెను.

'తస్మాత్తేషు మహాదండః క్షేప్తవ్యః క్షిప్రమచ్యుత హే అచ్యుతః అని సంబోధించినది. ఏ మాత్రమును నీ బుద్ధిని మార్చరాదని భావము.

ఇది ఇట్లుండ దుర్యోధమునకు పదకొండు అక్షౌహిణులుండగా మన బలము ఏడు అక్షౌహిణులు గదా ! యుద్ధమునకు బలము సరిపోవునా ? అను ప్రశ్నను దృష్టియందుంచుకొని ఇట్లు చెప్పినది.

నీవును, పాండవులును, సృంజయులును కూడగా దుర్యోధనుని బలమెంత ? కౌరవబలము తప్పక ఓటువడును.

'త్వయాచైవ మహాబాహో పాండవైస్సహ సృంజయైః'

అంతేకాక పాండవులచేత యుద్ధముచేయించుటే నీకు కీర్తికరముగాని సంధినికూర్చుట నీకు కీర్తినివ్వదని స్పష్టపరచినది. అనగా నీ అవతారము యుద్ధమునకేనని సూచించినది.

ఈ ఘట్టమున ద్రౌపది మరియొక ముఖ్యమగు విషయమును చెప్పినది. క్షత్రియుడెప్పుడును లోభత్వమను గుణమును వృద్ధినొందనివ్వక లోభులగు క్షత్రియులనుగాని, క్షత్రియుడు కానివానినిగాని యుద్ధమున జయించి, ఆ ద్రవ్యముచే జీవించుట స్వధర్మయుతమగు జీవనమగునుగాని, యాచ్ఞాదైన్యమునుపొంది జీవించుట క్షత్రియధర్మము గాదని నిర్ణయించినది.

'క్షత్రియేణ హి హంతవ్యః క్షత్రియో లోభమాస్థితః
అక్షత్రియో వా దాశార్హ స్వధర్మమనుతిష్ఠతా'

దుర్యోధనుడు లోభి. వానిని హతమార్చుట రాజధర్మము. దుర్మార్గుడగు

వానిని శిక్షించక పోవుటవలన పాపము వచ్చునుగాని వానిని చంపుటవలన పాపము రాదు. కృష్ణా ! ధర్మకోవిదులగువారి సూక్తి యట్లున్నది—

'యథాఽవధ్యే వధ్యమానే భవేద్దోషో జనార్దన

స వధ్యస్యాప్యవధేదృష్ట ఇతి ధర్మవిదో విదుః'

వధార్హులు కానివారిని వధించుటచే వచ్చు దోషము వధార్హులగువారిని వధించకపోవుటచే వచ్చును. ఇది ధర్మవిదుల ఆగమసూక్తి యని చెప్పి, ఇట్టి దోషము నిన్ను అంటకుండ చేసికొమ్మని యుద్ధావసరమును దృఢపరచినది.

'యథా త్వాం న స్పృశేదేష దోషః కృష్ణ తథా కురు'

ఇంతవరకు ద్రౌపది ఎంత విదుషీమణియై మాట్లాడినదో మీరు వింటిరిగదా ! తరువాతి ఘట్టము – ద్రౌపది తాను కూర్చుని సంభాషించిన చోటు నుండి లేచి శ్రీకృష్ణుని పాదపద్మములకడకేగి శరణాగతురాలగుట. కాని ఇదియొక విచిత్రమగు శరణాగతి. తాను దోసిలియొగ్గి భగవంతుని ప్రార్థించుచు కాళ్ళపైనబడి మ్రొక్కుటమాత్రమే కాదు. సంధికార్యమునకై కౌరవసభ కేగునట్టి పుండరీకాక్షుడు దేనిని తలచి కౌరవులతో మాటాడవలెనో దానిని శ్రీకృష్ణపాదారవిందములకడనుంచి నీ హృదయమున ధీవినుంచుకొని మాటాడమని చెప్పి, తన దీర్ఘకేశపాశమును శ్రీకృష్ణ పాదారవిందములకడనుంచి ఆతని చూపుల దెసపై ప్రసరింపజేయుట ద్రౌపది శరణాగతిలోని వైలక్షణ్యము.

నాడు కౌరవసభయందు ద్రౌపదిహృదయమునకు హారమున చెలరేగి నేటికిని చల్లారని పరాభవపరితాపాగ్నిజ్వాలలను చల్లార్చి తనకు పునశ్శాంతిని కల్పించువాడు భగవంతుడేగాని భర్తలుగారన్నది ఆమెకు నాడును నేడును నిశ్చయమైనది. కావున తన కేశపాశమును శ్రీకృష్ణునకు చూపి, శరణాగతురాలైనది.

ప్రకృత కథాంశమునకు వత్తము.

యుద్ధముచేయుటే ధర్మమని శ్రీకృష్ణునితో శాస్త్రాధారముగ మాటాడిన సంభాషణ ముగిసినది. తరువాతది ఆమె ఆర్తనినాదము. దానికొక ప్రత్యేక ఘట్టముగ వ్యాసులు ప్రారంభించినారు.

## ద్రౌపది శరణాగతి

శరణాగతుడగుటకు ముందుగ జీవుడు భగవంతునియందు దృఢమగు విశ్వాసముకలవాడు కావలెను. కావున వ్యాసులవారు

'పునరుక్తం చ వక్ష్యామి విశ్రంభేణ జనార్దన'

నీయందలి విశ్వాసముచేత మరల చెప్పనారంభించుచుంటినని ద్రౌపది మాట్లాడినట్లు వర్ణించినారు.

జీవుడు శరణాగతుడు కావలెనన్న తనకు కలిగిన బాధలచేత హృదయము ద్రవించగా తనకష్టమేమియో భగవంతునకు విన్నవించుకొనుటతో శరణాగతి ప్రారంభమగును. అడుగంటియున్న దురదృష్టవంతుల్లో నాకంటె దురదృష్టవంతుడు లేడను ఆర్తుని ఆర్తనినాదమే శరణాగతికి ప్రారంభవాక్యము. జగద్గురువులగు శంకరు లిట్లు పలికినారు.

'మదన్యః కోదీనః తవ కృపణ రక్షాతి నిపుణః'

నాకంటె దీనుడును నీకంటె నిపుణుడును రక్షకుడును లేడని యెలుగెత్తి పలికినారు.

ద్రౌపదియు తన దైన్యము నిట్లు పలికినది —

'కా ను సీమంతినీ మా దృక్పృథివ్యామస్తి కేశవ'

కృష్ణా ! నావంటి యిల్లాలు భూఖండమునం దెవ్వతెయున్నది ? అన్నది. అనగా నావలె పరాభవముల ననుభవించుచు ఇట్లు బ్రతుకు యిల్లాలు మరియొకతె అయినచో ఈనాటికి ప్రాణముల విడిచివేయుండునను భావమును ప్రకటించినది. ఇట్టి నాయందు నీవెంత దయచూపవలసియుందువో యూహించుకొమ్మన్నట్లు మాటాడినది. నేనెట్లు పుట్టితినో ; ఎట్లు పెరిగితినో ; ఎవ్వరికి స్నేహితురాలనై యుంటినో ; ఎట్టి చక్రవర్తుల వంశమున

కేతెంచి, ఎంత బలశాలుల భర్తల గావించుకుంటినో; ఎట్టి బిడ్డలగని కూడ జ్ఞాతులవలన జరగరాని పరాభవము నొందితినో విచారించుకొన్నచో నేను గనుక ఈ శరీరమును ధరించియుంటినిగాని వేరొక్క నారీమణి బ్రతికి యుండునా ? అని తన విలక్షణ జీవితవర్ణనమును గావించుచు శరణు పొందినది. ద్రౌపది తన జన్మవైభము మొదలు తాను పొందిన పరాభవము వరకును వర్ణించి శ్రీకృష్ణుని శరణుపొందిన వర్ణనాఘట్టము ఆంధ్ర సంస్కృతభారతములందెట్లు నడచినవో వినుడు.

ద్రౌపది తన యుదంతమును శ్రీకృష్ణభగవానునితో చెప్పి కన్నీరు కార్చుచు శరణాగతినొందుటను వర్ణించిన తిక్కనగారి పద్య రత్నము లివ్వి.

చ. 'వరమున బుట్టితిన్ భరతవంశము జొచ్చితి నందు బాండుభూ
పరునకు గోడ లైతి జనవంద్యులబొందితి నీతివిక్రమ
స్థిరు లగుపుత్రులం బడసితిన్ సహజన్ములప్రాపు గాంచితిన్
సరసిజనాభ యిన్నిట బ్రశస్తికి నెక్కినదాన నెంతయున్.'

అట్లుగాక –

ఉ. నీవు సుభద్రకంటె గడు నెయ్యము గారవముం దలిర్ప సం
భావన సేయు దిట్టినను బంకజనాభ యొకండు రాజసూ
యావభృథంబునందుశుచియై పెనుపొందిన వేణిపట్టి యీ
యేవురు జూడగా సభకు నీడ్చె గులాంగన నిట్లొనర్తురే.

'ఆసభ కేకవస్త్ర యగునట్టిననుం గొనివచ్చి నొంచు దు
శ్శాసను జూచుచుం బతులసంభ్రమలై తగుచేష్ట లేక నా
యాసలు మాని చిత్రములయాకృతి నున్న యెడన్ ముకుంద వి
శ్వాసముతోడ నిన్ గొలువవచ్చె మనం బడియున్ దలంపవే

హే సరసిజనాభా ! అని సంబోధించినది శ్రీకృష్ణుని. ఆ పదముతో

సృష్ట్యాది యందలి నారాయణావతారమును వర్ణించి, తన జన్మను మొదలు పెట్టినది.

తపః ప్రభావ సంపన్నత్వముచే నేను పుట్టితి నన్నది. ఆ పుట్టుక కూడ మాతృగర్భమునుండిగాక అగ్నికుండమునందు వ్రేల్చిన ఆహుతుల యొక్క ఫలముగా దివ్యదేహమును ధరించితి నన్నది. ద్రోణాచార్యుని పరిమార్చుటకై పుట్టిన ధృష్టద్యుమ్నుని కలుపుకొని పుట్టినచోటును చెప్పికొన్నది. ఇక వచ్చినచోటా ?

భరతవంశమునం దుత్పన్నుమైన పాండురాజునకు కోడలనైతి నన్నది. జనమాన్యులగు పాండవుల భర్తలనుగా గ్రహించి వారి యైదుగురివలనను అయిదుగురు వీరశిఖామణులగు బిడ్డల గంటినన్నది. ఈ సంపదకంటెను ఎంతయో చెప్పుకొనదగు సంపద యొకటున్నదని నీ తోబుట్టువగు సుభద్రకంటెగూడ నన్నెక్కుడు గారవింతువుగదా ! అని, అట్టి నన్ను ఒకానొక దుర్మార్గుడు రాజసూయ మహాధ్వరమున మంత్ర పూతములగు జలముచే తడుపబడి మహాపవిత్రతనొందిన ఈ కేశపాశ మును బట్టుకొని భర్తలైదుగురుదును చూడగా ఏకవస్త్రనగు నన్ను సభకు ఈడ్చుకొనిరాగా నా భర్తలు గోడమీది బొమ్మలవలెనుండ నిన్ను 'ముకుందా! కావ'మని వేడుకొంటివి గదా! ఆ పిలుపును తలపుమన్నది. ఇది ద్రౌపది ఆర్తవినాదము

ఇదే ఘట్టమున వ్యాసవాణిలోని విశేషములను వివిపింతును. 'వరమున బుట్టితిన్' అను పద్యమున 'భరతవంశము జొచ్చితి' నన్నది. ఈ ఘట్టమున వ్యాసులు, 'అజమీఢకులం ప్రాప్తా' అని భరతుని పేర్కొనక అజమీఢుడనువానిని వర్ణించినట్లు వ్రాసినారు. పై పద్యములకు శ్లోకవరుస ఇది.

'సుతా ద్రుపదరాజస్య వేదిమధ్యాత్సముత్థితా
ధృష్టద్యుమ్నస్య భగినీ తవ కృష్ణ ప్రియా సఖీ
అజమీఢకులం ప్రాప్తా స్నుషాపాండోర్మహాత్మనః'

భరతవంశమునకు బదులుగా ఆజమీఢుని వ్యాసు లెందుకు వాడిరి? ఈ అజమీఢు డెవ్వరు? అనునది మనకిక్కడ గ్రహించదగు విశేషము.

## అజమీఢుని ఔచిత్యము

దుష్యంతుని పుత్రుడగు భరతునితో భరతవంశమను మాట వచ్చినను అతని తరువాత కొన్నితరములలో అజమీఢుడను రాజు పరిపాలనకు రాగా ఆ అజమీఢుని ఒకకాలమున పాంచాలురు పరాభవించి భరతవంశమునందు స్థిరమైయున్న సామ్రాజ్యమును వారి స్వాధీనము గావించుకొనిరి.

భరతవంశీయులందరును సింధునదీప్రాంతారణ్యముల దాగి జీవితముల రక్షించుకొనిరి. ఆ ప్రాంతమునందున్న కొండగుహలు వారికి నివాసములు కాగా వేయిసంవత్సరములు గడచినవి. తరువాత వశిష్ఠమునీంద్రుడు వారికి పురోహితుడై మరల అజమీఢునకు రాజ్యము నప్పగించినాడు. ఆ తరువాత అజామీఢుడు అనేక యుద్ధములుచేయుట జరిగినది.

నాడు అజమీఢుని రాష్ట్రమును పాంచాలురు ఎట్లు కొల్లగొట్టి వారి రాజ్యమును స్వాధీనము గావించుకొనిరో నేడును పాండవులరాజ్యము హక్కుభుక్తములకర్తలుగాని ధార్తరాష్ట్రుల చేతికి చిక్కినది. కావున అజమీఢునివలెనే పాండవులకును ఆ రాజ్యమును చేజిక్కించుకొనగల కాలమిదీ యని అజమీఢుని పేరును ద్రౌపది చెప్పుటయు వ్యాసులు ఆ పదమును వాడుటయు జరిగినది. అజమీఢుని తరువాతవరుసలోనివాడు పాండురాజే గాని ధృతరాష్ట్రుడు గాడు. కావున పాండురాజునకు తాను కోడలగుటను గర్వోక్తిగ చెప్పుకొని నాకే పట్టమహిషికుదగిన హక్కు కలదని నిర్ణయించుకొన్నది. ఇది వ్యాసభారతిలోని విశేషము.

మరొక్క విశేషము—

పాండవులకు నేను పట్టమహిషినని చెప్పుచు పాండవులను ఇంద్ర సమానులని వర్ణించినది.

'మహిషీ పాండుపుత్రాణాం పంచేంద్రసమవర్చసాం'

పాండవుల పూర్వవృత్తమును స్మరింపజేసినది. పాండవులైదుగురును అయిదుగురు ఇంద్రులని పంచేంద్రోపాఖ్యానమును స్మరింపజేసి, తాను స్వర్గలక్ష్మియగుటను విన్నవించుకొన్నది. తరువాత తన అయిదుగురు బిడ్డల వర్ణించుచు అభిమన్యు డెట్టివాడో నాబిడ్డలును అట్టివారేనని పలికినది. అదెట్లు కుదురును ? అనుచో 'ధర్మతః' అని వాదినది.

'అభిమన్యుర్యథా కృష్ణ తథా తే తవ ధర్మతః'

అనగా సంబంధముచే నన్నది. ఇంతవరకు ద్రౌపది తన అర్హతల నన్నిటిని గుర్తుగుచ్చి చెప్పినది.

వీరపుత్రిక నన్నది. వీరసోదరి నన్నది. వీరపత్ని నన్నది. వీరమాత నన్నది. అట్టి నేను వెంట్రుకలబట్టి సభ కీడ్వబడితి నన్నది.

'సా౽హం కేశగ్రహం ప్రాప్తా పరిక్లిష్టా సభాం గతా'

జుట్టుపట్టి ఈడ్చుటగాదు ; నన్ను దాసీ అని పిలవగా, నా పుత్రులు దాసీ పుత్రులు కాగా ఈ యవమాన మెవరికి ? సుభద్ర దాసీయగుట నీవు సహింతువా ? అట్టిదాననే నేను. అంతకంటెను ఎక్కువదానను 'ధర్మతః' అన్నది. అంతేకాదు ;

'పశ్యతాం పాండుపుత్రాణాం త్వయి జీవతి కేశవ'

పాండవులు చూచుచుండగా, నీవు జీవించియుండగా—నన్నది. అనగా ధర్మ సంస్థాసంస్థాపనకై అవతరించిన నీవుండగా, ధర్మపరిపాలనకై స్వర్గము నుండి వచ్చిన పాండవులు చూచుచుండగా, కులస్త్రీని దుండగులు జుట్టు పట్టి యీడ్చినారు. వారిని సహించుటయా ? అని దుష్టక్షత్రియ సంహారము గావింప శరణాగతి నొందినది.

'త్రాయస్వ పుండరీకాక్ష సభర్తృజ్ఞాతిబాంధవాన్'

ఈ శ్లోకరత్నమునందలి సంబోధనను గమనింపుడు. హే పుండరీకాక్ష! అని పిలిచినది.

తామరరేకులబోలిన ఆ బ్రహ్మణ్యుని కన్నులలోని సోయగమును వర్ణించుటే ఇక్కడ ద్రౌపది హృదయముకాదు. కరుణారసపూరితమగు నీ విశాలదృష్టిని ప్రసరించి రక్షింపుమని ప్రార్థించినది. ఇక్కడ రక్షించునదెవరిని? పాండవులను, జ్ఞాతిబాంధవులనుకూడ అనగా వారి రక్షణమే తన రక్షణమని భావము. వారిచే యుద్ధమునుచేయించి, దుర్యోధనాదుల వధింపజేసి తనను పట్టభద్రురాలను గావింపుమని పుండరీకాక్ష శబ్దమును వాడినది. దీనికి అంతరార్థము మరియొకటున్నది.

సాధుపరిత్రాణ మెట్లు సాధువులయం దనుగ్రహమో దుష్టశిక్షణము గూడ దుష్టుల ననుగ్రహించుటేగాని వేరుకాదు. కావున భగవంతుడెప్పుడును పుండరీకాక్షుడే.

ద్రౌపదీ! నీ భర్తలు బలవంతులుగదా? అర్జునుని గాండీవము, భీముని గదాదండమును నిన్ను రక్షించగలవు అందువేమో కృష్ణా! అట్లుకాదని వారి బలప్రభావమంతయు నీపైననే - నీ అనుగ్రహదృష్టిపైననే ఆధారపడినదని గాండీవి ధనుర్బాణములను, భీముని గదాదండమునుగూడ ధిక్కరించి పలికినది.

'ధిక్ పార్థస్య ధనుష్మత్తాం భీమసేనస్య ధిగ్బలం
యత్ర దుర్యోధనః కృష్ణ ముహూర్తమపి జీవతి.'

హే కృష్ణా! ఇక్కడనుండి దుర్యోధను డొక్కముహూర్తమాత్రము బ్రతికియున్నను పార్థుని ధనుర్ధారిత్వమును భీముని బలశాలిత్వములను వ్యర్థము లన్నది. ఇది భర్తల ధిక్కరించుట కాదు.

భీమార్జునుల బలపరాక్రమములు సార్థకములు గావలెనన్న ఒక్క ముహూర్తకాలముగూడ దుర్యోధనుని నాసాపుటముల ప్రాణవాయువు

చలింపరాదు. ఆ దుష్ట భూభుజుని అహంకార దుర్విలసిత తనువునందు చలించు ప్రాణవాయువు మహావాయువున కలుపుటకే పాండవు లేతెంచిరి గాని జ్ఞాతులవద్ద యాచించి తెచ్చుకొన్న అన్నమును భుజించి జీవయాత్ర గడుపుటకై రాలేదని భర్తలను మేల్కొల్పినది. అంతియే. నీకు నా యందు దయ కలుగుచో వారి బలములు సార్థకములై దుర్యోధనాదుల వధింపగలరని నిర్ణయించి, చివరిమాటగా శ్రీకృష్ణున కిట్లు చెప్పినది—

'ధార్తరాష్ట్రేషు పై కోపః సర్వః కృష్ణ విధీయతాం'

కృష్ణా! నీకోపమునంతను ధార్తరాష్ట్రులపై వినియోగింపమన్నది. అనగా వారిని వధింపమన్నది. 'విధీయతాం' అనుమాటకు అర్థమిది. (విధీయతాం విశిష్టః క్రియతాం వధేన అపనీయతాం) ద్రౌపది శరణాగతి ఇంతవరకొక ఘట్టము. ఈ మాటను చెప్పిన తరువాత ఆమె చేసిన చేత మరియొక ఘట్టము.

నాడు సభయం దేకవస్త్రయై మానసిక శరణాగతినొందగా నేడు భగవానుని కన్నులారగాంచి వాగ్రూపమున విన్నవించుకొన్నది. మూడవది కాయికము.

ఇంతవరకెక్కడ కూరుచుండి భగవానునితో మాటాడినదో అచ్చటనుండి భగవానునిదగ్గర కేతెంచినది. దూరమునుండి చెప్పుకొన్న విజ్ఞాపన మామెకు తృప్తినివ్వలేదు. కారణమేమి? శ్రీకృష్ణుడు కౌరవ సభ కేగగా అక్కడ ఈ మాటలను మరువవచ్చును. కావున ఎట్టి ఘట్టము నందును మరువరాని ఒక దృశ్యమును అతని కన్నులఎదుట నుంచవలెను. ఇంతకుముందు దుశ్శాసనుడు తన కేశపాశమును పట్టుకొనుటయను దవ పరాభవమును నోటిమాటతో చెప్పుకొన్నది అది చాలదు. పరాభవము గావింపవచ్చిన దుశ్శాసనునిచేత జిక్కి అపవిత్రత నొందిన ఆ కేశపాశ మును శ్రీకృష్ణుని కరుణాకటాక్షవీక్షణములకు పాత్రముగావించి, ఆ కేశ

పాశమును పవిత్రము గావించుకొనదలచినది. అంతేకాదు ; తానిప్పుడు శ్రీకృష్ణుని కన్నులఎదుటనుంచు దృశ్యము రణరంగమున తాను చూడ దలచిన దృశ్యమునకు కారణము కావలెను. ఆమె చూడదలచిన దృశ్యమే మందురా ?

కురుక్షేత్రమున రణరంగము నిర్మింపబడవలెను. ఆ రణరంగ మున దుర్యోధన దుశ్శాసనుల మృతకళేబరముల నామె చూడవలెను. అందు...దుశ్శాసనుని భుజస్కంధము తెగి ముక్కలు ముక్కలై ధూళిధూసరిత మాంసఖండములు కాగా దుర్యోధనుని మృతకళేబరము తొడలు విరిగిపడవలెను. అట్టి మరువరాని దృశ్యమును శ్రీకృష్ణుని ముందుంచుటకై ఆమె ఇట్లు ప్రయత్నించినది.

తన క్రొమ్ముడిని రెండుభాగములు గావించినది. అందొక భాగ మును ఎడమచేత బట్టుకొన్నది. (తొందరపాటున లేచి) శ్రీకృష్ణుని సమీపమునకు వచ్చినది. తన వేణీభరమును శ్రీకృష్ణుని ముందుంచి మాట్లాడినది.

ఈ ఘట్టమును వ్యాసులు బహుసుందరముగ వర్ణించినారు. మున్ముందు ద్రౌపదీదేవియొక్క కేశపాశమును వర్ణించినారు తరువాత ఆమె శ్రీకృష్ణుని సమీపించుటను వర్ణించినారు. తరువాత ఆమె లక్ష్య మేమియో శ్రీకృష్ణునకు విన్నవించుకొనుటను వర్ణించినారు.

ఇట్లు యీ ఘట్టము మూడుభాగములుగ వర్ణింపబడినది. ద్రౌపది వేణీబంధమునకొక ప్రత్యేకత లేకున్నచో ఆతడట్లేల వర్ణించును ? ఆమె శిరోజములు లోకసామాన్య విలక్షణములు. పురంధ్రీమణులందరి శిరోజ ముల వంటివికావు. ద్రౌపది దేహకాంతి అప్రాకృతము. ఆమె భాషయు సామాన్యమానవ విలక్షణమయ్యేయుండును. ఆమెకొక ప్రత్యేకత లేకు న్నచో వ్యాసభారతి ఆమె కేశసంపదకంత ప్రాధాన్యత నిచ్చునా ? ఆమె కేశసంపద లౌకికపురంధ్రీమణులకంటె విలక్షణమని చెప్పుటకే కొన్ని విశేషణములతో ఆమె కేశసంపదను వర్ణించినారు.

యథార్థమునకు కురుక్షేత్ర సంగ్రామరంగమున దుష్ట క్షత్రియ సంహారమును గావించి, ధర్మసామ్రాజ్య ప్రతిష్ఠాపన గావించినదీ ద్రౌపదీమహాసాధ్వియొక్క వేణీభరమేనని చెప్పక తప్పదు.

వ్యాసమహర్షి దృక్పథమున ద్రౌపది శత్రుసంహారమునకై ఆవిర్భవించిన పరాశక్తి చిదగ్నికుండ సంభూత. కావుననే లలితా మహాదేవి కేశసంపదతో సమానముగ ద్రౌపదీసాధ్వి కేశపాశమును వర్ణించినారు.

ఆమె కేశపాశ వర్ణన మిట్లు నడచినది —

శ్రీకృష్ణునితో దుర్యోధనాదుల తప్పక వధింపుమని చెప్పిన తరువాత ఆమె వేణీభరములోని సగభాగమును గుప్పిట పట్టుకొన్నప్పుడు కూడ ఆమె కేశసంపదలోని మొదటిలక్షణమగు మార్దవము చూపరులకు స్పష్టమై కనబడుచున్నదట. అంతేకాదు. ఆ కేశసమూహమంతయు ఒక్కచో చేరినను ఒకే ఒక వెంట్రుకయొక్క కొనవలె సూక్ష్మమై చూపరులకు చూడముచ్చటైయున్నదిగాని విరియబోసియున్న వెంట్రుకలలోనుండదగు చిక్కు ఆమె క్రొమ్ముడియందు లేదట. ఇంతకంటెను గొప్పవిశేషమేమన నల్లని యీ వినీలకేశభారము సుగంధ పుష్పాలంకరణమునగాని, సుగంధతైలమర్దనమునగాని లేక ప్రకృతియందున్న సర్వసౌగంధ్యములకును అధిష్ఠానమై యున్నదట. అనగా లోకమునం దెన్ని సుగంధముల నిచ్చు పుష్పజాతులున్నవో అన్ని సుగంధములకును ఆ కేశసంపదయే అధిష్ఠానపీఠము నలంకరించినట్లు నానాసూనవితాన వాసనల విరజిమ్ముచున్నదని భావము.

ఇదిగో శ్లోకము —

'ఇత్యుక్త్వా మృదుసంహారం వృజనాగ్రం సుదర్శనం
సునీలమసితాపాంగీ సర్వగంధాధివాసితం'

ఈ శ్లోకమున వ్యాసులు ద్రౌపదియొక్క కేశసమూహమునకు గల మార్దవము నెక్కడ వర్ణించిరందురేమో ?

'మృదుసంహారం' అనుపదముచేత ఆ వెంట్రుకల యందలి విలక్షణ మార్దవమును వర్ణించినారు.

అదెట్లు ?

విడివడియున్న జుట్టు చమరీమృగముయొక్క వెంట్రుకలవలె మార్దవమును ప్రకటింపవచ్చును. కాని జడకట్టియున్న జుట్టుయొక్క మృదుత్వమట్లు ప్రకటితమగుట లోకసామాన్యముకాదు. కేశసంపద కట్టి మార్దవము మానుషాతీతము.

'మృదుసంహారం' అను పదములోని భావమును నీలకంఠులు చక్కగ వ్యాఖ్యానించినారు.

(మృదుసంహారం - వేణీరూపేణ సమాహృతమపి మృదుం) తరువాతది 'వృజనాగ్రం' అను పదమునకు నొక్కులు నొక్కులుగా నున్న ఆ కేశసమూహము చూడముచ్చటైయున్నదనిగాని, లేక వెంట్రుకవలె సన్ననగు కొనగలిగియున్నదనిగాని అర్థము చెప్పినారు.

'వృజనాగ్రం' కుటిలాగ్రం, కేశవత్సూక్ష్మాగ్రం వా. (నీ. కం.)

వ్యాసు లంతతో ఆమె వేణీవర్ణనను ఆపలేదు.

'సునీలమసితాపాంగీ సర్వగంధాధివాసితం'

సర్వగంధములచే అధివాసితమైన దనినారు. లలితాసహస్రమున 'చంకాశోకపున్నాగ సౌగంధికలసత్కచాం' అని అమ్మవారి కేశ సంపదను వర్ణించినారు. ఆ విశేషణము లట్లుండ మరియొక విశేషణమును వాడినారు చూడుడు —

'సర్వలక్షణసంపన్నం మహాభుజగవర్చసం'

ఆమె కేశసంపద సర్వలక్షణ సంపన్నమట. సర్వలక్షణములును సామాన్య జీవునియం దెట్లు పొసగును ? ప్రత్యేక దేహధారులయందే

సర్వలక్షణమను పదము వాడబడును. రామాయణ మహాకావ్యమున వాల్మీకి రామజనన ఘట్టమున 'సర్వలక్షణ లక్షితం' అని రాముని వర్ణించినారు. అట్లే వ్యాసులు ద్రౌపదికి ఆ విశేషణమును వాడినారు. తరువాతి విశేషణము 'మహాభుజగవర్చసం' అనునది. నల్లత్రాచులజాతి కంతకును అగ్రగణ్యమైన దేవతాతేజమున వెలుగొందు సర్పమునకు పోల్చినారు. ఆ సర్పమును ముట్టినవానికి చావు తప్పదని సూచించినారు.

వాల్మీకిమహర్షి సీతను వర్ణించుచు ... 'సీతామహాహిః' మహా సర్పమని వాడిరిగదా!

అట్టి కేశపాశములోని ఒకభాగమును ఎడమచేతపట్టుకొని శ్రీకృష్ణుని సన్నిధి కేగినది.

ఇక ఆమె శ్రీకృష్ణునివద్ద కేగినదన్న వర్ణనాఘట్టమును పరిశీలింతము. ఆ ఘట్టముకూడ ద్రౌపదియొక్క ప్రత్యేకతను చాటినది.

ద్రౌపదియు శ్రీకృష్ణుని యంశమేనని ఆమె శ్రీకృష్ణునిపద్దకు పోవు ఘట్టము స్పష్టపరచును. అంతేకాదు. శ్రీకృష్ణు డెట్లు కంస సంహారమునకై దేవకీవసుదేవులకు కారాగారమునం దవతరించెనో దుష్టకౌరవ వంశదాహమునకై ద్రౌపదియు అవతరించిన శ్రీకృష్ణాంశమే నని వ్యాసులు తన వర్ణనయందు ప్రకటించినారు. వ్యాసభారతి వైదిక వాఙ్మయమును ప్రకటించిన దనుమాటను మరచి, భారతమును పఠింప రాదు. ఈవిషయమును నేను మీకు పలు సందర్భములయందు చెప్పినను నామాటను మీరు పునరుక్తిగ భావించవద్దు. వ్యాసు లీఘట్టమున వర్ణించిన శ్లోకమును గమనింపుడు.

'పద్మాక్షీ పుండరీకాక్షముపేత్య గజగామినీ
అశ్రుపూర్ణేక్షణా కృష్ణా కృష్ణం వచనమబ్రవీత్'

శ్లోక తాత్పర్య మిది —

పద్మాక్షియగు కృష్ణ, కన్నులనిండ నీరు గ్రమ్మగా మంద గమనమున శ్రీకృష్ణుని సమీపించి పుండరీకాక్షునితో మాట్లాడినది. ఇది ముక్కకు ముక్కార్థమగు తాత్పర్యము. మరి ఇందలి ప్రత్యేకత ఏమి ?

ఈ శ్లోకమునందలి విశేషణము లివ్వి- ద్రౌపదికిని, శ్రీకృష్ణునకును కలిపి కృష్ణపదమునే వాడినారు.

'కృష్ణా కృష్ణం వచన మబ్రవీత్' కృష్ణ - ద్రౌపది, కృష్ణం - శ్రీకృష్ణుని గురించి, వచన మబ్రవీత్ - మాటాడెను.

ద్రౌపదికిని శ్రీకృష్ణునకును ఒకేనామమును వాడుటకాక వారిద్దరి దృష్టులును విశాలములై యున్నవేగాని సంకుచితములు గావనికూడ వారిద్దరి నేత్రసందపకు ఒకేవిధమగు ఉపమానము విచ్చినారు.

'పద్మాక్షీ పుండరీకాక్షం ఉపేత్య' అని. ఇచ్చట పద్మాక్ష పుండరీ కాక్ష పదములు సార్థకములై వాడబడినవిగాని పర్యాయపదములుగ వాడబడినవి కావు. శ్రీకృష్ణుని నేత్రద్వంద్వము తెల్లదామరవలె అనుగ్రహరూపము నొందియుండగా ద్రౌపది నేత్రకమలములు అశ్రుపూర్ణములై యున్నవి. అనగా కండ్లనిండ నీరుగ్రమ్మగా ఆతని అనుగ్రహమునకై పోవుచున్నదని ఆమె నేత్రములు ప్రసన్నములై లేక రోషవిషాదములతోకూడినవని చెప్పుచు, పాతివ్రత్యధర్మము మూర్తీభవించిన ద్రౌపది దుఃఖమును సూచించినారు. అంతేకాదు;

ద్రౌపదికి 'గజగామినీ' అను విశేషణమును వాడినారు. ఎడమచేత వెంట్రుకల పట్టుకొని దిగ్గునలేచిన ద్రౌపది భగవానుని సమీపించునప్పుడు ఆమె గమనములోని సహజసౌభాగ్యమును, ఆమె పాతివ్రత్య పట్టమహిషీత్వలక్షణములను వ్యాసులు స్పష్టపరచినారు. అంతేగాక అట్టి స్త్రీలకు కలుగు దుఃఖములు లోకకళ్యాణ నిమిత్తములేగాని వారి

దురదృష్టరేఖలుగావని కూడ ద్రౌపదికి వాడిన పద్మాక్షీ, గజగామిని పదములు మనకు చక్కని భావమును ప్రకటించుచున్నవి. అర్థభావము లిట్లే యుండును.

శ్రీమద్రామాయణమున సీత అశోకవనమునందుండి కన్నీటి బిందువులను రాల్చుటను వాల్మీకిమహర్షి వర్ణించుచు,

'పుండరీక పలాశాభ్యాం విప్రకీర్ణమివోదకం'

అని వర్ణించినారు. హనుమంతుడు సీతను నీవిట్లు కన్నీరుకార్చుచుంటివేమి? అని ప్రశ్నించు ఘట్టమున సీత కన్నీరుకార్చుట తామర పుష్పముయొక్క రేకులనుండి జారుచున్న నీటిబిందువులవలె నున్నవట.

అనగా ఏమి? నీ నేత్రసంపదకు ఇట్టి దుఃఖము కలుగరాదు. అయ్యును నీ దుఃఖమొక నిమిత్తమైనదేగాని అంతకంటే వేరుగాదు. ఇట్టి నీ కంటినుండి కారుచున్న నీటి కెవ్వరు కారణమో వారిని నీ శోకాగ్ని దగ్ధము గావించగలదని సూచించినాడు. అట్లే ఇక్కడ ద్రౌపదిని వర్ణించి 'పద్మాక్షీ' పదమునువాడి 'అశ్రుపూర్ణేక్షణా' అని ఆమెకు దుఃఖమును కల్పించిన దుశ్శాసనాదుల నాశమును సూచించినారు వ్యాసులు.

ద్రౌపది కేశపాశమును శ్రీకృష్ణుని సన్నిధానమునందుంచి మాటాడుట ఆంధ్రభారతము నందును వర్ణింపబడినది.

ఆ పద్య మిది —

ఉ॥ ద్రోవది బంధురం బయిన క్రొమ్ముడి గ్రమ్మన విచ్చి వెండ్రుకల్
దా వలచేత బూని యసితచ్ఛవి బొల్చు మహాభుజంగమో
నా విలసిల్లి ప్రేలగ మనంబున బొంగు విషాద రోషముల్
గావగ లేక బాష్పములు గ్రమ్మగ డగ్గఱ లేచి యార్తయై.

ఈ పద్యమున వ్యాసుని శ్లోకములోని 'మహాభుజగవర్చసం' అను విశేషణము మాత్రమే వాడబడినది.

'వృజినాగ్రం' 'సుదర్శనం' 'సర్వగంధాధివాసితం' అను విశేషణములు సంస్కృతమునందలి ప్రత్యేకతలు. తరువాత కథకు రండు.

ఆమె శ్రీకృష్ణుని ముందు కేశపాశముమంచి ఏమి చేసినది ? హే, పుండరీకాక్ష ! అని సంబోధించి, దుశ్శాసనుడు చేతబట్టి సభకు ఈడ్చుకొని రాగా కొనలు తెగిన నా కేశపాశ మిదియేనని స్పష్టముగ ఆ భగవానుని కంట పడవేసినది. కంటపడవేయుటకాదు ; నీవు సంధికిగాను ఏయే విషయముల మాట్లాడుచున్నను నా వెంట్రుకలగుంపు ఇట్లగుటకు కారణమును తప్పక స్మరించవలెనని నిర్దిష్టముగ చెప్పినది. ఈఘట్టమున వ్యాసభారతి ఎంత సార్ధకముగ తన పదజాలమును వాడినదో చూడుడు -

'అయం తే పుండరీకాక్ష దుశ్శాసనకరోద్ధృతః
స్మర్తవ్య స్సర్వకార్యేషు పరేషాం సంధిమిచ్ఛతా'

పుండరీకాక్ష ! అనుపదమున, నీకంటితో నీవిశాలనేత్రములతో నీవే చూడుమని చెప్పినట్లైనది. 'అయం' అను సర్వనామము ఆనాడు దుశ్శాసనుడు చేతబట్టి లాగికొని వచ్చిన కేశసమూహ మిదియే అని ప్రత్యక్షముగ చూపినది. 'స్మర్తవ్యః' అను తవ్యత్ ప్రత్యయాంతక్రియ విధిగా నీవు సంధికాలమున నా కేశపాశమును స్మరింపుమనుటను చెప్పినది. అంతేకాక ఎవరితో సంధి ? అను ఆకాంక్షకు సమాధానముగ దుర్యోధనాదుల పేరును తలపక 'పరేషాం' అనుటచే శత్రువులు స్మరించు వారు కారు అనుటకూడ ఇందలి విశేషము.

ఇక్కడకు ద్రౌపది ఎట్టి పరిస్థితియందును సంధి కుదర్చవద్దనియు యుద్ధమునకే సిద్ధముకమ్మని చెప్పిరమ్మనియు తేల్చిచెప్పినది. మరి భీమార్జునులు సంధికి సిద్ధముకాగా యుద్ధము చేయువారెవరు ? అను ప్రశ్నకు సమాధాన మిచ్చినదా ? ద్రౌపది వీరపుత్రిక, వీరమాత అను మాటను మీరు మరువకుడు.

భీమార్జునులు సంధికార్యమును చక్కజేయుమని చెప్పిన మాటకు ఇంతకు ముందుగ వారి బలపరాక్రమములు యుద్ధములేని పక్షమున సార్థకములు కావనిచెప్పి, ఇప్పుడు వారు పిరికివారై యుద్ధముచేయకున్నచో నన్ను గన్నతండ్రి కౌరవుల జయింపగలడని ముదుసలియను సందేహమునుగూడ నివారించి ద్రుపదుని యుద్ధవీరత్వమును నిలబెట్టినది. అంతతో ఆమె ఊరుకొనలేదు. వీరమాతయైనందుకు తాను గన్నబిడ్డలను గూడ ముందుకుదెచ్చి, నా బిడ్డలయిదుగురును అభిమన్యుని పురస్కరించుకొని ఈ యుద్ధరంగమును నడుపుదురని తన ఆశను ప్రకటించినది.

'యది భీమార్జునౌ కృష్ణ కృపణౌ సంధికాముకౌ
పితా మే యోత్స్యతే వృద్ధః సహపుత్రైర్మహారథైః
పంచచైవ మహావీర్యాః పుత్రా మే మధుసూదన
అభిమన్యుం పురస్కృత్య యోత్స్యన్తే కురుభిస్సహ'

ఈ విధముగ యుద్ధనిశ్చయమును చేయుటేగాదు. ఆ యుద్ధరంగమున తానూహించు భీభత్సాద్భుతరౌద్రరసములు ఎట్లుప్పతిల్లవలెనో కూడ వర్ణించి చెప్పినది. ఆ వర్ణన మామె యూహాప్రపంచమునందు మాత్రమే ఈనాటికి రూపొందినను రాబోవు రణరంగమునందు కన్నులకగపడదగునట్టి దృశ్యములలో ఈ చెప్పబోవు దృశ్యమొకటి ప్రధానముగ వర్ణింపబడినది. ఏమా దృశ్యము ? —

అది దుశ్శాసన వధాఘట్టము. ఆ ఘట్టమున దుశ్శాసనుని మృతకళేబరము. అంతేకాదు — అంతమాత్రముననే ద్రౌపది పరాభవాగ్ని చల్లారి ఆమె హృదయము శాంతించునా ? — ఆమె హృదయము శాంతింపవలెనన్న దుశ్శాసనుని భుజస్కంధము తెగి ముక్కలు ముక్కలై క్రిందపడవలెను. అంతతో చాలదు. ఆ మాంసఖండములు

నేలపైనున్న దుమ్ముతో ఆమెకంట బడవలెనట. అప్పటికి తన హృదయము శాంతించునట. ఆమె అమరవాణి యిది —

'దుశ్శాసనభుజం శ్యామం సంఛిన్నం పాంసుగుంఠితం
యద్యహం తు న పశ్యామి కా శాంతిర్హృదయస్య మే'

ఆంధ్రవాణిని వినిపింతును.

సీ॥ ఈ వెంట్రుకలు వట్టి యీడ్చిన యాచేయి
దొలుతగా బోరిలో దుస్ససేను
తను వింతలింతలు తునియలై చెదరి రూ
పరి యున్నగని యుడుకారుగాక

... ... ... ... ...

ఈమాటల చెప్పుచు ఇంతవరకు తాను చూపిన ఓరిమినికూడ శ్రీకృష్ణునకు విన్నవించినది. ఓర్వరాని ఈ ఓరిమికి పదమూడు సంవత్సరములు గడచినవన్నది. కాని ఇంక కొంతకాలము గడపరాదా, అందువేమో ?

కృష్ణా ! అట్టి సమాధానమేమైన నీ విచ్చుచో ఆమాట నాకు శల్యమై హృదయవిదారకమగునని ముందుగనే శ్రీకృష్ణునకు సమాధాన మిచ్చి, ఇక నేను నా పరాభవాగ్ని కణముల వేడిమిని భరింపజాలనన్నది.

'విదీర్యతే మే హృదయం భీమవాక్శల్యపీడితం
యోఽయ మద్య మహాబాహో ర్ధర్మమేవాను పశ్యతి'

నిజముగ ఆమె దుఃఖమింతవరకు కంఠసీమయందుండి గద్గద భాషణముల భాషింపజేయుచున్నను ఆ దుఃఖవేగ మిక కంఠసీమయందు నిలవలేకపోయినది. పొంగిపొరలినది. కన్నులనుండి అశ్రుపాతము ధారగా మారినది. కుచమండలమంతయు తడసినది. కటి ప్రదేశమందలి వలువయు తడసినది. వెక్కి వెక్కి ఏడ్వనారంభించినది. అట్లామె

క్రోధాగ్ని కరగి కంటినీ రత్యుష్ణమై ప్రవహించగా ఆ ఘట్టమును భగవానులు చూడగలరా ?

భగవానులు తన అభయహస్తమున ద్రౌపది నిట్లు ఓదార్చినారు—

ఉ॥ ముచ్చిర నేల యే గలుగ ముద్దియ నాకు వృకోదరుండు వి
వ్వచ్చుడు దోడు గాగ జనవంద్యుడు ధర్మసుతుండు పంప నీ
మెచ్చుగ శత్రుసంక్షయము మేకొని చేసెదగాక వే రొకం
డచ్చుపడంగ నేర్చునె దురాత్ములు కౌరవు లుర్వియిత్తురే.

క॥ లలనా యుడుగుము నీయే
డ్పులకోలదియె కురునృపాలపుత్రకశత్రం
బులయేడ్పు లింక వానిం
గలకల నవ్వుచు వినంగ గాలం బయ్యెన్.

కౌరవస్త్రీల వైభవ మిక లేదవినారు. వా రనాథలై దుఃఖింపగా నీవు నవ్వదగు కాలము సమీపించినదని తన మృదుమధుర వచోవిలాసములతో ఓదార్చినారు. సామాన్యమున ఓదార్చుటకాదు. ప్రతిజ్ఞను చేసి కన్నీటిని తుడిచినారు.

'సత్యం తే ప్రతిజానామి కృష్ణే బాష్పో నిగృహ్యతాం
హతామిత్రాన్ శ్రియాయుక్తానచిరా ద్రక్ష్యసే పతీన్'

ద్రౌపదీ నే నిదియే ప్రతినను చేయుచున్నాను. నీవిక దుఃఖింపకుము. నీ భర్తలు శత్రుపక్షమును హతమార్చి సామ్రాజ్యలక్ష్మివైభవముతో కూడియుండుట నీవు చూడగలవు.

ఆంధ్రానువాద మిది —

తే॥ పూనిపలికెద వినుము రిపుక్షయంబు
జేసి యుజ్జ్వల పుణ్యలక్ష్మిసమేతు

లైన పాండుకుమారుల యధిక విభవ
మీవు సూచెదు తడవు లేదిది నిజంబు.

కౌరవస్త్రీలు దుఃఖార్తలై విలపించుటను నీవు కొలదికాలముననే చూడగలవు. నా మాటను నమ్ముమని తన ఒదార్పుమాటలతో ద్రౌపది కన్నీటిని తుడిచినారు. ఇది ద్రౌపది శరణాగతి.

ఇంతవరకు ధర్మజ భీమార్జునులు, యుద్ధశాంతికి ప్రథానస్థానము నివ్వగా ద్రౌపది యుద్ధమునకే స్థానమిచ్చినది. ద్రౌపది సంభాషించిన తరువాతకూడ అర్జునుడు రెండుపక్షములకును యుద్ధము లేకపోవుటయే మేలని చెప్పినాడు. అట్లు కాకున్నచో యుద్ధమునకు సిద్ధమనినాడు.

ఇంతతో ఈనాటి ఉపన్యాసము ముగిసినది. మీరీ యుపన్యాసమున ముఖ్యముగ గ్రహించవలసిన విషయము లేమి ?

జీవుడెప్పుడైన తన దుఃఖజీవితమునుండి బయటపడవలెనన్న దేహబంధువులనేగాక ఆత్మబంధువగు భగవంతుని శరణువేడుకొనుటయే అవసరమని ద్రౌపదీశరణాగతి చక్కగ చాటినది. అంతేకాదు. నాటి రాజవంశములం దుద్భవించిన భారతనారీమణుల కెంతవిజ్ఞానము కలదో, వారెంతధైర్య స్థైర్యముల కలిగి తమతమ జీవితబాధ్యతల గుర్తెరిగి నిర్వర్తించిరోకూడ మనకీ ఘట్టము స్పష్టపరచినది.

ఇక శ్రీకృష్ణభగవానులు సంధికార్యమునకై హస్తినాపురమున కేగవలెను. దానికి ముహూర్తము రేపు. ఈనాడు మీకొక పద్యమును వినిపించి ముగింతును.

ఉ॥ చక్కనివాడు సర్వగుణసంపదలుం గలవాడు భక్తిచే
చిక్కెడువాడు లోకముల చిక్కెడలించెడువాడు దీనులన్
మిక్కిలిప్రోచువాడు కననేర్చిన కన్పడువాడు గాన నీ
వక్కరపాటుతోడ మనసా హరిపాదము లాశ్రయింపుమా.

ఇది ఒక చక్కని సాధకుని ప్రబోధము.

మనసా ! నీవు నేత్రేంద్రియ సహాయమున చక్కని సౌందర్యము చూచి ఆనందించుచో - అదుగో ! సగుణమూర్తియై నిలచిన భగవానుని దివ్యమంగళ విగ్రహము.

నీ కాశ్రయము కావలెనన్న - అతనికంటె సుగుణ భూషితు లెవ్వరు ! ఔదార్య దాతృత్వాది గుణముల కతడే ఆధారము.

'అతడు నాకు దొరకునా ? అందువా ! - భక్తియనుదాని కాతడు తప్పక చిక్కును.

నేనీ సంసారపు చిక్కులలో చిక్కుకొని యుంటినని విచారించకుము. లోకులందరి చిక్కులను విడదీసి చిక్కుల సడలించుటలో నేర్పుగలవాడును అతడే.

నా దగ్గర ధనము శూన్యమందువా? - దీనుల నాతడు ముందుగనే చూచును.

మరి అతడెప్పుడును నాకంట పడలేదందువా ? నీకు చూచు నేర్పరితనమున్న అతడు తప్పక నీకంటికి కనబడును. కావున నామాట విని నీ వెక్కడికిని బోక ఆ చక్కని మూర్తినే ఆశ్రయింపుము.

ఈ పద్యమును, పద్యములోని భావమును తప్పక మనము మననము చేయుట ఈనాటి యుపన్యాససారము.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# శ్రీకృష్ణుని పయనము

మహాశయులారా !

మనకీనాటికి ఉద్యోగపర్వ కథాఘట్టమున మూడురోజులు గడచినవి. నేడు నాల్గవరోజు. నేటికథాఘట్టము భగవానుని దౌత్య నిర్వహణము. అతడు హస్తినాపురమునకు పయనమగుట నిన్నటి యుపన్యాసమున నిశ్చయమైనది. నే డాతడు ప్రయాణమును సాగించవలెను. మనమును ఆ మహనీయునితో హస్తినాపురమున కేగవలెను. నారదాదిమునీంద్రులును నేడు హస్తినాపురమున కేతెంతురు. హస్తినాపురమున మునీంద్రుల కేమిపని యున్నది అందురా ? అఖండ భారతక్షేత్రమున జీవుల నుద్ధరించుటకై అవతరించిన భగవానునితోపాటు వారును, ధర్మకార్యనిర్వహణమున భాగస్వాములై యుండుట భారతీయేతిహాసములలోని రహస్యము.

భారతీయేతిహాసములు కేవల భౌతిక చరిత్రలవంటివికావు. అవి మోక్షలక్ష్మి నివాసమందిరములు. నేటి మన యుపన్యాస మొక అద్భుత కథాఘట్టము. నేటి ఘట్టమునందలి ప్రతిసన్నివేశమును భారతీయ రహస్య సిద్ధాంతముల ప్రతిపాదించును. మనమందరమును నేడు శ్రీకృష్ణునితో పయనమై విదురుని గృహాభ్యంతరమున కేగవలెను.

అచ్చట భగవానునితో ఆ భక్తునకుగలుగు సన్నివేశమును దర్శించవలెను. అంతేకాదు. విదురున కానాడు భగవాను లందించిన దివ్యసందేశము నొకదానిని మనము గమనించవలెను. నేటి యుపన్యాసమున ముఖ్యమగు రహస్యమేమియో తెలియునా ? —

శ్రీకృష్ణుడు సచ్చిదానంద బ్రహ్మము. అతడాచరింపదగు విధికర్మలు లేవు. నిషేధములును లేవు. అతడు కర్మఫలభోక్త కాడు. కర్త

కానివానికి భోక్తృత్వ మెక్కడిది ? అట్లు కర్తృత్వభోక్తృత్వ రహిత మగు నా పరబ్రహ్మము కర్మయోగియై కర్మల నాచరించును. భక్తశిఖామణియై నారదాది యోగీంద్రులకు సేవలుచేయును. ఇదియే భారతీయాధ్యాత్మిక శాస్త్రములోని పరమరహస్యము. ఈ పలుకులు నే పలికిన పలుకులు గావు. గీతాశాస్త్రమున శ్రీకృష్ణుని యుద్బోధవాక్యములే.

'న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషులోకేషు కించన
నా నవాప్త మవాప్తవ్యం వర్తఏవ చ కర్మణి.

పార్థా ! మూడులోకములందును నాకు కర్తవ్యము లనునవి లేవు. పొందవలసిన కర్మఫలములును లేవు. అయ్యును నేను కర్మల నాచరింతును అనినారు. ఇక కథకు పోదము—

అది ప్రాతఃకాలము. మైత్రముహూర్తము. ప్రతినిత్యమును, పరివర్తించు ముహూర్తములలో మైత్రముహూర్త మొకటి. ఆ ముహూర్తము సామాన్యముగ ఎనిమిదిగంటల కాలమున వచ్చును. ఆ ముహూర్తముననే శ్రీకృష్ణభగవానులు హస్తినాపురమునకు పయనమగుట జరిగినది. అది కార్తీక మాసము. శరదృతువు వెళ్ళిపోవు సమయము. అనగా కార్తీకమాసమున బహుళపక్షము. నాడు రేవతీ నక్షత్రము.

భారతక్షేత్రము కర్మభూమి యగుటచే అవతారమూర్తి యగు శ్రీకృష్ణచంద్రులుకూడ వేదోక్తములగు విధికర్మల నాచరించును.

నాడు శ్రీకృష్ణులు ప్రాతఃకాలకృత్యములగు సంధ్యాగ్నిహోత్ర కార్యముల చక్కగ నిర్వర్తించినారు. అవి ప్రతిరోజును చేయదగు నిత్యకర్మలు. నాటి పయనమును గురించి ప్రత్యేకముగ నిర్వర్తించ దగు పుణ్యకర్మలు నైమిత్తికములు. పయనమగుటను నిమిత్తముగాగొని తానుపాసించు వైదికాగ్నికి ప్రదక్షిణ మాచరించినారు. ఆ అగ్నికుండలము నందలి జ్వాలలు ప్రదక్షిణావర్తములై వెలుగొందగా రాబోవు

శుభముల మనసా ధ్యానించినారు. అగ్నిహోత్రుని తరువాతవారు వేద వేదాంగపారగులగు భూసురోత్తములు. వారికి పాదాభివందనములగావించి నారు. తరువాతది గంధమాల్యాద్యలంకరణము. ఆ యప్రాకృత దివ్య మంగళవిగ్రహుని కంఠసీమ నలంకృతము కాదగిన వైజయంతీ మాలయు, ఆతని వక్షస్థలమున వసించి తన కాంతిని వెదజల్లదగు కౌస్తుభమణియు, ఆతని వినీల దేహమునందలంకృతములైనవి. అట్లలం కృతమైన తన దేహమును అద్దమున చూచుకొనవలెను. ఇదియు శాస్త్ర విధియే. తరువాత మంగళద్రవ్యముల తాకవలెను. ఆ మంగళద్రవ్యముల తాకుటలో గోవుయొక్క పృష్ఠభాగమొకటి. దానిని చేతతాకిన మంగళము. శ్రీకృష్ణు లట్లే చేసినారు.

శ్లో॥ యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః
స యత్ప్రమాణం కురు తే లోక స్తదనువర్తతే.

ఆదర్శపురుషుల ఆచరణములే సామాన్యమానవ సమాజసముద్ధరణ ములు కాగలవని భగవానుని నిర్ణయము.

కావుననే రామకృష్ణాద్యవతారముల నిత్యజీవితములు క్రమబద్ధము లయ్యే నడచినవి. నేటికిని లోకము వారి ననుసరించిననే బాగుపడగలదు. కథాభాగమునకు మరలుదుము. మన మెక్కడుంటిమి ? శ్రీకృష్ణుడిక ప్రయా ణము కావలెను.

రథము నాయత్తము చేయింపుమనియు, ఆ రథమున సుదర్శనాద్యా యుధముల గూడ నుంచుమనియు, శ్రీకృష్ణులు సాత్యకికి ఆజ్ఞయిచ్చినారు. కాని దౌత్యనిర్వహణకై బోవు శాంతిదూతకు ఆయుధము లెందుకు ? అదియే శ్రీకృష్ణుని నీతివిశారదత్వము. తాను కాలిడబోవు ప్రదేశము ఘోరాతిఘోరములగు పాపకార్యముల నాచరించుటకు వెనుదీయని దుష్ట చతుష్టయముగల స్థలముగదా ! అక్కడికేగునప్పుడు శ్రీకృష్ణుడు రిక్త హస్తములతో పయనించునా !

గజేంద్రుని రక్షించుటకేగిన భగవానులట్లే వెళ్ళినట్లు పోతనా మాత్యులు చెప్పిరనకుడు. ఆ ఘట్టము వేరు.

శ్రీకృష్ణులీ ఘట్టమున మనకొక చక్కని రాజనీతిని బోధించుచు తన అభిప్రాయమును స్పష్టపరచినారు.

'దుర్యోధనోఽపి దుష్టాత్మా కర్ణశ్చ సహసౌ బలః
న చ శత్రు రవజ్ఞేయో దుర్బలోఽపి బలీయసా'

శత్రువెంత దుర్బలుడైనను, తానెంత బలవంతుడైనను శత్రువును నిర్లక్ష్యము చేయరాదు.

పై సూత్రము ననుసరించియే శ్రీకృష్ణులట్లు సాత్యకి నాజ్ఞాపించినారు.

తరువాతి కథ...

సాత్యకి తేరును బూన్పుమని దారుకుని కాజ్ఞయివ్వగా దారుకునిచే రథ మాయత్తమైనది.

శైబ్య, సుగ్రీవ, మేఘ, పుష్ప, వలాహకములను గుర్రములా రథమునకు పూన్పబడినవి. గరుడధ్వజ మెత్తబడినది. ఆయుధములం దమర్చబడినవి. ఆనాటి శ్రీకృష్ణుని రథసౌందర్య మెట్లున్న దందురు? ఆ దివ్యస్యందనము చూపరులకు ఆకాశమే పయనము గావించుచున్నదా యనునట్లున్నదని వ్యాసభగవానులు వర్ణించినారు. ఆ రథచక్రములు సూర్యచంద్రమండలములవలె నుండగా ఆ రథమునందు కూర్చబడిన మణిగణ ప్రభాపటలము నక్షత్రములవలె వెలుగొందగా, ఆ స్యందనము ఆకాశమువలె భాసించినదట. దాని వైశాల్యమెంతయుండెనో వ్యాసులు చెప్పినారు పై వర్ణనమున.

శ్రీకృష్ణులు సాత్యకినిగూడ తన రథముననే కూర్చుండ నియోగించినారు. పాండునందనుల రథములును శ్రీకృష్ణుని కొంతదూర మనుసరించుటకై అతని పయనము ననుసరించినవి. పాండవుల రథములే

కాదు. ఒకవేళ యుద్ధమే వచ్చుచో సిద్ధమై యుండవచ్చిన మహారాజులును శ్రీకృష్ణుని ప్రయాణము గావించుటకై బారులు తీర్చి తమతమ రథముల నిలిపినారు. విరాట ద్రుపదుల రథములును ఆ రథసమూహమునందున్నవి. అదియొక సుందరమగు దృశ్యము. శ్రీకృష్ణులు సాధించబోవు కార్య గౌరవమంతయు ఆ దృశ్యమున స్పష్టమైయున్నది.

శ్రీకృష్ణుని రథము కదలినది. పాండవుల రథములును కదిలినవి. బారులు తీర్చియున్న రాజవరుల రథములును కదలినవి. కొంతదూరము పయనము సాగినది.

## ధర్మజుని సందేశము

ధర్మజుని యరద మెందుకో శ్రీకృష్ణుని రథమునంటి నిలిచినది. రహస్యమేమైన శ్రీకృష్ణున కందించుటకా ? కాదు. ఆ మహారాజమండల మధ్యముననే పయనించుచున్న శ్రీకృష్ణునితోడనే ఆతడు మాట్లాడినాడు. రహస్యమేమున్నది ? అదియొక విచిత్రమగు సమయము. ముఖ్యబంధువుల కందించదగు సందేశముల నందించు సమయమిదియే. ఆప్తులెవ్వరైన తన ఆత్మబంధువులకడకేగుచో ఆ బంధువుల కందించదగు సందేశములు ఆతని వదలివచ్చు చివరియడుగువరకును చెప్పదగినవెన్నియో యుండును. అట్లు చెప్పినను అవి సమాప్తములు గావు. ధర్మనందనుని దగ్గరకు వత్తము.

పదమూడు సంవత్సరములనుండి తాము కంటబడకపోవుటచే పుత్రవియోగ దుఃఖమున క్రుంగి కృశించు కన్నతల్లికి అందించదగు సందేశములకై ధర్మజుని యరదము శ్రీకృష్ణుని రథమునంటి నిలిచినది.

తమను కన్నతల్లి ఈనాటివరకింకను బ్రతికియుండెనా ? అను సందేహ మంకురింపగా బ్రతికియుండుచో తనపిగా శ్రీకృష్ణు డామెకడ నెరవేర్చదగు కృత్యమేదియో కృష్ణునితో చెప్పుకొనినాడు.

కొంతసేపు తమ బాల్యమాదిగా నేటివరకును ఆ మహాసాధ్వి యనుభవించిన దుఃఖముల వర్ణించుటతో తన పరితాపమును వెళ్ళగ్రక్కుకొని, శ్రీకృష్ణుడు కుంతిదగ్గరకుపోయి ఏమిచేయవలెనో ఇట్లు చెప్పినాడు. ఈ ఘట్టమున తిక్కనామాత్యుల రసాత్మక పద్యపంక్తిని మీకు వినిపింతును.

ఉ. వచ్చె జనార్దనుండనిన వార్తకుఁ బ్రాణము మేనికంతకున్
వచ్చిన పేదదేరుఁ గురువంశ పవిత్రచరిత్ర గొంతి నీ
వచ్చటికేగి పాండవుల యందఱమాఱని చెప్పి మ్రొక్కుచున్
గ్రుచ్చియు కౌగలించుకొని కుందిన చిత్తము నొప్పిదీర్పుమీ.

చ. అడవికి నేఁగునాఁడు మమునంపఁగ నెంతయు దవ్వువచ్చిన
ప్పుడు దనమోము దైన్యమునఁబొందెడు నశ్రులుఁజూచిచూచి య
ట్లొడఁబడి డించిపోవలసె నుమ్మలికమ్మున గొంతి యింతకున్
బడుగయి పాలలోఁబడిన బల్లి విధంబున నుండకుండునే.

శ్రీకృష్ణులు హస్తినాపురమున కేగగనే ఆతడు వెళ్ళినది కుంతి వద్దకు కాదు. ధృతరాష్ట్రుని మందిరమునకు. కుంతివద్దకు వెళ్ళునప్పటికి కొంతసమయము గడచును. కాని శ్రీకృష్ణుని పురప్రవేశము కుంతికి ముందుగనే తెలియును. శ్రీకృష్ణునిరాక కుంతి చెవినిబడగనే ఆ క్షణమున కుంతి ఎట్లుండునో 'వచ్చె జనార్దనుం'డను పద్యమున వర్ణితమైనది. కుంతి యింతకుముందు బక్కచిక్కి బడుగై జీవచ్ఛవమువలె నుండగా కృష్ణనామ మామె చెవిని బడగనే ప్రాణపంచకమప్పుడే శరీరమున ప్రవేశించినట్లుండెనట.

'న నూనం మ్రియతే దుఃఖైః సా చేజ్జీవతి కేశవ'

ఆమె చావక బ్రతికియున్నచో అను మూలములోని భావమును చక్కగ తిక్కనార్యులు విపులీకరించినారు. బాల్యమాదిగ ఆమె పడ్డ

దుఃఖముల నన్నిటిని వర్ణించుచు తమకును దుర్యోధనాదులు బాల్యమున కల్పించిన మారణకృత్యములనుండికూడ రక్షించుట యను నేర్పరితనము గూడ మూలమున వర్ణితమైనది. అట్టి తల్లికి వందనమాచరింపుమని చెప్పి, 'ఆమె బ్రతికియుండుచో' అన్న మాటను చివరపలికినాడు ధర్మజుడు. ఆ శ్లోకముల నన్నిటిని సంగ్రహించి తిక్కనార్యులు పై పద్యములతో ధర్మజునిబాధను మనముందట సాక్షాత్కరింపజేసినారు.

ధర్మజుని చివరి సందేశ మిది —

క. ఏననుట గాఁగ దుఃఖము
లైనవి దెగుసమయమయ్యెనని చెప్పుము మీ
మేనత్త నూరడింపుము
దానెప్పుడు నీవు గలవు తన కనుచుండున్.

తిక్కనామాత్యులీ పద్యమున కుంతియొక్క భక్తి యెట్టిదో చక్కగ తెలిపినారు. బంధుప్రేమతో భావమును మేళవించి భగవద్ధ్యానముతో సమాప్తము గావించినారు. కుంతికి గల బాధనంతను తీర్పగలవాడు శ్యామసుందరుడే. మేనత్తయన్న భావమున కౌగలించుటేగాక అభయ ప్రదానమున మనసున గ్రుచ్చుకొనియున్న దుఃఖమును ఊడబెరికివేయ దగు సామర్థ్య మా మహనీయునకుతప్ప ఏ దేహబంధువులు సమూల ముగ దుఃఖముల తీర్పగలరు ? ఇదియే ధర్మజుని భావము. ఇక మా ప్రయత్నము, వీ దుఃఖముల తీర్పగలవని కథాసందర్భముగ కుంతికి తెలుపమనినాడు. తప్పక మేము నిన్ను దర్శింతుమని చెప్పినాడు. ఇంతతో కుంతికి సందేశములు పూర్తియైనవి. భీష్మాదికురువృద్ధులకుగూడ తన అభివాదనల నందించినాడు. వారందరితోపాటువాడుగాడు విదురుడు. విదురుని పాత్ర భారతమునం దొక వెలుగునిచ్చు పాత్ర. విదురునకు కొన్ని విశేషణములను వాడి, అతనిని కౌగలింపుమని చెప్పి, కృష్ణుని అనుజ్ఞగైకొని, అతనికి ప్రదక్షిణమాచరించి ధర్మజుడు మరలినాడు.

విదురుని వర్ణించిన శ్లోకమిది—

'విదురం చ మహా ప్రాజ్ఞం కురూణాం మంత్రధారిణం

అగాధబుద్ధిం మర్మజ్ఞం స్వజేథా మధుసూదన'

విదురుడు పండితుడు. రహస్యరక్షణమున దక్షుడు. ఆతని బుద్ధిపై శర్య మగాధము. అట్టి విదురునకు నా కౌగలింత నందింపుమనినాడు ధర్మజుడు.

తరువాత వాడు పార్థుడు. ఆతడుగూడ శ్రీకృష్ణుని యనుజ్ఞను గైకొనుచు చివ్వరిమాటగా దుర్యోధనుడు సంధికి ఒప్పనిచో క్షత్ర మండల వినాశము తప్పదని చెప్పినాడు.

ఆ పలుకు భీమునకు రణరంగమును దర్శింపజేసినది. భీముడా మాటకు పొంగి క్రోధావేశమున శరీరము కంపింపగా ఆక్రోశమున పెద్ద వినాదమును గావించినాడు.

భీముని వినాదమునకు సైన్యమొక్కమారుగ కంపించినది. గజ బల అశ్వబలములు మూత్రపురీషముల వదలినవి. భీముడును శ్రీకృష్ణుని కౌగలించి ఆతని అనుజ్ఞతో వెనుకకు తిరిగినాడు. రాజవర్గమంతయు వెనుకకు మరలినది. మరి శ్రీకృష్ణుని రథమో ? ముందుకు నడచినది.

దారుకుడు వాహనముల అదిలించగా భగవానుని రథము మేఘ మండలమున చరించుచున్నదా ! అనునట్లు మహావేగమున పయనించినది. అయ్యును కొంతదూరమేగగా రథమును శ్రీకృష్ణులు నిలిపినారు. కారణ మేమి ? నారదాదిమునీంద్రు లాతని దృక్పథమున బడగా తన రథమును నిలిపి, రథముదిగ్గి వారి పాదములకు ప్రణమిల్లినారు. కుశల ప్రశ్నలం గావించి వారి రాకకు కారణమడుగగా, వారు మీవు కురుసభాస్థలిని ప్రబోధించు ధర్మార్థసహిత వాక్యముల వినుటకును, భీష్మాది కురువీరుల సభయందు జరుగు ఘట్టముల దర్శించుటకు మేము వచ్చుచుంటిమని పరశురాముడు సమాధానమిచ్చి అంతర్ధానముకాగా కృష్ణబ్రహ్మము తన పయనమును సాగించినారు. నేడాతడు సరాసరి హస్తినాపురమునకేగలేదు.

హస్తినాపురమునకును ఉపప్లావ్యమునకును మధ్యభాగమున వృకస్థలి యున్నది. శ్రీకృష్ణులు సాయంకాలమగుసరికి వృకస్థలీనగరమునకు చేరినారు. ఆ పురవాసుల మహాభాగ్యమది. కాని ఒక్క విశేషము. శ్రీకృష్ణులుపప్లావ్యమునుండి బయలుదేరు సమయముననే అనేకములగు ఉత్పాతములు ప్రారంభమైనవి. ప్రతిదేశము నందును ఆ యుత్పాతము లున్నను శ్రీకృష్ణులు పయనించు ప్రదేశముల యందా యుత్పాతములు కనబడకపోవుట సరిగదా ; అత డెక్కడెక్కడ పయనించుచుండెనో ఆ ప్రదేశములందు చల్లనిగాడ్పులు మొదలగు శుభశకునములు కలిగినవట.

'యత్ర యత్ర చ వార్ష్ణేయో వర్తతే పథి భారత
తత్ర తత్ర సుఖో వాయుః సర్వం చాసీత్ ప్రదక్షిణం'

ఇది యిట్లుండ శ్రీవారి ప్రయాణము దేశవ్యాప్తముకాగా ధృతరాష్ట్రు డా విషయమును గుర్తెరిగి భీష్మద్రోణవిదురాది వృద్ధజనులకు సంతోషము కలుగునట్లు అటనుండి హస్తినాపురమువరకును గల మార్గమంతయు సభామంటపముల కల్పించి శ్రీకృష్ణుని పూజార్థముగ సేవకుల నియోగింపుమని దుర్యోధనునకు చెప్పినాడు. దుర్యోధను డట్లే చేసినాడు. వృకస్థలమున మాత్రము ప్రత్యేకములగు వసతుల కల్పించినాడు. కాని శ్రీకృష్ణు డా యలంకారముల తిలకించెనా ? కన్నెత్తియైనను అతడు చూడలేదు. అతని కరుణాకటాక్షములకు పాత్రులు గాదగిన భక్తశేఖరు లెందరో అతని పూజింపగా, ఆయా స్థానముల వారి వారి పూజల నందుకొనుచు ప్రకృతిసౌందర్యము తనకు స్వాగత మివ్వగా సస్యశ్యామలములగు ప్రదేశముల దర్శింపుచు సరాసరి వృకస్థలికే వచ్చి, ఆ రాత్రి అచ్చటనే వసించి, మరునాటి ప్రాతఃకాలమున హస్తినాపురి యందలి ధృతరాష్ట్రుని మందిరముననే వచ్చినారు.

ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణుని తనవానినిగా చేసికొనదలచినాడు. మాయాప్రభావ మనిర్వాచ్యము. శ్రీకృష్ణుడు పరబ్రహ్మయని ఎరుగనివా

రెందరో నాడును కలరు. ఎందరో యనుమాట ఎందుకు? చతుర్ముఖ బ్రహ్మయే శ్రీకృష్ణుని గుర్తెరుగక గోవత్సములను గోపాలురను దాచి, సృష్టిఖండము తననుండియే వెలువడునుగాని సృష్టికర్త వేరొకడు లేడని తలచినాడుగదా! ధృతరాష్ట్రుడు మోహాంధుడు. విదురాది భక్తశేఖరులు శ్రీకృష్ణుని గురించి చెప్పినను ఆతని హృదయమున హత్తుకొనలేదు. చెప్పువారి ప్రబోధములు గాలికి పోవుటయే జరిగినది. సనత్సుజాత మహర్షివారి ఆత్మబోధయు అంతియేయైనది. శ్రీకృష్ణుని తనవానినిగా చేసుకొను మార్గమేమి? ఆతని దృక్పథమున శ్రీకృష్ణుడు కాంతాకనకములకు వశమగు మానవమాత్రుడనియే యున్నది. కావున శ్రీకృష్ణుని సత్కరించుటకు కొంత ధనమును, కొందరు కాంతామణులను కేటాయించినాడు. పాండవులకు రాజ్యమివ్వకుండ యుండవలెనన్న శ్రీకృష్ణుని జేబులు నింపవలెనని, నిశ్చయించినాడు. భగవంతుని సంగతి ఆతడేమెరుగును? సత్యవంతుల నిశ్చయార్థములు మోహాంధులకు తెలియునవిగావు. ధృతరాష్ట్రుడు తన అభిప్రాయమును విదురునకు తెలుపకుండ ఉండలేదు. హస్తినాపురమున తానెంతగా శ్రీకృష్ణుని గౌరవించదలచెనో విదురున కెరింగించినాడు.

శ్రీకృష్ణుని గౌరవమర్యాదలకై తానూహించిన విధానమిదియట___

రుక్మమణి వినిర్మితములగు రథములు పదియారు. ఆ పదియారు రథములకును అలంకరించు అశ్వములు బాహ్లికదేశమున పుట్టుపేగాక, ఒకేవర్ణముకలిగి, ఒక్కొక్క రథమునకు నాలుగు గుఱ్ఱము లమర్చబడునట. ఇట్లే జాతిగల ఏనుగులను ఎనిమిదింటినిచ్చి, ఆ మదపుటేనుగుల కెనయైయుండు గున్నయేనుగులకూడ ప్రతిఏనుగతోడను ఎనిమిదింటిని జతగూర్చునట. అంతేకాదట. నూరుమంది దాసీస్త్రీల నిచ్చునట. ఇవి యిట్లుండ, తన మందిరమున పగలు రాత్రియుగూడ ఏకైక ప్రకాశమున ప్రకాశించు మణియొకటి కలదట. అదియు శ్రీకృష్ణునకే సమర్పింపదలచి

నాడట. ఇంతకంటె మరియొక చిత్రమేమన, తన పత్తనమున గల వేశ్యాంగనలు వేనకువేలుగా సర్వాభరణభూషితలై పాదచారులయ్యే శ్రీకృష్ణు నెదుర్కొందురట. ఈ మర్యాదలిట్లు జరుపుటేగాక తన నూర్వురు పుత్రులును సకుటుంబముగ శ్రీకృష్ణునకు స్వాగతమిచ్చి గృహమునకు తోడ్కొనికూడ వత్తురట. వేయేల ? నగర వాసులనందరను శ్రీకృష్ణుని తోడ్కొనిరా బంపుదునని మహోత్సాహమున విదురున కెరింగించి నాడు. విదురా ! శ్రీకృష్ణుడు వసించుటకు దుశ్శాసనుని గృహము నేర్పాటు చేసినాను. దుర్యోధనుని మందిరమునకంటె దుశ్శాసనునిమందిర మతి రమణీయము.

ఇట్లు చెప్పిన ధృతరాష్ట్రుని సంభాషణమునకు విదురుదేమైన సమాధానమిచ్చెనా ? విదురుడేల యూరకుండును ? ధృతరాష్ట్రుని దుర్బుద్ధి కాతడు కటకటబడినాడు. విదురుడు ధృతరాష్ట్రునకు ముఖప్రీతిమాటల చెప్పడు. భీష్మ, ద్రోణ, విదురు, లెప్పుడును ధృతరాష్ట్రుని లోభిత్వ గుణమును వ్రేలుబెట్టి చూపుచు దానిని నివారింప ప్రయత్నింతురేకాని ఆతనితో ఏకీభవించుటెప్పుడును లేదు.

ధృతరాష్ట్రుని యవివేకము విదురున కాశ్చర్యమును గొలిపినది. కాంతాకనకములచే శ్రీకృష్ణుని వశము గావించుకొని పాండవులకును, శ్రీకృష్ణునకును, భేదమును కల్పింతమనుకొన్న ధృతరాష్ట్రుని యవివేక మును ప్రక్షాళన గావించి ధృతరాష్ట్రునకు జ్ఞానోదయమును కావింప దలచినాడు విదురుడు. కావున ధృతరాష్ట్రుని హృదయమునందలి విషమ బుద్ధిని బహిర్గతముగావించి మాట్లాడినాడు. ధృతరాష్ట్రుని సంబోధించి నీకీనాటికి వచ్చిన వయోవృద్ధత్వమేమైనది ? నీవు చదివిన చదువు ఇట్లు పరిణమించినదా ? ధృతరాష్ట్రా ! నీ యవివేక మెంతటిది ? శ్రీకృష్ణుని పాండవులనుండి భేదింపదలచితివా ? శ్రీకృష్ణుని సంతోషపెట్టునది నీవనుకొన్న సత్కారము లెన్నటికిని కావు. నీవు నీ దుర్బుద్ధిని వదలి

శ్రీకృష్ణు డేమిట సంతోషించునో నే చెప్పెద వినుమని ధృతరాష్ట్రుని కీ క్రింది విధమున ప్రబోధించినాడు.

ధృతరాష్ట్రా !

'వేద కృష్ణస్య మాహాత్మ్యం వేదాస్య దృఢభక్తితాం
అత్యాజ్యమస్య జానామి ప్రాణైస్తుల్యం ధనంజయం'

అర్జునుడు శ్రీకృష్ణుని ప్రాణము. శ్రీకృష్ణుడు పార్థుని వదలుట యను మాటయేలేదు. ఆ విషయము నాకు బాగుగ తెలియును.

మరి శ్రీకృష్ణుడెట్లు సంతోషించును ?

శ్రీకృష్ణుడు సంతోషించునది. ధన, కనక, వస్తు, వాహనములచే కాదు. భక్తికాతడు వశమగును. పాండవులకు అయిదూళ్ళ నిచ్చుటకు నోచుకొనక శ్రీకృష్ణునకు మణి, రత్న, సువర్ణముక్తా, ప్రవాళముల నివ్వ దలచితివా ? ఎంత వెర్రి ! ధృతరాష్ట్రా ! అతడట్లు సంతోషించునా ?

'అన్యత్కుంభా దపాం పూర్ణా దన్యత్పాదా వసేచనాత్
అన్యత్కుశల సంప్రశ్నా న్నైవేక్ష్యతి జనార్దనః'

అతడు మన కభిముఖుడు కాగా, పూర్ణ కలశమును చేతనిడుకొని, అతని కెదురేగి, పాద ప్రక్షాళనగావించి, అతడు ప్రేమించు ప్రియజనుల యోగక్షేమముల నడిగి, అతనికి ప్రియమగువారికి గావింపదగు సత్కార ముల గావింపగా, అతడు సంతోషించునేగాని వేరువిధమున అతడు సంతోషింపడు. కావున ఇప్పటికైనను బుద్ధిగలిగి శ్రీకృష్ణులు నీదగ్గర కేతెంచు కార్యమును చక్కజేసి పంపుము. పాండవ కార్యార్థమయ్యే అతడు వచ్చుచుండెను.

ఇది విదురుడు ధృతరాష్ట్రునకు జేసిన యుద్బోధము.

శ్రోతలారా ! మీకేమర్థమైనది ? శ్రీకృష్ణుడెవ్వడో పాండవులెవ్వరో ధృతరాష్ట్రున కర్థముకాలేదని మీరర్థము జేసుకొనవలెను. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యముల కగ్రస్థానము నిచ్చు, భౌతికవాదులకు శ్రీకృష్ణుని అభిప్రాయ మర్థముకాదు. పాండవులనుసరించునది ధర్మమని వారెరుగరు. వయోవృద్ధత్వము వృద్ధత్వము గాదు. భారతీయశాస్త్రములు జ్ఞానవృద్ధత్వమునకొాక అగ్రస్థానమిచ్చినవి. విదురుని యుద్బోధలు ధృతరాష్ట్రునకు నామమాత్రములైనవి. ఈ ఘట్టమున విదురుడు చెప్పిన శ్రీకృష్ణతత్వములోని ఒక భాగమును మాత్రము దుర్యోధను డొప్పుకొనినాడు. ఏమది ? శ్రీకృష్ణుడు అర్జునన కాప్తమిత్రుడని. అనగా అతడొకపక్షము నాశ్రయించినవ్యక్తియేకాని భగవంతుడు కాదనునది. అందుచే అతడసలు శ్రీకృష్ణునిరాకకు ఎదురేగి 1) మణిరత్న సువర్ణాదుల ఖర్చుచేసి, తీసుకొనిరావలసిన యవసరము లేదనియు, 2) అతడు మన సత్కారమాన పూజలను మనము పాండవులకు భయపడి చేయుచుంటిమని అర్థముచేసుకొనును. కావున, అతనిని గౌరవించుటకాక అతనిని బంధించుట చాల అవసరమనియు, దుర్యోధనుడు నిర్ణయించినాడు.

శ్రీకృష్ణుని సత్కరింపనక్కరలేదనుట యట్లుండ బంధించుట యవసరమనుటలో దుర్యోధనుని హృదయమేమి ?

శ్రీకృష్ణుడే పాండవులకు బలమని దుర్యోధనుని అభిప్రాయము. అతని బంధించిన పాండవుల బంధించినట్లే. రాజ్యము తనదే.

ధృతరాష్ట్రుడీమాటకు ఒత్తాసి పలుకలేదు. భీష్ముడు ధృతరాష్ట్రుని వైపుదిరిగి క్రృష్ణుని బంధించుట మీ వినాశమునకే కారణమని గట్టిగ చెప్పి అచ్చటినుండి లేచిపోయినాడు. అంతటితో ఆరోజు ముగిసినది.

ఇక రెండవరోజు ప్రాతఃకాలము సంగతి.

శ్రీకృష్ణులు ఒకరాత్రి వృకస్థలమునందా పురవాసులకు భాగ్యదేవతయై ఆ పురవాసులచే నారాధింపబడి మరునాటి ప్రాతఃకాలమున హస్తినాపురికి బయలుదేరినారు. వృకస్థలనివాసులును భగవానునితో బయలుదేరిరి.

## శ్రీకృష్ణుని హస్తినాపుర ప్రవేశము

ఆనాడు హస్తినాపురమునందొక నూత్నచైతన్యము వెల్లివిరిసినది. రాజమార్గములన్నియు సుగంధతోయములతో తడుపబడి రత్నతోరణాలంకృతములైనవి. రాచబాటలు జనసమూహముతో క్రిక్కిరిసినవి. స్త్రీపురుషులెవ్వరును వారివారి స్వగృహములందులేరు. కృష్ణదర్శనలాలసులై పురవీధులలోనే యుండిరి.

శ్రీకృష్ణుని రథము హస్తినాపురి కేతెంచినది. ఆతని కెదురేగి తోడ్కొనివచ్చుటకు దుర్యోధనుడుదప్ప మిగిలిన భీష్మాది కురువృద్ధులందరును వెళ్ళినారు. రాచబాటలబోవు శ్రీకృష్ణునిరథముపైన అంతఃపురస్త్రీలందరును పుష్పవర్షముల గురిపించినారు. మంచిముత్యములును భగవానునిపై స్త్రీలకరకమలములనుండి జలజలరాలినవి. సువర్ణాక్షతల తనపై రాల్చు కాంతానివహంబుల క్రీగంటజూచుచు భక్తశేఖరులకు తన యప్రాకృత దివ్యమంగళవిగ్రహసందర్శనము నందించుచు, తన చిన్ననాటి పూతనాసంహారాది బాల్యక్రీడల వారు తమతమ వాక్చాతుర్యంబుల స్తుతించుచుండగా, ఆ స్తోత్రపాఠకులగు వారి గానములు శ్రవణాలంకృతములుగాగా శ్రీకృష్ణులు సరాసరి ధృతరాష్ట్రుని మందిరమున కేగినారు.

శ్రీకృష్ణుని రాకకు ధృతరాష్ట్రుడును భీష్మ ద్రోణ కృపాచార్యాదులును తగు సత్కారముల నందింపగా భగవానులును వారి వారికి తగువిధములతో వందనాదుల సమర్పించి ధృతరాష్ట్రుని అజ్ఞచే తనకేర్పరుపబడిన సువర్ణాసనము నలంకరించినారు.

'తత్రాసీ దూర్జితం మృష్టం కాఞ్చనం మహదాసనం
శాసనా ద్ధృతరాష్ట్రస్య తత్రోపావిశ దచ్యుతః'

భగవానుని దివ్యమానుషలీలావైభవము లప్రాకృతములే యైనను, ప్రాకృతములవలెనే చూపరుల కచ్చెరువు కలిగించును. బావమరదులతో పరిహాసప్రసంగముల గావించి, గురువృద్ధజనముల గౌరవించి ధృతరాష్ట్రు డందించిన మధుపర్కాది స్వాగతములనందుకొని అటనుండి విదురుని మందిరమున కేగినారు.

## విదురగృహము

అది విదురుని మందిరము. కాని దానిని శ్రీకృష్ణునకది నిత్యనివాస మందిరమనుట యుక్తము. శ్రీకృష్ణునిరథము విదురుని మందిరాభ్యంతర మున విడువబడినది. భగవానులు విదురుని మందిరమున కాలిడినారు. విదురుడు మధుపర్కాది విధులతో భగవానుని అర్చించినాడు. కాని నాడు శ్రీకృష్ణుని సందర్శించి ఆనందించిన విదురుని యానందము నెవ్వరు వర్ణించగలరు ? వ్యాసులు వర్ణించలేదు. వ్యాసులు వర్ణింపలేకపోవుటగాదు. విదురుడే కృష్ణా ! నిన్ను దర్శించి నేనీక్షణమున అనుభవించు ఆనందము ఇట్లుండెనని వర్ణించలేకపోవుచుంటిననినాడు. కాని విదురుడు తా ననుభ వించిన ఆనందమును ఒకవిధముగ శ్రీకృష్ణునకు తెలిపినాడు. విదురుని వాక్యమిది.

'యా మే ప్రీతిః పుష్కరాక్ష త్వద్దర్శన సముద్భవా
సా కిమాఖ్యాయతే తుభ్య మంతరాఽత్మాసి దేహినాం.'

హే భగవన్ నీ సందర్శనముచే నాకు కలిగిన ఆనందమును నేనేమని వర్ణింపను ? అది అనిర్వాచ్యము. అయ్యును దేహాలకు నీవు అంతరాత్మవుగదా ! నీ వెరుగని నా యనుభవమెక్కడున్నది ? అని తన యానందానుభవమును వర్ణించినాడు. నిజమునకు విదురుని యంతఃకర

ణమునం దేయానందతరంగ ముద్వేత్తున పొంగెనో, ఆ తరంగమున కధిష్ఠానమైయున్న ఆ సద్రూపపరబ్రహ్మమునకే విదురుని యానంద స్ఫూర్తి గోచరముకాగలదుగాని, వాగింద్రియ మా యానంద తరంగము నందుకొనగలదా ? ఆనందమనిర్వాచ్యము. కావున విదురుడామాటను పలికినాడు. అంతతో ఆ ఘట్టము పూర్తికాగా – పాండవుల యోగక్షేమ ముల విదురుడడుగుటయు, శ్రీకృష్ణులు తెలుపుటయు, జరిగినది. అప్పటికి మధ్యాహ్నకాలము దాటినది.

## కుంతిగృహము

ఇక శ్రీకృష్ణులు చూడవలసినది కుంతిని. తన మేనత్త అభ్యంతర గృహమున కేగినారు. కుంతికి చాలకాలమునకుగాని శ్రీకృష్ణసందర్శన మబ్బలేదు. పుత్రవియోగ దుఃఖ మొకవంక పొంగిపొరలగా, చాలకాల మున కబ్బిన శ్రీకృష్ణసందర్శన మామెకొక యపూర్వసంఘటన కాగా, తననుతాను మరచిన దుఃఖసముద్రమునమునిగి శ్రీకృష్ణుని చూడగనే పెద్దపెట్టున గొంతెత్తి యేడ్చుచు శ్రీకృష్ణుని కంఠమును కౌగలించు కొన్నది. ఆమె దుఃఖము భరింపరానిది. తను కన్నబిడ్డలకు పసితనము ననే పితృవియోగముకాగా జ్ఞాతిశత్రుత్వము వికృతాట్టహాసమున ఆ బిడ్డల మ్రింగజూడగా వారు కల్పించు మృత్యుముఖమునుండి తప్పించుచు పెంచి పెద్దవారిగావించిన బిడ్డలు సామ్రాజ్యములవదిలి మహారణ్యసీమలకు పయనమైననాడు చూచినచూపు లింతవరకు మరల బిడ్డలపైన పడలేదు. పదమూడుసంవత్సరములు గడచినవి. అందు పండ్రెండువత్సరముల అరణ్యవాస మొకయెత్తు. అజ్ఞాతవాస మొకఎత్తు. ఆ ఘట్టమంతయు ప్రతినిత్యమును తలచి తలచి కుంగి కృశించిన ఆమె దుఃఖభారము నెవ్వరు వర్ణించగలరు ? ఆమె యంతఃకరణమున పొంగిపొరలుచున్న ఆ దుఃఖములే నేడు కట్టతెగినవి. శ్రీకృష్ణసందర్శనమబ్బగా ఆతని కంఠ సీమను కౌగలించుకొన్న కుంతీమహాసాధ్వి దుఃఖము బహిర్గతమై

శ్రీకృష్ణుని శరీరమును తడపినది. భగవానుని ఓదార్పుతో కొన్నిక్షణములు గడవగా, ఆ వేగము వెనుకకు మరలినది. అప్పుడుగాని ఆమె శ్రీకృష్ణున కాసనమివ్వగలగలేదు. అప్పటివరకును ఆమె వాగింద్రియము ఆమెకు స్వాధీనము కాలేదు.

ఇప్పుడామె శ్రీకృష్ణున కాసనమిచ్చినది. కన్నులనుండి రాలుచున్న కన్నీటిబిందువుల తుడుచుకొన్నది. శ్రీకృష్ణుని మంగళవిగ్రహమును కన్నులారగాంచినది. ఇప్పటివరకును దురదృష్టమున దుఃఖభాగులై యున్న బిడ్డల యోగక్షేమముల నడగదలచినది. బయటకు పొంగివచ్చిన దుఃఖము నాపుకొన్నను, లోపల తడియారని శోకము గద్గదస్వరము నివ్వగా, తొట్రుపాటుపడుచునే, శ్రీకృష్ణునితో మాట్లాడినది. ఆమె మాట్లాడుటకు మొదలు పాండవులు పుట్టిననాటినుండి నేటివరకును పడినపాట్లు వర్ణించుట. ఆ వర్ణనము భగవానునకు విన్నవించుకొన్న విన్నపము గావచ్చును. తరువాత పేరుపేరునను తన బిడ్డల యోగక్షేమముల నిట్లడిగినది.

తొలిచూలున తాను కన్నబిడ్డ ధర్మజుడు. జాంబూనదమువలె విశుద్ధవర్ణమున వెలుగొందు నాతని మేనిచాయను తలచి, ఆ శాంతమూర్తి యుదారగుణములన్నియు స్మృతికిరాగా ఆతని రూపగుణముల వర్ణించుచు, దానదయాపరుండయిన ధర్మతనూభవుడు క్షేమమేనా? అన్నది. తరువాత వారినిగూడ అట్లే వారి, వారి, పరాక్రమాది, గుణముల వర్ణించుచునే వారి క్షేమముల నడగినది.

భీముని పరాక్రమము, అర్జునుని శస్త్రాస్త్రవిద్యలును, నకుల సహదేవుల వినయసంపదయు, వారియందలి ప్రత్యేకగుణములుగాగా, ఆయా గుణముల ప్రత్యేకించి వారి నడిగినది. తరువాతది ద్రౌపది. ద్రౌపది ఆమె యనుంగు కోడలు. పుత్రులపైనగల ప్రేమకంటెను కోడలపైగల అనురాగము వేయిమడుంగులెక్కువ కుంతికి.

'సర్వైః పుత్రైః ప్రియతరా ద్రౌపదీ మే జనార్దన!'

కృష్ణా ! నా బిడ్డలందరికంటెను ప్రియతమురాలు ద్రౌపది అన్నది. ద్రౌపదికి అత్తగారియందలి భక్తికూడ అట్టిదే. కావుననే ద్రౌపది క్షేమమును ప్రశ్నించుచు 'సర్వైః పుత్రైః ప్రియతరా ద్రౌపదీ' అని వాడినది. అది యట్లుండ, కుంతి శ్రీకృష్ణునితో మాటాడునప్పుడామె పదమూడు సంవత్సరములనుండి కృశించునది పుత్రుల రాజ్య వియోగమునకు కాదన్నది. ఎందరో మహారాజు లొకప్పుడు ద్యూతక్రీడలనాడి రాజ్యముల కోల్పోయినారు. వనముల గ్రుమ్మరినారు. కాని ఏనాటి చరిత్రయందును కులకాంతనట్లు సభాస్థలియం దవమానపరచుటమాత్రము కని విని యెరుగని ఘట్టమగుటచే ఆ ఘట్టమే కుంతిహృదయమును కాల్చివైచినది. నాడు సభలో ద్రౌపదికి జరిగిన ధార్తరాష్ట్రుల ఆ యకృత్యమునుతలచియే శ్రీకృష్ణునిముందర ఆమె కన్నీటి నెక్కువగ కార్చినది. సామాన్యమున దుఃఖించుటకాదు. ద్రౌపదికి జరిగిన పరాభవముద్రను శ్రీకృష్ణుని హృదయమున చెరగరాని ముద్రనుగా నుంచినది. సభలో నాడు జరిగిన ఘట్టమును వర్ణించి, అక్కడికామె ఉపప్లావ్యమునందలి యోగక్షేమముల నరయుట పూర్తికాగా, తన జీవితచరిత్ర నొక ఇసుకపాతరవలె త్రవ్వుకొన్నది.

కుంతి శూరసేనమహారాజు యింటనే జన్మించినది. కాని కుంతిభోజునకు దత్తపుత్రికయైనది. శూరసేనునకు కుంతిభోజుడు మిత్రుడగుటచేతనే దత్తత యిచ్చినాడు. ఇప్పుడామె ఆ ఘట్టమును జ్ఞాపకమునకు తెచ్చుకొన్నది. పుట్టిననాడే నేను కన్నతల్లిని కన్నతండ్రిని వదలిన దురదృష్టవంతురాల నన్నది. తరువాతది అత్తవారింట కాలిడుట. ఇక్కడామె పడిన సుఖమేమున్నది ? వీరపుత్రులనే ప్రసవించినది. కాని వారి నెడబాసి నేటికి పదమూడుసంవత్సరములు గడచినవి. ఇది పదునాల్గవవత్సరము. ఇన్ని సంవత్సరములనుండియు, బిడ్డలు బ్రతికియుండిరను ఊహచే పుత్రవంతురాలైనదేగాని కన్నబిడ్డలను కంటచూచుకొన్న

నోచలేదుగదా ! యథార్థమునకు పండ్రెండుసంవత్సరములకాలము కంట బడని వారికి శ్రాద్ధాదికృత్యముల నెరవేర్చుటకూడ శాస్త్రసిద్ధము కాగా అట్టి ఘట్టమే నాకును వచ్చినదని ఒకమారు వలవల ఏడ్చినది.

'జీవనాశం ప్రనష్టానాం శ్రాద్ధం కుర్వంతి మానవాః'

అన్నది. అర్జునుని ప్రసవించగా ఆకాశవాణి ఏమేమో విశేషముల చెప్పినది. ఆ మాటలు వ్యర్థములైనవని యే, నేటి చరిత్ర చెప్పుచుండగా ఆమె దుఃఖమున కంతమెక్కడ ? అయ్యును ఆకాశవాణిమాటలు వ్యర్థ ప్రలాపములని ఆమె పలకలేక ధర్మదేవతకొక్క నమస్కారముగావించి భవిష్యత్తున నీ యనుగ్రహము కలుగవచ్చునన్న భావమును ప్రకటించుచు, శ్రీకృష్ణుని చూచి ఆర్తురాలైనది.

అంతతో ఆమె బాధ తీరినదా ? ఆమెకు తీరనిబాధ యొకటున్నది. పుత్రవియోగదుఃఖ మొకవంక బాధించినను అంతకంటెను బాధించునది క్రూరహృదయులగు బావకొడుకుల ఈసడింపుతో పెట్టు అన్నమును తి! బ్రదుకుట. ఆ బాధను కృష్ణునకు చెప్పుకొన్నది.

క. ఇది యెల్లను నొకతల యీ
పదమూఁడేఁడులును నాకు బావకొడుకుచే
నదయమగు కూడు గుడుచుట
యది యొకతలయయ్యె నేమియనఁగల దనఘా !

ఇట్లెన్నియో దుఃఖభాగముల వర్ణించి బాధపడినది. ఆ బాధాభాగముల నట్లుండనిండు. కుంతీమహాసాధ్వి ఈ ఘట్టమున తన బిడ్డలకిట్లు చెప్పుమని, రాచవనిత తన బిడ్డలకివ్వదగు దివ్యసందేశము నొకదాని నిచ్చినది.

శ్లో॥ యదర్థం క్షత్రియా సూతే తస్య కాలోఽయ మాగతః

క్షత్రియజాతిస్త్రీ ఎందుకొరకు బిడ్డలను కనునో ! ఆ రాచబిడ్డలు రాచబిడ్డలై వర్తించదగు కాలము వచ్చినదని నా బిడ్డలకు చెప్పుమన్నది. ఈ పలుకు ఏమి పలుకు ?

భారతదేశమున ఒక్కొక్కజాతి ఒక్కొక్కతేజమున వెలుగొందు నని ఈమె హృదయము. క్షత్రియజాతిస్త్రీ దేశరక్షణ చేయదగిన బిడ్డలను కనవలెను. రాచరికమున కిట్టి అవమానముచేయు దుష్టుల శిక్షించుట వీరల కర్తవ్యము. కావున ధర్మజాదులు ఓరిమి వహించదగుకాలము గడచిన దనియు, ఇది వారికి యుద్ధకర్తవ్యముచే రాజ్యము గైకొనదగుకాలము వచ్చినదనియి చెప్పుమన్నది. క్షత్రియజాతి జీవనము యుద్ధజీవనమన్నది.

'విక్రమే ణార్జితాన్ భోగాన్ వృణీతం జీవితాదపి
విక్రమాధిగతా హ్యర్థాః క్షత్ర ధర్మేణ జీవితః'

బ్రతుకుకంటె క్షత్రియజాతి పరాక్రమమునకు స్థానమివ్వవలె నన్నది. అంతతో ఆమె ఆగలేదు. భీమార్జునులను ద్రౌపదిచెప్పు మార్గము ననుసరించవలసినదని వారికి ఆజ్ఞయిచ్చినది. ద్రౌపది చెప్పినట్లు నడవ మనుటలో కుంతి హృదయమేమి ? ద్రౌపదికి సభామంటపమున జరిగిన పరాభవమే కుంతిని కాల్చివైచినది. పాండవులకు రాజ్యము పోవుటకామె కుందలేదు. ఆమెకు బిడ్డలదారిద్ర్యము రెండవ పక్షము. ద్రౌపది యవమానము ముఖ్యపక్షము. కుంతి వాక్యమిది.

'న దుఃఖం రాజ్యహరణం న చ ద్యూతే పరాజయః
ప్రవ్రాజనం తు పుత్రాణాం న మే తద్దుఃఖకారణం
'యత్తు సా బృహతీ శ్యామా ఏకవస్త్రా సభాం గతా
అశృణోత్ పరుషా వాచః కిం ను దుఃఖతరం తతః'

నా పుత్రుల రాజ్యహరణము నాకు దుఃఖమివ్వలేదు. జూదమునం దోడుటయు, అడవులకేగుటయు నాకు దుఃఖకారణము కాలేదు. సభ కీడ్చి ద్రౌపదిని పలికిన కఠినవాక్యములే నన్ను పీడించుచున్నవని గట్టిగ చెప్పినది. యుద్ధము తప్పదని సూచించినది.

భగవంతుడా మెకు మేనయల్లుడు. కావచ్చును. దుఃఖములరాకుండ నతడేమి చేయుగలడు ? తనను ఆశ్రయించినవారిని తన మధురసూక్తులచే ఆదరించి, ఆ దుఃఖముల ననుభవింపగల ఓరిమి నాతడు ప్రసాదించ గలడు. ప్రకృత కథాభాగమున కుంతికిచ్చిన సందేశములోని సారాంశ మిదియే.

శ్రీకృష్ణులు కుంతి నిట్లు ఆశ్వాసించినారు.

నీవు దురదృష్టవంతురాలవు కావు. నీవంటి భాగ్యవంతురాలగు స్త్రీ ఎక్కడున్నది ?

'వీరసూ ర్వీరపత్నీత్వం సర్వైస్సముదితా గుణైః'

నీవు శూరాగ్రేసరులగు పుత్రుల గని వీరమాత వైతివి. పాండురాజుకు పత్నివై వీరపత్ని వైతివి. ఈ రెంటికిని తగిన ఫలము నీ వనుభవింపవలెను. ఏమది ?...

'సుఖదుఃఖే మహాప్రాజ్ఞే త్వాదృశీ సోఢుమర్హతి'

సుఖదుఃఖముల సహించుటే పండితలక్షణమని భగవానుని మతము. కావున కుంతిని ఓ అత్తయ్యా ! అని పిలవక, 'మహాప్రాజ్ఞే!' అని సంబోధించినారు. నీవంటి విద్వాంసురాలు సుఖదుఃఖముల సహించ వలెనని శాస్త్రసారము నుపదేశించినారు. ఇక పాండవులగురించి ఆతడు చెప్పినమాట లెట్లుండెనో చూడుడు. పాండవుల నిట్లు వర్ణించినారు.

'నిద్రా తంద్రే క్రోధహర్షౌ క్షుత్పిపాసే హిమాతపౌ
ఏతాని పార్థా నిర్జిత్య నిత్యం వీరసుఖేరతాః'
'త్యక్త్వా గ్రామ్య సుఖాః పార్థా నిత్యం వీరసుఖప్రియాః
న తు స్వల్పేన తుష్యేయుః మహోత్సాహా మహాబలాః
'అంతేషు రేమిరే ధీరా న తే మధ్యేషు రేమిరే
అంతప్రాప్తిం సుఖామాహు ర్దుఃఖ మంతరమేతయోః'

శ్రీకృష్ణులు పాండవులనుగురించి వర్ణించిన ఈ ఘట్టము సర్వోపనిషత్సారము. భౌతికప్రపంచమును వదలి కేవలము ఆత్మైకనిష్ఠులగువారి లక్ష్యమేదియో, అదియే పాండవుల లక్ష్యమని కుంతికి శ్రీకృష్ణులు నొక్కి చెప్పినారు. పాండవుల దృక్పథమున వీరసుఖమే యున్నదిగాని రాజ్యసుఖములు వారి దృష్టియందు లేవనినారు భగవానులు. ఇక్కడ వీరసుఖమనగా పరాక్రమముచే సంపాదించిన రాజ్యభోగములని అర్థము కాదు. ఆత్మసుఖమని అర్థము. బుద్ధీంద్రియ మనఃప్రాణముల నాధారముగా గొని శరీరముతో అనుభవించు సుఖమునకు గ్రామ్యసుఖమని పేరు. ఈ గ్రామ్యసుఖముల, ననుభవించదగు సమయము మెలకువ, కల అను రెండవస్థలయందు మాత్రమే. వీటినే జాగ్రత్స్వప్నము లందురు. ఈ రెండవస్థలయందును మనము గ్రామ్యములగు సుఖములను అనుభవించుచుందుము. నిద్ర, భయము, క్రోధము, సంతోషము మొదలగునవన్నియు గ్రామ్యములే. వీటిని నిగ్రహించుటకు ప్రయత్నించనిచో ఈ ఘట్టమున జంతుజాలమునకును మనకును తారతమ్యములేదు. జాగ్రత్స్వప్నములను అవస్థాకాలములు రెండేకాక మూడవదగు సమయమొకటున్నది. ఆ సమయమునకు సుషుప్తి అని పేరు. ఆ యవస్థయందు మనకు జాగ్రత్స్వప్నములందు సహాయకారియగు మనస్సును, ఇంద్రియములను గూడ ఒకచోట దాగియుండును. ఇంద్రియములును, మనస్సును, జాగ్రత్కాలమున మనకు బహిర్ముఖము నందున్న ప్రపంచముతో సంబంధము కలిగి, పంచభూతముల వలన కలుగు సుఖదుఃఖములను మనమనుభవింతుము. మనము నిద్రించగా బాహ్యప్రపంచమును, భౌతికమగు మన స్థూలదేహమునువదలి, మనోమయమగు ప్రపంచమున మాత్రమే చరింతుము. దానికి స్వప్నమని పేరు. ఆ స్వప్నమున వాసనలతోగూడి మనస్సుమాత్రమే చరించును. అందనుభవింపబడు శబ్దస్పర్శాదులను అనుభవములను అనుభవించువాడును, మనస్సేగాని వేరుగాదు.

ఆ తరువాత మనస్సును, ఇంద్రియములను విశ్రాంతినొందగా వాసనలన్నియు అవ్యక్తమునందు లీనమగును. దానికి సుషుప్తి యనిపేరు. ఆ కాలమున ఆత్మయే ప్రకాశించుచు సుఖానుభవము మాత్రమే ఉండును. కాని అందు అజ్ఞానానుభవముకూడ ఉండును. ఈ సుషుప్తిని గాఢనిద్ర యనికూడా అందుము. నిద్రనుండి మేల్కాంచిన మనము నాకు హాయిగా నిద్రపట్టినది. నేనేమియు ఎరుగను అని పలుకుదుము. సుషుప్తిలోని అనుభవమునే మేల్కాంచినప్పుడు మనము స్మృతిరూపమున భావించుచున్నాము. మరల వాసనాబీజములు మొలకలెత్తుటచే ఆ సుషుప్తిలోని ఆనందానుభవము శాశ్వతమై నిలుచుటలేదు. అయ్యును, ఆ సమయమున కలుగు ఆనందానుభవమువంటి ఆనందము అజ్ఞానముతో కూడనిస్థితికి తురీయమని పేరు. అట్టి తురీయమునందుండు ఆనందము శాశ్వతము. ఆ శాశ్వతానందమునే ప్రధానలక్ష్యముగ పాండవులు భావించిరని శ్రీకృష్ణులు కుంతికి చెప్పినారు. అట్టివారినే ఉపనిషత్తులు ధీరులని వాడినది. ధీరులగువారు చివ్వరిదగు శాశ్వతానందముననే రమింతురు. జాగ్రత్స్వప్నములందలి సుఖములు దుఃఖరూపములని భావించి వీటిని సహింతురు తల్లీ ! అనినారు.

అంతతో కుంతికి అశ్వాసమను పేరుతో ఉపదేశించిన ఉపదేశము పూర్తియైనది. తరువాత కథకు వత్తము.

పాండవులు కుంతికి తెలుపుమన్న వారి వందనశతములను శ్రీకృష్ణులు తెలిపినారు. కుంతియు, పుత్రులను స్మరించగా వచ్చిన దుఃఖము నాపుగొని, కృష్ణా ! నీకు తోచినదానిచేతనే మాకు హితమును చేకూర్చుమని నిర్ణయించినది. ఇప్పుడు నన్ను ఏమిచేయమందువు ? సంధిని చేయమందువా ? యుద్ధమునే నిశ్చయింపమందువా ? అను ప్రశ్నను కల్పించుకొని ఆమె తన నిర్ణయము నిట్లు తెలిపినది శ్రీకృష్ణునకు.

'యద్య త్తేషాం మహాబాహో పథ్యం స్యాన్మధుసూదన
యథా యథా త్వం మన్యేథాః కుర్యాః కృష్ణ తథా తథా'
అవిలోపేన ధర్మస్య అనికృత్యా పరంతప'

హే ! మధుసూదనా ! నీకు ఏది ఉత్తమమని తోచునో ; అట్లే చేయమని చెప్పి, ధర్మలోపమును చేయవద్దని తన నిశ్చయమును తెలిపినది. ఇంతతో కుంతి సంభాషణ ముగిసినది. శ్రీకృష్ణులు మేనత్తకు వందన మాచరించినారు. అప్పటినుండి మరల దుర్యోధనుని గృహమున కేతెంచినారు.

## దుర్యోధనుని ఆతిథ్యము

అది దుర్యోధనుని పేరోలగము. భీష్మ ద్రోణ కృపాశ్వత్థాములును, దుర్యోధనుని మిత్రబృందమును విండియుండగా, శ్రీకృష్ణుని రథము అత్యంత రామణీయకంబగు దుర్యోధనుని మందిరమున కేగినది.

ద్వారపాలకులు శ్రీకృష్ణుని రాకను తెలుపగా దుర్యోధనుడు సపరివారముగ శ్రీకృష్ణున కెదురై ఘనస్వాగతమున ప్రత్యుత్థానము గావించి శ్రీకృష్ణుని లోనికి తీసుకుని వెళ్ళినాడు.

శ్రీకృష్ణునితోగూడ వెళ్ళిన సాత్యకి, కృతవర్మలకును, శ్రీకృష్ణునకును దుర్యోధనాదులతో పరస్పర మైత్రీభావముల సంభాషణలు నడచుచున్నవి. తరువాతది భోజనప్రస్తావనము —

దుర్యోధనుడు తాను చేయించిన వంటకముల నన్నింటివి వర్ణించుచు శ్రీకృష్ణుని భోజనమునకు లెమ్మనినాడు.

శ్రీకృష్ణుడు సర్వజ్ఞమూర్తి. భారతీయసిద్ధాంతము లోకవ్యవహారమును వేరుగావించి పరమార్థము నొక్కదానినే బోధించలేదు.

దౌత్యనిర్వహణమునకై వచ్చిన దూతకు కొన్ని నియమము లున్నవి. తానెప్పుడును తాను వచ్చిన కార్యనిర్వహణము కాకయే శత్రు

గృహమున భుజింపరాదు. దుర్యోధనుడు భోజనమున కాహ్వానింపగా మేఘగంభీరధ్వానమున ముక్తకంఠముతో తన భుజదండమును సాచి స్పష్టాక్షరములతో, శ్రీకృష్ణులిచ్చిన సమాధాన మిట్లున్నది.

కృతార్థా భుంజతే దూతాః పూజాం గృహ్ణన్తి చైవహ
కృతార్థం మాం సహామాత్యం సమర్చిష్యసి భారత.

దుర్యోధనా ! దూతలగువారు తాము వచ్చినకార్యము నెరవేరు వరకును భుజింపరు. భుజించుటే కాదు; సత్కారములనుగూడ యథావిధిగ అందుకొనరు. నేను వచ్చిన కార్యము నెరవేరగా నేను కృతార్థుడనై నీ యింట కుడుతునని నిర్ణయించినాను.

దుర్యోధనుడు దీనికేమి సమాధానమిచ్చును ? కృతార్థుడనై తినను కొనియే లెమ్మనునా ? పాండవుల కైదూతనైనను ఇవ్వతలచలేదు.

నేనిచ్చు సత్కారముల నందుకొని "భుజించుటకును, నీవు వచ్చిన కార్యము సఫలమగుటకును సంబంధము లేదనినాడు. నీకును నాకును శత్రుత్వము లేదుగావున నీవు నా యాతిథ్యమునందుకొనుటయే యుక్తము గాని, నీవు చెప్పిన సమాధానము యుక్తముగాదని విసురుగ సమాధాన మిచ్చినాడు.

దుర్యోధనుని భావసంపద శ్రీకృష్ణునకు క్రొత్తకాదు. ఒక్కమారుగ శ్రీకృష్ణుని ముఖమండలమున నవ్వు మొలకెత్తినట్లున్నది. ఆతనిచూపులు దుర్యోధనునిపైపునకేగాక ఆతని మంత్రిమండలముపైపునకు కూడ ప్రసరించినవి. అందరను కలయజూచు చూపులతో దుర్యోధనున కిట్లు సమాధానమిచ్చినారు శ్రీకృష్ణులు.

దుర్యోధనా !

'నాహం కామా న్న సంరంభా న్న ద్వేషా న్నార్థ కారణాత్
న హేతువాదా ల్లోభాద్వా ధర్మం జహ్యాం కథంచన'

కామక్రోధములకు వశుడనైగాని, ద్వేషపూరితుడనైగాని, ధన లోభముచేతగాని, తర్కబుద్ధిని సాయముగా గొని, నేనెప్పుడును ధర్మమును వదలను. ధర్మము నాధారముగాగొనియే నేను మాట్లాడుదును.

భోజ్యమగు అన్నము రెండువిధములు. తన రాకకై ఎదురుచూచు ఆప్తవర్గము అత్యంతాదరమున తన్నాహ్వానింపగా ఆ యాప్తబంధువు అందించిన భోజనము ప్రీతిభోజనము. తనకొక్కసమయమున భోజనము లభింపక ఆకొన్నవాడై తాను యాచించగా ప్రాప్తించిన భోజనము ఆపద్భోజనము. నీవు నాకిప్పు డందించు భోజనము ప్రీతిభోజనము కాదు. నేను ఆపద్గతుడనై లేను. నీవు నాకిప్పుడు పెట్టు భోజనము ప్రీతియుక్తమెందుకు కాదందువా? ధర్మరతులగు పాండవులను నిర్హేతుకముగా నీవు ద్వేషించుటే కారణము. పాండవులను ద్వేషించుట నన్ను ద్వేషించుట. పాండవులను ప్రేమించుట నన్ను ప్రేమించుట. ధర్మచారులగు పాండవులకును, నాకును భేదములేదు. పాండవుల ఆత్మ నా ఆత్మ. నా ఆత్మయే పాండవులు.

ఎవడు కామక్రోధములకు వశుడై, మోహమున బుద్ధిమంతులగు వారల ద్వేషించునో, అతడు పురుషాధముడు. లక్ష్మి ఆతనివద్ద నిలువదు. దుర్యోధనా! నేను భుజించక పోవుట నీయింటనే కాదు. కౌరవులందెవ్వరి యింటి యన్నముగూడ కుడువరానిదే. మీ యందరి యన్నమును దుష్టాన్నమే. విదురుడొక్కడే పరిశుద్ధుడు. ఆతని ఇంటియందలి అన్నమొక్కటే పవిత్రము. ఇది నా నిశ్చితమగు అభిప్రాయము—అని భగవానులు దుర్యోధనుని మందిరమునుండి అతి శీఘ్రమున బయలుదేరినారు. దుర్యోధనునకు బుద్ధిచెప్పుటకిది మొదటి ఘట్టము. ఈ ఘట్టమున భగవానులు దుర్యోధనునకే బుద్ధిచెప్పుటకాదు; పాండవుల ద్వేషించువారికందరకును శ్రీకృష్ణుని నేటి శాసనము వర్తించును. ఈ ఘట్టమున పాండవులకును తనకును వేరులేకపోవుటను స్పష్టపరచినారు. ఇది మనకు మరువ

రాని మాట. కొందరు భగవద్గీతను ప్రేమింతురు. పాండవుల ధర్మమును శంకింతురు. అట్టివారి నేమనవలెను ? వారినేమియు అనవద్దు. అట్టివారి కెప్పుడైన మీరీ శ్లోకమును వినిపింపుడు.

శ్లో॥ యస్తాన్ ద్వేష్టి సమాం ద్వేష్టి యస్తానను సమామను
ఐకాత్మ్యం మాంగతం విద్ధి పాండవై ర్ధర్మచారిభిః

పాండవులను ద్వేషించుట తనను ద్వేషించుట యట. అనగా పాండవులు మాత్రము ధర్మమూర్తులా ? అనుచో శ్రీకృష్ణునియందును అధర్మము నారోపించినట్లే. శ్రీకృష్ణునియందధర్మము నూహించి భగవద్గీత ధర్మగ్రంథమనుటలోగల వారి విశాలభావమును మీరే యూహించుకొనవలెను.

ముందు కథకు పోదము.

## విదురుని ఆతిథ్యము

అది విదురుని మందిరము. తనను సాగనంపుటకై వచ్చిన భీష్మాదులు వెనుకకు మరలగా శ్రీకృష్ణులు విదురుని మందిరాభ్యంతరమున కేగినారు.

యథార్థమునకది విదురుని యదృష్టకాలమనక తప్పదు. భక్తమనోరథస్థుడగు భగవానుడు విదురుని మనోరథమును పరిపూర్ణము గావింప నేడేతెంచినాడు. ఆతడు ప్రత్యేకముగ విదురుని యతిథిసత్కారము నందుకొనదలచినాడు. రాజాన్నము లాతనికి రుచింపవు. కటికి యటుకు లాతని కిష్టము. గోపకాంతల యధరామృత మాతనికి ఎంగిలి కాదు. తిన్నడు తెచ్చిపెట్టిన మాంసఖండము లాతనికి నింద్యములైనవా ? వేదవాదుల యజ్ఞవేదికలయం దాతడు మడికట్టుకొన్నగాని భుజింపడు. వారుచ్చరించు మంత్రరాజములలో స్వరదోషములేమైన వచ్చుచో ఆతడు సహింపడు. వారికి ప్రాయశ్చిత్తములు తప్పవు. విదురుని గృహాభ్యంతరము నందా విదురుడు సమర్పించు సరసాన్నముల నందుకొనదలచిరాగా,

విదురుడు ముందుగ ఆతనికి షోడశోపచారముల నర్పించి పూజించదలచి నాడు. కావున భగవానుని ఒక యాసనమున కూర్చొనబెట్టినాడు. ఆతనితో వచ్చిన వేదవిదులగు బ్రాహ్మణ బృందమునంతను ఆతని చుట్టును కూర్చుండ నియోగించినాడు. భగవానులు కూరుచున్న పీఠమునకు ముందు తాను తన అర్ధాంగియును నిలిచినారు. తమ ముందుంచుకొన్న పూర్తి కలశముతో భగవానునకు పాద్యమర్పింపవలెను.

సతీలలామయగు విదురుని యర్ధాంగి తన పవిత్రపాణితలము లతో పూర్ణకుంభము నెత్తి పవిత్రపాదుని పాదపద్మముల నీళ్ళుంచగా విదురుడు భగవానుని పాదముల కడిగి, బ్రహ్మాదులకందరకును శిరో ధార్యములగు నా పవిత్రజలముల తన శిరముపై జల్లుకొని, భార్యశిరమున చల్లినాడు. భక్తియుతములై విదురుని యుపచారము లన్నియు పూర్ణము లైనవి.

తరువాతేమి జరిగినది ?

శ్లో॥ తతః క్షుత్తాన్నపానాని శుచీని గుణవంతి చ
ఉపాహర దనేకాని కేశవాయ మహాత్మనే.

భగవానునికొరకేర్పరచిన అన్నాదికములన్నియు ఆతని కముచ్చ బడినవి. కాని భగవానులు తానారగించుటకుముందే బ్రాహ్మణుల కర్పించి తరువాత తానారగించి, విదురుని కృతార్థుని గావించినారు. నాడు విదురుని గృహము స్వర్గసీమయైనది.

అట్లా పగలు గడచినది. నాటి రాత్రికూడ శ్రీకృష్ణు లక్కడనే వసించినారు. ఆ రాత్రికాలమున భగవానుని భోజనమజ్జనాదికములన్నియు కాగా విదురుని శయ్యాగారమున భగవానునికై హంసతూలికాతల్పము మమర్చబడినది. అది భగవద్భాగవతుల ఏకాంతసన్నివేశము. కావున కానాటిరాత్రి భగవద్భాగవతులిద్దరును మౌనముగ నిద్రను సేవింతురా ?

విదురుడమర్చిన శయనతలమున భగవానులు పవ్వళించగా విదురుడు భగవానుని పాదతలముల నొత్తుటకై ఆ మహనీయుని పాదారవిందముల దరిజేరినాడు. భగవంతుని పాదములు విదురుని తొడలపై నుంచబడినవి. విదురుడా పాదపద్మముల తన కరకమలముల సుకుమారముగ నొత్తుచుండ కొద్దికాలము గడచినది. భగవత్పాదారవిందముల స్పర్శసుఖ మాతనికి అఖండానందము నొసంగగా ఆ క్షణము లాతనికి సమాధి నొసంగినవి.

విదురునకు శ్రీకృష్ణులిప్పుడు వచ్చుట యుక్తముకాని కార్యమని అభిప్రాయము కలిగినది. తన భావమును శ్రీకృష్ణున కిప్పుడు తప్పక తెలుపవలెను. దుర్యోధనుడు దుర్మార్గుడు. ఇతడు తన ఇష్టదైవము. ఈ మహనీయుని సంధివాక్యముల నాతడు పెడచెవిని బెట్టునని, విదురుడెరుగును. భగవానుని హితబోధలు దుర్యోధనుని మూర్ఖభావమును మరలింపలేవనుట త్రికాలసత్యమనియే విదురుని దృఢనిశ్చయము. అదిగాక దుర్యోధనుని మిత్రబృందమంతయు విషవలయమువలె ఆతని సేవింపగా, పదకొండు అక్షౌహిణుల సైన్యము నాతడు యుద్ధమునకై సిద్ధముగావింపగా, అట్టి విషవలయమున నా ప్రేమమూర్తి అడుగిడుటయా ? ఈ మహనీయు డపేక్షించిన సంధికార్యము నెరవేరునదికాదు. ఏదిఏమైనను నా ప్రభువునకు నా హృదయమును తెలిపి, నా నిజభావము నీతని పాదములకడ సమర్పింతునని నిశ్చయించుకొనినాడు. శ్రీకృష్ణుని విదురుడిట్లు సంబోధించినాడు.

విదు – భగవత్పాదులగు తామీ దుర్యోధనుని కాలుష్యకూటమునందు ఏల యడుగిడితిరి ?

కృ – భరతవంశమును భద్రపరచుటకు.

వి – అది దుర్యోధనునిపైన ఆధారపడియున్నది.

కృ – అవును.

వి - కావున మీరు కోరివచ్చిన సంధికార్యము కుదరదు. దుర్యోధనుడు మీ సుహృద్బోధల వినడు. అతడు మూర్ఖుడు. పాండవులతోటి యుద్ధమునే అతడు నిశ్చయించుకొనినాడు. భీష్మ ద్రోణుల బాహు బల మొకవంక ఆ మందుని యుద్ధమునకు పురిగొల్పగా కర్ణు డొక్కడే పాండవుల జయించి ఈ యఖండ సామ్రాజ్యలక్ష్మిని తన యరచేత నుంచగలడన్న మూర్ఖధైర్యమాతనికి వదలకుండ యున్నది. అదిగాక అతడు బలసమేతుడై, మదగర్వమున గర్వించియున్న దుష్టహృదయుడు. ఆ మూర్ఖునకు తోడై వచ్చిన రాజమండలమును అట్టిదే. కావున ఆ దుష్టక్షత్రమండల మధ్య మున నిలిచి, దుర్యోధనునకు హితబోధలగావించుట యుక్తము గాదని నా భావము. దేవరవారిపై గల సుహృత్స్నేహభక్తిప్రపత్తు లచే ఇట్లు విన్నవించితినని విదురుడు మౌనమును ధరించినాడు. అప్పటికి రాత్రిభాగము చాల గడిచియుండవచ్చును. అయ్యును శ్రీకృష్ణులు మానవుని కర్తవ్యమేమి ? అను విషయమును ప్రబోధించదగు సమయమిది యగుటచే తన సిద్ధాంతసూత్రమును విదురున కెరింగింపదలచినారు. విదురు డెరింగించిన విషయము శ్రీ క్రృష్ణుని నిశ్చయములు కాకపోలేదు. అయ్యును తన కర్తవ్య తను తానెట్లు నెరవేర్చునో భక్తులకు తెలుపుట అవసరము. భగ వానులు తనరాకకు గల ప్రాధాన్యమును విదురునకిట్లు తెలిపినారు.

కృష్ణ - విదురా ! నా రాకకొక ప్రత్యేకతయున్నది. దుర్యోధనుని యొక్కయు, దుర్యోధనునకు సాయపడవచ్చిన దుష్టభూభుజుల యొక్క దౌరాత్మ్యము నెరిగియే నేను వచ్చితిని.

విదు - తెలిసియే విచ్చేసితిరా ?

కృష్ణ - అవును. ఈ ఘట్టమున దుర్యోధనుడు నా మాటను విని యుద్ధ మును మానునని కాదు. దుర్యోధనుని మూర్ఖత్వము దేశోపద్రవ

కారణము. ఇట్టి విపత్తునుండి సంరక్షించుటకు చేయు ప్రయత్నము ధర్మకార్యము. తన శక్తివంచనలేకుండ ధర్మకార్యము నే మానవుడైన ఆచరించుచో ఆ ధర్మఫల మాతనికి దక్కును. ఈ విషయమున నాకు సంశయము లేదు.

'ధర్మకార్యం యతన్ శక్త్యా నోచేత్ ప్రాప్నోతి మానవః
ప్రాప్తో భవతి తత్పుణ్యం అత్ర మే నాస్తి సంశయః'

ఇక పాపముసంగతి ఏమందువా ?...

'మనసా చింతయన్ పాపం కర్మణా నాతిరోచయన్
న ప్రాప్నోతి ఫలం తస్యే త్యేవం ధర్మవిదో విదుః'

పాపమును మనస్సుచేత చింతించినను దానిని ఆచరణయందుంచని వ్యక్తి ఆ పాపఫలమును పొందనేరడవి ధర్మవిదుల నిశ్చయము. కావున కౌరవులయందు పుట్టిన ఈ మహాఘోరవిపత్తును తప్పించుటకు నా యథాశక్తిగ సత్యబుద్ధితో ప్రయత్నించెదను. నా ప్రయత్న పరిణామమునుగురించి నా కక్కరలేదు. ఇది యిట్లుండ నా మిత్రమండలియగు పాండవులకిది కష్టకాలము. మిత్రులకు సంప్రాప్తించిన వ్యసనమును తొలగింప ఎవ్వడు ప్రయత్నింపడో అతడు నింద్యుడు.

'వ్యసనే క్లిశ్యమానం హి యో మిత్రం నాభిపద్యతే
అనర్థాయ యథాశక్తి తన్నృశంసం విదుర్బుధాః'

విదురు — పుట్టినది మొదలు మూర్ఖుడై వర్తించు దుర్యోధనుడు ఇప్పుడు మారునా ?

కృష్ణు — మారకున్నను మనమెవ్వని హితమును కోరుదుమో, వారు మనలను నీ వెవ్వడవు ? నాకు చెప్పుటకని జుట్టుపట్టి గెంటువరకును మిత్రునకు హితమును బోధించవలెను. ఇది మానవుని కర్తవ్యము.

విదు - బాగున్నది. తాము సంకల్పించిన ధర్మ ప్రబోధము యుక్తమే. జ్ఞాతులమధ్య వచ్చిన ఈ భేదమును తొలగించి రాచకుటుంబముల మృత్యుముఖమున బడకుండ మీరు ప్రయత్నించుచుంటిరి. అయ్యును, దుర్యోధను డతిక్రూరుడు. తమ కేమైన యాపద కల్పించునేమోయను భీతి నన్ను వదలుటలేదు.

కృష్ణ - విదురా ! సింహము గర్జించుచో నీచమృగములా మృగరాజు నేమి చేయగలవు ? దుర్యోధనుడు నా ధర్మబోధల వినక నన్ను పాండవపక్షపాతిగా తలంచుచో ; వారికి మృత్యుకాలము సమీపించినదనియే నిర్ణయము. ఆతడును ఆతని మిత్రులునుకూడ నన్నేమియు కదలింపలేరు. నీవు నాయందలి ప్రేమ వాత్సల్యములతో చెప్పినమాటలు నన్నాదరించినవి. కాని నా ప్రయత్నమును నేను చేతును. విదురా ! ఇక పరుండమని ఆజ్ఞయివ్వగా విదురుడు శ్రీకృష్ణుని శయనతలమును విడిచినాడు. భగవానులును ఆ మృదు తల్పమున సుఖనిద్రను చెందగా నాటిరాత్రి పుణ్యనిశియైనది.

మనకీనాటి యుపన్యాసము ముగిసినది. భగవానుని కౌరవసభా ప్రవేశమును ఆ మహనీయుని రాయబారసరణియు రేపు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# శ్రీకృష్ణుని సభాప్రవేశము

మహాశయులారా ! నేటి ప్రసంగమేమి ?

మనమిప్పుడు కృష్ణరాయబార కథాఘట్టము నందుంటిమి కదా !

నేడు శాంతిదూతయైవచ్చిన శ్రీకృష్ణుడు కౌరవసభామంటపమున తన దౌత్యకళాప్రాభవమును ప్రదర్శించుచు యావద్భారతజాతికిని చెవుల పండువుగ గావించిన ఆ మహనీయుని దివ్యవాణియే నేటి కథాప్రసంగము.

భగవానుడు నేడు విదురుని మందిరాభ్యంతరమునుండి కౌరవసభా స్థలికి రావలెను.

అది ప్రాతఃకాలము. విదురుని గృహమునందు విడిసిన శ్రీకృష్ణుని వందిమాగధుల స్తోత్రపాఠములతో మంగళవాయిద్య ఘోషములతో నిద్రను మేల్కాంచినారు. శ్రీకృష్ణుడు సచ్చిదానంద బ్రహ్మము. అయ్యును అతడు కర్మయోగి. జ్ఞానులగువారు వైదికములగు కర్మల నాచరింపకపోవుట యనునది లేదు. వారును ఆత్మార్పణముగ కర్మల నాచరించుచునే యుందురు.

శ్రీకృష్ణుడు విదురమందిరమున నిద్రను మేల్కాంచి, నిత్యకర్మల నాచరించిరనియే, వ్యాసులు వర్ణించినారు. అది యట్లుండనిండు. ప్రకృత మున శ్రీకృష్ణుడు సంధ్యాదుల నిర్వర్తించుచుండెను. ఆ మహనీయుని అనుష్ఠానమింకను పూర్తికాలేదు. ఇది విదురుని మందిరమున శ్రీకృష్ణుని గురించిన కథాభాగము.

ఒక్కమారు మనము ధృతరాష్ట్రుని మందిరమువైపుకు మరలు దము. నాడు ధృతరాష్ట్రుని కొలువుకూటమొక రణరంగమువలెనున్న

దనుటకు సందేహములేదు. యుద్ధభటులతో నానాదేశాగత రాజమండల మంతయు ఆ సభనలంకరించినది. ధృతరాష్ట్రుడు తన సింహాసనము నధిష్ఠించినాడు. ఆ కొలువుకూటముననే సర్వతోభద్రపీఠమొకటి నిర్మిత మైనది. దానిని ధృతరాష్ట్రుడే నిర్మింపజేసినాడు శ్రీకృష్ణభగవానుని కొరకు. భీష్మ ద్రోణాదులును ఆ సభయందుండిరి. ఇక భగవానులా భద్రపీఠము నలంకరింపవలెను. నాటి ప్రాతఃకాలమున కొంత సమయము గడచినది. భగవానులింకను విదురుని గృహాభ్యంతరమునుండి బయలు దేరలేదు.

ఆతని కాహ్వానమందవలెను. దుర్యోధనుడు శకునితో కలసి భగవానుని ఆహ్వానింప విదురుని మందిరమున కేగినాడు.

విదురుని మందిరాభ్యంతరమున శ్రీకృష్ణుని నిత్యకృత్యములు సమాప్తమైనవి. దుర్యోధనుని ఆహ్వానము శ్రీకృష్ణున కందినది. ఇక శ్రీకృష్ణుడు కౌరవసభకు బయలుదేరవలెను.

అది శైబ్య, సుగ్రీవ, మేఘ, పుష్ప, వలాహకములతో గరుడ ధ్వజ చిహ్నముతో కూర్చబడిన భగవానుని దివ్యస్యందనము.

భగవానుని రథము ననుసరించియే విదురుని రథము. విదురుని రథము వెనుక శకుని దుర్యోధనుల రథములు. వారి రథముల వెనుక కృతవర్మ సాత్యకుల రథములు. సాత్యకి కృతవర్మల రథముల ననుస రించి మరికొందరి వృష్ణివీరుల రథములును బారులు తీర్చినవి.

భగవానులు తన యప్రాకృత దివ్యమంగళవిగ్రహమున కను గుణ్యములగు అలంకారముల గావించుకొనినారు. పట్టుపీతాంబర మాతని వినీల దేహమునకొక వినూత్నాలంకారముగాగా, సౌవర్ణోత్తరీయ మాతని భుజస్కంధమున మెరుపుతీగవలె మెరసినది. కౌస్తుభమణి కంఠసీమ కలంకృతమైనది. బ్రాహ్మణుల యాశీర్వాదములందినవి. అంతతో శ్యామ సుందరులు రథము నధిరోహించినారు.

భగవానుని రథము కదలినది. తోటిరథములును కదలినవి. భేరీ ఝాంకారముల మారుమ్రోతల మధ్యలో శంఖతూర్యనినాదములు చెల రేగగా కౌరవసభకు భగవానుని పయనము సాగినది.

భగవానులు కేవలమొక రాజదూతయేకాదు. అదియొక దివ్యచైత న్యము. సర్వోత్కృష్టమగు ఆత్మ. అది ఆనంద కందము. కావున రాజమార్గమున పయనించు భగవానుని దర్శింపవచ్చిన ప్రజానీకము భగ వానుని రథమును వేగముగ పయనింపనివ్వక చూడముచ్చపై యున్న ఆ మంగళవిగ్రహమును దర్శించుచుండిరి.

తన గమనమును నిమిత్తముగా గొని రాజమార్గము లన్నియు కస్తూరికాజలముల తడపబడి సువాసనల గుబాళింపగా, సౌధాంతర్భాగ ముల నుండి పురపురంధ్రీమణులు తమ క్రీగంటి ప్రసారముల ప్రసరించి తన మధురమూర్తిని పూజింపగా; తన్ను దర్శించువారల ననుగ్రహించుచు, తన్ను సత్కరించువారల కటాక్షించుచు ; మందగమనమున గమనించు రథాంతర్భాగమునుండియే హస్తినాపురవాసుల ననుగ్రహపాత్రుల గావించుచు కౌరవసభాప్రాంగణ ముఖద్వారమున తనరథము నాపినారు భగవానులు.

భేరీభాంకారములు మరల మ్రోగినవి. దానితో సభాస్థలియందలి రాజవరుల హృదయములును ఉప్పొంగినవి.

ఎందరో రాజులు శ్రీకృష్ణుని చాలకాలము క్రిందట చూచినారు. నేడు మరల ఆతని దర్శన మబ్బినది. వారి హృదయము లేల యుప్పొంగవు ?

రథ మధ్యమునుండి భగవానులు దిగినారు. శ్రీకృష్ణున కిరు ప్రక్కల విదురసాత్యకులు, అగ్రభాగమున కర్ణదుర్యోధనులు, వెనుక ప్రక్క కృతవర్మయు వృష్ణివీరులును ఉండిరి. కావున తన కిరుప్రక్కల నున్న విదుర సాత్యకుల పాణితలములతో తనపాణితలముల స్నేహము గావించుకొని సభను ప్రవేశించినారు.

భగవానుని తేజము స్వయంప్రకాశము. ఆతని తేజము నాధార ముగా గొనియే జగత్తంతయు ప్రకాశించుచున్నదని ఉపనిషత్ప్రవస్థ్యా పచించును. మిణుకు మిణుకుమను నక్షత్రకాంతులన్నియు రవితేజమునం దస్తమించునుగదా !

భగవానుని కౌరవసభాప్రవేశమును వ్యాసమునీంద్రు లిట్లు వర్ణించినారు :

'జ్యోతీంష్యాదిత్యవద్రాజన్ కురూన్ ప్రచ్ఛాదయన్ శ్రియా'

రవిమండల కాంతులు నక్షత్రకాంతుల కప్పినట్లు భగవానుని తేజము కౌరవుల నాచ్ఛాదించినదట. అనగా తన తేజముతో కౌరవతేజ ముల పరాభవించుచునే సభను ప్రవేశించినారట. ఈ వర్ణనలోని సౌందర్య మేమి ? దుర్యోధనుడు శ్రీకృష్ణునకు తలపెట్టిన పరాభవము కౌరవులకు సాధ్యముకాదని చెప్పుచు ఆతని మూర్ఖత్వమును ప్రకటించినారు.

కథకు పోదము —

భగవానులు సభయందు ప్రవేశించగనే ధృతరాష్ట్రుడు తన సింహాస నమునుండి లేచినాడు. భీష్మద్రోణులును లేచినారు. కౌరవసభాస్థలి యంతయు ఒక్కమారు లేచినిలబడినది. ధృతరాష్ట్రాది రాజవరులందరును భగవానుని రాకకు లేచినిలవగా, సభాసదులెవ్వరు ఆసనములపై కూరుచుందురు !

తన ముఖమండలమున చిరునవ్వు మొలకెత్తగా భగవానులు ధృతరాష్ట్రుని ముందుగ పలకరించినారు. భీష్మద్రోణులను గౌరవించి నారు. తనను పలకరించినవారి పలకరింపులకు తగుసమాధానముల నిచ్చి నారు. ఇక తనకొరకేర్పరచిన సర్వతోభద్రపీఠము నధిష్ఠించవలెను.

భగవానునితోపాటు నాడు ఆ సభాస్థలి నలంకరింపదగిన మహ నీయులు మరికొందరు లేకపోలేదు. ప్రకృతమున వారీ సభాస్థలియం దాసీనులైలేరు. వారు నారదాది మునీంద్రులు. భగవానునిరాకతోపాటు వారును వచ్చి వియత్తలమున నిల్చినారు. వారు ఆసనముల నధిష్ఠించిన

గాని తాను భద్రపీఠము నధిరోహించరు. వారి నెవరు ఆహ్వానించి పూజించవలెను ? దుర్యోధనుడందు కర్హుడుగాడు. ధృతరాష్ట్రుడు గ్రుడ్డి రాజు. కావున వారిని కూర్చుండబెట్టదగు ఛత్రశేఖరుడు శాంతనవు డొక్కడే. వారి రాకను భగవానులు భీష్మునకే తెలిపినారు. ఒక్కక్షణ కాలముననే ఆ యోగిపుంగవుల కాసనము లమర్చబడినవి. వారును సభా ద్వారమునకు అంతలోరాగా, పాద్యాదివిధులతో వారు కౌరవసభాస్థలి నధిష్ఠించినారు. అంతియే. భగవానులా క్షణముననే సర్వతోభద్ర మంటపము నధిష్ఠించగా రాజాధిరాజులందరును వారివారి ఆసనములందు కూర్చొనినారు.

మరి శ్రీకృష్ణుని వెంటనంటివచ్చిన సాత్యకి కృతవర్మ లెక్కడ కూర్చుండిరి ? దుశ్శాసనుడు సాత్యకికిని, వివింశతి కృతవర్మకును స్వయముగ ఆసనముల నమర్చగా సాత్యకి కృతవర్మ లిద్దరును, శ్రీకృష్ణున కత్యంత సమీపముననే కూర్చుండుట జరిగినది. కర్ణ దుర్యోధను లెక్కడ ? కర్ణ దుర్యోధనులిద్దరును ఒకే ఆసనముపైన శ్రీకృష్ణునకు దగ్గరగనే కూర్చుండిరి. విదురుడో ? అతడు చాల దీర్ఘదర్శి. విదురుడు తన చేతిని శ్రీకృష్ణుని యాసనమున కానించియే భగవానుని వెనుక తన మణిపీఠమున కూర్చొనినాడు. శకుని ఎక్కడుండెను ? తన పుత్రమిత్రులతో కూడి వేరొకచో కూర్చుండెను. నేటి కౌరవసభాస్థలి మహనీయులతోనే గాక దుష్టచతుష్టయముతోగూడియు కలకల లాడినది.

ఇంతవరకు శ్రీకృష్ణుని సభాప్రవేశ కార్యక్రమమైనది. ఇక శ్రీకృష్ణుని గంభీరోపన్యాసమును మీరు వినవలెను.

సభ నిస్తరంగసముద్రమువలె నున్నది. నల్ల అగిశెపూవురంగు దగిలియున్న శ్యామసుందరుని విగ్రహము పదియారువన్నె పసిడితో కూర్చిన భద్రపీఠమునధిష్ఠించగా, ఆ విగ్రహము బంగారమునందు పొదిగిన ఇంద్రనీలమణివలె భాసించి, ఆ యుజ్జ్వల నీలమణి సభాస్థలికొక

వినూత్నాలంకారముల నిచ్చుటచే సభాసదుల దృష్టులన్నియు, ఆ ఇంద్ర నీలమణి కాంతులనే తమ నేత్రములతో పానము చేయుచున్నవి. యథార్థమునకా భద్రపీఠము నధిష్ఠించిన దొక అవయవమూర్తి గాదు. అది అమృతభాండము. కావుననే రాజమండలమంతయు ఆ భాండమును చూచుచు తృప్తినొందలేక కిక్కురుమనక కూర్చుండినది.

వ్యాసభగవానులీ కౌరవసభామధ్యమునందు కూర్చొన్న సగుణ బ్రహ్మము నెంతచక్కగ యుపాసించి వర్ణించెనో శ్లోకమునుగూడ వినుడు.

'అతసీపుష్పసంకాశః పీతవాసా జనార్దనః
వ్యభ్రాజత సభామధ్యే హేమ్నీవోపగతో మణిః'

వ్యాసమునీంద్రు లిక్కడనే ఈ మూర్తిని మరకతమణిగా నిర్మించుట కాదు. గోపికాగణ మధ్యమునందును ఈతని మరకతమణినిగానే వర్ణించినారు.

'మధ్యే మణీనాం హైమానాం మహామరకతో యథా'

అని వర్ణించినారు. గోపికలందరును సువర్ణవర్ణమున విలసిల్లగా భగవానుల మరకతమణి యయ్యెను.

ఇక మన సభను మరొక్కమారు పరికింపుడు.

'తతస్తూష్ణీం సర్వమాసీత్ గోవిందగతమానసం
న తత్ర కశ్చిత్ కించిద్వ్యాజహార పుమాన్ క్వచిత్'

శ్రోతలారా! కౌరవసభాస్థలియంతయు నిశ్శబ్దమై గోవిందుని పైననే తమమనసుల నిలిపి, ఆ నిర్వికారబ్రహ్మము శబ్దరూపము నెట్లు ధరించునోయని చూచుచున్నది. మీరును మీ మనస్సులనట్లే యుంచుడు. అనగా భగవానుని నోటవచ్చు పలుకుల కెదురుచూచుచుండిరని భావము.

సభాస్థలియందర్థవంతములగు పదములకూర్చి, వర్ణోచ్చారణము స్పష్టముకాగా, భావగాంభీర్యమునకు కొదువలేక, తానందించు భావములు

వినువారల హృదయమునందు హత్తుకొనునట్లుపన్యసించు ఉపన్యాసకుడు పదివేలమందిలో ఒక్కడుండునని అభిజ్ఞులనానుడి.

అంతేగాక వక్త యగుటకు జన్మసిద్ధములగు అర్హతలుకూడ కలిగియుండవలెను. అందు మొదటిది కంఠధ్వని. రెండవది పలుకుబడికి అర్హమగు పలువరుస. ఇవి జన్మసిద్ధములు కావలెను. విషయ ప్రతిపాదనమునకు వలసినది భాషాభిజ్ఞత. ఈ విషయమును రామాయణ మహాకావ్యమున వాల్మీకియు, భారతమున వ్యాసులును చక్కగ విశద పరచినారు. రామాయణమున హనుమంతుడు ముఖ్యదూత. భారతమున శ్రీకృష్ణులు ముఖ్యదూత. హనుమంతుని విద్యార్హతలను, ఆ యర్హతల ననుసరించిన కంఠమాధుర్యమును, భావప్రకటనలోని ఔచిత్యమునుకూడ వాల్మీకి వర్ణించినారు. అట్లే వ్యాసభగవానులుకూడ శ్రీకృష్ణబ్రహ్మము మాటాడుటకు ప్రారంభించు నప్పుడే ఆ మహనీయు నిట్లు వర్ణించినారు.

'వాక్యమభ్యాదదే కృష్ణః సుదంష్ట్రో దుందుభిస్వనః
జీమూత ఇవ ఘర్మాంతే సర్వాన్ సంశ్రావయన్ సభాం'

శ్రీకృష్ణులు చక్కని పలువరుసగలిగి, దుందుభివలె మ్రోగునట్టి కంఠస్వరముతో వర్షాకాల ప్రారంభమునందలి మేఘమువలె ఆ సభయం దున్న ప్రతి ఒక్కనికిని స్పష్టముగా వినబడునట్లు మాట్లాడెనట. ఈ శ్లోకమున 'సుదంష్ట్రః' 'దుందుభిస్వనః' అను రెండువిశేషణములను వక్తకు వాడి, వాక్యమునకు మేఘము నుపమించుట గమనార్హము.

ఈ వర్ణన మెందుకు ?

మనము మాటాడుమాటల కాధారము వర్ణములు. ఆ వర్ణముల యుత్పత్తి కాధారము నాదము. ఆ నాదము సూక్ష్మాతిసూక్ష్మమై మన నాభిస్థానమునం దుండి మన మేమాటల నుచ్చరింపదలంతిమో ఆ వర్ణములరూపమున బహిర్గతమగును. మన మిప్పుడు మాటాడుకొను,

లేదా పాడుకొనునట్టి శబ్దములోని వర్ణము లన్నియు కలపి ఏబదియైదు. ఆ యేబదియైదు వర్ణముల యుత్పత్తికిని ఆధారము మొదటిదగు నాదము. ఆ నాదము అఖండమైనదే యయ్యును బహిర్గతమగునప్పుడు అనేక రూపాంతరములనందును. అది రూపాంతరముల నొందుట కాధారము మాటాడునట్టి వ్యక్తి. వ్యక్తి ననుసరించి ఆ నాదము అనేక నామములతో వ్యవహరింపబడును. సంగీతమునందున్న రాగములన్నియు ఒకే ప్రాణవాయువుపై ఆధారపడియున్నను ఆ ప్రాణవాయువు చరించునట్టి ఉపాధి ననుసరించి భిన్నభిన్న రాగములై వ్యవహరింపబడుచున్నవి. అట్లే ఈ నాదము నెమలికంఠమునుండి వెలువడగా మయూరధ్వని యను పేరు వడసినది. హంసయొక్క కంఠమునుండి బహిర్గతమై హంసధ్వని యైనది. ఒక భేరీని మ్రోగించగా దానినుండి వెలువడు నాదము భేరీధ్వానము.

ప్రకృతమున శ్రీకృష్ణుని నాదము దుందుభి మ్రోగినట్లు మ్రోగిన దని వర్ణించినారు వ్యాసులు. కావున 'దుందుభిస్వనః'—ఇక అత డెట్లు మాట్లాడెను ? తొలకరి మేఘమువలె గర్జించెను. ఉరుమువలె సర్వలోక విదితమగునట్లు నుడివెను. ఇక్కడ వ్యాసులు వర్షాకాలమేఘ మనక ఘర్మాంతపదమును వాడినారు. పదమూడు సంవత్సరములనుండి పరితపించు పాండవుల తాపనివారకములును, క్రియావంతములును అగు వాక్యములేగాని వ్యర్థవాక్యములు కావనియు, ఇక కాలవిళంబము లేదనియు సూచించినారు. అంతేగాక, అతని మాటలు స్వార్థరహితములని మేఘ ముపమింపబడినది. మేఘము వర్షించు వర్షమునకు పక్షపాతము లేదు. మేఘము తన ధనమును సర్వత్యాగము చేయును. మేఘము సముద్రోదకములను గ్రహించి, శుద్ధజలము నిచ్చును. భగవానుడను మేఘము వేదసారమునే యుపన్యసించుచున్నదని వ్యాసుని భావము.

ఇక 'సుదంష్ట్రిః' అను పదమును విచారింతము.

ఎవ్వరైనను మాటాడునప్పుడు వర్ణోచ్చారణము స్పష్టమగుటకు పలువరుస బాగుండవలెను. మనముచ్చరించు శబ్దము బహిర్గతమగుటకు అంతః ప్రయత్నము బాహ్యప్రయత్నమునను రెండవస్థలున్నవి. అంతః ప్రయత్నమునకు మొదలు మనము మాటాడవలెనని సంకల్పించు కాలమే. ఆ సంకల్పము కలిగినవెంటనే మనలోని వాయువు మూర్ధస్థానమునకు వచ్చి, ఆ వాయువే ముఖమునుండి వెలువడునప్పుడు ఒక్కొక్క వర్ణము ఒక్కొక్క చోటును ఆధారముగా గొని బహిర్గతమగును. అప్పుడు మన పలువరుస హెచ్చుతగ్గులతో నున్నచో వర్ణములు స్పష్టములై ఉండవు. కావున వ్యాసులు 'సుదంష్ట్రః' అనినారు.

ఇక భగవానుని ప్రబోధక్రమమును పరికింతము.

భగవానుని ప్రబోధము ధృతరాష్ట్రు నుద్దేశించియే నడచినది. పాండవుల యభిప్రాయముల తెలిపినదికూడ ధృతరాష్ట్రునకే. ధృతరాష్ట్రుడు తన పుత్రుని తీర్చిదిద్దమనికోరగా అతని మాట నాధారముగాగొని దుర్యోధనునకుకూడ హితోక్తులను చెప్పినారు. శ్రీకృష్ణుడు దుర్యోధనునితో మాట్లాడుటకు పూర్వము నారదాదిమునీంద్రుల హితబోధలు నడవగా, ఆ మునిచంద్రులను, తిరస్కరించి మాట్లాడిన దుర్యోధనుని బుద్ధిమంతుని గావింపుమని ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణుని అర్థించగా అతనితో మాట్లాడుట జరిగినది. తరువాత జరిగిన ఘట్టమంతయు శ్రీకృష్ణుని ప్రబోధముకాదు. దుర్యోధనున కిచ్చిన సమాధానములు. దీని అంతరార్థమేమి? పాండవుల కన్యాయము జరుగుటకు ముఖ్యమగు దోషము ధృతరాష్ట్రునిదే.

యథార్థమున పాండవులకు రాజ్యమిచ్చు నధికారము దుర్యోధనున కెక్కడిది? దుర్యోధనుడుచేయు ప్రతి పనియు ధృతరాష్ట్రుని యనుమతిపైననే జరిగినది. తులువతనమున ప్రవర్తించు దుర్యోధనుని దుశ్చేష్టల ననుమతించు దోషము ధృతరాష్ట్రునిది. ధృతరాష్ట్రునిలోని

ప్రధానగుణము లౌచిత్యము. ధర్మజుడు శ్రీకృష్ణులు రాయబారమునకు వచ్చుటకుముందు తన కష్టమును విన్నవించుకొనుటలో లౌచిత్యమను గుణమును గురించి ప్రధానముగ వర్ణించి, ఈ లౌచిత్యముయొక్క పరిణామమే ధార్తరాష్ట్రుల దుండగములు గావున ఆ లౌచిత్యమునుగురించిన ధర్మప్రబోధము ధృతరాష్ట్రున కవసరమని తెల్పినాడు. దాని ననుసరించియే భగవానులు నేను ధార్తరాష్ట్రులకు ధర్మప్రబోధమును చేసి, వారి దోషములను వారికిని, ప్రపంచమునకునుకూడ తెలిపి, మీ ధర్మము నుద్ఘాటించుటకు హస్తినాపురి కేగెదననినారు. కావున ధృతరాష్ట్రు నుద్దేశించియే శ్రీకృష్ణుని ప్రబోధము నడచినది. 'ధృతరాష్ట్రమభిప్రేక్ష్య' అని మూలము.

శ్రీకృష్ణుని ప్రబోధమున కుపక్రమ మిది.

రణరంగమున రాజకుటుంబములేవియు నాశమొందకుండగనే కౌరవ పాండవులకు శాంతి వాటిల్లగలదను నిశ్చయముతో తనకు తానై శమమును కల్పింపుమని ధృతరాష్ట్రుని యాచింపవచ్చెనట.

శ్లో॥ కురూణాం పాండవానాం చ శమస్స్యాదితి భారత
అప్రణాశేన వీరాణా మేతద్యాచితు మాగతః

ఈ యుపక్రమములోని భావ సౌందర్యమేమి?

పాండవు లేమైన యుద్ధమునకు జడిసి నన్ను రాయబారమున కంపిరనుకొందువేమో! యుద్ధభయముచే వారు పంపుట కాదు. ధర్మజుడు దయామయుడై యుద్ధమునకు భీతిల్లి నేను రాజ్యమును యాచించుచో క్షత్రియ ధర్మము కుంటుబడునుగదా! అని బాధపడగా నాకు నేనై దూతనుగా వచ్చితినని పాండవుల శూరత్వమును స్పష్టముచేయుచు, వారి ధర్మ భావమునుగూడ ప్రదర్శించినారు. అనగా నీ కర్తవ్యమును నీవు నెరవేర్పని పక్షమున యుద్ధము తప్పదనియే నిశ్చయించుకొమ్మని తన

యుపన్యాస సారమును సంగ్రహముగ చెప్పినారు కూడ. తరువాత చెప్పు మాటలు దీని వ్యాఖ్యానములు. ఈ శ్లోకముననే సామ దాన భేద దండోపాయములు నాల్గును ప్రదర్శింపబడినవి

తరువాతి శ్లోకమున తాను చెప్పు వాక్యము వేదశాసనమువంటిదని సూచించుచు ధృతరాష్ట్రు డిప్పుడు చేయదగు ప్రయత్నమును సూచించు చున్నారు. శ్లోక మెంత గంభీరార్థములను బోధించు పదజాలముతో కూడి యున్నదో చూడుడు ―

శ్లో॥ రాజన్నాన్యత్ప్రవక్తవ్యం తవ నైశ్రేయసం వచః
విదితం హ్యేవ తే సర్వం వేదితవ్యమరిందమ.

భగవానులు ధృతరాష్ట్రుని చాలదూరము గొంపోయినారు. ధృతరాష్ట్రుని సంబోధించుటకు రెండుపదములను వాడినారు.

హే రాజన్! అని సంబోధించుచు, హే! అరిందమ! అనికూడ వాడినారు. అరిందమ అనగా శత్రువుల జయించువాడని అర్థము.

హే మహారాజా! నీవు నీఅంతశ్శత్రువుల జయించి, నేను చేయు హితబోధలకు మారుపలుకక, ఈ ధరామండలము నేలి నీ జాతివాచకము నకు సార్థకతను కల్పింపుమనినారు. ధృతరాష్ట్రున కంతశ్శత్రువు లెవరు? రాజ్యలోభము. కేవలమగు పుత్రవాత్సల్యమును వీడి, లోభగుణమును వదలి, నిశ్రేయసమును కూర్చునట్టి నామాటకు అడ్డును చెప్పవద్దని శాసించినారు.

'నాన్యత్ప్రవక్తవ్యం' క్తవ్యత్ ప్రత్యయము విధ్యర్థబోధకము. కేవలము నాది శాసనమని అనుకొనకు. నీకు తెలియని విషయ మేమి ఉన్నది? ముందు నీకు తెలుసుకొనదగిన విషయముకూడ లేదు. నీ వన్ని విషయముల నెరిగినవాడవని గౌరవించికూడ పలికినారు. నిశ్రేయసమన మోక్షము. మోక్షపురుషార్థమునకు పట్టుముకట్టుకొమ్మని ధ్వనించినారు.

ఇంతవరకు తనకుతానై విచారించుకొనదగిన విషయమునుచెప్పి, ఒక్కమారు నీవు పుట్టినవంశమునైనను, చూచుకొని వంశమర్యాదను కాపాడుటకైనను నామాటను త్రోసి రాజన వద్దని భరతవంశముయొక్క ఉత్కృష్టతను చెప్ప ప్రారంభించినారు.

భరతవంశముయొక్క ప్రత్యేకగుణము లివ్వియట —

శ్లో॥ కృపానుకంపా కారుణ్యం అనృశంస్యం చ భారత
తథార్జవం క్షమా సత్యం కురుష్వేతద్విశిష్యతే.

కృప, అనుకంప, కారుణ్యము, అనృశంస్యము, ఆర్జవము, క్షమ అనుగుణములు భరతవంశమునకు పెట్టని సొమ్ములట.

కృపయన ఇతరులకు సుఖమును చేకూర్చు ప్రయత్నము; అనుకంపయన మనసుమెత్తన, ఒరులబాధను చూడలేకపోవుట; కారుణ్యమన ఇతరుల దుఃఖమును నివారింప ప్రయత్నించుట; అనృశంస్యమన పరులకు తనవలన బాధయేకలుగనివ్వకుండుట; ఆర్జవమన వంకరితనము లేకుండుట. ఇట్టి గుణములన్నియు నీపట్ల ఇప్పుడు విపరీతమగుట యుక్తముకాదని స్పష్టపరచినారుకూడ. నిన్ను నిమిత్తముగా గొని వంశ ధర్మములన్నియు మాసిపోరాదని నొక్కివక్కాణించినారు. ఇదీ శ్లోకము

తస్మిన్నేవం విధే రాజన్ కులే మహతి తిష్ఠతి ।
త్వన్నిమిత్తం విశేషేణ నేహాయుక్తమసాంప్రతం॥

పైనవర్ణించిన భరతవంశపుగుణములు నీయందు విపరీతమైనను విషయము ఈ శ్లోకమునందలి 'అసాంప్రతం' అను పదమున వ్యాఖ్యానించినారు. ఇట్లు విగూఢముగ చెప్పుటేకాదు. నీవంటిరాజు ఇట్లు చేయుట తగదని చెప్పదలచి ధృతరాష్ట్రుని విశిష్టతను వర్ణించి, పరులకు దుఃఖమును కల్పించుట, పరులు దుఃఖపడగా సంతోషించుట మొదలగు దుర్గుణ

ములు ధృతరాష్ట్రునియందు ఋజువుపరచుచు మాట్లాడినారు. తరువాతి శ్లోకమున.

'త్వం హి ధారయితా శ్రేష్ఠః కురూణాం కురుసత్తమ
మిథ్యాప్రచరతాం తాత బాహ్యాభ్యంతరేషు చ'

నీవు కురువంశమున శ్రేష్ఠుడవు. అయ్యును, పాండవులకు నీ కొడుకులు చేసిన బాహ్యాంభ్యంతరదోషముల రెంటిని నీవు సహించితివి. ఇది నీకు యుక్తముగాదు. ఇక్కడ బాహ్యాభ్యంతరదోషములన నేవి? బాహ్యమనగా కళ్ళకు కట్టినట్లు అందరెరిగినది. జూదరంగము నందలి దౌష్ట్యము. అభ్యంతరమన లక్కయింట పాండవులనుంచి నిప్పుపెట్టుట. కాని మీరు నన్నొకప్రశ్న వేయుదురు. ఈ పనులు చేసినది ధృతరాష్ట్రుడు కాదుగదా? అని.

శ్రీకృష్ణులు ధృతరాష్ట్రుడు స్వయముగా చేసెనని చెప్పలేదు. 'త్వంహిధారయితా' అనినారు. అనగా ఆతని యెరుకలేక దుర్యోధనుడు చేయలేదు. ఆతడు ఇష్టపడుట; ఆతడు చేయుటేగావున ఆ దోషమును చక్కగ ఉద్ఘాటించినారు. నిజమునకు దుర్యోధనునకంటె, ధృతరాష్ట్రుడే మిక్కిలి దోషియని భారతము నిర్ణయించును.

దుర్యోధనుడను క్రోధమయ వృక్షమునకు మూలము ధృతరాష్ట్రుడు. 'మూలం రాజా ధృతరాష్ట్రో మనీషీ'

ధృతరాష్ట్రుని దోషమునుచూపి సవరించుకొమ్మని చెప్పుచు దుర్యోధనాదుల లక్ష్యమేమియోకూడ చెప్పినారు. వారి ప్రవర్తనను తెలిపినారు.

'తే పుత్రాస్తవ కౌరవ్య దుర్యోధన పురోగమాః
ధర్మార్థౌ పృష్ఠతఃకృత్వా ప్రచరంతి నృశంసవత్
అశిష్టా గతమర్యాదా లోభేన హృతచేతసః'

వారి లక్ష్యమునం దర్థమే యున్నదిగాని ధర్మములేదు. ఆ అర్థము నైనను ఎట్లు పాలించుకొనవలెనో కూడ వారు పెద్దలవలన తెలిసినవారు కారు. వారికి శిష్టులు విశిష్టులు కాలేదు. లోకమర్యాదను పాటించుట అసలు లేదు. మానవత్వమునందుండదగు సిగ్గునుకూడ, వదలి చరించు స్వభావము గలిగియుండిరేగాని వేరుకాదు. ధృతరాష్ట్ర ! నీవు భీష్మాది పెద్దల దగ్గర పెరిగియు వారి మర్యాదలననుసరించక పుత్రులనే యనుసరించుచుంటివి గదా ! అని విచారమును వ్యక్తమునుచేసి మాట్లాడి ధృతరాష్ట్రుని ఆసురీ సంపదను చెప్పినారు.

గీతాశాస్త్రమున వర్ణించబడిన ఆసురీసంపద దీని భాగమే. భగవానుల ప్రబోధమెక్కడైనను ఒకేవిధముగ నడచును. కృష్ణరాయబారమున గీతాశాస్త్రములేకపోలేదు. కృష్ణరాయబారములోని సూక్తులే గీతాశాస్త్రమనుట ఇంకను యుక్తమే. ఇట్టి లోభోపహతచేతస్కులవలననే, శాస్త్రాచార్యుల తిరస్కరించువారివలననే లోకమున ఉపద్రవము వాటిల్లునని స్పష్టముగ చెప్పినారు గీతలో

'ప్రభవంత్యుగ్రకర్మాణః క్షయాయ జగతో హితాః'

గీతలోని ఆసురీసంపదవర్ణనంతయు దుర్యోధనాదుల స్వరూపమే. రాజ్యలోభులై ప్రజలక్షేమమును దృష్టియందుంచుకొనని కౌరవుల రాక్షస చర్యలనుండియే ప్రజాక్షయము కలుగనున్నదని. స్పష్టపరచినారు.

'పేయ మాపన్మహా ఘోరా కురుష్వేవ సముత్థితా'

ధృతరాష్ట్ర ! నేడు యుద్ధము వచ్చుటకు తగు దుర్మార్గము కురువుల యందే పుట్టినదని వక్కాణించినారు. 'కురుష్వేవ సముత్థితా' కురువులయందే ఉన్నదని నొక్కి పాండవులయందు లేదని తెల్పినారు. పాండవులయందు లేదని ప్రత్యేకముగ చెప్పలేదు. కారణమేమి ? మాటమాత్రముగ కూడ వారినీ ఘట్టమున వచింపరాదను గంభీరార్థమును 'ఏవ' కారముచే సూచించినారు. ఘోరమగు ఆపద మీవలన పుట్టినదని

చెప్పి, ఆ యాపదను తరువాత వివరించుచు, ఈ యాపద తప్పింపరానిది కాదనియు, ఇంతవరకింకను పాకము ముదరలేదనియు చెప్పి, ఇంకను నీవూరుకొన్నచో నీకేగాక ఈ భూమండలమంతయు నీ పుణ్యమా యని ఘోరవిపత్తును పొందుననియు వాచ్యముగ దెలిపినారు.

'ఉపేక్షమాణా కౌరవ్య పృథివీం ఘాతయిష్యతి'

నీ పుత్రులలోని దుర్గుణమును నీవు సహింపగా నీ వంశనాశమే గాక నీ యుపేక్ష భూమికంతకును ముప్పువాటిల్లజేయునని చెప్పి, ఇంత పాపమున కేల యొడిగట్టెదవని పాపభీతినికూడ కల్పించినారు.

క. నరనాథ నీవుపేక్షా
పరుఁడవయిన గౌరవులక పాండవులక కా
దరయగ భూప్రజకెల్లను
దురితం బొనరించినట్ల తుదిఁ గీడుసుమీ !

ఇట్లు చెప్పి, ఈ యుద్ధవిరమణ మనునది దుష్కరమగు పని కాదనినారు. నీ వీ ప్రజాబాహుళ్యమును, ఈ యువరాజమండలమును, ఈ పదాతిసైన్యమును, బంధుజాలమును, మృత్యువునకు నప్పగింప దలచనిచో యుద్ధవిరమణ మెంతపని ? గోట మీటదగినపని అనినారు.

'శక్యాచేయం శమయితుం నచేద్దిత్ససి భారత
న దుష్కరో హ్యత్రశమో మతో మే భరతర్షభ'

ఓ భారత ! ఓ భరతర్షభ ! అని ప్రశంసాపూర్వకముగనే విషయమును ప్రతిపాదించినారు.

అంతేకాదు. ఈ కార్యభారమును నీ వొక్కఁడవే మోయనక్కర లేదు. పాండవులును ఈ యుద్ధవిరమణకార్యమున పాలుపంచుకొందురని నారు. నేను వారిని వినిపించుటకై యత్నింతును. నీవు నీ పుత్రులను వినిపింప యత్నింపుము. వారిరువురకును మన మిద్దరమును పెద్దలమై,

వారినీ యుద్ధమునుండి విరమింపచేయుదమని, ఈ యుద్ధవిరమణకార్యభారమును తనపైనను ధృతరాష్ట్రునిపైనను మోపి మాట్లాడినారు. శ్లోకమిది —

'త్వయ్యధీనశ్శమో రాజన్ మయి చైవ విశాంపతే
పుత్రాన్ స్థాపయ కౌరవ్య స్థాపయిష్యామ్యహం పరాన్''

కాని ఈ శ్లోకమునందొక విచిత్రమున్నది. మొదటి పాదమున యుద్ధవిరమణము నీ యధీనమని ధృతరాష్ట్రునకు చెప్పి, రెండవపాదము చివరిలో తన సంగతిని చెప్పినారు. అనగా మొదట ఒప్పదగినవాడవు నీవు. తరువాత పాండవులను వినిపించువాడను నేను. అని ధ్రువపరచినారు. ఈ శ్లోకమును తెనిగించునప్పుడు తిక్కనామాత్యులును ఈ భావసౌందర్యమును వదలలేదు.

తే. నీకు వీరలఁదీర్పంగ నేరవచ్చు
నధిప తెఱఁగు నీవశమున యదియకాన
నీకు వీరలఁ దేర్చుట నెరియకాదె
సిద్ధ మెవ్వారిఁదెలివొందఁ జేయనేర్తు.

మూలమున 'హే విశాంపతే' అను సంబోధన ధృతరాష్ట్రుని అధికారమును సూచించగా అనువాదమున కూడ ఆ సంబోధనను విడువలేదు.

యథార్థమునకు ఈ సంధికార్యమున పాండవులకంటె ధృతరాష్ట్రునకు కలుగు లాభము పెద్దది. ఏమందురా ?

ధృతరాష్ట్రుడు కోరుకొను ఐశ్వర్యము అతని పుత్రులగు దుర్యోధనాదుల వలన స్థిరముగా నిలువదు. లక్ష్మి ఎప్పుడైనను ధర్మపరులయందే వసించును. అన్యాయముచేయువారికి తాత్కాలికముగ లక్ష్మీకటాక్షము కల్గినను అది సమూలముగ వాని జీవితనాశమును కల్పించును. కావున ధర్మాత్ములగు పాండవులనే దీదరి జేర్చుకొని, ధృతరాష్ట్రుడు ధర్మార్థముల

రెంటిని రక్షించుకొన్నచో ధృతరాష్ట్రునకే యైశ్వర్యము స్థిరముకాగలదు. అంతేగాక దేవతలనైనను, జయించగలిగిన పాండవబలము మహోన్నత మగు భీష్మ ద్రోణాదిబలములతో కలియుచో దేవతలకైనను తేరిపార జూడరాని ఐశ్వర్యము ధృతరాష్ట్రునకు దక్కును. ధృతరాష్ట్రున కెట్లు దక్కును ? పాండవులది యగునుకదా ? అనకుడు. పాండవులు ధృతరాష్ట్రునకే పెద్దరికమిచ్చు ధర్మాత్ములు. కావున ధృతరాష్ట్రునకే ఈ సంధి కార్యమువలన లాభమెక్కువ. ఈ మాటనే శ్రీకృష్ణులు చెప్పినారు.

'తవ చైవ హితం రాజన్ పాండవానామథో హితం
ధర్మార్థయో స్తిష్ఠ వై రాజన్ పాండవై రభిరక్షితః
న హిత్వాం పాండవై ర్జేతుం రక్షమాణం మహాత్మభిః
ఇంద్రోపి దేవై స్సహితః ప్రసహేత తతోనృపః'

తా. ధృతరాష్ట్రా ! ఈ సంధికార్యము నీకు హితమును కూర్చును. పాండవులకును హితమే. కావున పాండవులచే రక్షితుడవై ధర్మార్థముల నందుకొనుము. పాండవులచే రక్షితుడగు నిన్ను దేవతలే జయింపలేర నగా సామాన్యరాజుల సంగతి చెప్పెడిదేమున్నది ?

ఈ ఘట్టమున మీకొక్క మాటను చెప్పెదను. నేడు కొందరు బుద్ధిమంతులు శ్రీకృష్ణుడు సంధిచేయుట కిష్టములేక మాట్లాడెనందురు. వారి కొక నమస్కారము.

మధురాతిమధురములగు హితవాక్యముల బోధించుచు సంధిని చెప్పగా వారట్లూహించుట కేమనవలెను ?

ఇక మీకు భగవానుని యుపసంహార వాక్యములెట్లుండెనో గూడ వినిపింతును.

'సంయుగేవై మహారాజ దృశ్యతే సుమహాన్ క్షయః
క్షయే చ ఉభయతో రాజన్ కం ధర్మమనుపశ్యసి'

యుద్ధమునందు రెండుపక్షములును నాశముగాగా నీ వాచరించదగు ధర్మమునకు స్థానమెక్కడ ? అనినారు. అనగా ఏమి ? ధర్మమును రక్షించుకొనుటకే ఐశ్వర్యముగాని వేరుగాదని తేల్చి, ధర్మమువైపుకు నీ బుద్ధిని మరల్చుమని బోధించినారు. బోధించి, చివరకు ఈ యుద్ధరంగమున బలియైపోవు ప్రజల రక్షింపుమని ప్రజల పక్షముగ శరణు వేడినారు.

'త్రాహి రాజన్నిమం లోకం న నశ్యేయురిమాః ప్రజాః'

అంతచెప్పినను ధృతరాష్ట్రుని మనస్సు కరగలేదు. చివరి కొక న్యాయమును దృష్టియందుంచుకొని భగవానులొకమాట మాట్లాడినారు. ఎవ్వరైనను విషవృక్షమునుగూడ తమచేతితో నీళ్ళుపోసి పెంచి పెద్దగావించి, దానిని తమచేతితోనే నరకుట యుక్తముకాదను న్యాయము ననుసరించి, ధృతరాష్ట్రా, నీవు నీ తమ్ముడు కొడుకులను, నీ తమ్ముడు వారి పిన్నతనముననే చనిపోగా నీవు వృద్ధిపరచితివి. వారినిప్పుడు నీవు చల్లనిచూపుచూచి సంధి చేయుమని తేనెసోనలు కురియునట్లు కరుణారసమును ఒలకపోయుచుగూడ చెప్పినారు. ఇంతంకటె మెత్తగ చెప్పుటెట్లు?

శ్లో॥ బాలా విహీనాః పిత్రా తే త్వయైవ పరివర్ధితాః
తాన్ పాలయ యథా న్యాయం పుత్రాంశ్చ భరతర్షభ.

ఇంతతో భగవానులు తన యుద్బోధసలమాని పాండవుల అభిప్రాయమును చెప్పనారంభించినారు.

ధృతరాష్ట్రా, నీకు పాండవులిట్లు చెప్పమనిరి.

కృష్ణా, మా తండ్రి చనిపోవగా మమ్ముల పెంచి పెద్దగావించిన మా పెదతండ్రికి మా అభివాదనముల చెప్పుమనిరి. మా పెదతండ్రి ఆజ్ఞననుసరించి ఎన్నియో కష్టముల ననుభవించుచు పండ్రెండుసంవత్సరములు అరణ్యములందే రోజులగడిపి, సంవత్సరకాలము అజ్ఞాతవాసమును

గూడ ననుభవించితిమనియు, మా ప్రతిజ్ఞాకాలమును మేము నెరవేర్చితిమనుటకు బ్రాహ్మణులే సాక్ష్యమనియు, మా ప్రతినలు తీరగా, మా పెదతండ్రి మరల మా నగపాలు మాకిచ్చి రాజ్యమున సుప్రతిష్ఠితుల చేయునను ఆశతోడనే మా కష్టదివసముల గడిపితిమనియు చెప్పుమనిరి.

నీవే మాకు తల్లివి, తండ్రివి, గురుడవు గూడ నని తమ భక్తి విశ్వాసముల ప్రకటించి, ధర్మార్థముల గుర్తెరిగి మమ్ముద్ధరింపుమని మా మనవిగా మా తండ్రికి విన్నవింపుమనిరి.

ధృతరాష్ట్రా ! బిడ్డలపై తండ్రులకుగల అధికారమును, గురువులకు శిష్యులపైగల అధికారమును నీకిచ్చి, మాయందు దోషములున్నచో మమ్ములనుగూడ మా పెదతండ్రి మంచిమార్గముల నడిపించుట మాకిష్టమని నీకు సర్వాధికారముల నొసంగి మాటాడిరి.

మేము నీయందుంచు గౌరవమునకు మారుగ నీవును మాయందు పుత్రవాత్సల్యమును చూపుమని ప్రార్థనాపూర్వకముగ పలికి, దుర్యోధనాదులకు వారియందట్టి స్నేహభావము లేకపోవుటకు బాధపడుచు, మాకుగాని దుర్యోధనాదులకుగాని యుద్ధమునందేమైన కీడు వాటిల్లగా ఆ దుఃఖఫలము మా పెదతండ్రి యనుభవించునుగదా ? అని వాపోయి, మా విచారము విశదముగా మా పెదతండ్రికి చెప్పుమని గట్టిగ చెప్పిరి. ధృతరాష్ట్రా ! ఇవి నీకు చెప్పుమన్నమాటలు. ఇట్లే ఒక ముఖ్యమగు విషయమును నీ సభ్యులకుకూడ చెప్పుమనినారు.

సభ్యులారా !

ధర్మవిదులగువారు సభయందుండగా ఆ సభయందు ధర్మమును అధర్మమును ; సత్యమును అసత్యమును మ్రింగునపుడు సభాసదు లుపేక్ష జేయుచో, ఆ పాపము సభ్యులకే ఫలించగా వా రాకీడు ననుభవింపక తప్పదని చెప్పి, సత్యధర్మములనే దృష్టియందుంచుకొని, సత్యధర్మముల పాలించిన ధర్మపాలకులకు ఆ ధర్మఫలము తప్పక విజయమును చేకూర్చు

నని మీకు గట్టిగ చెప్పుమనినారు పాండవులు.— అని పాండవుల సందేశమును సభ్యుల కందించి భగవానులు మౌనమును వహించలేదు. — రాజమండలమువైపుకు తన చూపును త్రిప్పి, ధర్మమూర్తులైన పాండవుల యీ పలుకునకు మీరేమి సమాధాన మిత్తురని సభ్యులను గద్దించి ప్రశ్నించినారు.

సభ్యులనోట మాటరాలేదు. శ్రీకృష్ణు లేల యూరకొందురు ? నిర్దుష్టమగు తన ధర్మప్రబోధము స్పష్టముకావలెను. మరల సభ్యులవైపు తిరిగి, నా మాటలు ధర్మార్థములతో కూడియే యున్నవను నిర్ణయము మీకు కలుగుచో; పాండవులకు రాజ్యమిచ్చుటకంటె ధృతరాష్ట్రునకు వేరొక కర్తవ్యమున్నచో, వచింపుడని గర్జించి ప్రశ్నించినారు. సభ్యులు మాటాడ లేదు. వారి మౌనమే తన ప్రశ్నకు సమాధానముగాగొని, ఒక్కమారు మరల తన విశాలదృష్టులను పెద్దరాజువైపుకు త్రిప్పినారు. తన గంభీర ధ్వానమున ధృతరాష్ట్రివి రాజా ! అని సంబోధించినారు. తన దీర్ఘ బాహువుతో అందు కూర్చున్న రాజమండలమునుచూపి. ఈ రాజులనందరను మృత్యుముఖమునుండి తొలగింపుమని జాలిగపలికినారు.

క్రోధమునకు వశముకావద్దని హితమును బోధించినారు. పాండవుల పితృభాగమును వారికి వప్పచెప్పి, నీవు కొడుకులతో మనుమలతో సుస్థిరమగు సుఖజీవితమును గడుపుమని క్షేమవార్త నందించినారు. అంతతో ఊరుకొనక జూదమంటపము నొక్కమారు జ్ఞాపకము చేసి, నాడు మీరు ధర్మనందనునకు గావించిన దుర్మార్గములకు సహించిన ధర్మనందనుని అచంచలస్థితిని గుర్తుకుతెచ్చుకొమ్మని ధర్మజుని శాంతి సౌశీల్యములను ధృతరాష్ట్రుని ఎదుట సాక్షాత్కరింపజేసి, ధృతరాష్ట్రా ! ఇదియే నా చివరిసందేశమని పాండవుల నిర్ణయమేమియో రెండేరెండు మాటలతో వక్కాణించి, తన ఉపన్యాసము నుపసంహరించినారు భగవానులు.

పాండవుల నిర్ణయము నిట్లు చెప్పినారు—

శ్లో॥ స్థితాః శుశ్రూషితుం పార్థాః స్థితాః యోద్ధుమరిందమాః
యత్తే పథ్యతమం రాజన్ తస్మిన్ తిష్ఠ పరంతప'

రాజా! దిక్కుల నన్నిటిని గెలిచి, రాజసూయమహాధ్వరమున ఏకచ్ఛత్రాధిపత్యము వహించిన పాండవులు నీ ధర్మమును నీవు నిర్వర్తించుచో నేడు నీ చరణసన్నిధానమున నిలిచి వినయావనతులై, నీయాజ్ఞలను శిరసావహించుచు నీకు శుశ్రూషగావించుటకును, నడుముగట్టి నిలిచినారు. నీ ధర్మమును నీవు పాటించక, వారి పిత్ర్యంశమును వారికి పంచనిచో తమ కెదురై నిలచిన ఎట్టివీరులనైనను చించి చెండాడి రాజసింహాసనము నధిష్ఠించుటకైనను దీక్షవహించినారు. నీకీ రెండుపుట్టములలో ఏది హితమనితోచునో, దానినే ఆచరింపుమని భగవానులు శాంత రౌద్ర, రసముల రెంటిని ఒలికించి పలకక యుండగా—భగవానుని వాక్యసరణిలోని ధైర్యస్థైర్య గాంభీర్య శాంతోదార గుణముల కలయికకు సభాసదుల రోమములు నిక్కబొడిచినవి. విభ్రాంతి కలిగినది. విస్మయమైనది. వారేమి పలుకుదురు ? గోడమీది బొమ్మలవలె నుండిరి. వారి చూపులు మాత్రము ఆ కళ్యాణవిగ్రహముపై నిలచినవి. అంతియే. అంతతో స్వామివారి బోధామృతవర్షము కొంతతెరిపి నిచ్చినది. ఆ మహానీయుని తరువాత మాట్లాడినవారు మహర్షులు. అందు పరశురాముడు దంభోద్భవుడను రాజు కథనుచెప్పి, దుర్యోధనునకు అర్జునుని ప్రభావమును బోధించినారు.

దంభోద్భవుడు గొప్పపరాక్రమశాలియగు రాజు. కాని ఆతడు బలగర్వి. ఒకప్పుడాతడు తనతో సమానముగ యుద్ధముచేయువాడెవ్వడని ఆహంకరించగా కొందరు బ్రాహ్మణులాతని నరనారాయణులవద్ద కేగుమని చెప్పిరి.

నర, నారాయణులు బదరికాశ్రమమునందున్న మహర్షులు. దంభోద్భవుడు బదరికాశ్రమమునకేగెను. వారిచ్చిన పాద్యాదివిధుల గ్రహించెను. తన రాకకు కారణమేమని వారడుగగా, మీతో యుద్ధము నకై వచ్చితినని తన అహంకారమును ప్రకటించుచు పలికెను. వారు శాంతులు. మాతో యుద్ధము నీకేల? పొమ్మనిరి. దంభోద్భవుడు గర్వముతో తన అభిప్రాయమును మార్చుకొనలేదు. అంత నరుడలిగి, కొన్ని దర్భలను చేతబట్టుకొని ఇవియే మా బాణములు. నీ యుద్ధమును సాగింపుమనెను.

దంభోద్భవుని శస్త్రాస్త్రజాలమంతయు ఆ దర్భకర్రలతో పోరాడ లేక విరమించినది. దంభోద్భవుని గర్వమును ఉడిగినది. శరణాగతుడు కాక తప్పలేదు. ఆ మహర్షుల కాళ్ళపై బడగా ఆ శాంతమూర్తులు ఇంకెప్పుడును ఇట్లు గర్వించకని చెప్పి, దంభోద్భవుని ప్రాణములతో వదలినారు. ఆ నరనారాయణులలో నరుడను మహర్షియే, అర్జునుడని నీవును నీ గర్వమును వదలి పాండవులకు హితుడవు కమ్మని బోధించినారు.

తరువాత కణ్వమహర్షి మాతలి వరాన్వేషణమను కథను చెప్పి, ఆ కథయందు గరుత్మంతుని గర్వభంగమును చెప్పినారు.

మాతలి దేవేంద్రుని సారథి. అతనికి గుణకేశియను కూతురు ఉండెను. ఆ కన్యకకు తగినవరుని వెతకుచు, మనుష్యదేవలోకములలో ఎక్కడను పెండ్లికొడుకులు నచ్చక, ఒకనాడు నారదునితో నాగలోకమున కేగెను.

నాగలోకమున సుముఖుడను నాగుడు తన కూతురుకు తగిన వాడని ఆతని నిర్ణయించుకొనెను. సుముఖుడు చికురుని కొడుకు. ఆర్యకుని పౌత్రుడు. సుముఖునకు తండ్రిలేడు. గరుత్మంతుని చేతిలో చికురుడు

బలియయ్యెను. ఆర్యకునివద్దనే సుముఖుడు పెరుగుచుండెను. నారదులును మాతలియు సుముఖుని తాతగారగు ఆర్యకునివద్దకేగి తమ రాకను తెలిపిరి.

నారదమునీంద్రులు మాతలి నీ పుత్ర పుత్రునకు పిల్లనిచ్చుటకై వచ్చెనని చెప్పగా ఆర్యకుడు మొగము చిన్నదిగావించుకొని, తన కొడుకును గరుడుడు చంపెననియు, తన మనుమనికికూడ అతనివలననే గండమున్నదనియు చెప్పెను. మాతలి తన యల్లునకు దేవేంద్రునిచే ఆయువునిప్పింతునని సుముఖుని వెంటనిడుకొని ఇంద్రునివద్ద కేగెను. శ్రీమహావిష్ణువును ఆ సమయమునందక్కడనే యుండగా సుముఖునకు మాతలి ఇంద్రునిచే ఆయువునిప్పించి అల్లుని గావించుకొనెను. గరుత్మంతునకు దేవేంద్రుడన్న లెక్కలేదు. గరుత్మంతునకీ వృత్తాంతము తెలిసినది. సురలోకమున కేతెంచినాడు. ఇంద్రవిష్ణువుల యిద్దరివద్దను తన ప్రభావమును వర్ణించుకొనుచు సుముఖుని చంపెద చూడుమని విర్రవీగి పలికినాడు. శ్రీమహావిష్ణువువంటి బలశాలిని తాను మోయుచుంటినని అతని గర్వము. ఆ పలుకునుకూడ విష్ణువున కెదురుగ పలికినాడు. గరుత్మంతుని గర్వమును పారద్రోలవలెనని విష్ణువు సంకల్పించి, ఓ గరుడుడా ! కొంచెము నాచేయి నొప్పిగానున్నది నీ మూపుపై కొంచెముంచుకొని విశ్రాంతిని తీసుకొందుననినాడు. గరుత్మంతుని వీపుపై భగవంతుడు చేయి పెట్టినాడు. ఆ విష్ణుమూర్తిబరువు పెద్దదిగదా ! గరుత్మంతుని బలము క్రుంగినది. కళ్ళు గిరగిర తిరిగినవి. క్రిందపడి లబోదిబో యని వాపోవగా మహావిష్ణువు నీ గర్వముపోయినదా ? అని గర్వమునుడిపి, సుముఖుడను ఈ మహానాగమును నీవేమి చేయదలచితివో చేయుమని గరుత్మంతుని కాళ్ళపై కెగురవేయగా గరుత్మంతుదేమియు చేయలేకపోయెను. ఇప్పటికి గరుత్మంతుని కాళ్ళకు చుట్టుకొని

యుండునది ఆ సర్పముఖుడే. అంతతో గరుడుని గర్వ మణగినదని కణ్వమహర్షి దుర్యోధనునకు చెప్పి, పాండవులకు రాజ్యభాగ మివ్వుమని బోధించినారు.

తరువాత గాలవుని చరిత్రను చెప్పి, నారదులుకూడ హితోపదేశమును చేసినారు దుర్యోధనునకు. అతడు మారలేదు.

గాలవుడొక మునికుమారుడు, విశ్వామిత్రుని శిష్యుడు. అతడు గురువులను గురుదక్షిణ కోరుకొమ్మనెను. వారు నీ శుశ్రూషకు మెచ్చితిమనిరి. అయ్యును కోరుకొమ్మనెను. విశ్వామిత్రమహర్షికి కన్నులెఱ్ఱబడినది. ఆతడు ఎనిమిదివందల గుఱ్ఱములు కావలెనని కోరెను. కాని ఆ గుఱ్ఱములు లోకసామాన్యములు కావు. ఆ గుఱ్ఱములకు చెవిపై భాగము మాత్రము శ్యామవర్ణముండి, గుఱ్ఱమంతయు తెల్లగయుండవలెనట.

గాలవుడు చాలమంది మహారాజులవద్ద గాలించినాడు. ఎవరి దగ్గరను దొరకలేదు. వేసారినాడు. అతని ఒడలు చిక్కినదిగాని గురుదక్షిణ మాత్ర మాతనికి దొరుకలేదు.

గరుత్మంతు డాతనికి మిత్రుడు. దైవికముగ గరుత్మంతుడొకనాడు గాలవునకు కలిసినాడు. గాలవుడు తనకు వచ్చిన కష్టమును చెప్పుకొనగా ఆతనికి జాలికలినది.

గరుత్మంతునకు యయాతిమహారాజు ఆప్తమిత్రుడు. యయాతి అనేక యజ్ఞములను చేసిన పుణ్యమూర్తి. దానధర్మములకు ప్రసిద్ధుడు. గాలవుని తీసుకుని గరుత్మంతుడు యయాతివద్దకేగినాడు. అతనివద్ద గాలవునకు కావలసిన గుఱ్ఱములు లేవు. కాని త్యాగశీలురగువారు పాత్రులు యాచకులైరాగా లేదనుమాటను ఉచ్చరింపలేరు.

యయాతివద్ద మాధవియను పుత్రిక కలదు. ఆ కన్యక లోకసామాన్యకాదు. లోకవిలక్షణ ప్రభావము కలదగుటేకాక లోకైకసుందరి. ఆమె యందెవ్వరైన విజ్ఞులగువారు సంతానమును గని పుణ్యలోకముల

కేగ కోరుకొందురు. ఆ కన్యక అవయవలక్షణము లట్టివి. యయాతి మహారాజు ఆ కన్యకను గాలవునకిచ్చి, ఈ కన్యకను శుల్కముగా ఏ రాజువద్దనైన యుంచి, అట్టి అశ్వములను సంపాదించుకొమ్మని చెప్పినాడు. ఇంతవరకు గాలవునకు గరుత్మంతునివలన గురుదక్షిణను సంపాదించుకొనుటకొక ఉపాయము చిక్కినది. అంతతో గరుత్మంతుడు వెళ్ళినాడు. ఇక గాలవుడీ కన్యకను తీసుకొని ఏ రాజుదగ్గరకుపోవలెను?

హర్యశ్వుడు అయోధ్యాపురమును పాలించు రాజు. ఇక్ష్వాకువంశీయుడు. దాత. గాలవు డాతనియొద్ద కేగి మాధవిని చూపెను. ఈ కన్యకయందొక కుమారుని గని, చక్రవర్తిని గావించవలెనని ఆతనికి అభిప్రాయము కలిగినది. ఈ కన్యకయందు సంతానము గనవలెనన్న నీకేమి యిచ్చిన ఈ కన్యక నిత్తువనినాడు. గాలవుడు తనకు కావలసిన ధనమును గురించి చెప్పినాడు.

ఆ రాజువద్ద ఎనిమిదివందల గుఱ్ఱములు లేవు. శ్యామవర్ణముగల కర్ణములతో రెండువందలు మాత్రమే యున్నవి.

మాధవియందొక విలక్షణ ప్రభావమున్నది. ప్రసవమగుటతోడనే స్త్రీలకు యౌవనముపోవును. కాని మాధవి ప్రతి ప్రసవమునందును యౌవవమును కోల్పోయిన శరీరమును చాలించి, నూత్న యౌవనముతోగూడిన శరీరమును ధరించగల ప్రభావ సంపన్నురాలు. బ్రహ్మవాదులు కొందరామెకు ఆ వరము నిచ్చినారు.

మాధవి ఆ విషయమును గాలవునకు చెప్పినది. గాలవుడు అయోధ్యాపతికి ఒక సంతానమునకు మాత్ర మా కన్య నిచ్చి రెండువందల గుఱ్ఱములను తీసుకొందుననినాడు. అత డట్లే ఒప్పుకొనగా రెండువందల అశ్వములు మాత్రము చిక్కినవి. ఇంకను ఆరువందల గుఱ్ఱములు కావలెను.

దివోదాసుడు, ఔశీనరుడు అను రాజు లిద్దరివద్ద అట్టి గుఱ్ఱము లున్నవి. వారివద్దను రెండేసివందలే యున్నవి. మాధవిని వారికిగూడ నట్లే యిచ్చి, వారిద్దరినుండియు నాలుగువందల గుఱ్ఱములను సంపాదించినాడు. గాలవున కింతవరకు గురువుతో చేసిన ప్రతిన చెల్లలేదు. గరుడుడు కలిసినాడు మరల గాలవునకు. గాలవుని ముఖ మంతయు శుష్కించగా కన్నులవెంట నీరువచ్చినది. ప్రభావ సంపన్నులగువారికి క్రోధమును తెప్పించుచో ఎచ్చటి కష్టము లిట్టివేయని గాలవుని మందలించి, గరుడు డొక ఉపాయమును చెప్పినాడు. ఆరు వందల గుఱ్ఱములను మునివర్యుల కప్పగించి మిగిలిన రెండువందల క్రిందను విశ్వామిత్రున కీ మాధవిని నప్పచెప్పుమనినాడు. గాలవు డట్లే చేసి గురు డడిగిన ఋణమునుండి విముక్తుడు కావలసివచ్చినది. విశ్వామిత్రుడు మాధవియందు అష్టకుడను ఒక పుత్రునిగని మాధవిని మరల గాలవునకు నప్పచెప్పగా గాలవుడు మాధవిని మరల యయాతి కిచ్చినాడు. మాధవియు, యయాతియు వనముల కేగినారు. యయాతి స్వర్గమున కేగగా మాధవి తాపస తేజమున అనేకములగు శరీరముల తన ఇచ్ఛచే ధరించుచు ఆశ్రమవాసుల ఆశ్రమములందే తిరుగుచుండెడిది.

గాలవుడు విశ్వామిత్రుని ప్రతిబంధకముగా అడుగుటవలన వచ్చిన యిక్కట్టులివ్వి. గాలవుడే గాదు. ఒకప్పుడు యయాతిమహారాజు కూడ నాయంతవాడు లేడని ఆత్మాభిమానమును ప్రకటించగా స్వర్గ భ్రష్టుడై మాధవిపుత్రులగు తన దౌహిత్రులు నలుగురివలనను మరల స్వర్గమున కేగినాడు. కావున దురభిమానము ఎట్టివారికిని తగదని చక్కగ బోధించినారు నారదులు.

ఇట్టి యుపదేశములు మూర్ఖులకు నచ్చునా ?

శ్లో॥ ఉపదేశోహి మూర్ఖాణాం ప్రకోపాయ న శాంతయే
పయః పానం భుజంగానాం కేవలం విషవర్ధనం.

మూర్ఖులకు హితోపదేశములు క్రోధకారణములేగాని శాంతిని చేకూర్చవు. పాలుపోసినను సర్పములకా క్షీరము విషమునకే కారణము లగునుగదా ?

దుర్యోధనుడా మునిపుంగవులకిట్లు సమాధానమిచ్చినాడు—

క. మునులార నన్ను విధి యే
మని పుట్టించె నట్టులయ్యెడుఁగా కీ
వినఁజవిగాని పలుకులకుఁ
బనిగలదే యుడుగుఁడింక బహుభాషణముల్

ధృతరాష్ట్రుడిప్పుడు శౌరి కేమని సమాధానమివ్వవలెను ? మునీశ్వరుల ప్రసంగమును ప్రశంసించి తన పుత్రుని మూర్ఖతకు విచారించి, భగవానుని కృష్ణా ! నీవు దుర్యోధనునకు హితోపదేశము గావించి ఆతని మనసును మార్చుమని అర్థించినాడు.

మూర్ఖజన చిత్తములను భగవంతుడు మాత్రము మార్చగలడా ? అయ్యును ప్రయత్నమునకే భగవానులు స్థానము నిచ్చినారు.

దుర్యోధనునివైపుకు దిరిగి దుర్యోధనా ! నీవు మంచి రాజవంశమున జన్మించినావు. బుద్ధిమంతుడవు. నీకిట్టి దురాగ్రహమా ? అని ప్రశ్నించి, చక్కనిమాటలతో బుజ్జగించుచు చెప్పినారు. ఇప్పట్టున తిక్కనగారి పద్యములను వినిపింతును.

చ. తులువలుగాక యిట్టిఘోర దుర్ణయవృత్తినిఁ జొత్తురయ్య పు
త్రులు నను జన్ములుం జెలులు దుష్టపథంబునఁ బోవకుండఁ జూ
ట్టలుఁ దగువారు దండ్రియు నొడంబడఁజేయుము కార్య మల్పబు
ద్ధుల వెడమాట లూఁకొనకు దోసము సేగియువచ్చు నెమ్మెయిన్.

క. పాండిత్య శౌర్యనిత్యులు
పాండుసుతులు వారిఁగూడి బ్రతుకుట ధృతరా

ష్ట్రిందును బాహ్లికుఁడును భీ
ష్మందు గురుడు గోరు తెరగుసూవె నరేంద్రా.

తిక్కనయే చక్కని పలుకులతో నాడు దుర్యోధనునకు ఆంధ్ర భాషతో చెప్పినట్లున్నవి పద్యములు. వ్యాసభారతియు అనుష్టుప్ ఛందస్సునందు ఇట్లే యున్నది.

'శర్మార్థం తే విశేషేణ సానుబంధస్య భారత
మహాప్రాజ్ఞకులేజాతః సాధ్వేతత్కర్తుమర్హసి.'
'సంధత్స్వ పురుషవ్యాఘ్ర పాండవైర్భరతర్షభ
శమే శర్మ భవేత్తాత సర్వస్య జగతస్తథా
తిష్ఠతాత పితుఃశాస్త్రే మాతుశ్చభరతర్షభ'
'శృత్వా యత్సుహృదాం శాస్త్రం మర్త్యో న ప్రతిపద్యతే
విపాకాంతే తహత్యేనం కింపాకమివ భక్షితం.'

శ్రీకృష్ణుడు దుర్యోధనున కొక ఉపమానమును చెప్పినారు. కింపాకమన ముసిడిపండు. దానిని తిన్నవానికి బలమురాదు. చావుతప్పదు. కర్ణుడు ముసిడిపండువంటివాడని శ్రీకృష్ణులు పోల్చినారు.

తరువాత చెప్పతగిన మాట నీ వీ యుద్ధమున జయము గొనలేవని పాండవుల ప్రాభవమును వర్ణించి ఆమాటయు గట్టిగ చెప్పినారు.

శా॥ తోడం బుట్టిన భీమపార్థుల మహాదోర్దర్పముల్ లాతులై
తోడంచుం బెరవారి దుర్బలుల నెందున్ నచ్చి దైన్యంబునం
గూడం బెట్టెదు నీవ పాండుసుతులం గుండంపగా నత్యముం
బాడిం దప్ప రొకప్పుడుం గినియ రా బంధుత్వ మేలొల్లవో.

ఉ. వారును మీరు బొంది జనవల్లభులెల్లను భృత్యభావనం
జేర సమస్తవస్తువులు జేకురగా బ్రతుకోపుగాక నీ

కిరసమెత్తికోల్ గరపి యిప్పుడు కార్యముతప్పజూచు నీ
వారలు ముట్టవచ్చిన నవశ్యమునంతకు జాలరుంజుమీ.

ఆ. వీరకారు పాండవేయుల బోర మా
ర్కొన సురాసురులకు గొలదిగాదు
గాన వారితోడి కయ్యంబునకు విర్ణ
యింప వలదు సంధి పెంపుజేయు.

దుర్యోధనా ! సత్యధర్మములకు పాదైయున్న పాండవుల బాంధవ్యమును వదలకు. వారికి నీపైన కోపములేదు. నీ దుర్మార్గములనుగూడ వారు తలపక సంధిని కోరుచున్నారు. వారును మీరును చేయదగునది సంధియే. కాదు...యుద్ధమే చేయదలచుచో నీవును నీవారునుకూడ వారిని గెలువలేరు. మీరుకాదు దేవతలైనను వారి జయింపసమర్థులు కారు.

అని చెప్పి ఉత్తరగోగ్రహణమును జ్ఞాపకము చేసినారు. ఉత్తరగోగ్రహణమున అర్జునుడొక్కడుకాగా, నేడు నేనును అర్జునుడును ఏకరథస్థులమై రణరంగమున నిలిచెదమనిచెప్పి, మా యిద్దర జయించుటకు దేవేంద్రుడు చాలడని ముక్తకంఠమున పలికినారు.

'మద్ద్వితీయం పునఃపార్థం కః ప్రార్థయితుమర్హతి
యుద్ధేప్రతీపమాయాంతం అపిసాక్షాత్పురందరః'

కావున నిన్ను నిమిత్తముగా ఈ ప్రజలు నాశముగాకుండ రక్షించుకొనుట కర్తవ్యమని స్పష్టపరచినారు. కులనాశము చేసితివను అపప్రథను నీవు పొందవద్దు. నీ తండ్రియే చక్రవర్తికాగా, నీవు యువరాజువుగా పాండవులు రాజ్యమును స్థాపింతురు. సిరిరా మోకాలొడ్డకుము.

'పాండవైస్సంశమం కృత్వా కృత్వా చ సుహృదాంవచః
సంప్రీయమాణో మిత్రైశ్చ చిరం భద్రాణ్యవాప్స్యసి.

పాండవులతో సంధిగావించి, సుహృత్తుల సంతోషపరచి, పుత్ర మిత్ర బాంధవులతో సుఖమందుమని చెప్పి భగవానులు విరమించినారు. భీష్మ ద్రోణ విదురులుగూడ పాండవుల కర్ధరాజ్యమిచ్చి సంధికార్యమును ఒప్పుమని పలువిధములుగ చెప్పి, శ్రీకృష్ణుని మాటలను గట్టిపరచినారు. ధృతరాష్ట్రుడును భీష్మాదుల ననుకరించియే పుత్రునికి హితవు చెప్పినారు.

ఇంతవరకు అందరును దుర్యోధనునకు పాండవుల కర్ధరాజ్య మిమ్మనియు యుద్ధమును విరమింపుమనియు, యుద్ధమున వారిని జయింప లేవనియు మాటాడినారు.

ఇక దుర్యోధనుని సమాధానము రావలెను. సమాధాన మిట్లు వచ్చినది.

దుర్యో - కృష్ణా ! నీవును భీష్మ ద్రోణ కృపాదులును నా తండ్రి ధృత రాష్ట్రుడును నన్నే నిందించుచుండిరిగాని నా వలన తప్పేమున్నది? 'అరయం దప్పొకయింత నావలన లేదు.' ఆలోచించుకొమ్ము.

కృష్ణ - అన్యాయమగు జూదము నెవరు నిర్మించిరి ?

దుర్యో - ధర్మజుడే తన ద్యూతమున సమర్థుడుగాక, శకుని చేతిలో ఓడిపోయెను. రాజ్యము నాకైవశమైనది. ఇందు నా తప్పేమి యున్నది ? ఇప్పుడు మత్స్యపాంచాలాదివీరుల గూర్చుకొని ముందుగ కయ్యమునకు దూకినదికూడ పాండవులే. ఈ యుద్ధము నకు నేనేమైన ముందుగ తలబడితినా ? యుద్ధము క్షత్రియ ధర్మము కావున నేనును యుద్ధమున కియ్యకొంటిని.

కృష్ణ - ఆ మాటల నటుంచుము. పెద్దలును నీ తండ్రియు చెప్పిన సంధికి నీ నొప్పెదవా ? లేదా ?

దుర్యో - అది యెన్నడును జరగని పని. వాడిగల సూదిని క్రింద మోపగా దానిచే ఆవరించబడినంత భూమినికూడ పాండవుల

కిచ్చునది లేదు. మేమైనను పాండవులైనను యుద్ధమున గెల్చు
కున్న రాజ్యమునే పాలించవలెను.

'యావద్ధి తీక్ష్ణయా సూచ్యా విధ్యేదగ్రేణ కేశవ
తావద ప్యపరిత్యాజ్యం భూమేర్నః పాండవాన్ ప్రతి'

కృష్ణ - యుద్ధమున పాండవుల జయింతుననియే ఆశపడుచుంటివి
కాబోలు.

దుర్యో - మువ్మూటికిని జయము నాకు తప్పదు. భీష్మ ద్రోణ కర్ణాదివీర
వరుల గెల్చు మగవాడెవడు ?

కృష్ణ - అటులైన నీవును నీవారును యుద్ధమునకే సిద్ధము కండు. ఇదె
ఖండన మెల్లియవచ్చును.

శ్రీకృష్ణ దుర్యోధనుల సంభాషణమున యుద్ధము నిశ్చయమైనది. నా తప్పేమున్నదన్న దుర్యోధనుని మాటకు శ్రీకృష్ణులేమైన సమాధాన మిచ్చెనా ? దుర్యోధనునకు సమాధానమిచ్చుటకే వచ్చినారు. సమాధాన మిచ్చినారు.

శ్రీకృష్ణుడు కిన్కబూనిన తన ముఖమండలమున అలతినవ్వు మొలకెత్తగా తెల్లదామరలవలెనున్న ఆతని నేత్రద్వంద్వము ఎర్ర దామరలై ఆతనిముఖమండలమున కొంక నూత్నశోభను చేకూర్చగా దుర్యోధనా ! ఏమంటివి ? నా తప్పేమి యున్నదంటివా ? ...

నీవు పుట్టినది మొదలు పాండవులకు చేయని దుర్మార్గమేమున్నది ? తినుబండారముల విషము పెట్టితివి. త్రాళ్ళగట్టి గంగయందు దోసితివి. లక్కయింటపెట్టి నిప్పంటించితివి. సుహృద్ద్యూతమను పేర దుర్ద్యూతమును కల్పించి, కపట ద్యూతముననే వారినోడించి సిరినికొల్లగొట్టి, యిల్లాలిని సభకీడ్చితివి. సభకీడ్చుట గాదు ; ఆడుదాని వలువను చేతబట్టి వస్త్రవిహీనను చేయనుంకించి పట్టపురాణిని తొడపై కూర్చొనమని ఎగ్గాడినపలుకులు

నోటమాటాడదగినవియా ? నీవును, నీ మిత్రుడును మాటాడిన మాటలు సభయం దెల్లవారలును వినినవికాగా నా తప్పేమున్నదని పలుకు చుంటివా ? నీవు మూర్ఖుడవని ఎరిగియు నీకును పాండవులకును శాంతిని కల్పించుటకై ఇంతచెప్పితినని భగవానులు ఘాటుగనే సమాధానమిచ్చినారు.

ఈ ఘట్టమున దుర్యోధనుడు సభయందేయున్నచో భీష్మాదులు దుర్యోధనుని చే సంధికార్యమున కొప్పింతురని దుశ్శాసనున కభిప్రాయము కలిగినది. అన్న నిక్కడనుండి లెమ్మనినాడు.

దుర్యోధనుడు సింహాసనమునుండి తటాలున లేచినాడు. అతని వెంట కర్ణుడును లేచినాడు. వారిద్దరును దుర్యోధనుని సోదరులును వెంట నంటినారు. మరికొందరు దుర్యోధనుని ఆప్తులుకూడ ఆ గుంపున లేక పోలేదు.

అప్పుడు కొలువుకూట మెట్లుండెను ? కొలువుకూటము కల్లోలిత మైనది. దుర్యోధనాదుల యునికి భీష్మునకు నచ్చలేదు. అతడు కురువృద్ధు. ఈ మందబుద్ధులకు కాలము పరిపక్వమైనదనియే భావించి, దుర్యోధనుని అసభ్యతను నిందించిపలికినాడు. కాని కర్తవ్యము నాతదేమి నిశ్చ యించును ? ఇట్లున్న దుర్యోధను నెట్లు దారికి తేవలెనో భీష్మాదులకు తోచలేదు.

భగవాను లిట్టి దౌరల తీర్చిదిద్దుటకే అవతరించినారు. శ్రీకృష్ణులు భీష్మాదివీరవరులవంక దిరిగి మీరంద రనుమతించుచో ఉగ్రసేనమహా రాజును ధిక్కరించిన కంసుని దుర్మార్గమును దిద్దినట్లే ఈ దుర్యోధనుని దుశ్చేష్టనుగూడ దిద్దెదననినారు. లేక మరియొక మార్గముకూడ కలదని వేరొకధర్మమును ప్రపంచించినారు.

ఆ ధర్మము ఒకప్పుడు దేవాసురులమధ్య యుద్ధము రాగా రక్కసుల దుండగీడుతనమును మాన్పుటకై పరమేష్ఠి చెప్పిన ధర్మమట.

'దేవాసురమనుష్యాశ్చ గంధర్వోరగరాక్షసాః
అస్మిన్ యుద్ధే సుసంక్రుద్ధా హనిష్యంతి పరస్పరం
ఇతిమత్వాబ్రవీద్ధర్మం పరమేష్ఠీ ప్రజాపతిః'

ఏమది ? అసురదానవుల నందరను పాశముల బంధించి, వరుణున కప్పగింపుమని ధర్మున కాదేశింపగా ధర్ముడట్లే చేసినాడు. మీరును దుర్యోధన దుశ్శాసన కర్ణాదులను బంధించి పాండవులకు వప్పచెప్పుట కూడ ధర్మమేననినారు. సామాన్యమున చెప్పుటకాదు. ధృతరాష్ట్రుని సంబోధించి దుర్యోధనుని బంధించి పాండవులతో సంధికొప్పుమని స్పష్టపరచినారు భగవానులు.

భగవానుని పలుకునకు ధృతరాష్ట్రుని గుండె తల్లడిల్లినది.

వెంటనే విదురుని పిలిచి గాంధారి వచ్చుచో, తన బిడ్డనేమైన చెప్పి యొప్పించగలదు. గాంధారిని పిలుచుకొని రమ్మనినాడు.

గాంధారియు, సభకేతెంచినది. ధృతరాష్ట్రుడు గాంధారితో నీ పుత్రుని మూర్ఖతను మాన్పుమనినాడు.

గాంధారి నిష్పక్షపాతముగ మాటాడు భారతనారీమణి. ధృతరాష్ట్రునివలె ఆమె పుత్రమోహమున మునిగి లోకవినాశమున కొప్పుకొనునది కాదు. గాంధారి ఆ సభామంటపముననే కౌరవకులార్ణవమున పుట్టిన బడబాగ్ని ఎట్లు రగుల్కొన్నదో ; ఈ దోషమెవ్వరిదో ఉద్ఘాటించినది. ఈ దోషమంతయు యథార్థముగ ధృతరాష్ట్రునిదేనని స్పష్టము చేసినది.

ధృతరాష్ట్రునిదేనని పరోక్షముగ పలుకుట కాదు. ధృతరాష్ట్రుని సంబోధించియే నాథా ! ఈ ఘట్టమున నిందార్హులు మీరేనన్నది.

'త్వంహ్యేవాత్ర భృశం గర్హ్యో ధృతరాష్ట్ర సుతప్రియః
యో జానన్ పాపతామస్య తత్ప్రజ్ఞామనువర్తసే'

దుర్యోధనుడు దుర్మార్గుడని తెలిసి ఆతడినేల యనువర్తింతువు ? అని అడిగినది. ఈ ఫలము ననుభవించవలసినది ధృతరాష్ట్రుడే నన్నది.

దుస్సహోయస్య లుబ్ధస్య ధృతరాష్ట్రోః త్వతేఫలం
కథం హి స్వజనే భేదముపేక్షిత మహీపతిః'

స్వజనులలోని భేదమును రాజేల యుపేక్షించెను ? దుర్యోధనుని మూర్ఖత మాన్పశక్యమైనది కాదు. అని స్పష్టపరచినది.

విదురుడు దుర్యోధనుని సభాస్థలికి తీసుకొని వచ్చినాడు. ధృతరాష్ట్ర గాంధారీల యాహ్వానమునకే అతడు సభకేతెంచినాడు.

కన్నులెఱ్ఱనై, ముఖము చిట్లించుకొని, చిరచిరలాడు దుర్యోధనుని చూచినది గాంధారి. చక్కని ధర్మప్రబోధమును గావించినది. భీష్మ ద్రోణ విదురుల ననుకరింపుమన్నది. నీతండ్రి మాటను పెడచెవిని పెట్టవద్దన్నది. కామ క్రోధములకు వశుడై, ఇంద్రియ లౌల్యముగల వారు రాజ్యలక్ష్మిని చేపట్టియు నిలుపుకొనలేరని నిర్ణయించి చెప్పినది. బుజ్జగించినది. కినిసినది. ఏది ఏమైనను దుర్యోధనుడు తల్లి కూర్చుండ బెట్టిన సింహాసనమున నిలువలేదు. చివాలున లేచి వెళ్ళినాడు.

అది దుష్టచతుష్టయముయొక్క కూటమి. అందు మరికొందరు దుష్టులును లేకపోలేదు. కృష్ణుడు దుర్యోధనుని బంధించుట యుక్తమని గదా ! సలహా నిచ్చినాడు. తామే ఆ పనిని భగవానునిపై వాడినచో పాండవుల బలము క్రుంగునను నిశ్చయమును ఆ యాలోచనాసంఘము నిశ్చయించినది. అక్కడక్కడ గుంపులు గుంపులుగాచేరి మాటాడుకొను కొందరి గుసగుసలను సాత్యకి కనిపెట్టకపోలేదు. లోపలనున్న యన్నను రక్షింప తానిక్కడనేయుండి, కృతవర్మను బయటవాకిట నిలిపినాడు. శ్రీకృష్ణునకీ విషయమునంతను వెల్లడించినాడు. భీష్మ విదురులతో దుర్యోధనుని దుర్మంత్రమును చెప్పి శ్రీకృష్ణుని సామర్థ్యమును ప్రకటించినారు. దుర్యోధనుడు శ్రీకృష్ణుని బంధించుటయను దుర్మార్గమును విదురుడు ధృతరాష్ట్రున కెరింగించినాడు.

పి కొడుకుల చావు ఇప్పుడేనన్నట్లు గట్టిగ చెప్పినాడు. ఇప్పట్టున విదురుడు శ్రీకృష్ణునిగురించి చెప్పిన రెండు శ్లోకములు మనకు చిరస్మరణీయములు.

'దుర్గ్రాహ్యః పాణినా వాయుః దుస్స్పర్శః పాణినా శశీ
దుర్ధరా పృథివీ మూర్ధ్నా దుర్గ్రాహ్యః కేశవో బలాత్'
'అయం కర్తా న క్రియతే కారణం చాపి పౌరుషే
యద్యదిచ్ఛేదయం శౌరిః తత్తత్ కుర్యాదయత్నతః'

చేతితో గాలినిపట్టుకొనుట సాధ్యముకానట్లు ; చంద్రునిచేతితో స్పృశింపరానట్లు; భూమిని తలపైనిడుకొని మోయ చేతకానట్లు; బలముచే కేశవుని పట్టశక్యము కాదనినాడు విదురుడు. దీని అంతరార్థమేమి ? భక్తిచేతనే అతడు పట్టుబడునుగాని క్రియాశక్తిచే ఆ దివ్య చైతన్యము చేతికందునది కాదనినాడు.

రెండవశ్లోకమున అతడు కర్తయై కారణసామగ్రి కలిగి పురుష ప్రయత్నమున సాధించువాడు కాడని, అతడు దేనిని ఇచ్ఛగించునో అతని ఇచ్ఛాశక్తియే అన్ని కార్యముల నెరవేర్చుననినాడు. అనగా అతడు సాక్షిమాత్రుడని నిర్ణయించి, జగత్కార్యమును నెరవేర్చు శక్తికి అతడు ఆధారమనినాడు.

కథకు వత్తము.

దుర్యోధనుని ప్రయత్నమును విదురుడు ధృతరాష్ట్రునకు చెప్పునప్పుడు శ్రీకృష్ణులు ధృతరాష్ట్రునకు మరల హెచ్చరిక చేసినారు. ఏమని ? కంసునివలె దుర్యోధనుని శిక్షింతునని.

ధృతరాష్ట్రుని గుండె ఝల్లుమన్నది. మరల విదురునితో చెప్పి దుర్యోధనుని పిలిపించినాడు.

దుర్యోధనుడు తండ్రియాహ్వానము నందుకొని, తన ప్రయత్నమును మనసునందుంచుకొనియే, సపరివారముగ సభకేతెంచినాడు.

శ్రీకృష్ణుని గురించి ధృతరాష్ట్రుడు దుర్యోధనునకు ప్రబోధించినాడు. కాని, ఆ ప్రబోధములు దుర్యోధనున కెందుకు ? దుర్యోధనుని దృక్పథమున శ్రీకృష్ణుడు పాండవ పక్షపాతి. తనకు శత్రువు. శ్రీకృష్ణుని హస్తినాపురమున బంధించుటయే దుర్యోధనుని నిశ్చయము. విదురుడును దుర్యోధనునకు బుద్ధులు చెప్పినాడు. శ్రీకృష్ణులు దుర్యోధనున కిక బోధింపవలసినది లేదు. చూపదగిన పరాక్రమమే మిగిలినది. దానికి సమయమిదియే.

అజ్ఞానుల దృక్పథమున భగవంతుడొక పరిమితమగు శరీరము గలవాడు. అతడును ఒక మనుష్యమాత్రుడే. దుర్యోధనుని వంటి బుద్ధిమంతు లాతనిలోని గుణముల లెక్కింపరు. దోషములను చూడ గలరు. మూఢులహృదయమున దోషరహితమగు వ్యక్తులెవ్వరు ? వారికి వారే సాటి.

ధృతరాష్ట్రుడును విదురుడును దుర్యోధనున కేవియో నీతులు బోధించుచుండగనే భగవానుని చూపులు చురచురలాడుచు దుర్యోధనుని పైన ప్రసరించినవి. నే నొక్కడనుగాను. నే ననేకరూపములలో నున్నానని దుర్యోధనునకిప్పుడు చెప్పదలచినారు. దుర్యోధనునకొక్కనికే కాదు. దుర్యోధనుని సభయందున్న దొరలకును తన ప్రభావమును చూపదలచినారు. తన రాకతోపాటు తన యద్భుతవిశ్వరూప సౌందర్యమును చూడవచ్చిన నారదాది మునివర్యులకును విశ్వరూపమున తాను దర్శనమివ్వదలచినారు. సభాస్థలియంతయు కన్నులపెద్దగా పించుకొని తనను చూచుచుండగనే ఒక్కక్షణకాలమున వికటాట్టహాసము గావించి, రే ! దుర్యోధనా ! అని దుందుభిధ్వానమున గర్జించి, నన్ను బంధింతువా ? నే నొక్కడననియేనా : నీ యభిప్రాయము ? పాండవులెక్కడనుండి రావలెను ? పాండవులందరును ఇక్కడనే యుండిరి. వృష్ణిపీరులును,

భోజాంధకులనుగూడ వారు వేరు, వేరు దేశములయందులేరు. నాయందే వారి నివాసములుగూడ నని, తన అచింత్యరచనాశక్తిలోని, అణుభాగము మాత్రమే, ఆ సభాస్థలియందు ప్రదర్శించినారు.

అప్పుడది శ్రీకృష్ణుని శృంగారవిగ్రహము కాదు. అద్భుతరస చిన్మయ విగ్రహము.

భగవానుని ఫాలతలమున చతుర్ముఖబ్రహ్మయు, ఆతని విశాల వక్షమున విరూపాక్షవిగ్రహమును, నోరు తెరువగా జ్వాలాభీలమగు, అగ్నిమండలమును ; అతని కిరుప్రక్కల నాక్రమించి ఇంద్ర, యమ, వరుణ, కుబేరులును నిలిచియుండిరి.

ఆదిత్యులు పండ్రెండుమంది. మరుద్గణము ఏడుగురు. అశ్వనీ దేవత లిద్దరు. ఈ దేవతాగణముకూడ శ్రీకృష్ణునియందే యున్నది. అతని కుడిభుజమున గాండీవమును ధరించి, అర్జునుడు నిలిచినాడు. ఎడమభుజమున నాగలి భుజమునం దుంచుకొన్న హలాయుధుడు (బలరాముడు) నిలచినాడు. వీపున ధర్మజ, భీమ, నకుల, సహదేవు లుండినారు. ఇందొక చిత్రమేమన ? దుర్యోధనునికి సహాయమిచ్చిన వృష్ణిభోజాంధక వీరులను అతని తొడల నాధారముగాగొని నిలిచినారు. శంఖ, చక్ర, గదా, ఖడ్గ, శార్ఙ్గ, శక్తి, ప్రాస, తోమరా ద్యాయుధ సామగ్రియు అక్కడనే యున్నది.

కన్నులనుండి, చెవులనుండి, ముక్కులనుండి కుప్పలుకుప్పలుగా పడు నిప్పులు మంటలమండుచుండగా, ఆ విశ్వమయుని విరాడ్విగ్రహము నందలి రోమకూపములనుండి వెలుపలకువచ్చు కాంతికిరణములు సహస్రకిరుని కిరణసహస్రములవలె చూపరుల కన్నులకు మిరుమిట్లు గొలుపుచున్నవి.

ఆ భయంకర విరాడ్విగ్రహమును భగవదనుగ్రహపాత్రులు గానివారు చూడగలరా ? సభలోనివారందరును కన్నులు మూయగా

భక్తవరులగు భీష్మ ద్రోణ విదురులును, నారదాది మునీంద్రులును ఆ విశ్వరూపుని యనుగ్రహమునకు పాత్రులై తమ కన్నులనిండ ఆ మంగళమూర్తిని చూడగలిగిరి.

భగవానులా కౌరవసభయందు విశ్వరూపప్రదర్శనము గావింపగా దేవదుందుభులు మ్రోగినవి. కల్పవృక్ష ప్రసూనములు జలజల రాలినవి. ధృతరాష్ట్రిడా పుండరీకాక్షు నర్థించగా పుట్టుగ్రుడ్డికి భగవంతునిచూడదగు చూపులు ప్రాప్తించినవి. కాని అతడా కన్నులను అట్లే యుంచుకొన నిశ్చయించలేదు. నిన్ను చూచిన ఈ కన్నులతో వేరొక ప్రపంచమును చూడదలచలేదని తన గ్రుడ్డితనమునే తాను మరల తీసికొనినాడు.

ధృతరాష్ట్రిడు భగవానుని తన నేత్రములతోనే చూచినాడు. తన మనోద్వారమును తెరచి, ఆతనికి ప్రవేశమివ్వలేదు.

భగవానుని విశ్వరూప ముపసంహరింపబడినది. తరువాత కథ యేమి ?

గాంధారి తన యంతిపురమున కేగినది. ఋషు లచ్చటనుండియే అంతర్ధానమైరి. బంధుమిత్రజనంబులు వెంటరాగా కోపగించుకొన్న ఆ ముఖముతోడనే శ్రీకృష్ణభగవానులు సాత్యకి కృతవర్మల చేతుల జోడించుకొని తన పయనమును సాగించినారు.

ధృతరాష్ట్రిడు చాల చిత్రమైనవ్యక్తి. బయటవారికి తన నిర్దోషత్వ మును తెలిపి, కార్యభంగమునకు కారణము దుర్యోధనుపిదపి కొడుకు పైన పెట్టుట ఆతని నడక.

భగవానుని రథము కక్ష్యాంతరములు గడపగా శ్రీకృష్ణుడు తనను వెన్నంటివచ్చు భీష్మ, ద్రోణాది, మిత్ర బంధుజనములను సీరిక విలువు డని వారికి వెనుకకు మరలుట కాజ్ఞయిడగా ఆ సమయమున ధృతరాష్ట్రుని చివరి మాటయిది.

కృష్ణా ! పాండవులతోటి పొత్తుకై నా ప్రయత్నమంతయు నీకు తెలిసినదిగదా ? నా దోషమేమియు లేదవి నీకు తెలిసిన చాలును. అని తన స్వచ్ఛతను ప్రదర్శించుకొనినాడు.

'విదిత్వైతా మవస్థాం మే నా భిశంకితుమర్హసి
నమే పాపో స్త్యభిప్రాయః పాండవాన్ ప్రతికేశవ'

శ్రీకృష్ణుడు తనను గ్రహించలేదనియే ధృతరాష్ట్రుని అభిప్రాయము. శ్రీకృష్ణుడు భీష్మ ద్రోణులవంక దిరిగి ధృతరాష్ట్రుడు నేను నిర్దోషినని చెప్పుకొను మాటను వింటిరిగదా ? ఇక నేను వెళ్ళివచ్చెదను. ధర్మజునకీ యుదంతమును తెలుపవలెను. అని చెప్పగా ఆతని రథము కుంతిమందిరమున కేగినది. భీష్మాది కురువృద్ధులింకను, వెనుకకు మరలలేదు.

కురుసభయందు జరిగిన వృత్తాంతమంతయు మేనత్తకు నివేదించినారు. ఇట్టి ఘట్టమున తల్లియగు కుంతి పాండవుల కివ్వదగు సందేశమేమి ? పాండవులకు మాతృమూర్తియగు నా వీరవనిత తన బిడ్డలకేమి సందేశము నందించవలెనో అట్టి సందేశమునే భీష్మాది కురువృద్ధులందరును వినుచుండ క్షాత్రధర్మమును ప్రబోధించుచు ఇట్లు నుడివినది.

తిక్కనార్యుని పద్యమిది—

ఉ. రాజులకెందునారయ పరాక్రమవృత్తి జీవనవృత్తి దక్కనొం
దోజ నిషిద్ధమంద్రు మునులుత్తమసత్వులు వంశధర్మముల్
పూజత భంగిజేయుదురు బుద్ధివిహీనులు వాని దక్కి ని
స్తేజపు కూటికియ్యకొని దీనత బొందుదు రంబుజోదరా !

జాతి ననుసరించి జీవనవిధానమును మునులెట్లు వచించిరో ఆమె చెప్పినది. క్షత్రియజాతికి పుట్టుకతో బెట్టు వెన్నవలెనున్న వీరధర్మమును మరువవద్దని ధర్మజునకును భీమార్జునులకును చెప్పుమన్నది. నాడు

సభలో ద్రౌపదిని గురించి కౌరవులు మాట్లాడిన మాటలను, చేసినచేష్ట లను తన బిడ్డలు మరిచిరేమోనని జ్ఞాపకము చేసినది. విదులయను రాచ వనిత తనపుత్రుడు శత్రువుల కోడి యుద్ధరంగమునుండి వెనుకకు మరలి రాగా సంజయుడను రాజపుత్రున కుపదేశించిన నీతిని ఉపదేశించినది. విదుల ఉపదేశించిన నీతిలోని సారమిది.

'యుద్ధాయ క్షత్రియ స్సృష్టః సంజయేహ జయాయచ
జయన్వా వధ్య మానోవా ప్రాప్నోతీంద్రసలోకతాం'

కుంతి యుద్ధముచేయుటకే స్థానమిచ్చి, క్షాత్రధర్మమును నిలబెట్టు కొమ్మని పుత్రులకు సందేశమిచ్చినది. విదులాపుత్ర సంవాదమను కథను కూడ చెప్పినది. అంతతో శ్రీకృష్ణుడు కుంతితో మాటాడుట ముగిసినది. పుండరీకాక్షుడు కుంతికి వందనమాచరించగా కుంతి మేనల్లుని కౌగలించు కొని పాండవులకు తాను సుఖముగ ఉంటినన్న వార్తను చెప్పుమని బాహుబలమున జీవించుటను మరల తనబిడ్డల కెరిగింప శ్రీకృష్ణునకు చెప్పి, మరలినది. శ్రీకృష్ణుని రథమును అటనుండి ఉపప్లావ్యమునకు మరలినది.

కుంతి వాక్యములు భీష్మాది కురువీరుల కెల్లరకును ఆశ్చర్యమును గొలుపగా వారందరామెను ప్రశంసించగా శ్రీకృష్ణుడు వారినందరను వెనుకకు మరలించినారు. భీష్మాదులు దుర్యోధనుని మరల మరల శ్రీకృష్ణునితో సంధికార్య మొప్పుకొనిరమ్మని తరిమిరిగాని దుర్యోధను డొప్పుకొనలేదు. భీష్ముడు యుద్ధమునే నిశ్చయించి తన స్థానమున కేగగా పొగరాజు ముఖముతో దుర్యోధనుడు వెనుకకు మరలినాడు. ఇంతతో శ్రీకృష్ణరాయబారఘట్టము ముగిసినది. కాని భారతమున నాడును నేడును కలవరపరచు కర్ణునిపాత్రను గురించి మన మెరుగదగిన అవసరము చాల యున్నది. 'కర్ణతల' భారతమని భారతమును గూర్చిన నానుడి యొక టున్నది. కర్ణునిగురించి నేడెందరో ఎన్నియోవిధముల మాటాడుదురు.

కర్ణునిపాత్రను వ్యాసులు తీర్చిదిద్దలేదందురు. కర్ణునివంటి న్యాయస్థుడు నిజముగుమనిషి, నిజమగు వీరుడు భారతమున లేడందురు. నేడెందరికో కర్ణునిపైన జాలియున్నది. కర్ణునకెంతయో అన్యాయము జరిగినదని నేటి విమర్శకుల వాదము.

కాని కర్ణునిగురించి భారతమునందెట్లున్నదో వారామూలాగ్రముగ చూచి యెరుగరు. కర్ణునియందలి ప్రతిభా ప్రభావములనుగూడ విడదీసి సప్రమాణముగ చూపలేరు. కర్ణునిగురించి మీకిక్కడ నేను చక్కగ వివరింపదలచినాను.

కర్ణుడు కుంతికి కన్యాత్వముననే సూర్యునితేజమున పుట్టిన తేజోమూర్తి. అతని పరాక్రమముగూడ వీరలోకమునందగ్రగణ్యము. అతడు పుట్టుకయందు క్షత్రియజాతికి చెందినవాడేయయ్యును, అతని జీవితము సూతకులముననే కొనసాగినది. కావున అతడు సూతనందనుడనే బాల్యమాదిగ వ్యవహారము నడచినది. పాండవకౌరవుల విద్యాభ్యాసకాలముననే అతడు దుర్యోధనునితో స్నేహమును కలుపుకొని పాండవుల ద్వేషించినాడు. దుర్యోధనుడు తన విద్యాభ్యాసకాలముననే తనదికాని రాజ్యమును, లేక తన హక్కుభుక్తమునలేని రాజ్యమును తానాక్రమించుకొన్నట్లుగనే కర్ణునకు అంగరాజ్యమునిచ్చి పట్టాభిషేకము చేయగా ఆతడును దుర్యోధనునివలెనే ఒకరాజై దుర్యోధనునితో కలసి మెలసి మిత్రుడనుపేరుతో మెదిగినాడు. కర్ణునకు అతిరథునిజాతికి సంబంధించిన కన్యకనే వివాహము చేసినారు. కర్ణుడు ద్రోణాచార్యునివద్దనేగాక పరశురామునివద్దకూడా ధనుర్వేదము నభ్యసించినాడు.

అది యట్లుండ కర్ణుడు చక్కని దాత. ప్రత్యేకముగ దాతలను పేర్కొను భారతీయచక్రవర్తుల పంక్తియందు ఈతని దాతృత్వమును చేరినదేగాని: సామాన్యముగ దాతయని మాత్రమే పిలువబడినవాడుకాడు.

దాతృత్వమున కౌరవపాండవుల నతిక్రమించి కర్ణుని యశశ్చంద్రికలే దిగంతమున వ్యాపించినవి.

ప్రకృతమున కర్ణునిగురించి మన చర్చయేమి ? కర్ణుడు దుర్యోధనుని జీవితమును చక్కదిద్దుటయే లక్ష్యముగా గలిగి, దుర్యోధనుని యైశ్వర్యమును చిరస్థాయిగావించి దుర్యోధనుని రాజరాజు గావించుటకే ఆతడు పాటుపడెనా ? లేక, తన జీవితమును వెళ్ళదీసుకొనుటలో నేర్పరియై తన జీవితమునందీ లోకమునం దనుభవింపదలచిన తన గౌరవ మర్యాదలకు లోపమురాకుండ కాపాడుకొనుటకై దుర్యోధనునకు మాత్రము నా కీతడొక్కడే అప్తమిత్రుడను ఊహ కలుగునట్లు నటించుచు స్వార్థపరుడై యుండెనా ? అనునది ప్రశ్న. ఈ చర్చనియాంశ మెట్లు తేలవలెను ? మహాభారతచరిత్ర ననుసరించియే తేలవలెను ? కర్ణుని నిశ్చితాభిప్రాయము లెక్కడెక్కడ ఏయేవిధములుగ వెల్లడియైనవో ఆతని అభిప్రాయములనన్నిటిని ఒక్కచో కూర్చి తేల్చవలెను. ప్రస్తుతమున కథాంశమున శ్రీకృష్ణునకును, కర్ణునకును ఏకాంతమునందు ఒక విధముగ సంభాషణనడచినది. ముందా సంభాషణను పరిశీలింతము.

శ్రీకృష్ణులు కుంతియింటినుండి మరలి వెళ్ళునప్పుడు భీష్మాది కురువృద్ధులనందరను వెనుకకు పొమ్మని కర్ణునిమాత్రము తన రథమునందు ఎక్కించుకొని తనవారితోకూడ వెళ్ళినాడు.

శ్రీకృష్ణుని రథమున కర్ణుడొక ప్రియమూర్తియై కూర్చొనినాడు. రథము కొంతదూరము పోయినది. సాత్యకి ప్రముఖులును శ్రీకృష్ణుని రథమువెంట నుండిరి శ్రీకృష్ణులు కర్ణునితో ఏకాంతమున మాటాడవలెను. ఎవ్వరును వారి సంభాషణను వినగూడదు. అది అత్యంత రహస్యము. కావున సాత్యకి ప్రముఖులను తప్పించి కర్ణునొక్కనే ఏకాంతమునకు తీసికొనివెళ్ళినారు శ్రీకృష్ణులు.

అక్కడ వారిద్దరికిని జరిగిన సంభాషణము ప్రేమానుబంధమై సుహృద్భావముననే జరిగినదిగాని ఒకరినొకరు నమ్మక మాటాడుకొన లేదు. శ్రీకృష్ణున కిప్పుడు కర్ణుని నిజహృదయము కావలెను. కర్ణుడు పాండవులను యథార్థముగ ద్వేషించుచుండెనా? దుర్యోధనుని మైత్రి ప్రీతికై అట్లు మాట్లాడుచుండెనా? లేక కర్ణుడేమైన రాజ్యకాంక్షియై దుర్యోధనుని పక్షమున నిలచెనా? కర్ణుని యథార్థస్వరూపమేమి? ఆతని నిజరూపమును దెల్పుటకిదియే సమయము. ప్రస్తుతమగు ఘట్టము కర్ణుని జీవితలక్ష్యమును స్పష్టపరచుటకిదియొక పరిపిడిరాయి. కౌరవ పాండవ యుద్ధము కర్ణునిపైననే ఆధారపడినది. కర్ణుడు కాదన్నచో యుద్ధము ముగిసినట్లే. రణరంగమున నేడు జరుగబోవు ప్రజాక్షయము కర్ణాధీనము. కర్ణుడిప్పుడు దుర్యోధనుని పక్షమునుండి తొలగినచో ప్రజాక్షేమము కలుగవచ్చును. కావున తానీ ఘట్టమున తగినప్రయత్నము చేయు అవసరమున్నది. ఈ యవసరమును తీర్చవలెనన్న తాను చెప్పుమాటలు శాస్త్రాధీనములై ఉండవలెను. ధర్మశాస్త్రములకు వ్యతిరేకముగ ప్రయత్నించు దేశాభ్యుదయము శ్రీకృష్ణుని దృక్పథమునలేదు. శ్రీకృష్ణులు కర్ణునితో మాటాడునప్పుడే హృదయమున మాటాడెనో వ్యాసుని నిర్ణయమును వినుడు.

'అనుపూర్వ్యేణ వాక్యాని తీక్ష్ణానిచ మృదూనిచ
ప్రియాణి ధర్మయుక్తాని సత్యానిచ హితానిచ'

ఒకమాటకు మరియొకమాట సంబంధములేకుండ యుండక ఆనుపూర్వికమైన వాక్యములనే శ్రీకృష్ణులు చెప్పిరట. కాని ఆ మాటలు కేవలము కటువులుగాక మృదువులును తీక్ష్ణములుకూడనై యుండెనట. ప్రియములై యుండెను. కాని ధర్మయుక్తములైన ప్రియములుగాని చక్కలిగిలిపెట్టునట్టి ప్రియవాక్యములు కావట అందును అబద్ధములు లేవట. అవి కేవలము ధర్మజాదులకు హితమును కూర్చుటకై స్వపక్ష

బలమునకు మాట్లాడలేదట. ఇన్ని విశేషణములను వాడి, కర్ణునితో మాట్లాడుటను ఆతనికిగల ధర్మశాస్త్రానుభవముతో ప్రారంభించి, అదియు శిష్టాచారసిద్ధమని కర్ణుని విజ్ఞానమును ప్రపంచించినారు, శ్రీకృష్ణులు. శ్లోకము లివ్వి —

'ఉపాసితా స్తే రాధేయ బ్రాహ్మణా వేదపారగాః
తత్త్వార్థం పరిపృష్టాశ్చ నియతేనానసూయయా
త్వమేవ కర్ణ జానాపి వేదవాదాన్ సనాతనాన్
త్వమేవ ధర్మశాస్త్రేషు పరినిష్ఠితః.'

ఇక్కడ కర్ణునిపాత్రను పరిశీలింపుడు. అతడు వేదవిదులగు బ్రాహ్మణులను ఆరాధించి తత్త్వమును తెలిసికొన్న జ్ఞాని. అదియు కపటముతోగాక, అసూయారహితుడై వారికి శుశ్రూషగావించి, నియమ బద్ధుడయ్యే తెలిసికొనిన జిజ్ఞాసువు.

వారు చెప్పినపలుకులే ఆధారముగాగాక తానును ఆ శాస్త్రముల పరిశీలించిన దిట్ట. ఆ ధర్మశాస్త్రములలోగూడ సూక్ష్మధర్మములను ఎరిగిన ప్రౌఢ. ఇది కర్ణుని యర్హత. శ్రీకృష్ణు లొప్పుకున్న యర్హత. ఇప్పుడేమి తేలినది ? కర్ణుడు మూర్ఖుడు కాడనియు, విద్వాంసుడనియు తేలినది. నాటి ధర్మశాస్త్రముల నన్నిటిని ఒప్పుకొనెనని తేలినది. శ్రీకృష్ణుడు కేవలము కపటోపాయమునకై కర్ణునితో మాటాడ అభిలషించ లేదని తేలినది. ఇక శ్రీకృష్ణులేమి చెప్పెనో వినుడు.

శ్రీకృష్ణులు కర్ణుని జన్మరహస్యమును చెప్పినారు. కర్ణుడు పాండునందనుడగుట ధర్మశాస్త్రసమ్మతమనినారు. నీవు ఒప్పుకొన్నచో పాండవజ్యేష్ఠునిగా పెద్దలవలనగూడ ఒప్పించి, పాండవజ్యేష్ఠుని అనుమతితో భీమార్జున నకుల సహదేవులకలయికతో నిన్ను పట్టభద్రుని చేయించెదననినారు. ధౌమ్యాదిమహర్షుల అభిప్రాయములతో వేదవిధుల

తోడనే నీ జీవితమునకొక విధమును కల్పింతుననినారు. ద్రౌపదియు నిన్ను ఆరవవానిగా గ్రహించుననినారు. ఉపపాండవులును, అభిమన్యుడు కూడ నిన్ను సేవింతురని గ్యారంటీని యిచ్చినారు. నేను నిన్ను సింహాసనాసీనుని గావించి అభిషేకింతుననినారు. పితృపక్షమున పాండవులును మాతృపక్షమున వృష్ణులును నీకు బంధువులుగాగల రనినారు. రాజబంధువులును రాజకన్యకలునుగూడ, కాంచనరాజిత మృణ్మయ కుంభములతో వేదోక్తవిధితో అభిషేకింతును అని చెప్పినారు. ధర్మజుడు యువరాజై నిన్ను సేవించుననినారు. ఇవి శ్రీకృష్ణుడు కర్ణునకు చెప్పిన సత్య ధర్మహితబోధలు. మూలవచనములనుగూడ మీకు వినిపింతును ఆ శ్లోకములలో ముఖ్యముగ ధర్మజుని యువరాజును చేతుననుటయు, తాను స్వయముగ పట్టాభిషేకమును చేతుననుటను, ద్రౌపదిగూడ నిన్ను సేవించునన్న శ్లోకములను వినిపింతును.

'షష్ఠేత్వాంచ తథాకాలే ద్రౌపద్యుపగమిష్యతి
అహంచ త్వాభిషేక్ష్యామి రాజానం పృథివీపతిం
యువరాజోస్తుతే రాజా ధర్మపుత్రోయుధిష్ఠిరః'

ఇంతవరకు శ్రీకృష్ణుని వాక్యసరణి. ఇక కర్ణుడు చెప్పిన సమాధానము-ముఖ్యముగ —— కర్ణుడు శ్రీకృష్ణులు తన హితమును, శ్రేయస్సును కోరియే తనకీమాటలను చెప్పెనని ఒప్పుకొని తరువాత తన అభిప్రాయములను వెల్లడించినాడు. కర్ణునకు శ్రీకృష్ణునియందు సంశయము లేదు.

'అసంశయం సౌహృదాన్మే ప్రణయాచ్చాత్థకేశవ'

కృష్ణా ! నీవు చెప్పినట్లు ధర్మశాస్త్రానుసారముగా నేను పాండు నందనుడనే. సందేహములేదు. అయ్యును అతిరథుడు నన్ను తీసుకొని రాధకు యివ్వగా ఆమెకు నాయందలి వాత్సల్యముచే చన్నులనుండి పాలుగారినవి. నా మూత్ర పురీషముల గ్రహించి, తన క్షీరమునిచ్చి పెంచినది రాధగాని కుంతికాదు. అంతేగాక శాస్త్రసిద్ధముచేతను, పుత్ర

ప్రీతిచేతనుగూడ జాతకర్మాది సంస్కారములను సూతుడే చేసి నాకు వసుషేణుడను నామకరణమునుగూడ చేసిన మాతా పితరులు వారే. ఇప్పుడు నేను వారికి సేవచేయకుండ విడుచుట ఎట్టి ధర్మము ? అంతేకాక నాకు సూతకులమునకు సంబంధించిన కన్యకనే పెండ్లిచేయగా ఆమె యందు నాకు పుత్ర పౌత్రులుండగా నా అభిమానము వారినుండి ఎట్లు వేరగును ? ఇవన్నియు ఇట్లుండ దుర్యోధనుడు అర్జునునకు మారుగ నన్ను ఎన్నుకొని, నేను అర్జునునికి దీటైయుందునని నమ్మినాడు. నమ్ముటకాదు : నన్నాదరించి గౌరవించినాడు. ఇప్పుడు నేను చావునకు భయపడి ఆ పక్షమునుండి తొలగుటయు ధర్మముకాదు. ఒకవేళ నేను తొలగినను అర్జునునకును నాకునుగూడ కళంకము రాగలదు. కావున నేను పాండవపక్షము నాశ్రయింపనని చక్కనికారణములను ప్రతిపాదించి తాను తన నిశ్చయమును తెలిపినాడు. కర్ణుడంతతో ఆగలేదు. నా జన్మ రహస్యమును ధర్మజునకు చెప్పవద్దని మంత్రరక్షణకై భగవానుని అర్థించి, తన జన్మరహస్యరక్షణను గావించనిచో వచ్చు నష్టము నిట్లు చెప్పినాడు.

నేను పాండుసుతుడనని ధర్మజుడెరుగుచో ఆతడు రాజ్యమును తీసికొనడు. నాచేత బెట్టును. ఆతడు ఇంద్రియనిగ్రహము కలిగిన మహనీయుడు. 'ధర్మాత్మా సంయతేంద్రియః' నేను తప్పక ఆ రాజ్యమును దుర్యోధనునకే యిచ్చెదను. కాని ఈ సామ్రాజ్యము దుర్యోధనునకు రాతగినదికాదు. ధర్మజుడే శాశ్వతమగు రాజు కావలెనని తన నిశ్చయమును చెప్పినాడు.

'స ఏవరాజా ధర్మాత్మా శాశ్వతోస్తు యుధిష్ఠిరః'

కర్ణుని సమాధానమున మరియొక ముఖ్యమగు విషయమున్నది. యథార్థమును మాన్పప్రయత్నించుట యుక్తముకాదనినాడు. కారణ మేమన ? ఇది ఒక యజ్ఞమని కర్ణుడు పలికినాడు. ఈ యజ్ఞము దుర్యో

ధనునిదే ననినాడు. ఈ యజ్ఞమునకు శ్రీకృష్ణుని ఉపద్రష్టగాను, అధ్వర్యుడుగాను వర్ణించినాడు. శ్లోకము లివిగో.

'ధార్తరాష్ట్రస్య వార్ష్ణేయ శస్త్రయజ్ఞో భవిష్యతి
అస్యయజ్ఞస్య వేత్తాత్వం భవిష్యపి జనార్దన
అధ్వర్యవంచ తే కృష్ణ క్రతావస్మిన్ భవిష్యతి'

ఆంధ్రభారతమున నీ వుపద్రష్టవుగా ఈ యజ్ఞము జరుగునని యున్నది. వ్యాసభారతమున నీవు వేత్తవును అధ్వర్యుడవునని కర్ణుడు శ్రీకృష్ణున కిక్కడ రెండధికారముల విచ్చినట్లు చెప్పినది. కారణ మేమన: లోకమున అధ్వర్యుడు వేరుగను, ఉపద్రష్ట వేరుగను ఉందురు. కాని ఈ రెండును నీవేనని కృష్ణుని వర్ణించినాడు. అధ్వర్యుడన కార్యకర్త. యజ్ఞమును నెరవేర్చువాడు. ఉపద్రష్టయన సాక్షియై చూచువాడు. ఈశ్వరరూపముచేత కర్తయై, పరబ్రహ్మగా సాక్షియై ఈ యజ్ఞమును నీవు నడుపుదువనినాడు. ఇంతేగాక ఈ యజ్ఞములోని భాగములనన్నియు వర్ణించి, ఆయా భాగములను ఏవరెవరు నెరవేర్తురో కూడ వర్ణించినాడు. ఉదాహరణకు యజ్ఞమున హోతయనువాడొక ఋత్విక్కు. అతడు అర్జునుడుగా ఇందు వర్ణించినాడు కర్ణుడు. హోత చాల ప్రధాన పాత్ర. యజ్ఞమునందు నేతినిఉంచి, హోమముచేయు పాత్రకు స్రుక్కని పేరు. ఆ స్రుక్కు ఇక్కడ గాండీవమేననినాడు. ఆ స్రుక్కుయందుంచబడు ఆజ్యము యోధులయొక్క వీర్యమని వర్ణించినాడు. ఇట్లు చెప్పుచు, ఈ యజ్ఞముయొక్క చివరిభాగ మెక్కడనో చెప్పినాడు.

యదా ద్రోణంచ భీష్మంచ పాంచాల్యోపాతయిష్యతః
తదా యజ్ఞావసానం తద్భవిష్యతి జనార్దన
దుర్యోధనం యదాహన్తా భీమసేనో మహాబలః
తదా సమాప్స్యతే యజ్ఞః ధార్తరాష్ట్రస్య మాధవ.

భీష్మద్రోణుల పతనము దుర్యోధనుని యజ్ఞమునకు చివరి భాగమట. దుర్యోధనుని భీముడు చంపగా ఈ యజ్ఞము సమాప్తమట. వింటిరా ? కర్ణుని నిర్ణయము లెట్లుండెనో ? ఇంకను మరికొన్ని ముఖ్యములగు మాటలు కర్ణుని ముఖమునుండి వెలువడినవి. ఈ సమయమున యుద్ధము జరుగుట చాల ముఖ్యమని కర్ణుడు నిర్ణయించినాడు. కారణమేమన ? క్షత్రియులకు వృధామరణము శాస్త్రీయముకాదు. యుద్ధమరణము శ్రేష్ఠము. కావున విద్యావృద్ధులును వయోవృద్ధులును అగు రాజులెందరో ఈ కురుక్షేత్రమున యుద్ధమందు నీల్గి పుణ్యలోకముల పొందుదురుగాన ఈ యుద్ధమును విరమింపచేయవద్దని కృష్ణునకు సలహా నిచ్చినాడు.

కర్ణుడు ద్యూతమంటపమున పాండవులను గురించి మాట్లాడుటకును ఈ ఘట్టమున కృష్ణుని ఎదుట మాట్లాడుటకును ఏమి సంబంధమున్నది ? కాని తాను దుర్యోధనునివద్ద పాండవులను గురించి మాట్లాడిన దానిని గురించి కర్ణుడు శ్రీకృష్ణునికి సమాధానమిచ్చినాడు. ఆంధ్రభారతమున లేదు. వ్యాసభారతమునందున్నది.

'యదబ్రువ మహం కృష్ణకటుకాని స్మ పాండవాన్
ప్రియార్థం ధార్తరాష్ట్రస్య తేనతప్యే మహాత్మనా'

నేను పాండవులను నిందించిన నిందావాక్యములన్నియు దుర్యోధనుని ముఖప్రీతికయ్యే మాటాడితినిగాని నా హృదయపూర్వకములు గావని నిర్ణయముగ పలికినాడు. ఇది ఇట్లుండనిండు. తాను అర్జునుని జయించుటను గురించి ఏమి చెప్పినాడు ?

'యదాద్రక్ష్యసి మాం కృష్ణనిహతం సవ్యసాచినా
పునశ్చిత్తి స్తదాచాస్య యజ్ఞస్యాథ భవిష్యతి'

తాను అర్జునునిచేతిలో చచ్చుట నిక్కమనియే కృష్ణునకు చెప్పినాడు. నేటి యుద్ధము ఆచంద్రతారకముగ మహానీయులచే పుణ్య

మునకై కీర్తింపబడుననినాడు. కర్ణుని పాత్రను పరిశీలించుటకిది చాలును. దుర్యోధనునకీ విషయ మొక్కరోజునైనను చెప్పియుండలేదు. మరి కర్ణుడు దుర్యోధనునకెట్టి మిత్రుడు ? మిత్రముఖ శత్రువనక తప్పదు. కర్ణునియందలి గుణదోషముల విభాగించి చూడవలసివచ్చినప్పుడు పాండవులయందు తనకుగల లక్ష్యమును దుర్యోధనునివద్ద దాచి స్వార్థపరుడై దుర్యోధనునివలన సన్మానముల ననుభవించెనను దోషగుణము కర్ణునియందున్నదనక తప్పదు. ఇక కర్ణునిలోని గొప్పతనమును విభాగింతము. దుర్యోధనుని పక్షమునందుండి, పాండవుల పరాక్రమమును, పాండవుల ధర్మమును నిందించుచు, దుర్యోధనునకు సామ్రాజ్య కాంక్షను కల్పించి, కౌరవ పాండవ యుద్ధమునకు కారకుడగుట యను దోషమును తొలగించినచో మిగిలినదంతయు కర్ణునిలోని గుణసంపదయే. అతని దాతృత్వము—శ్రీకృష్ణుడు సామ్రాట్ పదవిని చేతికిత్తుననినను దానికి దా నర్హుడను కానని ఆ పదవిని త్యాగముచేయుట, అమానుష సౌందర్య రాశియైన ద్రౌపదిని తనకిప్పింతునన్నను, తాను పరిణయమాడిన యిల్లాలి యందలి ధర్మానురాగము, శ్రీకృష్ణుడు బ్రహ్మణ్యుడని గుర్తెరిగి, ఇంద్రియనిగ్రహమున తపస్వియై వర్ధిల్లుట, తన బ్రతుకునకు నిమిత్తమాత్రమగు స్థానమునేయిచ్చి, ఆత్మోద్ధరణకు సంబంధించిన దాన ధర్మముల తాను వదలుకొనకుండుట – మొదలగువాటిని విచారించుచో కర్ణుడు ధర్మమూర్తియని వ్యాసభారతము చక్కగ నిర్ణయించినది.

భారతచరిత్ర కర్ణుని కీర్తికిరణములను మరుగుపరచలేదు. అతని కీర్తిచంద్రికలను దిగంతములయందు వ్యాపింపజేసినది. ఇప్పుడు భగవానులు చేసినపనిని పరికింపుడు. ఇది రాజకీయము గాదు. పాండవుల యథార్థస్వరూపమేమియో ప్రతిపక్షమునందున్న కర్ణునివలననే బయటకు తెప్పించినారు. కాంతాకనకములం దాశలేని కర్ణునిజీవితమును బయట పెట్టినారు. కాని ద్రౌపదిని కర్ణున కిప్పింతునన్న మాటయేమి ? అందురా!

అదియు కర్ణునకు కేవలమగు కాంతాసుఖము నిప్పింతుననుట కాదు. కర్ణుడు దుర్యోధనుని ఎదుట ద్రౌపదిని మరియొకభర్తను చూచుకొమ్మని పలికినాడు. ద్రౌపది అయిదుగురుభర్తలు కలదగాన ఆమె కెక్కడి పాతివ్రత్యమని ద్రౌపదిని నిందించినాడు. ఆ మాటనే యిక్కడ రాజ్యము నిప్పింతునన్న మాటతో కలిపి, ఆ ద్రౌపదికి ఆరవభర్తవు నీవే యగుమని సూటిగ చెప్పినాడు. పాండునందనుడవైన నీ వుంటివిగదా ! వేరొక భర్త నేలచూచుకొమ్మంటివి ? అను భావమును గంభీరముగ చూపినారు కృష్ణులు. కర్ణుడా ఘట్టమును స్మరించియే మనసున నాడు ద్రౌపదిని అన్న మాటకు బాధపడి పశ్చాత్తప్తుడై పాండవులను మాటాడిన కటుక భాషణములకు బాధపడుచుంటినని భగవంతుని దగ్గర విన్నపించుకొని ప్రత్యేకముగ ద్రౌపది మాటనెత్తలేక, పాండవులనే ఎత్తికొని ఆ మాటకు సమాధానమిచ్చినాడు. భగవానులు అసలా పలుకును పలకవచ్చునా ? అందురేమో ? కర్ణుడు పాండవజ్యేష్ఠు డగుటచే ధ్వనిదోషము లేదు. ఒకవేళ కర్ణుడొప్పుకొన్నచో ఏమిచేయును ? కొందరు ప్రశ్నింపవచ్చును. రాజ్యమునుగ్రహించుటకు పాండునందనునిగా ఏ ధర్మశాస్త్రము లాధారము లైనవో ద్రౌపది పత్నియగుటకును ఆ శాస్త్రములే ఆధారములగును. ధౌమ్యు లగ్నిహోత్రముల చేయునని చెప్పెనుగదా ? అతడు వైదికాగ్ని నెట్లు ఏర్పరచును ? అట్లే ద్రౌపదకి ధర్మపత్నిత్వము శాస్త్రతఃప్రాప్తించును. ఒకవేళ తానన్న మాటను కర్ణు డొప్పుకొన్నచో ఏమి చేయవలెనో ఆలోచించకయే కృష్ణుడు మాటాడునా ?

ఇంతవరకు మీకు కర్ణుని పాత్రనుగురించి కృష్ణ కర్ణ సంవాదము నాధారముగా గొని చెప్పినాను. ఇంతేకాక భీష్మ డంపశయ్యయందుండగా కర్ణుడు వెళ్ళి దర్శించినప్పుడు భీష్ముడుకూడ కర్ణుని పాండవులలో కలుపుటకు రహస్యముగ యత్నించినాడు. అప్పుడును కర్ణుడు చలించ లేదు. కర్ణుడు దుర్యోధనుని హితమును కోరిన మిత్రుడుకాడు. అత

డందించిన గౌరవమునకు కృతజ్ఞతచూపిన సేవకుడు. కర్ణుడు భీష్మునితో నేను పాండవులవైపుకు వెళ్ళను, దుర్యోధనునకే నా జీవితము నంకితము చేసెదనని చెప్పుచు

శా॥ ... ... ... ...
మత్సేవా ధర్మము నిర్వహించెద ... ... ...

ననినాడు. కర్ణుని గురించి ఇకచాలును. మరొక్కవిషయమును గూడ చెప్పి, మిమ్ములను కథకు తీసుకుపోదును.

పాండవుల దాయభాగమును గురించి మీకు ఒక సందేహమును తీర్చవలసి యున్నది.

ధృతరాష్ట్రుడు పెద్దవాడుగనుక రాజ్యము దుర్యోధనాదులదే ననువారుండ వచ్చును. లేక ధృతరాష్ట్రుడు గ్రుడ్డియగుటచే పాండురాజునకే పట్టముకట్టబడినదన్నచో రాజ్యము అవిభక్తముగదా ; పాండవులర్ధరాజ్యము నేలకోరిరి ? అనవచ్చును. ఎటులైనను పాండవపక్షమున గూడ అన్యాయమున్నదని సంశయించుట నేడు కొందరి విజ్ఞులయందు కలదు.

ముందు రాజ్యమునందు ధార్తరాష్ట్రుల కేమియు సంబంధము లేదనుటకు గల ఆధారములను చూపెదను. దుర్యోధనునితో రాజ్యవిషయమున చెప్పిన ధృతరాష్ట్రుని మాట.

'పాండుస్తురాజ్యం సంప్రాప్తః కనీయానపిసన్నృపః
వినాశే తస్య పుత్రాణాం ఇదం రాజ్యమరిందమ
అరాజ పుత్రోహ్యస్వామీ పరస్వం హర్తుమిచ్ఛసి'

కనిష్ఠుడైనను పాండురాజే రాజయ్యెను. ఈ రాజ్యము ఆతని పుత్రులదేగాని నీదికాదు. రాజుకానివాని పుత్రునకు రాజ్యముపై హక్కులేదు.

ఇట్లే గాంధారి చెప్పినది.

'రాజ్యంతు పాండోరిద మప్రధృష్యం
తస్యాద్య పుత్రాః ప్రభవంతి నాన్యే
రాజ్యం తదే తన్నిఖిలం పాండవానాం
పైతామహం పుత్రపౌత్రానుగామీ.'

ఈ రాజ్యము పాండురాజుదే. వంశక్రమమునకూడ వారికే చెల్లును.

మరి ధృతరాష్ట్రుని చేతి కెట్లు వెళ్ళినది ? అను ప్రశ్న లేకపోలేదు. పాండురాజు అన్నగారి యందలి గౌరవముచే పీఠమున కూర్చుండ బెట్టెను.

రాజా కురూణాం ధర్మాత్మా సువ్రతః సుసమాహితః
జ్యేష్ఠాయ రాజ్య మదదత్ ధృతరాష్ట్రాయ ధీమతే.

ఇది ద్రోణుని సమాధానము. ఇక కథకు పోదము.

శ్రీకృష్ణుడు కర్ణుని రథముపై నెక్కించుకొని ఏకాంతమునకు బోయి మాట్లాడె ననునది కథాంతర్భాగము.

కర్ణుని పాండవపక్షమునకు రమ్మని పిలచెను. ఆత యొప్పుకొన లేదు. ధర్మజుని యుద్ధమునకు తీసుకొని రమ్మనియు తన జన్మ రహస్యము నాతనికి చెప్పవద్దనియు చివరి సమాధానముగ చెప్పినాడు.

'సముపానయ కౌంతేయం యుద్ధాయ మమ కేశవ
మంత్ర సంవరణం కుర్యాన్నిత్య మేవ పరంతప'

కర్ణు డింత గట్టిగ ఎందుకు చెప్పెను ? కృష్ణు డేమైన యుద్ధము మానునట్టి యత్నము చేయునేమోయని చెప్పెను.

కృష్ణునకు నవ్వు వచ్చినది. పరిహాసించుచు రాజ్యము నొదులుకుంటివనినారు. అని యుద్ధమునకు నిశ్చయమని భీష్మద్రోణులకు

కర్ణుని ముఖముగా ఆహ్వానము నందించినారు. యుద్ధమున కిదే తగు కాలమనినారు. ఏడురోజులలో అమావాస్య వచ్చునని ఆరోజు ఇంద్ర దేవతాకమని చెప్పినారు. కర్ణుని క్షేమైన భయమా ? శకునములు యుద్ధమునే సూచించుచున్నవని చెప్పి, శ్రీకృష్ణుని గాఢముగ కౌగలించు కొని రథమును దిగినారు. కర్ణునకు జయించుటయు చచ్చుటయు ఒకటియే. కావుననే కృష్ణా ! జయించిన ఇక్కడను, చచ్చిన వీరస్వర్గమునందును నిన్ను కలియుదునని కృష్ణుని కౌగలించి వెళ్ళినాడు. కృష్ణుడు ఉపప్లావ్యమున కేగినారు.

నేటికి ఉపన్యాసము సమాప్తము —

తరువాతి కథ రేపు —



# యుద్ధోద్యోగము

మహాశయులారా!

నేటి కథాఘట్టము యుద్ధోద్యమము. ఉద్యోగపర్వమున సంధిభాగము సమాప్తమైనది. రాజనీతిశాస్త్రము నందలి చతుర్విధోపాయములలో మూడుపాయములు ముగిసినవి. నాల్గవది దండోపాయము. నిన్నటి దినమున శ్రీకృష్ణుని రథము ఉపప్లావ్యమునకు మళ్ళగా కర్ణుడు దీనవదనుడై నిజమందిరమునకు మరలినాడు. విదురుని రథము శ్రీకృష్ణుని విడిచి కుంతిగృహమున కేగినది. కౌరవసభయందలి విశేషములు శ్రీకృష్ణుడు కుంతి కెరింగించి వెళ్ళినను కర్ణునకు శ్రీకృష్ణుడు తెలిపిన యుద్ధ నిశ్చయవార్తను తెలుపుటకై విదురుడు కుంతివద్దకు వెళ్ళినాడు. యుద్ధము నేటి కేడవరోజున వచ్చు అమావాస్య యనుమాటకూడ కుంతిచెవిని పడినది. కుంతియు, విదురుడును చాల చింతించినారు.

కాలము బలవత్తరము. నాటి రాజమండలము కాలగర్భమునం దస్తమించక తప్పదు. అయ్యెను ఆశ చాలచిత్రమైనది. యుద్ధ విరమణకు ప్రయత్నించు ప్రయత్నములలో కుంతి ప్రయత్నము ఇంకను మిగిలి యున్నది. విదురుడు చెప్పిన యుద్ధవార్త విని కుంతి కుంగిపోయినది. తన బిడ్డల కపజయము వచ్చునేమో ననికాదు. క్షత్రియజాతికి వచ్చిన ఆపదను తలచి ఆమె పరితపించినది. ఈ యుద్ధమును విరమింపచేయ దలచిన ప్రతివారి దృక్పథమునను కర్ణుడు చాల ముఖ్యుడై నిలిచినాడు.

దుర్యోధనుని పక్షమునుంచి కర్ణుని విడదీసినచో యుద్ధము ముగియునని శ్రీకృష్ణుడు చాల ప్రయత్నించగా ఆ ప్రయత్నము సఫలము కాలేదు. కుంతికి కొంత ఆశయున్నది. ఆప్రయత్నమున కామె

నిర్ణయించుకున్నది. కుంతి ఆ ప్రయత్నము నెట్లు చేయవలెను? కుంతి కర్ణునితో మాటాడుట కొక రహస్యప్రదేశము కావలెను. కుంతి కర్ణునితో మాట్లాడెనని ఎవ్వరికిని తెలియకూడదు. కుంతి కాతడు కన్యాత్వమున జనించినవా డగుటచే కుంతికి ఆతనియం దొకవిధమగు స్వతంత్ర మున్నది. తానే స్వయముగ కర్ణునకు జన్మరహస్యము నెరిగించుచో ఆత డేమైన పాండవులపై సోదర ప్రేమను చూపునేమోనను ఆశ ఆమెకు పొడమినది.

ప్రతి నిత్యమును ప్రాతఃకాలమునం దాతడు భాగీరథీతీరమున జపతత్పరుడై యుండునని కుంతి యెరుగును.

కర్ణుడు కేవలము దానవ్రతుడేకాదు. జపతత్పరుడు. అతడు ప్రాతః కాలమున ఊర్ధ్వబాహువై కాళ్ళను నేలమోపి ధ్యానగతుడగుచో రెండు జాములు దాటినగాని అతని దృష్టి ప్రపంచాభిముఖముకాదు. కుంతి కర్ణునితో మాటాడుటకు కర్ణుడు జపము గావించుకొను ప్రదేశమునకు తా నొక్కతెయే ఒంటరిగ గంగాతీరమున కేగినది. కర్ణుని సమీపించినది. ఆత డింకను అప్పటికి కన్నుల తెరవలేదు. కుంతి ఎండకు మగ్గుచు కర్ణుడు జపమునుండి లేచువరకును అట్లే నిలచినది. అక్కడ జన సంచారములేదు.

అప్పటికి మధ్యాహ్నకాలము దాటినది. కర్ణుడు ఊర్ధ్వబాహువుల దింపి, శాంతచిత్తముతో కన్నుల దెరచినాడు. తనను కన్నతల్లియొక్క దర్శనమైనది. కాని ఆమె పాలనిచ్చినస్మృతియైనను కర్ణునకు లేదు. తను కన్నది తడవుగా బిడ్డను నదీగర్భమున వదలిన తల్లియని ఆత డెరుగును. స్నేహమెక్కడినుండి వచ్చును? కాని వారిద్దరిమధ్యను ధర్మము మూర్తీభవించియున్నదనుట సత్యము. ధర్మము ప్రతివ్యక్తికిని కన్నులకగపడు విగ్రహము కాదు. వేదశాస్త్రములపై గల విశ్వాసము దాని స్వరూపము.

కర్ణుడు కుంతినిచూచి తన సూత కుల గోత్ర నామములతో నేను రాధేయుడనని చెప్పి కుంతిపాదములకు ప్రణమిల్లినాడు. ప్రకృతమున కుంతి తానెవ్వరో కర్ణునకు చెప్పుకొనవలెను. తనకు కర్ణునియందున్న ఒకవిధమగు స్వాతంత్ర్యభావము చొరవను కల్పించగా కర్ణునకు తన నిజమాతృత్వ స్వరూపమును చెప్పినది. అంతేకాదు. తానిప్పు డేకార్యము నభిలషించి వచ్చినదో కూడ కర్ణుడడుగగా చెప్పినది.

కర్ణా! నీవును పాండవులును సోదరులు. నీవిప్పుడు దుర్యోధనుని పక్షమును వదలి పాండునందనుడవై రాజపుత్రుడవు కమ్మన్నది.

కర్ణుని చిత్తము ధర్మమునకు దూరమైయుండదు. తన నిజ ధర్మమును తాను మరచినవాడు కాడు. తన్ను గౌరవించిన దుర్యోధనుని ఎట్లు మరచును? ఏ క్షణమునందును ఆతనిని మరచియుండడు. అదియే కృతజ్ఞతా ధర్మము.

కుంతి తనకు చెప్పిన పుట్టుకను గురించి సూర్యమండలమునుండి ఇది సత్యమనుమాట కర్ణునకు వినిపించినది. అయ్యును పుట్టిననాడే నీవు నన్ను దూరముచేసితివిగదా? నీ సుఖముకొరకై నా క్షత్రియసంస్కారమును నాశనము చేసితివి. నీకంటె నాకు శత్రువెవరు? చేతులార కన్న బిడ్డను నదిలోవదలిన నీయందు నాకెక్కడి మాతృప్రేమ? అని కుంతిని నిర్మొగమాటముగ అడిగినాడు. కుంతి ఏమనును? తాను కన్నబిడ్డను ప్రవాహమున వదులునప్పుడెట్టి బాధ ననుభవించినదో ఆ బాధనిప్పుడు కర్ణునకు చెప్పి, అతని హృదయమును తనవైపుకు త్రిప్పగలదా? ఆ కర్ణునిమాటకు ఆమె లోలోననే కుంది, మౌనమును వహించినది.

కర్ణుడు కుంతితో నాకు రాధయే తల్లి, అతిరథుడే తండ్రియని గట్టిగ వక్కాణించినాడు. రాజ్యకాంక్ష అతని ధీరత్వమును చలింప చేయ లేకపోయినది. కాని అతడొకవిధముగ దానవీరుడు. దీనురాలైన కన్న తల్లి తనదగ్గరకు రాగా అతడామెను రిక్తహస్తములతో పంపునా?

కుంతి పాండవులపై కల్పించిన సోదరభావమునకుగాను యుద్ధరంగమున ఒక్క అర్జునునితప్ప మిగిలిన నలుగురుసోదరులను చంపనని తల్లికి అభయదానము నిచ్చినాడు. అర్జునుడే తనకు చిక్కుచో చంపక వదలనని సత్యమునే చెప్పినాడు. తల్లీ ! నీ కెప్పుడైన అయిదుగురే బిడ్డలనినాడు. నేను చచ్చుచో అర్జునునితో అయిదుగురు. అర్జునుడు పోవుచో నాతో అయిదుగురు అని గట్టిగ చెప్పినాడు. యుద్ధవిరమణమును కోరిన కుంతి ఆశ నిరాశయైనది. పుత్రులను గురించిన వరమొక్కటే దక్కినది. అంతతో వారి సంభాషణ ముగియగా పుత్రప్రేమతో కుంతి కర్ణుని కౌగలించినది. అతడును నాటి మాతృగౌరవమున కుంతిని కౌగలించి నాడు. కుంతి గృహమున కేగినది. మనమిప్పు డొక్కమారు ఉపప్లావ్యమున కేగుదము.

శ్రీకృష్ణుని రథము ఉపప్లావ్యమునకు చేరినది. విరాట ద్రుపద ముఖ్యులందరును ధర్మజుని కొలువునందుండగా ఆ కొలువుకూటముననే భగవానుని దర్శనమబ్బినది ధర్మజునకు. సోదరులందరును అచ్చటనే యుండిరి. భగవానులు వారందరి సత్కారముల నందుకొని, సంధికార్య మేమైనదో ఒక్కమాటతో వారందరికిని తెలియజేసినారు.

తే॥ ధార్తరాష్ట్రు లున్మత్తులు దగినపలుకు
లేల విని సంధి పేయుట కిచ్చగింతు
రెడిరి దమ్మును నెరిగిరయేని వార
లంతలంతలు పేయుదురయ్యా నాడు.

మదాంధులైన ధార్తరాష్ట్రులు సంధికి ఒప్పుకొందురా ? వారు తమను తామెరుగరు, ఎదరివారినస లెరుగరు. ఎరిగినవారగుచో వారం తంత కృత్యముల చేయుదురా ? అని మార్గాయాసమును తీర్చుకొనుటకై తన గృహమున కేగినారు.

ఇక ధర్మజునకు కౌరవసభయందలి వార్తావిశేషములు వివరముగ తెలియవలెను.

అది రాత్రికాలము. భీమార్జున నకులసహదేవులును, ధర్మజుడును ఒక్కచోకూర్చుని భగవానుని రావించినారు. కౌరవసభా విశేషము లన్నియు శ్రీకృష్ణులు పూసగ్రుచ్చినట్లు చెప్పినారు ధర్మజునకు. ధృతరాష్ట్ర, విదురులును, భీష్మద్రోణులును, గాంధారియు, నారదాది మహర్షులుగూడ దుర్యోధనునకు సంధికార్యమును గురించి ఎంతయో చెప్పిరికాని ఆతడు వినలేదని ఆ దుర్యోధనుని మూర్ఖతయు, తన్ను బంధింపవచ్చుటయు తాను చివరిలో అయిదు ఊళ్ళనిమ్మని అడిగినను సూదిమొన మోపినంత భూమినికూడ పాండవుల కిచ్చుటలేదని తనకు దుర్యోధనుడు చెప్పిన సమాధానమును ధర్మజునకు వివరించి చెప్పి, ధర్మజా ! యుద్ధములేక వారు నీకు రాజ్యమివ్వరు. ఆ పాపాత్ములయందు దండమును విధించుటకంటె వేరు మార్గములేదని స్పష్టపరచినారు.

'దండం చతుర్థం పశ్యామి తేషు పాపేషు నాన్యథా'

శ్రీకృష్ణుని వచనముతో ధర్మజుడు యుద్ధమునే నిశ్చయించినాడు. యుద్ధయాత్రకుబోవు రాజునకు ప్రథమకర్తవ్యమేమి ? సేనానాయక నిర్ణయము. సర్వసేనా నాయకు డెవ్వడను విషయమున నకుల సహదేవులు ద్రుపద విరాటులను, భీముడు శిఖండిని నిర్ణయించగా అర్జునుడు ధృష్టద్యుమ్నుని నిర్ణయించినాడు. ధర్మజుడు శ్రీకృష్ణునిపై నుంచగా ఆతడును ధృష్టద్యుమ్నునే నిర్ణయించుట జరిగినది. రాజు లందరును అందుకు తల లూపినారు. భేరీభాంకారములు మ్రోగినవి. అట్లే పాండవబలమునంతను ఏడుభాగములుగా విభజించి, ప్రత్యేకముగ ఒక్కొక్క అక్షౌహిణికి ఒక్కొక్క దండనాథుని ఏర్పరచినారు. విరాట ద్రుపదులును, సాత్యకియు, జరాసంధుని పుత్రుడు సహదేవుడును, చేకితాన ధృష్టకేతు శిఖండులును దండనాథులు. వా రందరికిని పట్టాభిషేకములు

గావింప నిశ్చయమైనది. అప్పటికి చాలరాత్రి గడచినది. అందరును తమ తమ గృహములకు జని సుఖనిద్రను చెందినారు.

అది ప్రాతఃకాలము. భగవానుని దివ్యతేజము సూర్యమండలమై ఆకసమునం దంకురించినది. ఉపప్లావ్యమున ధర్మనందనుని కొలువు కూటము యుద్ధవీరులతో కలకలనాడినది.

పాండవ కౌరవుల సంగ్రామరంగము కురుక్షేత్రము. ప్రకృతమున ధర్మనందనుడా కురుక్షేత్రమునకే తన సైన్యమును తరలించవలెను. సర్వసేనానాయకు డెవ్వడో క్రిందటిరాత్రియే నిర్ణయించబడినాడు. దండనాథులును నిశ్చయింపబడినారు. యుద్ధసామగ్రి అంతయు నమకూర్చబడినది. కాని సర్వసేనానికిని, దండనాథులకును, పట్టాభిషేకముల గావించుట మిగిలినది. ఆ ఘట్టమంతయు నేటి ప్రాతఃకాలమున జరిగినది.

ఇక కురుక్షేత్రమునకు పయనమును సాగించి రంగస్థలమున కాలు బెట్టవలెను.

ధృష్టద్యుమ్నుడు సర్వసేనాధిపతియై వీరవరులనందరను అర్జునునకు అధికారికముగ పరిచయము గావించి, వీరినందరను నీవు కంటికి రెప్పవలె కాచగా నీకు రక్షకుడీ కృష్ణుడు కాగలడని వీరరక్షను గావించినాడు. అంతలో ధర్మజుడును సమరోత్సాహమున పయనించు వీరభటులకును మహారాజులకుగూడ స్వాగతముల బలికి తన ధైర్య స్థైర్య గాంభీర్య మృదు మధురవచనముల వారందర కుత్సాహమును రెట్టింపు గావించినారు.

వేదవచనములతో బ్రాహ్మణుల యాశీస్సులొకవంక జరుగుచుండగా పుణ్యాంగనల మంగళగానములును గానము చేయబడినవి. దాసదాసీజనములతో ద్రౌపదియు పయనమైనది. యుద్ధవీరులందరును తమతమ నాయకుల ఆదేశానుసారముగా తీర్చిదిద్దినట్లు నిలిచినారు.

యుద్ధయాత్రకు బయలుదేరునప్పుడుండదగు సామగ్రియంతయు పరిపూర్ణముగ సంగ్రహింపబడినది. కోశాగారాధ్యక్షుడు ధనసంచయమును నింపియుంచెను. వ్రణవైద్యులు ఓషధుల భద్రపరచిరి. ఇక ప్రయాణభేరి మ్రోగుట తడవుగా వారు యుద్ధభూమికి పయనమయ్యెదరు. ప్రస్థానభేరి మ్రోగినది. శంఖకాహళాది మంగళతూర్యములు మారు మ్రోగినవి.

ఆ సైన్యమధ్యమున ధర్మజుని సితచ్ఛత్రము వెలుగొందినది. వందిమాగధాది స్తోత్రములును ధర్మజునిముందు కొనసాగినవి.

భగవానులు తన విశాలవక్షమున వనమాల నలంకరించుకొని విజయుని రథము నధిరోహించి, చేతనున్న సెలగోలతో గుఱ్ఱముల తోలుటకు నొగలపై కూర్చొనగా అర్జునుడు ధర్మజుని పాదములకు మ్రొక్కి భూనభోంతరాళముల వ్యాపించు ధ్వనితో దేవదత్త శంఖమును పూరించినాడు. శ్రీకృష్ణుని పాంచజన్యమును మ్రోగినది. భీమాదులును శంఖముల పూరించి అన్న కెదురుగ నిలిచినారు. మిగిలినవారల శంఖములు మ్రోగినవి. ధృష్టద్యుమ్నుడు ధర్మజున కెదురై సాష్టాంగ మర్పించినాడు. శుభశకునములు రాబోవు విజయమును సూచించినవి.

ధర్మజుడు సైన్యసమేతముగ కురుక్షేత్రమున దిగినాడు. ఋషుల ఆశ్రమములును, దేవతాయతనములును సేనలను నిలుపు ప్రదేశములు కావు. అవి పవిత్రస్థలములు. వాటిని వదలి మిగిలినప్రదేశము లన్నియు స్కంధావారముల నేర్పరచదగు స్థలములే. ధర్మజుడట్లే చేసినాడు. కురుక్షేత్రమునకు సమీపముననే హిరణ్వతియనునది యొకటున్నది. దాని నాధారముగా సైన్యమంతయు నిలిచినది. కురుక్షేత్రమున విడియుట తడవుగా మరల కృష్ణుని పాంచజన్యమును, అర్జునుని దేవదత్తమును, మిగిలిన వీరులు తమతమ శంఖములను పూరించగా ఆ వీరశంఖారావము మిన్ను ముట్టినది.

అందొక రమణీయమగు ప్రదేశమున రాజమందిర మేర్పరుప బడినది. మిగిలినవర్గమంతయు తగుప్రదేశముల నిలపబడినది. ఇంతవర కిది ఉపప్లావ్యమునందలి పాండవుల కథ.

ఒక్కమారు హస్తినాపురమున కేగుదము.

పాండవులరాక దుర్యోధనునకు గూఢచారులవలన తెలిసినది. దుర్యోధనుని మనసు చలించినది. కాని రాజగువాడు తన మనోదౌర్బల్య మును సేవకజనమునకు తెలియనివ్వరాదు. కావున పాండవులరాకను గుర్తెరిగియు ఎరుగనివానివలెనే వారు తప్పక మస్పైకి దండెత్తవత్తురని యోధులకు చెప్పి, కర్ణ దుశ్శాసనులకు యుద్ధసన్నాహము గావింప ఆజ్ఞాపించినాడు. ఇక సేనానాయకులను నిర్ణయింపవలెను.

దుర్యోధనుని సైన్యము పదకొండు అక్షౌహిణులు. పదకొండు అక్షౌహిణులకును సేనానాయకుల నేర్పరచవలెను. ప్రతి అక్షౌహిణికిని ఒక్కొక్క నాయకుడుండవలెను. ఆ నాయకులందరిపైనను వేరొకడు సర్వసేనానియై ఉండవలెను గదా !

దుర్యోధనుడు కొలువుకూటమున కేతెంచినాడు. అక్షౌహిణీనాయ కులును సర్వసేనానియు అతని మనసున నిశ్చయులయ్యే యుండిరి. ద్రోణ, కర్ణ, కృపాశ్వత్థామ, బాహ్లీకులును, శల్య, శకుని, భూరిశ్రవ, కృతవర్మ, కాంభోజ, సింధురాజులును అక్షౌహిణీనాయకులు. భీష్ముడు సర్వసేనాని. అట్లే అక్షౌహిణీనాయకుల నేర్పరచినాడు. వారును ఒప్పుకొనినారు. ఇక సర్వసేనానిగ భీష్ముని నిర్ణయించవలెను. ప్రత్యేక నాయకులందరితో కలసి పితామహునిదగ్గర కేగినాడు. సర్వసేనానియై యుండుటకు పితామహుని ప్రార్థించి, నీ వొక్కడవే ఇందుకు తగినవాడ వనినాడు. కాని భీష్ముడు కొన్ని నిబంధనలతో తాను సర్వసేనాని యగుటకు ఒప్పుకొనినాడు. భీష్ముని నిర్ణయము లివ్వి.

దుర్యోధనా! నేను సర్వసేనాని నగుటకు అర్హుడనే. కాని నా అభిప్రాయము లన్నిటిని విని నన్ను సర్వసేనానిగా తీసికొమ్మని చెప్పినారు.

నేను అర్జునుని ఎదిరించలేను. అతడు నాకంటె ప్రజ్ఞావంతుడు. కాక వారును, నీవును నాకొక్క రూపులే. మిగిలినరాజుల నందరను నరకుటకు నేను దయను చూపను. పాండవులకొట్టుటకు నాకు చేయాడదు. అది యట్లుండ మరియొక గట్టిమాటయున్నది. దానికి నీ వొడంబడుచో నేను సర్వసేనాని నయ్యెదను.

సర్వసేనాధిపత్యాధికారము ముందు కర్ణునకా? నాకా? అను దానిని నీవు నిర్ణయించుకొనుట ముఖ్యము. అని కర్ణుని యెదుటనే చెప్పినాడు.

కర్ణుడు వెంటనే సమాధానమిచ్చినాడు. నేవింతకు పూర్వమే భీష్ముడు పడినగాని నేను నాయకుడను గానని చెప్పితినిగదా! ఇప్పుడా ప్రశ్న ఎందుకు? అని.

భీష్ముడు సర్వసేనాధిపతి యగుటకు నిశ్చయమైనది. సంతోషమున భీష్ముడు తన అధికారమును స్వీకరించినాడు. భేరీభాంకారములు మ్రోగినవి. పట్టణమున పతాకాలంకరణము లైనవి. విధివిధానముగ భీష్ముని సేనాధిపతిగ అభిషేకించినారు. అధికారికమర్యాదలన్నియు నెరవేరినవి. కాని ఆ సమయమున శకునములేవియు బాగుండలేదు. రక్తవర్షము కురిసినది. పిడుగులు పడినవి. దుమ్ము రేగినది. సైనికుల నిరుత్సాహము ప్రబలినది. దుర్యోధనుడు మాతాపితరుల యనుజ్ఞకై గాంధారి, ధృతరాష్ట్రుల సమీపించినాడు. వారు సంతోషముగ దీవించలేదు. తన యిష్టము నాధారముగాగొనియే వారికడనుండి వచ్చినాడు. సైన్యము కురుక్షేత్రమునకు తరలింపబడినది. స్కంధావారములు నిర్మింపబడినవి.

కాని ఒక్కమాట. కృష్ణుడు పాండవపక్షమునం దుండెను. బలరాముడేమయ్యెను ? బలరాముడు తన శిష్యులిద్దరును గదాదండము లతో పోరాడి చావగా చూడజాలనని పాండవ కౌరవపక్షముల రెంటిని వదలి తీర్థయాత్రలకేగినాడు. కావున బలరాముడు యుద్ధరంగమున లేడు. యుద్ధమున లేనివారిలో రుక్మికూడా యొకడు. రుక్మి యుద్ధరంగమునుండి వెలివేయబడినాడు. రుక్మి యన శ్రీకృష్ణుని బావమరది. రుక్మిణి తమ్ముడు. అతడు – మీరెవ్వరు గెలవలేనిచో నేను గెలిచెదనని పాండవులవద్దకును కౌరవుల వద్దకును వచ్చి స్వయముగ అడిగినాడు. ఆతని గర్వమునకు వారు అసహ్యపడి ఆతనిని యుద్ధమున చేర్చుకొనలేదు. ఇప్పటికి రెండు పక్షములును కురుక్షేత్రమున చేరినవి.

తరువాతి కథాక్రమము ఉలూకరాయబారము.

ఉలూకుడనువానిచేత పాండవుల నిందించుచు రేపు కడయుద్ధమునకు సిద్ధముకండని దుర్యోధనుడు కబురుపంపినాడు. ఆ ఉలూకుడును పాండవులయొద్దకేగి శ్రీకృష్ణుని ఇంద్రజాలములు మాకడ పనికిరావనియు అర్జునుని భుజాబలమును చూపెట్టుమనియు మా దొర గట్టిగ చెప్పెనని చెప్పగా ధర్మనందనుడు రేపే యుద్ధమునకు సిద్ధమనిచెప్పి, ఉలూకుని వస్త్రాభరణములచే సత్కరించి పంపెను. ఈ ఘట్టమున పెద్దవిషయ మేమియును లేదు. తరువాతది కౌరవపాండవ సైన్యమునందున్నవీరుల తారతమ్యములను భీష్ముడు నిర్ణయించినాడు. ఆ నిర్ణయమున భీష్ముడు కర్ణుని అర్ధరథులలో లెక్కించుట జరిగినది. కాని మీకు ఈ ఘట్టము నందు ఒక ముఖ్యవిషయము చెప్పతగియున్నది. ఏమన? భీష్మద్రోణులు దుర్యోధనునిపై పున నిలచియు పాండవపక్షమునే అవలంబించి దుర్యోధనుని అన్యాయముచేసిరను ప్రవాదమొకటి నేడు కలదు. అది యథార్థము కాదు. కర్ణునిపాత్రను గురించి మీకు చెప్పినాను. కర్ణుడు తనకు తెలిసిన పాండవుల జయమును దుర్యోధనునికడ దాచి, దుర్యోధనుని– నీవు యుద్ధ

మున తప్పక గెల్తువనియు, అర్జునుని నేను కొట్టెదననియుచెప్పి తన జీవితమును గడుపుకొని దుర్యోధనునకు హితము చెప్పవి అన్యాయము ద్రోణునియందున్నదిగాని అట్టి అన్యాయము భీష్మాదులయందు లేదు.

భీష్మ ద్రోణులపాత్రలను పరిశీలింతము.

భీష్ముడెప్పుడైన దుర్యోధనునకు నేను పాండవుల గెల్తునని చెప్పెనా ? అనునది యొకప్రశ్న. భీష్ముడు పాండవులను నేను జయింపలేను, అర్జునుడు నాకంటె అస్త్రములనెక్కువ యెరుగును. పాశుపతాస్త్రము అర్జునునివద్ద కలుగుట, శ్రీకృష్ణుడాతనికి సాయముండుట, నాకు మీరును వారును సమానమగుట అనుకారణములతో నేను పాండవుల చంపజాలనని గట్టిగ చెప్పినాడు. అది యట్లుండ, ఆతనిని సర్వసేనానిని గావించినప్పుడు గూడ ఆతడు తన కృత్యమును నిర్ణయించి చెప్పినాడు. 'ఆ నిర్ణయమునకు భంగములేకయే యుద్ధముచేయగా అతడన్యాయము చేసినట్లగునా ?

ఆతడేమనెనో మీకు ఆంధ్రముననే చూపెదను.

క॥ సేనాధిపత్యమును దగ
బూనెద ననుమార్కొనంగ బురుషుల నుర్విం
గాన గిరీటికి నొక్కని
కే నోర్వ నతండు శరము లెక్కుం డెరుంగున్.

క॥ పెరవారి నెల్ల దర మిడి
నరుకుడు బాండుక్షితీశనందనులను రూ
పరసేయం జేయాడదు
తరుమరు నామీద నత్యుదగ్రత వారున్.

నీ కొక్క బాస యిచ్చెద నాకర్ణింపుము.

క॥ మీటుగల రాజరథికుల
నాటికి వేవుర పదింతు నరుశరములు నో
నాటి పడవైచునంతకు
వేటాడెద బ్రతిబలంబు పేరులనెల్లన్.

ఈ విధమున నేను అర్జునుని జయించలేనని చెప్పి, ప్రతిదినమును తన కృత్యమును చెప్పినాడు. ప్రతిరోజును పదివేలసైన్యమును, ఒక వేయిమంది రథికులను చంపుదును. అట్లు మొత్తము పదివేలసైన్యమును, పదివందలమంది రథికులను నావంతు. అని గట్టిగ చెప్పియే యుద్ధమున ప్రవేశించినాడు భీష్ముడు. ద్రోణుడుకూడ పాండవులు చావరు. అర్జునుడు నాకు శిష్యుడైనను ఆతడు పాశుపతాస్త్రమును సంపాదించెననియే చెప్పగా వారు చేసిన అన్యాయమెక్కడ ? అర్జునుడు నన్ను పడవేయు వరకును నేను యుద్ధమును చేసెదను అనినాడు భీష్ముడు.

కాని భీష్మ ద్రోణులు తమ చావునుగురించి పాండవులకు చెప్పిరిగదా ? అందురు. దుర్యోధనునకు వారేమిచెప్పిరో ఆ పనిని వారు చేసిరి. తరువాత విషయము వారి యిష్టము. తామొప్పుకున్న యుద్యోగములో వారు తప్పుచేయలేదు. వారి చావులు అసామాన్యములు గావున వారీ భూమిపైనుండి దేహములను పడలునట్టి ఉపాయములు యుద్ధమునకు సంబంధించియుండగా వారే వారి రహస్యములను చెప్పి, తమ ప్రారబ్ధ తనువులను వదలవలసివచ్చి వదలినారు. భీష్ముడు తను దుర్యోధనునకు చెప్పిన కృత్యము నెరవేరువరకును పాండవులకు తన మరణకాలమును చెప్పలేదు. తాను దేహత్యాగమును చేయదలచినప్పుడు ధర్మజుని పిలచి నాకీ సహాయమును చేయుమని కోరి, అర్జునుని బాణములుగాని తన శరీరమును పడవేయజాలవని, తాను యుద్ధము చేయకుండుటకు శిఖండిని ముందుంచుకొమ్మని, తన శరీరము పడిపోవుటకు అర్జునుని శరముల నాటమనిచెప్పి, తాను రథమున ఒరిగినాడు దేవభావముతో. అంతేగాక, భీష్మద్రోణులు దుర్యోధనుని పిండమును తిన్నందుకు వారి స్థూలశరీరములను దుర్యోధనునకు వప్పచెప్పి, సూక్ష్మశరీరమును పాండవుల కిచ్చినారు. పాండవులు వారిని కోరినవియు, చూరగొనినవియుగూడ వారి మనస్సులనేగాని, వారి శస్త్రాస్త్రబలమును పాండవులు కోరలేదు.

భారతమును చక్కగ పరిశీలించినచో భీష్మ ద్రోణుల అన్యాయ మిసు మంతయు లేదు.

ద్రోణాచార్యుని చంపుటకే ధృష్టద్యుమ్నుడు పుట్టగా ఆతడేమి చేయును ? ఇది యిట్లుండనిండు. భీష్ముడు శిఖండితో నేను యుద్ధము చేయనని చెప్పినాడు. దాని కారణమును మీకు చెప్పెదను. భీషుడు స్త్రీ తోడను, ముందు స్త్రీయైపుట్టి, తరువాత పురుషుడుగా మారిన వానితోను యుద్ధము చేయడు.

## శిఖండి పుట్టుక

శిఖండి మొట్టమొదట ద్రుపదునకు స్త్రీ శిశువై పుట్టి, తరువాత పురుషుడయ్యెను.

ద్రుపదునకు సంతానములేక ఈశ్వరునికొరకై తపస్సు చేయగా నీకు మొదట స్త్రీగా జన్మించి తరువాత పురుషుడు కాగలిన సంతానము పుట్టునని వరమిచ్చినాడు.

కాశిరాజు కూతుళ్ళను ముగ్గురను భీష్ముడు తనసోదరుడగు విచిత్రవీర్యునకు పెండ్లిచేయుటకై వీర్యశుల్కమున రాజుల గెల్చి తీసుకొనిరాగా, ఆ ముగ్గురిలో పెద్దదయగు అంబ-నేను సాళ్వుని వరించి యుంటినని భీష్మునకు చెప్పినది. అప్పుడా కన్యను మంత్రుల రక్షణ యిచ్చి సాళ్వభూపతిదగ్గరకు పంపగా ఆతడు అంబను గ్రహించలేదు. అంబ మరల భీష్మునియొద్దకు వెళ్ళలేదు. పుట్టినింటికిని వెళ్ళలేదు. తన సంసారసుఖభంగమునకు భీష్ముడే కారణమని తపస్సుచేత భీష్ముని సాధించవలెనని ఆమె మునుల ఆశ్రమములకు వెళ్ళినది.

హోత్రవాహనుడు అనునాత డొక మహర్షి. ఆతని మనుమరాలు (కూతురు కూతురు) అంబ.

అంబ వెళ్ళిన మున్యాశ్రమమునకు హోత్రవాహనుడు దైవికముగ వచ్చి, ఈ కన్యక ఎవరు ? ఇక్కడికేల వచ్చినది ? అని ఆ మునుల నడిగినాడు. అప్పుడు వా రంబవృత్తాంతమును హోత్రవాహనునకు చెప్పగా ఆతడు పరశురామునిచే భీష్మునకు చెప్పించి, విచిత్రవీర్యునకే అంబను పెండ్లి చేయింతునని మనుమరాలిని ఓదార్చినాడు.

ఇక హోత్రవాహనుడు అంబనుతీసుకొని పరశురాముని వద్దకు వెళ్ళవలెను. కాని దైవసంఘటన లతి చిత్రములు. పరశురాముడుండు ప్రదేశము మహేంద్రపర్వతము. అయ్యును పరశురాముడు ప్రస్తుతమున హోత్రవాహనుని చూచుటకై ఈ మున్యాశ్రమములకు ఏతెంతురని హోత్రవాహనునకు తెలిసినది. అంబయు హోత్రవాహనుడును ఆ మున్యాశ్రమములయందే ఉండిరి.

పరశురాముడు వచ్చెను. హోత్రవాహనుడు అంబవృత్తాంతమును పరశురామునకు విన్నవించగా పరశురాముడు అంబను తీసికొని భీష్ముని యొద్ద కేగినాడు. ఏమని ? విచిత్రవీర్యున కీమెను పెండ్లి చేయమని. పరశురామునకు భీష్ముడు శిష్యుడు. అయ్యును ఈ వివాహము ధర్మ వ్యతిరేకము. ఒకనిని వరించిన కన్యకను వేరొకనికెట్లు ఇచ్చుట ? భీష్ముడు తన తమ్మునకిచ్చి వివాహముచేయుటకు ఒప్పలేదు. భీష్మునకును పరశురామునకును ఈ విషయమున యుద్ధము జరుగవలసివచ్చినది.

భీష్ముడు రథమునధిరోహించగా పరశురాముడు భూమిపైననే నిలచెను. గురువర్యులకు భీష్ముడు నమస్కరించి ఆయన అనుజ్ఞను తీసికొని తమరును రథమునధిరోహింపుడని గురువర్యులను కోరెను.

పరశురాముడు నాకు భూమియే రథము. వేదములు నాకు రథాశ్వములు. రథసారథి వాయువు. నాకు కవచము వేదమాతలగు గాయత్రీ, సావిత్రీ, సరస్వతీదేవతలని, ఈ సామగ్రితోడనే ఉపవీతుడనై యజ్ఞోపవీతమును ధరించిన నేను యుద్ధము చేయుదునని నాడు.

అకృతవ్రణుడను మహర్షి సారధికాగా పరశురామునకును భీష్మునకును యుద్ధము ప్రారంభమైనది. వారిద్దరి యుద్ధమును కురుక్షేత్రముననే జరిగినది. యుద్ధరంగమునందును పరశురామునియందు భీష్మునకు పూజ్యభావము పోలేదు. గురువుల ఆశీర్వాదము నందుకొనియే యుద్ధమును సాగించినాడు. ఇందొక్క విశేషము.

పరశురామునియందున్న బ్రాహ్మణత్వమును, ఆతని యందున్న వేదమంత్రములను ఆతని తపోతేజమును వదలి, వాటికి నమస్కరించి, ఆతడు యుద్ధమునకై వచ్చిన క్షత్రియత్వధర్మమునే నేను జయింప యుద్ధము చేయుచుంటినని యుద్ధమును సాగించినాడు భీష్ముడు. వారిద్దరికిని యిరువదిరెండురోజులు యుద్ధము సాగినది. పరశురాముడే యందు ఓడిపోగా అంబ ఆశ నిరాశయైనది.

అంబ తపస్సునకేగి భీష్ముని చంపుటకై ద్రుపదమహారాజునకు శిఖండియను పేర పుట్టినది.

శిఖండి పుట్టుకతో స్త్రీయై పుట్టినాడు. తరువాత ఆతడు ఒక యక్షుని అనుగ్రహముచేత పురుషత్వమును బడసినాడు. కావున భీష్ముడు శిఖండితో యుద్ధమును చేయడు. శిఖండి భీష్ముని చంపుటకే పుట్టినాడు. కావున భీష్మద్రోణులు దుర్యోధనునకుచేసిన అన్యాయ మేమియునులేదు. భీష్ముడే, అంబ ఇట్లు పుట్టినట్లు నాకు నారదునివలన తెలిసినదని దుర్యోధనునకీ కథను చెప్పినాడు.

ఆ సందర్భముననే దుర్యోధనుడు భీష్ముని నీ వొక్కరుడవే యుద్ధము గావించి పాండవులబలము నెన్నిరోజులలో చంపుదువనగా ఒకనెల పట్టునని చెప్పినాడు. ద్రోణాచార్యులును అదియే సమాధానమిచ్చినారు. కృపాచార్యులు నాకు రెండునెలలు పట్టుననినాడు. అశ్వత్థామ పదిదినముల గడువులో పాండవబలమును పరిమార్తునని చెప్పగా కర్ణుడు

ఆయిదురోజులలో కొట్టివేయుదునని నాడు. ఇదంతయు కౌరవబలమున జరిగిన రహస్య సంభాషణము. అయ్యును గూఢచారులవలన ధర్మజునకీ వార్తలు తెలిసినవి. ఆతడర్జునుని ప్రశ్నించగా ఒక్కనిమేషకాలమున పాశుపతాస్త్రముచే కౌరవసైన్యము దగ్ధమగునని చెప్పినాడు. అయ్యును నేను ఆ అస్త్రమును ఆ విధముగ ఉపయోగింపరాదని ప్రాకుచ్చినాడు. కారణమేమి ? అది బాహుపరాక్రమమునకు లక్షణము కాదు. ధర్మనందనా ! నీవీ కురుబలమును గురించి అనుమానింపనక్కరలేదు. నీ వొక్కడవే ఈ శత్రువుల సంహరింపగలవుకూడ నని విరమించినాడు.

ఇది ఉద్యోగపర్వమునకు చివరి ఘట్టము. నేటికీ యుపన్యాసము సమాప్తము.

రేపు భీష్మపర్వము ప్రారంభము. అనగా యుద్ధపర్వములో మొదటిపర్వము ప్రారంభమగును.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

ఓమ్

# భీష్మ పర్వము

## ( భగవద్గీతా సారము )

## ప్రస్తావన

మహాశయులారా !

మనమీనాటికి మహాభారతామ్నాయమున ఆది, సభా, అరణ్య, విరాట, ఉద్యోగములను అయిదుపర్వములను గడచినాము. ఆ పర్వములం దంతర్భూతములగు భారతీయధర్మములును, భక్తిజ్ఞానములనుగూడ ఆయా పర్వములందు ప్రపంచించబడినవి.

ఆదిపర్వమున ధర్మదేవతల యావిర్భావమును, సభాపర్వమునం దపార కృపాసింధువగు భగవానుని అనుగ్రహమును, దానితోపాటు ద్రౌపదీసాధ్వియొక్క అనన్యభక్తిప్రభావమును, అరణ్యమునందంత్య భాగమున యక్షప్రశ్నలనుపేర వ్యాఖ్యానింపబడిన ఆధ్యాత్మిక రహస్యము లను, విరాటమున భగవత్సేవాదురంధరులగువారు ధర్మరక్షణకై వహించ వలసిన ఓరిమియు, ఉద్యోగమున భక్తులకొరకై భగవానులెంత తపించి ఋణవిముక్తుడు కాగోరునో ద్రౌపదివిషయమున సంజయునకు చెప్పిన భగవానుని సందేశమును మీ హృదయక్షేత్రములనుండి దొలగరానివి.

నేడు మీకందించబోవునవి యుద్ధషట్కములోని ధర్మరహస్య ములు. మన యుద్ధరంగము నేటి భౌతికవాదులు నిర్మించుకొను రణరంగ ముల వంటిదికాదు.

ఇది భారతీయచక్రవర్తుల బాధ్యతాయుతమగు ధర్మనిర్వహణకై భగవానులు సారధ్యమును వహించి నడుపునట్టి ధర్మవీరుల రణరంగము.

ఈ రణరంగమున నిలచినవి రెండుపక్షములును ఒకరి కొకరు తీసిపోని బలపరాక్రమములతో నానావిధాయుధపరికర సన్నాహములతో పదునెనిమిది అక్షౌహిణులతో మొహరించి పదునెనిమిది దివసములుగా చిత్రవిచిత్రములై దేవతలకు పైతమును ఆశ్చర్యమును గొలుపు నానావిధ వ్యూహసంధానములతో వివిధశస్త్రాస్త్రములతో వీరావేశవిజృంభణలతో ధర్మాధర్మవిమర్శనలతో రాత్రికాలమున వినియోగించుకొనుటకై విద్యు ద్దీపసహస్రములనుగూడ వెలిగించుకొని రణరంగమును సాగించినవి.

యుద్ధవీరులలో కొందరు రథికులు, కొందరు రథికశ్రేష్ఠులు, కొందరు మహారథులు, కొందరు మహారథశ్రేష్ఠులు, మరికొందరు రథాతిరథులు– ఇట్లనేకశాఖలు విభక్తములై సేనానాయకుల శక్తిసామర్థ్య ములను ప్రకటించినవి.

కాని ఇందొక్క రహస్యమున్నది.

ధర్మసంస్థాపకుడగు ధర్మజుని పక్షమున ఏడక్షౌహిణుల బలము మాత్రమే సాయపడగా స్వార్థపరులై దుండగీడులగు కౌరవుల పక్షమున పదకొండక్షౌహిణుల బలము సాయపడినది. ప్రజాస్వామ్య మిట్లే యుండును.

అక్షౌహిణీయన ఇరువదియొక్కవేయి ఎనిమిదివందల డెబ్బది రథములును అంతియే సంఖ్యగల ఏనుగులును అరువదియైదువేల ఆరు వందలపది గుఱ్ఱములును, ఒక లక్ష తొమ్మిదివేల మూడువందల ఏబది పదాతులును కలియగా అది ఒక అక్షౌహిణి బలమగును. ఆ సంఖ్య పదునెనిమిదిరెట్లుగా నాడు కురుక్షేత్రమున నిలిచినది. ఇది ముఖ్యముగ అందించిన లెక్క. లెక్కకురాని పైనికులెందరోకూడ ఉండి యుండ వచ్చును. నాడు ఏయేదేశములు యుద్ధమున పాల్గొనినవనికూడ మీకు ప్రశ్న రావచ్చును. మన భూభాగము ఏడుద్వీపములుగను, తొమ్మిది ఖండములుగను విభజింపబడినది. బాలవృద్ధజనులను తీసివేయగా అన్ని

ఖండములనుండియు యుద్ధవీరులీ యుద్ధమున పాల్గొనినట్లు భారతము వర్ణించినది. అంతేకాదు. అన్ని వర్ణములవారును యుద్ధమునందు భటులై యుండిరి కూడ.

'యావత్తపతి సూర్యోహి జంబూద్వీపస్య మండలం'

సూర్యకాంతులెంతవరకు ప్రసరించెనో అంతదేశమును వచ్చిన దట. శ్లోకమున జంబూద్వీపమును వర్ణించినను 'యావత్తపతిసూర్యః' అను పదము నవద్వీపములను చెప్పుచున్నది. కాని నాటికిని నేటికిని యుద్ధమున భేదము లేకపోలేదు.

నాటియుద్ధము నేటి యాంత్రికయుద్ధమువలె యుద్ధమున పాల్గొనని ప్రజలనుగూడ నాశము చేయునట్టిదిగాదు. యుద్ధశాస్త్రవిధుల ననుసరించి కొన్ని నియమములతో నాటి యుద్ధము సాగినది.

రథికునితోడనే రథికుడు యుద్ధముచేయవలెను. అస్త్రము లెరుగని వారిపై అస్త్రముల ప్రయోగింపరాదు. శరణాగతులగువారిని చంప కూడదు. ఎవ్వడైన వీరాలాపములయందు నిందించుచో అతనికిమాటల తోడనే సమాధానమీయవలెనుగాని అతనిపై బాణముల ప్రయోగింప కూడదు. పరుగుతీయువానిని కొట్టకూడదు. ఇట్లనేక నియమము లున్నవి.

ప్రతి చిన్న విషయమును వర్ణించుచో మనకు కాలము చాలదు. కాని భారతయుద్ధమునందొక అతీంద్రియశక్తికి స్థానమున్నది.

ఏ పక్షమునందైనను వారు వారు సంకల్పించు రహస్య సంకల్పములను పైతము కనుగొనదగు ఒక మహోన్నతశక్తిని వ్యాస మహర్షివారు సంజయున కనుగ్రహించినారు. అది నేటి టెలివిజనుల వంటిదికాదు. అది తపః ప్రభావ సంజనితము. అంతేకాదు. యుద్ధమున చరించు సంజయునకు ఒక్క బాణమైనను తగులదు. అదియు వ్యాస ప్రసాదమే. కావుననే సంజయుడు శ్రీకృష్ణుని విశ్వరూపమునుగూడ దర్శించగలిగినాడు.

నేటి దూరశ్రవణయంత్రములును, 'ఆటం'శక్తులునుగూడ నాడు మహర్షులు వారి అంతరాత్మలనుండియే గ్రహించిరనుట సత్యము. మరి ఆనాటి మానవ సమాజమున కంతకును ఆ శక్తు లుండెడివా ? అనకుడు. విద్యుద్దీపములలోని వెలుగులు ఆయా కాంతుల బహిర్గతము చేయు ఉపాధుల ననుసరించి ప్రకాశము నిచ్చినట్లే ప్రతివాని బుద్ధీంద్రియమును అతని ఆత్మశక్తి ననుసరించిన ప్రతిభను మాత్రమే ప్రదర్శించునుగాని సర్వజ్ఞత్వము ఎట్లు కలిగియుండును ? ఋషిపుంగవుల ప్రతిభా ప్రభావములు సూర్యకాంతివలె జగత్తున కంతకును వెలుగునిచ్చునవి గాని పరిమిత విజ్ఞానమును మాత్రమే కలిగియుండునవిగావు. కావుననే ఆర్షకవుల వాణి బహిర్ముఖమయ్యే ప్రసరింపదనియు, అంతర్ముఖమై సూక్ష్మాతిసూక్ష్మమగు అంతర్వాణిని దర్శించి గ్రంథముల నిర్మించిరనియు, భారతీయగ్రంథములు వివరించును. మన మహాభారత రచన అట్టిదనియేగదా మీకు మధ్య మధ్య వచించుచుంటిని ; ప్రస్తుతమునగూడ నేను ప్రధానముగ చెప్పునది యుద్ధరంగమునం దిరుపక్షములవారును ప్రయోగించుకొన్న శస్త్రాస్త్రముల సంఖ్యావిశేషముల వర్ణించుటకాదు. దెబ్బదియమ్ముల ఒకడు ఒకని నొంచగా ఎనుబది యమ్ముల అతని బాణముల వీతడు త్రుంచినాడనుట నా ప్రవచనమున ముఖ్యవిషయము కాదు. యుద్ధఘట్టములందు చర్చించదగు ప్రధానఘట్టముల చర్చించి, ప్రధానపాత్రలనుండి మనము గ్రహింపదగు ముఖ్యవిషయముల గ్రహించుటే నా యుద్ధప్రవచనమునందలి ముఖ్యవిషయము. కథ సంగ్రహమై యుండును. ఉదాహరణకు భీష్ముని యుద్ధము పదిరోజులు జరిగినది. అయ్యును అందు ముఖ్యములగు దివసములనే గ్రహించి మీకు కథ నందింతును.

భీష్మపర్వమున మనము గ్రహించదగు విషయములు కొన్ని యున్నవి. భీష్ముడు కేవలముగ వీరభటుడయ్యే యుద్ధమును గావించెనా ?

ఈ యుద్ధరంగమున పాండవుల కెదురై నిలుచుటలోని ఆతని ఆంతర్య మేమి? ఆతడు భక్తాగ్రగణ్యులలో కూడ లెక్కకు వచ్చెనుగదా; ఆతని వీరత్వమునకును భక్తికిని ఏమైన సంబంధముకలదా? భీష్ముని వీరరసమునకు పరమావధి ఎక్కడ? ఆతడు తన జీవితమును త్యాగము చేయుటకై తన మరణకాల రహస్యమును పాండవుల కేలచెప్పెను? అను కొన్ని ముఖ్యవిషయము లీ పర్వమున చర్చింపబడును. అంతేగాక యుద్ధము కొన్నిభాగములుగ నడచును. ద్వంద్వయుద్ధ మొకభాగము. సంకులసమర మొకభాగము.

ఏకైకవీర విజృంభణము, వ్యూహనిర్మాణభేదకము, అనునవి గూడ ఈ విభాగములలోనివే. ఈ విభాగములన్నిటియందును సామాన్య ధర్మమనియు, ప్రతిజ్ఞాధర్మమనియు, ధర్మముకూడ రెండుభాగములై యుండును. ఏ ఘట్టమునందు ఏ ధర్మము ప్రధానమనునదికూడ ఒక ప్రశ్నయే. ఆయా ఘట్టములలో ఆయా ప్రధానధర్మములను భారత మెట్లు ప్రపంచించినదోకూడ మనము గ్రహించవలసియున్నది. కావున వానికి ప్రధానస్థానమునిచ్చుచు యుద్ధవర్ణనముగూడ అక్కడక్కడ చవిచూపుచు నా ఉపన్యాసములు నడచును.

మనమిక కథాభాగమున కేగుదము.

కురుక్షేత్ర సంగ్రామరంగమున పాండవకౌరవబలములు రెండును తమతమ యక్షౌహిణీసైన్యముల సమీకరించి ప్రాక్పశ్చిమముల కభిముఖులై యుద్ధమును కొనసాగించగా నేటికి పదిరోజులు గడచినవి.

సంజయుడు యుద్ధభూమినుండియే హస్తినాపురమునకు విచ్చేసినాడు. అది ధృతరాష్ట్రుని మందిరము. సంజయుడు ధృతరాష్ట్రున కీ యుద్ధవార్తల నెరిగించవలెను.

కాలము దురతిక్రమము. కౌరవుల యదృష్టదివసములు గతించినవి. లోకాలోకములనన్నిటిని ఒక్కమారుగ మ్రింగగలిగి, మృత్యు

ముఖమున కెదురై నిలిచియు మృత్యువునకు వశముగాక మరణస్వాతంత్ర్యము గలిగిన భీష్ముడు నేడ స్తమించినాడు. ధార్తరాష్ట్రుల యాయుర్దాయమొకవిధముగ క్రుంగినది. ఆ వార్త నెరింగించుటకే ధృతరాష్ట్రుని మందిరమున కేతెంచిన సంజయుడు ధృతరాష్ట్రునకు తనరాక నెరింగించుచు పెద్దపెట్టున ఏడ్చినాడు.

కురుపితామహుని అస్తమయమును చెప్పవలెనన్న ఆ శోకవేగము నాపుకొని మాటలతో సంజయుడేమి చెప్పగలడు ? ఆ శోకముతోడనే భీష్ముని అస్తమయమును ధృతరాష్ట్రున కెరింగించినాడు.

ధృతరాష్ట్రుని దుఃఖము వేమని వర్ణించవలెను ? అదియొక మహాసాగరము. పరశురాముని గెలిచిన వీరు డస్తమించుటేమిటి ? ఆహా ! పాండవులు రాజ్యమునకై ఎంతపాపమున కొడిగట్టిరి ? దుర్యోధనుని దుర్మార్గమింతవరకు తెచ్చినది. నాహృదయము బ్రద్దలగుట లేదు. నేను బ్రతికియేయుంటిని. అన్న భావములన్నియు ఒకదానివెంట మరియొకటి ధృతరాష్ట్రుని తరుమగా అతడా శోకవేగమున కొంతసేపు క్రుంగి, ఎట్టకేలకు ధైర్యమున యుద్ధవివరమునంతను చెప్పుమని సంజయుని కోరినాడు. సంజయుడుకూడ తన దుఃఖమును మ్రింగి పదిరోజులనుండి జరిగిన యుద్ధవిశేషములన్నియు ధృతరాష్ట్రున కెరింగించినాడు. అదియే ఈ పర్వములోని కథకు ప్రారంభము.

అది హేమంతఋతువు. మాసము మార్గశీర్షము. నాడు తిథి చతుర్దశి. పక్షము కృష్ణపక్షము. నక్షత్రము మృగశిర. అదియే భారతయుద్ధమునకు ప్రారంభదివసము. భారతయోధులందరును తమ పుణ్యకర్మపరిపాకముచే పుణ్యలోకములకేగు జీవుల గొనిపోవుటకు అతివాహికులను నియమించి వారికి స్వర్గమును అందించుటకై చంద్రుడు నాడే పితృలోకమునకు పయనించినాడు. భారతీయాధ్యాత్మిక సిద్ధాంతమున పుణ్యలోకములకేగు కర్మవీరులు పితృలోకము మీదుగా చంద్రుని సాయముతో లోకాంతర

ముల కేగుదురు. కావున భారతవీరులు కురుక్షేత్రమున యుద్ధరంగముల తీర్చిదిద్దగా ఆ రోజుననే సోముడు పితృలోకమునందీ వీరులకొరకెదురు చూచుచుండెనని మహాభారతము వర్ణించినది.

'మఘా విషయగస్సోమ స్తద్దినం ప్రవద్యపద్యత.'

మఘా నక్షత్రము పితృదేవతల నక్షత్రము. ఇచ్చట విషయమన దేశమని అర్థము చెప్పవలెను. చంద్రుడు మఘావిషయగుడయ్యెనన పితృలోకమున కేగెనని అర్థము. అంతియేగాని మఘానక్షత్ర దినమున యుద్ధము ప్రారంభమనికాదు. ఇచ్చట నీలకంఠుడు పూర్వాపరముల చర్చించియే నాడు మృగశిరానక్షత్రమని తేల్చినాడు. బలరాముని యుద్ధ యాత్రను, భారత సావిత్రిలోని శ్లోకమును ఆధారముగా గొని ఈ విషయమును నిర్ణయించినారు.

సృష్టిఖండమునందది యొక మహోపద్రవమగు కాలము. నాటి సూర్యోదయము కురుక్షేత్రమునందు మొనలదీర్చియున్న క్షత వీరులకీ లోకమునుండి పరలోకములకు పయనించుకాలము. కావుననే గ్రహము లేడును అట్లే యున్నవి. నాడు సూర్యభగవానులు తన సహస్ర కిరణ ములతో ఉదయాద్రి నధిరోహించగా కౌరవసేనానాయకుడగు భీష్ముడును తన పదకొండు అక్షౌహిణుల సైన్యమును సమకూర్చి మానుషవ్యూహ మను పేర వ్యూహనిర్మాణము చేసినాడు. ఆ వ్యూహ మొక మహా సముద్రమువలె నున్నది. భీష్ముడా వ్యూహమున కగ్రభాగమున తాలధ్వజము నెత్తి తన రథమును నిలిపినాడు. ఆ వీరున కలంకారములై యున్న ఛత్ర చామరములును, అతడు ధరించిన తనుత్రాణమును చూడ ముచ్చటగాగా అతడొక పూర్ణసుధాకరుడై ఆ సైన్యసాగరము నుపొంగించినాడు. అట్లే ఆ సైన్యమున ద్రోణ కృపాశ్వత్థామ కర్ణాది వీరవరుల

పతాకములను అల్లలనాడగా చతురంగబలములను సేనానాయకున కుత్సాహము కల్పించినవి.

ఇది కౌరవసైన్యములోని సంగతి. మరి పాండవబల మెట్లున్నది?

పాండవబలమునగల ఏడక్షౌహిణుల సైన్యకదంబమునకును సేనానాయకుడు ధృష్టద్యుమ్నుడు. ఆత డగ్నికుండమునుండి పుట్టిన తేజోమూర్తి. రౌద్రరసోల్లాస చక్రవర్తి. అతని ధనుర్బాణములను మానవ నిర్మితములుగావు. వాటిని చేతబట్టియే అతడుద్భవించినాడు. తిక్కనామాత్యులతని మూర్తిని మన కన్నులయెదుట నుంచినారు.

శా. పుష్టోదంచితసారవీరరససంపూర్ణాంగమున్ సంగరా
వష్టంభోజ్జ్వలవీరరేఖయును భాస్వద్బాహసంవల్లనో
త్కృష్టస్యందనముం గనద్ధనువు నుద్దీప్తధ్వజంబుందగన్
ధృష్టద్యుమ్నుడు వొల్చె నైజవిలసత్తేజోవిరాజద్గతిన్.

ఈతడు ముందుండగా పాండవసైన్యము యుద్ధమునకు సన్నద్ధమైనది. ఈతనికి భీమసేను డండదండయై నిలిచినాడు. వారిద్దరకును అగ్రభాగమున కృష్ణార్జునుల దివ్యస్యందనము. ఇక యుధిష్ఠిరుని బలమునకు కొరతయేమున్నది? అయ్యును ధర్మజుడు కౌరవసైన్యసాగరమును తిలకించగా అతని హృదయమొక్కమారు స్పందించినది. అతని మనసు ముందడుగువేయుటకు శంకించినది. తనది అల్పసైన్యము. ఈ మహాసైన్యమును తానెదుర్కొనుటెట్లు? ధర్మజునకు తన విజయము సందేహగ్రస్తమైనది. ఇది సహజము. ఎంతటి మహానీయులకైనను కార్యభారమట్లే యుండును. ధర్మజు డర్జునునితో సంప్రతించినాడు. అర్జును డిందు ముఖ్యస్థానము నలంకరించిన యుద్ధవీరుడు. అతని మనోబలమిందు ప్రధానము. కావుననే తన సందేహమును అర్జునున కెరింగించినాడు ధర్మజుడు.

అర్జునుడు నరుడనుమహర్షి. అతనికి తెలియని యుద్ధధర్మములు లేవు. నారదమునీంద్రులు చెప్పిన యుద్ధశాస్త్ర రహస్యమును వినిపించి ధర్మజుని సందేహమును తీర్చినాడు.

శ్లో॥ న తథా బలవీర్యాభ్యాం జయంతి విజిగీషవః
యథా సత్యానృశంసాభ్యాం ధర్మేణై వోద్యమేన చ.

యుద్ధమున శత్రువుల గెలువగోరిన రాజునకు జయమును చేకూర్చునవి కేవలములగు బలవీర్యములే కావనియు, సత్యధర్మములే జయమును చేకూర్చగలవనియు నారదుని వచనము. ధర్మనందనా! మన కేమి భయము? మనముందు సత్యధర్మములును, ఆ సత్యధర్మముల కధిష్ఠాతయగు శ్రీకృష్ణులును నిలిచినారు. కావున విజయలక్ష్మి మననే వరించగలదని చెప్పినాడు.

ధర్మజుని సందేహము తీరినది. అంతతో పాండవులు వజ్రవ్యూహమును నిర్మించినారు. ఈ వ్యూహము ఇంద్రనిర్మితము. అనగా ఇంద్రునిచే చెప్పబడిన వ్యూహము. ఇట్లు రెండుసైన్యములను మానుష వజ్రవ్యూహముల నిర్మించగా ఆకసమున దేవతల విమానములు గుమిగూడినవి. అనిమిషులై దేవతలును ఆశ్చర్యముగ చూచినారు. ఇక కృష్ణార్జునులు రథము నధిరోహించవలెను. కాని శ్రీకృష్ణులు అర్జునునకు రథము నధిరోహించుట కనుజ్ఞనీయలేదు. కారణమేమి? అతని దృక్పథమునందింకను కౌరవుల నెదుర్కొను బలము పాండవులకు చేకూరిలేదు. అర్జునున కిప్పుడొక దివ్యకవచము నిచ్చిగాని రథము నెక్కింపడు. అది దివ్యతేజోవిరాజితమగు ఆదిశక్తియొక్క పరిపూర్ణ కటాక్షరూపము. దుర్గామహాదేవియొక్క ప్రసాదము. కావున అర్జునుడు రథమునెక్కుటకు ముందుగ అతనిచే దుర్గాస్తోత్రమును చేయించినాడు శ్రీకృష్ణులు.

ఇక్కడ శ్రీకృష్ణుని హృదయమేమి ? తాను సాక్షియై రథమున కూర్చొనగా తన మాయాశక్తి ప్రభావమే గాండీవమై అర్జునుని చేత నిలిచి యుద్ధము చేయవలెను. తన శక్తిప్రభావము కాళికామూర్తియై శత్రుమూకల చెండాడవలెను. నాదరూపమున దేవదత్త పాంచజన్యముల నుండి వెలువడి, అతిభయంకరరూపమై శత్రుమూకల గుండెలను జల్లుమనిపించవలెను.

ఒకే చైతన్యము సాక్షిరూపమై వెలుగుచు అంతర్యామిరూపమున ప్రేరకమై యుండెననునదే భారతీయసిద్ధాంతము.

ఇప్పుడట్లు సర్వభూతాంతర్యామియై తన్నారాధించువారి కనుగ్రహదాతయై యుండు దివ్యశక్తినే దుర్గారూపమున స్తోత్రము చేయుమని అర్జునుని ఆదేశించినారు.

అర్జునుడా యుద్ధరంగముననే నిలచి ఏకాగ్రచిత్తమున దుర్గాస్తోత్రము చేసినాడు.

ఒకే ఒక వస్తువున కనేకనామములు. ఆ నామములన్నియు సర్వజ్ఞము, సర్వశక్తిసమన్వితము అగు ఆ శక్తి స్వరూప స్వభావములనే చెప్పును. గుణభేదముచే నామభేదమును, నామభేదముచే రూపభేదమును గలిగి ఒకేతేజము నానారూపభేదములతో సాక్షాత్కరించును. దుర్గయన కష్టములనుండి బయటవేయునది. కావున దుర్గయను పేరును ప్రధానముగావించి, ఆమెకుగల అనేకశక్తులను అనేకనామములతో వర్ణించి అర్జునుడు స్తుతించినాడు. అప్పటికప్పుడే ఆ దివ్యశక్తి కృష్ణార్జునుల ముందట నిలచి, అర్జునునకు కావలసిన వరముల నిచ్చి, అంతర్ధానమైనది.

కృష్ణార్జునులు రథము నధిరోహించినారు. అది అగ్నిదత్తమగు దివ్యరథము. ఆ రథమునకు కట్టిన గుర్రములు విశుద్ధవర్ణమున తెల్లగనున్నవి. ఆ గుర్రముల తోలువారు కృష్ణబ్రహ్మముగదా ! ఆ గుర్రములు అనంతవేదరాశియొక్క దివ్యతేజము కావచ్చును.

ఇక యుద్ధప్రారంభము కావలెను.

# గీతాప్రబోధము

కౌరవసైన్యమున భీష్ముడు విజయశంఖమును పూరించినాడు. భీష్ముని సింహనాదము యుద్ధోత్సాహముననిలిచిన ఆ రంగస్థలములో నున్న సైన్యమునంతను ఒక్కమారుగ ఉప్పొంగించినది. సైనికులును తమ తమ శంఖముల నొక్కమారుగ పూరించినారు. యుద్ధభేరులును అప్పుడే మ్రోగినవి. ఆ శంఖభేరీనినాదములు మిన్నుముట్టగా భూన భోంతరాళముల వ్యాపించి దిక్కుల పిక్కటిల్లజేసినవి. భీష్ముని రక్షించుటకై సైన్యములన్నియు జాగరూకత నొందినవి. మృగరాజు కూడ రక్షణ లేకున్నచో క్షుద్రమృగములచేతికి చిక్కునుగదా!

ఒక్కమారు పాండవసైన్యములోనికి వత్తము. పాండవులును తమతమ శంఖముల పూరించినారు. కాని పాండవుల శంఖపూరణము నందొక ప్రత్యేకత యున్నది. పాండవులందరును ఒక్కమారుగ శంఖములపూరించలేదు. భగవానులు పాంచజన్యము నొత్తగా రెండవదిగా అర్జునునిచే దేవదత్తముపూరించబడినది. ధర్మజాదులు వారివారి ప్రత్యేకము లగు శంఖములను ఒక్కొక్కరుగా పూరించినారు. వారి శంఖారావములు కౌరవుల హృదయములను బ్రద్దలు గావించినవట. 'స ఘోషోధార్త రాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్' కారణమేమి? పాండవుల శంఖములు దివ్యములు. హృషీకేశుడనగా ఇంద్రియములకు ఈశుడు. అతడు మొదట పూరించినాడు. అతడవతరించినది రాక్షససంహారానికే. కావున కౌరవసైన్యమునందలి రాక్షసులను జయించుటకై అతడు శంఖమును పూరించగా వారి గుండెలు బ్రద్దలైనవి. ఆ బ్రహ్మమును అనుసరించి వచ్చినవారే ధర్మదేవతలు పాండవులు. ధర్మము రణరంగ మున నిలిచి శంఖముల పూరించగా అధర్మముయొక్క గుండెలు బ్రద్దలైనవి.

అర్జునుడు సారథిని సంబోధించి, తన రథమును ఉభయసేనా మధ్యమున నిలుపుమనినాడు.

అర్జునుని దివ్యస్యందనము ఉభయసేనామధ్యమున నిలచినది. భగవానులు, పార్థా ! అని సంబోధించి, అదుగో ! కురువులు అని వేలెత్తి కౌరవసైన్యమును చూపినారు. అంతతో అర్జునుని చూపులు కురువీరులపైన నిలచినవి. అర్జునున కింతకుపూర్వ మెన్నియో రణరంగములు నడచినవి. శత్రువుల నెందరినో చించిచెండాడినాడు. కాని ఈ రణరంగమాతనికి నూతనసృష్టియైనది. ఈ రణరంగమున నిలచిన వారిపై ఆతనికి క్రోధముదయించలేదు. దయారస ముప్పొంగినది. యథార్థమున కిది దయారసముప్పొంగుటకు తగిన ప్రదేశము కాదు. అయ్యును ఆతని హృదయక్షేత్రమున దయారసము పొంగిపొరలినది. ఆతని వీర్యము లోకోత్తరము. నేడాతని పరాక్రమము క్రొత్తమలుపు తిరిగినది. ఇది పిరికితనముకాదు. దయయే. కాని అస్థానకారుణ్యము. నేడాతడొక క్రొత్తప్రపంచమున నిలిచినాడు. ఆతని హృదయము కంపించినది. చేతనున్న గాండీవము జారినది. నోరెండినది. చర్మమునకు వేడి వచ్చినది. తన కెదురైయున్న వారందరును తన బంధువులే. శత్రువులు కారు. తాతలు, తండ్రులు, అన్నలు, తమ్ములు, గురువులు, స్నేహితులు. ఈ బంధువులనందరనీ చంపుటయా ? ఆతని హృదయము కరిగి నీరైనది. ఇంతతో జాతి నశించిన దనిపించినది. వీరందరును తనకు శత్రువులనుమాట ఏమూల దాగినదో ? రాచవనితలు ఆతని అంతరాత్మకు అనాథలై సాక్షాత్కరించినారు. ఆతని అంతరాత్మ తనకు కావలసినవి రాజభోగములు కావని నిర్ణయించినది. మానవజాతియొక్క ఔన్నత్యమంతయు స్త్రీ సంరక్షణముపై ఆధారపడియున్నదనియే ఆతని సిద్ధాంతము. వారనాథలగుచో వారిశీలమును కాపాడు వారెవరు ? కావున వర్ణసాంకర్యము కలుగునని భయపడినాడు.

అంతతో ఆతని మనసు నిలువలేదు. కర్మశాస్త్ర మాతని స్మృతికి వచ్చినది. లోకాంతరముల కేగిన పితృదేవతలకు వారి పుత్రులు పిండదానముల నందింపవలెనను విధులు కర్మశాస్త్రములోనివే నేడీ యువకులందరును యుద్ధరంగమునం దస్తమించగా వారి పితృదేవతలకు పిండదానముల చేయువా రెవరు? పితృదేవతలు నరకమున కూలుదురుగదా! అన్న సిద్ధాంతమును ఆతని అంతరాత్మ, తా నొక వాదపీఠమున నిలిచి వాదించినది. ఆ కర్మశాస్త్రము చెప్పిన వాదమే నిజమనిపించినది. అంతేకాదు. అర్జునా! వీరి నందరిను చంపి పాపము మూటకట్టుకొందువా? అని ధర్మశాస్త్రములు తనను ప్రశ్నించినట్లు భావించినాడు. ఇప్పుడు తన కర్తవ్యమేమి? యుద్ధమును మాని వెనుకకు మరలుచేనా?

భారతీయ జీవితవిధానము ఆత్మప్రబోధముపైన ఆధారపడదు. అన్ని వర్ణములకును అన్ని ఆశ్రమములకును వేదములు శాసనకర్తలై శాసించగా ఆ శాసనముల ననుసరించి తన కర్తవ్యములు నిర్ణయములగుట భారతీయుల లక్ష్యము. అర్జునుడు భారతీయుడు. భగవంతుడు పంపిన దూతను ఆశ్రయించినవాడు కాడు. వేదశాస్త్రములచే తెలుపబడిన భగవంతునే ఆశ్రయించిన భక్తశేఖరుడు.

మానవుని అంతరాత్మ గ్రుడ్డిది. అది అచేతనము. కావున తన అంతరాత్మ ప్రబోధించిన ప్రబోధమునుగాక తన హృదయమును విప్పి చెప్పుకొనదగిన ఆప్తమిత్రుడు తన ముందటనే యుండినాడు. ఆతడు వేదస్వరూపుడు. స్వార్థపరుడు కాడు. జీవుల నుద్ధరించుటకే ఆతని అవతారము. ఇప్పుడు తన కర్తవ్యము నాతడే నిర్ణయింపవలెను. అతడు ప్రేమమూర్తి. నేటి కెన్నియో ఆపదలనుండి కాపాడిన రక్షకుడు. తన సచివుడు. తన సారథి. ఆతనికి తన అవస్థా విశేషముల చెప్పుకొనకయే తన అంతరాత్మ ప్రబోధమును ఆతని చెవిని వేయకయే ఆతడు రథము దిగిపోవునా? రథికుడై యున్న తాను సారథియైయున్న గోవిందుని

సంబోధించినాడు. కృష్ణా ! యని పిలిచినాడు. అర్జునుని ఆర్తనాదము చెవికి సోకగనే భగవానులు అర్జునునివైపుకు తిరిగినారు.

అర్జునుడు తన బాధ నంతను ఆతనికి విన్నవించుకొని, ఈ యుద్ధముచే నాకు గలుగు శ్రేయస్సేమి ? అను ప్రశ్నకు దొరకని సమాధానము తనను క్రుంగదీయగా పొంగి పొరలి వచ్చు విషాదమున మునిగి, తన యుద్ధ విరమణను తెలిపికొనినాడు. తాను యుద్ధమును విరమించి వెళ్ళిపోవు తనను శత్రువులు వెంటాడి కొట్టినను మరల వారిని నేను కొట్టదలచలేదనికూడా చెప్పినాడు శ్రీకృష్ణునకు.

ఇది అర్జునుని విషాదఘట్టము. ఈ ఘట్టమున మనము గ్రహించదగినదేమి ? ఈ ఘట్టమునం దర్జునుడు యుద్ధమున వీరినందరను చంపుటచే నాకు ధర్మహాని కలుగుననియు, ఆ ధర్మహానిచే నాకు నరకము వచ్చుననియు, కావున నేనీయుద్ధమును చేయననియు చెప్పి తన చేతనున్న బాణమును వదలి దయకలవాడై యుద్ధ విరమణను గావించినాడు.

ఈ ఘట్టమునుబట్టి మనము నేర్చుకొనదగిన విషయము లేమనగా — ధర్మాధర్మములు వేదశాస్త్రాధీనములుగాని ఆ ధర్మాధర్మముల నిర్ణయించినది తెలివిగలిగిన నాగరిక మానవసమాజము కాదని నిర్ణయించుకొనవలెను. అంతేగాక స్వర్గనరకము లెక్కడనో లేవు ; ఇక్కడ మనమిప్పుడనుభవించు సుఖదుఃఖములే స్వర్గనరకములని నిర్ణయించుకొనుట తప్పు. స్వర్గనరకములు, పుణ్యాపాపములు వేదశాస్త్రాధీనములు కాగా వేదశాస్త్రములే భగవత్తత్వ ప్రతిపాదకములు కాగలవని నమ్మినప్పుడే గీతాశాస్త్రము మనకు ప్రమాణము కాగలదు.

గీతాశాస్త్రము ప్రపంచసమ్మతమగు గ్రంథమని నుడువుచు, అందు కృష్ణార్జునులు ఒప్పుకున్న స్వర్గనరకములును, పుణ్యాపాపములును,

వర్ణధర్మములను కల్పితములను హెచ్చరికలతో గీతాప్రబోధముల గావించు వారెంత ప్రామాణికులో, వారెంత ఆస్తికులో మీరే గ్రహింప వలసి యున్నది.

తరువాతది శ్రీకృష్ణులు అర్జునున కొసంగిన సమాధానోపదేశము. శ్రీకృష్ణుడు అర్జునా ! నీకీ హృదయదౌర్బల్యము నీచము. నీవు నీ మానసికదౌర్బల్యమును వదలి యుద్ధము చేయుము. లెమ్ము లెమ్ము భారతవీరా ! అని అర్జునునకు ధైర్యమును పురిగొలిపినాడు.

'క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప'

అంతతో అర్జునుడు యుద్ధమునకు దిగినాడా ? లేదు. కారణమేమి? శ్రీకృష్ణులిప్పుడు చెప్పిన సమాధానమాతనికి తృప్తిని కల్పించలేదు. నిజమునకు తానను కొన్న ధర్మమునకు పరమావధి ఎక్కడనో ఆతనికి తెలియలేదు. కావుననే ఆతడు సామాన్యమగు సమాధానమునకు తృప్తి నొందక 'ధర్మసమ్మూఢచేతాః' అనినాడు. అంతేకాదు. నేను నీకు శిష్యుడనైతిననియు, నీ శాసనమును శిరసావహింతుననియు చెప్పి కాళ్ళపై బడినాడు.

శాస్త్రములు శ్రేయస్సు, ప్రేయస్సు నని మానవుని కోరికలను రెండుభాగములు గావించినవి. ప్రేయస్సన కర్మాచరణవలన కలుగు ఐహికాముష్మికసుఖములు. ఇవి పూర్వభాగమున చెప్పబడినవి. శ్రేయస్సును వేదములలోని ఉత్తరభాగమగు ఉపనిషత్తులు ప్రపంచించి నవి. ఆ భాగమున కేగినగాని పూర్వభాగమునకు పరిపూర్ణమగు సమన్వయము కుదరదు. కావుననే 'భగవద్గీతాసు ఉపనిషత్సు' అని గీతాశాస్త్రము నందుండును. అర్జునుని విషాదమునంతను మనము పరిశీలించినచో శ్రేయస్సు ఆతని దృష్టియందున్నదని మనకు గోచరించును. వీరందర చంపుచో నాకు కలుగు శ్రేయస్సేమి ? అనునది ఆతని ముఖ్యలక్ష్యము.

'నచ శ్రేయోనుపశ్యామి హత్వా స్వజనమాహవే
యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహితన్మే'

అనునది ఆతని ప్రశ్న.

నేను శిష్యుడను నన్ను శాసింపుమనుటకు పూర్వమును, నేను శిష్యుడను నన్ను శాసింపుమని అడుగునప్పుడుగూడ శ్రేయస్సు అను దానిని దృష్టియందుంచుకొనినాడు. అదియు వర్తమానకాలమున కలుగు దానిని ఆతడు దృష్టియందుంచుకొనలేదు. కలుగబోవు శ్రేయస్సునే ఆతడు దృష్టియందుంచుకొనినాడు. శాస్త్రము విభాగించిన శ్రేయః ప్రేయములలో భోగములుసైతము నాకక్కరలేదన్న అర్జునునకు ప్రేయోభాగము తృప్తినెట్లు కల్పించును ? అందుచేత శ్రీకృష్ణుని మొదటి సమాధానముతో ఆతడు తృప్తిపడలేదు. కావున భారతీయగ్రంథముల లక్ష్యమేమి ? తాను చేయు ఏపనికైనను రాబోవుకాలమున అనగా ఈ శరీరమును వదలిన తరువాతకూడ ఈ చేయుపనికి ఫలమును దృష్టియందుంచుకొనవలెనేగాని ఈ లోకమున ఈ శరీరముతోడనే అనుభవింపదగు ఫలమును దృష్టియందుంచుకొన గూడదనియే భారతీయగ్రంథములకు లక్ష్యము.

ఈ విషయమున కృష్ణార్జునులకు భేదములేదని మీరు మరువ కూడదు.

ఇక కృష్ణమేఘము గీతాశాస్త్రబోధామృతము నెట్లు వర్షించినదో చూడుడు. మీకు ఈఘట్టమున గీతాసారమునుగూడ ముఖ్యముగ బోధింప దలచినాను. గీతాసారమును గ్రహింపదలచిన మనము ముందుగ గ్రహించదగిన ముఖ్యవిషయ మొకటున్నది. కృష్ణార్జునులు యుద్ధరంగ మున ప్రవేశించునప్పుడెట్టి సంబంధము కలవారై యుండిరి ? నాకు కావలసిన శ్రేయస్సునుగూర్చి నిశ్చయమగుమాటను చెప్పుమని పార్థుడు

ప్రశ్నించునప్పుడు వారిద్దరి సంబంధమేమి ? అను విషయమును ముఖ్యముగ పరిశీలించినగాని గీతాసారము బోధపడదు.

వారిద్దరి సంబంధము లివ్వి—

యుద్ధరంగమునం దుభయసేనామధ్యమున ప్రవేశించినప్పుడు శ్రీకృష్ణుడు సారథియు అర్జునుడు రథికుడునై యుండిరి. ఆ తరువాత వారిద్దరును గురుశిష్యులై మాట్లాడుకొనుట మనకిక్కడ గమనార్హమగు విషయము. వారిద్దరును గురుశిష్యులగుటలోని విశేషమేమి ? ఆత్మతత్త్వము పరమరహస్యము. అట్టి రహస్యమును చెప్పవలెనన్న భక్తుడును శిష్యుడును కానివాని కెట్లు చెప్పను ? అర్జునుని విషాదము ఆత్మతత్త్వమునగాని ఉపశమింపదు. కావున నేను శిష్యుడను నన్ను శాసింపుమన్న ఆర్తనాదమునువిని ప్రపన్నుడగు శిష్యునకు తన నిజరూపమెట్టిదో చెప్పి చూపినారు భగవానులు. దీనికే అధికారనిర్ణయమని పేరు. ప్రతిశాస్త్రమునందును అధికారనిర్ణయమున్నది. తన పుత్రునకు ఆస్తిని అప్పగించవలెనన్న మైనారిటీ తీరవలెను. కాలేజీ విద్యార్థికి సీటు నివ్వవలెనన్న అతని తెలివితేటలనుబట్టి ఇచ్చుచుండిరిగదా ! కావుననే శ్రీకృష్ణులు అర్జునునిగూర్చి ఒకచోట ఇట్లు మాట్లాడినారు.

'భక్తోసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమం'

అర్జునుడు శిష్యుడగుటయేగాక భక్తుడును స్నేహితుడునుగూడనై యుండెనట.

'బ్రూయుస్స్నిగ్ధస్యశిష్యస్య గురవో గుహ్యమప్యుత' (భాగవతము)

ఉత్తముడగు శిష్యునకు ఎట్టిరహస్యమునైన గురువులందింతురట. అన్ని రహస్యములలో చివ్వరి రహస్యము భగవత్తత్వము. లేక ఆత్మతత్వము. ఇక భగవానులు అర్జునున కందించిన గీతాశాస్త్రసారమేమియో విచారింతము.

# గీతాసారసంగ్రహము

సకలశాస్త్రములయొక్క సారము భగవద్గీత. 'సర్వశాస్త్రమయీ గీతా' 'తదిదం సమస్తవేదార్థసార సంగ్రహభూతం' గీ.బా.

గీతాప్రబోధము రెండవ అధ్యాయమున పదకొండవ శ్లోకమున ప్రారంభమై పదునెనిమిదవ అధ్యాయమున డెబ్బదిమూడవ శ్లోకముతో సమాప్తమైనది.

గీతాశాస్త్రమునందలి మొదటిసిద్ధాంతము ఆత్మనిత్యము. దేహము అనిత్యము. ఆత్మదేహమును ధరించును. వదలును. అట్లు ఆత్మదేహమును ధరించుటకు జననమని పేరు. దేహమును వదలుటకు మరణమని పేరు. జనన మరణములు రెండును మనము కట్టుకొని విప్పివేయు వస్త్రముల వంటివి. కావున ఆత్మకు చావులేదు. ఆత్మ దేహమును ధరించును గనుక ఈ ఆత్మకు దేహి అని పేరు. ఈ ఆత్మ పుణ్య పాపముల ననుసరించి స్వర్గనరకములకేగి అక్కడి సుఖదుఃఖములను కూడ అనుభవించుచుండును. కావున దేహివేరు. దేహము వేరు. ఈ విషయమును తెలిసినపండితులు దుఃఖించరు. మరణమును గురించి దుఃఖము ననుభవించుచో వారు పండితులు గారు. ఇది గీతాశాస్త్రమునందలి మొదటి మాట. గీతాశాస్త్రముననే కాదు; భారతీయశాస్త్రము లేవియైనను ఈ సిద్ధాంతమును చెప్పును. అనగా శ్రీకృష్ణులు అర్జునున కుపదేశించు గీతకు పూర్వమున్న శాస్త్రములన్నియు ఈ సిద్ధాంతమునే చెప్పినవి. దీనికి వ్యతిరేకములగు సిద్ధాంతములను అనగా—ఆత్మ చచ్చును. అదే ఆత్మ మరల పుట్టదు. దానికి సాక్ష్యాధారములు లేవు—అను సిద్ధాంతము గీతాశాస్త్రమునకు వ్యతిరేకము.

అనగా భగవద్గీతాశాస్త్రము ఏమి చెప్పినది ? జీవులకు గల మరణభయమును తొలగించినది. యథార్థమునకు జీవునకు మరణమును గురించియేగదా భయము !. కావున మృత్యుభయమును తొలగించుటే శాస్త్రముల తాత్పర్యము. మృత్యువునుగురించి సంపూర్ణముగా పరిశీలించిన శాస్త్రములు భారతీయశాస్త్రములే.

భగవద్గీత ఎన్ని భాగములు ?

గీతాశాస్త్రములోని విషయము మూడు భాగములుగ వర్ణింపబడినది. (1) కర్మ (2) భక్తి (3) జ్ఞానము. ఈ మూడింటికిని యోగములని పేరు పెట్టినది. యోగమనగా ఉపాయమని అర్థము. కర్మయను దానిని ఉపాయముగాచేసి మృత్యుభయమును తీర్చుటకు ప్రయత్నించుటచేత దీనికి కర్మయోగమని పేరు. అట్లే భక్తిజ్ఞానములను ఉపాయములతో మృత్యుభయమును తీర్చుటచే అవి భక్తిజ్ఞానయోగములనుపేర బరగినవి.

కేవలకర్మశాస్త్రములచే జీవులకు కలుగు అనర్థకములను తీర్చి దిద్దుటకై నీవుచేయు వేదశాస్త్రవిహితములగు విధికర్మలలోని ఫలమును గాని, అనగా యజ్ఞయాగాదికర్మలఫలమునుగాని, లేక దానధర్మాది ఫలములను గాని, అనగా సత్రముల గట్టించుట, బావుల త్రవ్వించుట, దేవాలయముల నిర్మించుట, పాత్రులగువారికి దానములనిచ్చుట, అన్నదానము మొదలగువాటిని ఆచరించిన ఫలములనుగాని నీ వనుభవించుటకై ప్రయత్నింపక భగవదర్పణచేయుచు ఆచరించినచో నీకు మృత్యుభయము తొలగునని, అన్నివర్ణములవారికిని, అన్ని ఆశ్రమములవారికిని సాధన భాగముగా సునాయాసమగు మార్గమును బోధించినవి.

'స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతోభయాత్'

యోగబుద్ధితో చేయు కర్మ స్వల్పమైనను జన్మమృత్యురూపమగు భయమును తొలగించును. కావుననే యోగబుద్ధితో కర్మనాచరింపుమన్నది. కాని కర్మయనన నేమియోగూడ గీతాశాస్త్రమే నియమించినది.

మనముచేయు ప్రతిపనియు మూడువిధములై యుండును. ఒకటి స్వాభావికమగు కర్మ. కనురెప్పల వాల్చుట, గాలి పీల్చుట, విడుచుట మొదలగునవి. ఉచ్ఛ్వాసనిశ్వాసల పీల్చుటకును, విడుచుటకును మన ప్రయత్నమక్కరలేదు. మన కోరికపై కొన్నిపనులను చేయుదుము. ఆ పనులు మన యిష్టముపై ఆధారపడి యుండును. ఆ పనులకు దేశ కాల నియమములుండవు. భోజనము చేయుట, ఫలహారముల భుజించుట సాయంత్రమున సుఖవిహారమున కేగుట మొదలగునవి. వాటిని మన కిష్టమున్నచో చేయవచ్చును, లేకున్న మానవచ్చును. దీనికి ఐచ్ఛికకర్మ యని పేరు. మూడవది నియతకర్మ. ఈ కర్మ మన స్వాతంత్ర్యముపై ఆధారపడియుండక విధులతో కూడియుండును. అనగా ఒక ఉద్యోగి ఆఫీసుకు వెళ్ళుటకు కాల నియమమున్నది. అందుండి కర్మను విరమించుటకును కాలనియమ మున్నది. అట్లే దేశనియమ మున్నది. దీనికి నియతకర్మయని పేరు. గీతాశాస్త్రమున వర్ణింపబడిన యోగబుద్ధితోచేయు కర్మ నియతకర్మయేగాని ఐచ్ఛికకర్మ కాదని తెలియుట చాల అవసరము. ఐచ్ఛికకర్మయే అగుచో - అనగా ఎవరి ఇష్టమువచ్చిన కర్మ వారు చేయుటయే కర్మయోగము చెప్పిన కర్మ యగుచో ; అర్జునునకు యుద్ధ కర్తవ్యము లేకుండెడిదిగదా ? భిక్షాటనమును చేయుటకు కోరుకొన్న అర్జునునిచే 'యుద్ధమే నీకు విధించబడిన కర్మ' యని చెప్పి, దానిని యోగబుద్ధితో ఆచరింపుమని బోధించినారు భగవానులు. ఫలము పుట్టునట్టి కర్మవలన వచ్చినట్టి ఫలమును త్యాగము చేయుదుముగాని, ఫలము పుట్టుటకు అవకాశములేని కర్మఫల త్యాగము నెట్లు చేయుదుము ? గీతలోని ఒక శ్లోకమును మీకు జ్ఞాపకము చేయుదును.

'నియతం కురు కర్మ త్వం కర్మజ్యాయోహ్య కర్మణః'

'నియతంకర్మకురు' అని అన్వయము. అనగా క్షత్రియజాతి యందు పుట్టిన నీకు వేదశాస్త్రములచే యుద్ధకర్మ విధింపబడినది గావున ఈ యుద్ధమును చేయక నీకు తప్పదని నిర్ణయించినారు.

యథార్థమునకు జాతులకానాటికి పుట్టుకతోడనే నిర్ణయము లేకున్నచో అర్జునునకు భిక్షాజీవనము చేయుట నీకు స్వధర్మము కాదనియు నీకు యుద్ధమే స్వధర్మమనియు భగవానులేల చెప్పును ? వృత్తులను బట్టియే జాతులనిర్ణయమని గీత చెప్పుచో లేక ప్రతివానికిని అంతఃకరణమున కలుగు సత్వాదిగుణములచేతనే జాతులను గీతనిర్ణయించుచో అర్జునుడు సత్వగుణముతో కూడి భిక్షనెత్తికొని, హింసాజీవనమును మాని బ్రాహ్మణుడయ్యెడివాడుగదా ? శ్రీకృష్ణులేల దానిని నిషేధించిరి ? ఎప్పుడైనను జాతి జన్మతోడనే వచ్చునని శాస్త్రములు నిర్ణయించినవి. 'జని ప్రాదుర్భావే' అను ధాతువునుండి జన్మ, జాతి అను పదములు వచ్చినవి. కావున ఆ రెండును ఒకేక్రియనుండి పుట్టిన వేర్వేరుపదములు. ప్రత్యయభేదముచే ఆ పదము లేర్పడినవి. జాతకర్మాది సంస్కారములు పుట్టినవెంటనే చేయు కర్మలుగాని పుట్టినతరువాత అతని గుణములను బట్టి అతడెవ్వరో నిర్ణయించి చేయునవికావు. రత్నము పుట్టుకతోడనే రత్నమయి యుండునుగాని పుట్టినతరువాత దానికి రత్నము అనుపేరు నెవ్వరును పెట్టరు. పరుగెత్తుగుణముకలదానికి గుఱ్ఱమని ఎవరును పేరు పెట్టలేదు. గుఱ్ఱము కనుకనే పరుగెత్తును. పరుగెత్తనిది గుఱ్ఱముకాదు. ఎద్దుకనుక నడచును. ఎద్దును పరగెత్తించుచో లేక ఒకకాలమున కొద్దికాలము పరుగెత్తుచో అది గుఱ్ఱము కాజాలదు. ఒకవేళ గుఱ్ఱమునకు పరుగెత్తుశక్తి లేకున్నచో అది అసమర్థమగు గుఱ్ఱమని వ్యవహరింపబడును. కావున ఎద్దునకు బరువుమోయు శక్తియు, గుఱ్ఱమునకు వేగగమనమును సాగించుశక్తియు పుట్టుకతోడనే వచ్చినవిగాని వాతావరణము వలన వచ్చినవి కావు. మనకు అవసరమగునట్లు శాస్త్రముల కర్థముల చెప్పుట రాజకీయము. కావున కర్మయోగములోని కర్మకు నియతకర్మయని పేరు. ప్రకృత విషయమేమన ? కర్మయోగసాధనమున సాధకుడగువాడు భగవన్నిర్మితములగు వేదశాస్త్రములచే ఆజ్ఞాపింపబడిన

కర్మలనుగాని, లేక దానధర్మములనుగాని నేను ఆ భగవంతుని ఆజ్ఞను పాలించుచుంటినను భావముతో భగవంతుని సేవకుడనై చేయుచుంటినను బుద్ధితో చేయుట ఆతనికి సాధన భాగము. అనగా నేను ఆయనవాడను అను నిశ్చయమున నిరహంకారముతో చేయునది కర్మయోగము. భగవంతు డెక్కడుండెనో, ఆతను ఏ రూపనామములతో ఉండెనో ఈతని కక్కరలేదు. భగవంతుని ఆజ్ఞారూపములగు శాసనములే ఈతనికి భగవంతుడై ఆరాధ్యములగును. అనగా వేదశాసనములే ఈతనికి భగవంతుడు.

స్వర్గాది భోగములకోరి పుణ్యకర్మ నాచరించుచో అది కర్మ యనిపించుకొనును. ఆ ఫలమును కోరకయే పుణ్యకర్మల నాచరించుచో అది కర్మయోగమగును.

కాని ఈ కర్మయోగమున భక్తికి తావు గలదా ? అని కొందరు శంకింతురు. భక్తి విశ్వాసములు రెండునుకలిగి చేయు కర్మయోగమే పూర్ణరూపము నొందగలదు. అంతేగాక ప్రతిఒక్క యోగమునందును మిగిలిన రెండుయోగములును అంతర్భూతములై యుండుటే భారతీయ శాస్త్రముయొక్క ప్రతిభావిశేషము. శ్రద్ధాభక్తులు లేనిది కర్మలను చేయు టెట్లు ? పారమార్థిక కర్మలేకాదు. లౌకికములగు కర్మలుగూడ భక్తి విశ్వాసములు కలవారికే పూర్ణఫలముల నిచ్చును. కాని ఈ కర్మయోగము సాధకునకు మొదటిమెట్టుగ నిలిచి, సిద్ధునకు సిద్ధస్వరూపము చెంద గలదు. అనగా భక్తునకు భక్తి ప్రధానకర్మయై జ్ఞానికి జ్ఞానప్రధానమగు కర్మకాగలదు. కావుననే శ్రీకృష్ణుని కర్మాచరణము జ్ఞానులకును ఆదర్శ మైనది.

కర్మయోగమును మూడుభాగములుగ విభజింపవచ్చును. కర్మ ప్రధాన కర్మయోగము, భక్తి ప్రధాన కర్మయోగము, జ్ఞానప్రధానకర్మ యోగము నని. సాధకునకు, సిద్ధునకుగూడ ఈ విభాగ మన్వయించును.

సాధకునకు కర్మయోగ మెట్లు పరమార్థమును సాధించును ?

కర్మయోగ ఫల మిట్లు పరిణమించును :-

ఈ కర్మయోగముచేత చంచలమగు మనస్సు పరిశుద్ధమునొంది చేతికి చిక్కును. కామక్రోధాదిదూషితమగు అంతఃకరణమాలిన్యము తొలగినగాని భగవంతుని వినిర్మలరూపము మన అంతఃకరణమందు ప్రతిబింబింపజాలదు. కావున కర్మయోగముచేత అంతఃకరణమాలిన్యమును తొలగించుకొనుట మొదటిమెట్టు. కావుననే శంకరులు...

'వేదో నిత్య మధీయతాం తదుదితం కర్మస్వనుష్ఠీయతాం
తేనేశస్యవిధీతా మపచితిః కామ్యేమతి స్త్యజ్యతాం
పాపేషుః పరిభూయతాం ... ... ... '

అని నుడివినారు. వేదశాస్త్రచోదితమగు కర్మాచరణకు చాల ప్రాధాన్యము నిచ్చినారు. అంతేగాక 'కర్మణా కర్మనిర్హారః' అని భాగవతము చెప్పినది. కర్మబంధములను త్రెంచుటకు యోగబుద్ధితో చేయు కర్మలే సమర్థములైనవట. కావున నీవుచేయు పుణ్యకర్మలలోని ఫలము లేక పుణ్యసంకల్పములవలనకలుగు ఫలమును భగవంతునికి సమర్పింపు మని గీతాశాస్త్రమున భగవానుని ఉపదేశము.

హోమియోవైద్యమున_రోగము లేనివానిపైన ఏ ఓషధిని వాడిన ఎట్టి రోగము పుట్టునో ఆ రోగముగలవానికి అదే ఓషధి నివ్వగా అది ఆ రోగమును మాన్పును. కావున కర్మయోగమున కర్మఫలభోక్త కాక కర్తయై కర్మల నాచరించును. దానితో కామ్యకర్మలవలన వచ్చిన మాలిన్యము తొలగును. భక్తి ఉదయించుటకు ఆ అంతఃకరణము అర్హమగును.

తరువాత ఆ కర్మయోగియొక్క కర్తవ్యమేమి ?

శ్లో॥ సంగత్సు విధీయతాం భగవతొ భక్తిర్దృఢాధీయతాం'

సత్పురుషసాంగత్యముతో భగవంతునియందు భక్తిని దృఢము కావించుకొనవలెను. కావున గీతాశాస్త్రమున రెండవది భక్తియోగము. గీతలోని పదునెనిమిది అధ్యాయములను మూడు షట్కములుగా కూడ విభజింపవచ్చును. మొదటి ఆరు అధ్యాయములును కర్మషట్కముకాగా, రెండవషట్కము భక్తియోగమును ప్రపంచించినది. ఇప్పుడు మనము భక్తియోగములోనికి పోదము.

## భక్తియోగము

అసలు భక్తి అను పదమున కర్థమేమి? భక్తిశాస్త్రములు భక్తి యను పదమునకు అర్థము నిట్లు చెప్పినవి.

భగవంతునియందుగల పరిపూర్ణానురాగమునకు భక్తియని పేరు. పరిపూర్ణమగు ఈ అనురాగమునే పరమప్రేమ అని శాస్త్రము వాడినది. ఈ రెండుపేర్లును భక్తికి పర్యాయపదములు. భక్తిని గురించి గీతా వాక్యము లివ్వి :

'నమే భక్తః ప్రణశ్యతి' 'భక్తాస్తేఽతీవమే ప్రియాః'

కాని ఆ పరిపూర్ణమగు అనురాగము భగవంతునియందు ఎట్లు కలుగును? అనునది ప్రశ్న.

కర్మకు ప్రధానమగునది స్థూలశరీరముకాగా భక్తియోగమునకు ప్రధానమగునది మనోమయము. కరగిపోదగిన చిత్తము భక్తియోగము నకు చాల అవసరము. మెత్తని మనస్సునందుగాని భగవంతుని ఆకారము ముద్రపడదు. అట్లు ముద్రితమగు ఆకారమునందనురాగము దినదినప్రవర్ధమానముకాగా అది పూర్ణరూపమునొందును. ఆ భక్తికి ప్రేమభక్తి యని పేరు.

మనస్సునకు ఒక విచిత్రమగు స్వభావమున్నది. మనస్సును మనము దేనియందుంచుదుమో మనస్సు దానియాకారము నొందును. అనగా దేనిని మన మెక్కువగా స్మరంతుమో దానియందొక రుచిని కల్పించుట మనస్సుయొక్క ధర్మము. కావున భగవానులు భక్తులగు వారి నిత్యజీవితము నిట్లు వర్ణించినారు.

'మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరం
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమన్తి చ'

భక్తులగువారి చిత్తమెప్పుడును తనయందే యుండునట. వారి ప్రాణములను తనపైననే పెట్టుకొని బ్రతుకుదురట. భక్తులెప్పుడును భగవంతుడగు తన గుణములనే ఒకరికొకరు చెప్పుకొనుచు కాలమును గడపుదురట. తన తత్త్వమునే ఒకరికొకరు బోధించుకొనుచు సంతోష మున ఉప్పొంగుచు, ఆనందానుభవము నొందుచుందురట. ఇదియే భక్తుల యొక్క నిత్యజీవిత మనినారు. ఇది భక్తియోగమున సిద్ధిపొందినవారి లక్షణము. మరి, సాధకు లేమిచేయవలెను ? సాధకులన అభ్యాసకులు. అభ్యాసము స్వభావమగుచో అది సిద్ధియను పేరునొందును. మన మనస్సు మన ప్రయత్నములేకయే భగవంతునిపైకి ప్రసరించుచో అది అభ్యాస కుని పాకావస్థకాగలదు. భగవంతునిపైకి మరలిన చిత్తము తిరిగిరాక ఆతని పూర్ణరూపమునందే రమించుచు నిలిచియున్నచో దానిని సమాధి యనిగాని, లేక అవ్యభిచారభక్తి యనిగాని వచింతురు. చంచలమగు మన మనస్సు ఆ భగవంతునియందు స్థిరమగుట సంభవమా ? అని మనకు చాల నిస్పృహ నిరాశలు కలుగుటలో సందేహములేదు. అయ్యును గీతా శాస్త్రము మన సందేహమును చక్కగ తీర్చినది. అర్జునుడు మనస్సు వాయువువలె చంచలమైనదిగదా ! దీనిని నిగ్రహించుట చాల దుష్కర మని ప్రశ్నించగా అభ్యాసవైరాగ్యములు మనోనిగ్రహమును కల్పించ గలవని చెప్పినారు.

'అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే'

అభ్యాసమననేమి ? మన మనస్సును దేనియందు నిలుపదలచితిమో దానినుండి మనస్సు తిరిగిరాగా మరల మరల దానియందే మన మనస్సు నుంచుటకు ప్రయత్నించుటే అభ్యాసము. ఇక్కడ విసుగుచెందకూడదు. ఇట్టి అభ్యాసము చేయుటకు ఇంద్రియసుఖములందు వైరాగ్యమునొందగా ఈ యభ్యాసము ఫలించును.

ఇట్టి అభ్యాసముచే మనస్సునొక్కచో నిలుపగా దానికి ధ్యానమని పేరు. కాని మీరు నన్నొకప్రశ్న వేయుదురు. ధ్యానమునకు ధ్యేయ మొకటి యుండవలెనుగదా ? ఆ ధ్యేయము భగవంతుడు కావలెనని మీరు చెప్పినారు. ఆ భగవంతునకు రూప నామక్రియలు లేవని కొందరు చెప్పుదురు - దానికేమి సమాధానము ? - అని. భగవంతునకు రూప నామములు లేవనునది ఒక సిద్ధాంతమైనను ; భక్తియోగమున రూపనామ క్రియాస్వరూపమగు భగవంతునే ఆరాధించుటకు సగుణభక్తియని పేరు. ఇది చాల ముఖ్యమని గీత చెప్పినది. గీతాశాస్త్రము దీనిని వ్యక్తోపాసన యనియు, అవ్యక్తోపాసన యనియు నిర్వచించి, దేహాత్మబుద్ధిగల జీవులకు అవ్యక్తోపాసనము చాల దుఃఖమునిచ్చునని స్పష్టముగ చెప్పినది. వ్యక్తో పాసనయే శ్రేష్ఠమని నిర్ణయించినది. అనగా సగుణమూర్తియగు భగవంతుని ఆరాధించి, భక్తిరసానుభవము నొందుటను గీతాశాస్త్రము చాల ప్రశంసించినది. అప్రాకృతదివ్యమంగళవిగ్రహుండనై భక్తజనుల నుద్ధరింపవచ్చిన నన్ను అనన్యభక్తితో ఎవరు సేవింతురో వారిని యీ సంసారమునుండి ఉద్ధరింతును - అని భగవానులు అభయప్రదానము గావించినారు.

'అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే
తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్'

అంతేగాక భక్తులకును తనకును ఒక నిత్యసంబంధము కలదనినారు. ఏమది ? నాకంటె వేరొకరు లేరని, నన్నే నమ్మి ఎవ

రుందురో వారి యోగక్షేమములను వారు చూచుకొన నక్కరలేదనినారు. వారి సంసారము నంతను నేనే దిద్దుదుననినారు.

'అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం'

కాని ఆ భగవంతుని మూర్తులలో ఏ మూర్తి చాల ముఖ్యమైనది అందురా? అన్ని మూర్తులును, అన్ని అవతారములును ఒక్కటే. ముఖ్యముగ గీతాశాస్త్ర మీ విషయమునే చెప్పినది.

ఎవరికి ఏ మూర్తియందు మనస్సు లగ్నమగునో ఆ మూర్తి యందే వారి భక్తి పూర్ణరూపము నొందును. ఇక్కడ ఏ మతము వారా మూర్తినే ఆరాధించవలెనను నియమము లేదు. మతాచార్యులు సాధకుని మనస్సును భగవంతునివైపుకు త్రిప్పుటకై అతడొక దైవతమును, నిర్ణయించుకొనలేని సమయమున గురువులు చెప్పిన దేవతనే ఉపాసించుటను చెప్పినారు. దీనికి మీకు కొన్ని ఉదాహరణలనిత్తును.

లీలాశుకుడు శ్రీకృష్ణభక్తుడు. కాని అతడు శైవుడు. ఒకే ఒక మూర్తియం దత్యంత ప్రేమానురాగముల కలిగియుండుట అతని అంతఃకరణసంస్కారము చేతనేగాని శైవవైష్ణవాది మతభేదములచే గాదు. కృష్ణకర్ణామృత గ్రంథకర్త యిట్లు పలికినాడు.

శ్లో॥ శైవావయం న ఖలు తత్ర విచారణీయం
పంచాక్షరీజపపరా నితరాం తథాపి
చేతో మదీయమతసీ కుసుమావభాసం
స్మేరాననం స్మరతి గోపవధూకిశోరం'

మేము శైవులము. అందు సందేహము లేదు. మేము పంచాక్షరీ మంత్రజపమునే చేయుదుము. అగుగాక: నా చిత్తము మాత్రము నల్లఅగిశెపూవురంగు గలిగి మందహాస సుందరవదనారవిందమున విలసిల్లు ఆ చిన్నికృష్ణుని ముఖమండలమునే స్మరించుచున్నది.

మధుసూదన సరస్వతియను పండితుడు అద్వైతసిద్ధాంత గ్రంథ కర్త. ఆతడీ జగత్తును మిథ్యయని వాదోపవాదములతో బ్రహ్మమొక్కటే నన్న విద్వద్వర్యులు. అయ్యును తన సంస్కారమెట్లుండెనో చెప్పినారు.

'ధ్యానాభ్యాసవశీకృతేన మనసా యన్నిర్గుణం నిష్క్రియం
జ్యోతిః కంచన యోగినోయదివరం పశ్యంతి పశ్యంతు తే
అస్మాకం తు తదేవలోచనచమత్కారాయ భూయాచ్చిరం
కాళిందిపుళినేషు యత్కిమపి తన్నీలంమహోధావతి'

యోగులగువారు గావించు ధ్యానాభ్యాసముచేత వారికి చిత్తము వశముకాగా వారు నిర్గుణబ్రహ్మమునే జ్యోతిరూపమున దర్శించిన దర్శింతురుగాక. అదియే మాకు మాత్రము కాళిందీపుళినతటమున సుకుమార సుందరమూర్తియై వినీలవర్ణమున భాసించుచూ దర్శనమిచ్చు గాక యనినారు.

ఈ భావములను గమనించితిరా ? శైవునకు కృష్ణభక్తియు అద్వైతశాస్త్రప్రణేతకు సగుణబ్రహ్మమునందలి మాధుర్యమును కలుగుట చిత్రమేమియు కాదు ; అంతఃకరణ సంస్కారము. కావున మన అంతఃకరణమునం దేమూర్తియం దనురాగము కలదో ఆ మూర్తినే ధ్యానించుచు, ఆ మూర్తిమంత్రమునే జపించుచు, ఆ మూర్తినామమునే స్మరించుచు, ఆ మూర్తియొక్క గుణములనే వర్ణించుట అభ్యాసముచేయగా, ఆ యభ్యాసము సంస్కారరూపమునొంది, అది దృఢమై ఆ యభ్యాసకుని చిత్తవృత్తికి స్వభావమై కొంతకాలమునకు-అనగా కొన్ని జన్మలకైనను పరిపూర్ణప్రేమరూపమున భగవానుని ప్రేమించును. నీ వే రూపమును ప్రేమింతువో అదియే అన్నిమూర్తులకును మూలము. జీవులకు భగవానుని యందు గలుగు అనురాగము, లేక ప్రేమ మూడు భాగములై యుండును.

వాత్సల్యము, సఖ్యము, మధురము నని. మాతాపితరులకు బిడ్డల యందు గలుగు అనురాగమువంటి అనురాగము భగవంతునియందు గలుగగా అది వాత్సల్యము. స్నేహితునియందు కలుగు అనురాగము వంటి అనురాగము కలుగగా అది సఖ్యము. ప్రియునియందు ప్రియురాలికి కలుగు భావమువంటి రాగము భగవానునియందు కలుగగా అది మధురము.

శ్రీకృష్ణునియందు యశోదకు కలిగినది వాత్సల్యభక్తి. గోపకుమారులకు శ్రీకృష్ణునితోటిగల సంబంధము సఖ్యభక్తి. గోపాంగనలకు భగవానునితోటిగల సంబంధము మధురభక్తి.

ఈ మధురభక్తికే ప్రేమభక్తియని పేరు. ఈ మధురభక్తియందు జీవుడు నాయికకాగా భగవానుడు నాయకుడై ప్రేమింపబడును. వీరిద్దరి మధ్యను ఉదయించునది శృంగారరసములోని భావపరంపరలే. సామాన్యముగ శృంగారమన నీచభావము నొందుట భక్తిరసమున వర్ణింపబడు భావతరంగములకు గాదు. ఇక్కడ శృంగారమన భగవంతుడే.

శృంగారము రెండువిధములు — ప్రాకృతము, అప్రాకృతము. ప్రాకృతశృంగారమన — జీవభావము నొందిన స్త్రీపురుషులయందు ఇంద్రియప్రీతికొరకై స్త్రీకి పురుషుడును, పురుషునకు స్త్రీయును ఆధారములు కాగా ఉదయించు శృంగారము. ఇది యిచ్చు ఆనందము తాత్కాలికము ; దాని పరిణామము దుఃఖము.

భగవంతునకును భక్తునకును మధ్యగల అనురాగములోని భావశృంగారము అప్రాకృతము. దీని ఫలితాంశము అఖండానంద ప్రాప్తి. భాగవతములోని శృంగారమంతయు అప్రాకృతము. గోపికా శ్రీకృష్ణుల శృంగారము దిగంబరుడైన శుకయోగీంద్రుల కుపాస్యమైన శృంగారము. నేను చెప్పిన జీవేశ్వరుల వాత్సల్య, సఖ్య, మధురభావముల సంబంధమును గీతాశాస్త్రమెట్లు చెప్పినదో చూడుడు.

అర్జునుడు విశ్వరూపసందర్శన సమయమున భగవంతుని శరణు వేడి క్షమాపణను చెప్పుకొనిన శ్లోకమిది.

'పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుం'

తండ్రి పుత్రుని క్షమించినట్లు - స్నేహితుడు మిత్రుని క్షమించినట్లు - ప్రియురాలిని ప్రియుడు క్షమించినట్లు నన్ను క్షమింపుమని కోరినాడు.

ఇచ్చట ప్రియురాలు, ప్రియుడు అను పదముల వాడుటయందొక విశేషమున్నది. భార్యాభర్తల అనురాగము బాధ్యతాయుతము. అనగా వీరిద్దరిమధ్య నొక ధర్మసంబంధమున్నదిగాని అది కేవల ఆత్మసంబంధమగు ప్రేమకాదు. గావున రుక్మిణీకృష్ణులకంటె రాధాకృష్ణ సంబంధమును ద్వైతాచార్యులు ప్రధానము గావించినారు.

ఇక్కడ శ్రోతలకొక ముఖ్యమగు విషయమును వివరించవలసియున్నది. రాధాకృష్ణుల యపారప్రేమామృత భక్తిరసామృత సింధువున గ్రుంకులిడిన వారిలో ఒకరు శ్రీకృష్ణచైతన్య మహాప్రభువు. ఈత డిటీవలి ద్వైతాచార్యులయందొకరు. జయదేవుని గీతగోవింద కావ్యమును రాధాకృష్ణుల దివ్యతత్త్వ ప్రతిపాదనమే. శ్రీకృష్ణ దివ్యలీలాతరంగములలో తానోలలాడి పఠితలను శ్రోతలనుగూడ నుర్రూత లూగించిన నారాయణతీర్థుల యపార కవితామాధుర్యమును కృష్ణభక్తిని ప్రతిపాదించినది. ఆ మహనీయులందరును మధురభక్తిని ప్రతిపాదించిన విద్వద్వర్యులు. నారాయణతీర్థుల కృష్ణకథాగానామృతమున అద్వైతాచార్యుల అద్వైతామృతముకూడ రంగరింపబడినది.

భక్తియోగమును గురించి నేనొక్కమాటను చెప్పెదను.

కర్మకాండమున వైదికకర్మప్రతిపాదనమున వర్ణాశ్రమాచారములతో కొంత సంబంధమున్నది. ఆ కాండయందు శ్రుతాధ్యయన సంపన్నుడగుటయు, శరీరదార్ఢ్యమును పుత్రవంతుడగుటయు నను అధికార

ప్రతిపాదనముండగా భక్తియోగమున ద్రవీభూతమగు చిత్తముగల ప్రతి ఒక్కరును అధికారులు కాగలరు. ఇందు జాతిమతవయోద్రవిణములు కారణములు గావు. ఇందు దేశకాలనియమములును లేవు.

'అపిచేత్సుదురాచారో భజతే మామనన్యభాక్
సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితోహిసః'

ఎట్టి దురాచారులైనను ఆతని శరణుపొందుచో వారు సాధువులుగ పరిగణింపబడుదురట. అంతేకాదు : ఎందుకొరకు ఆ భగవంతునియొద్ద కేగినను వారు పుణ్యవంతులుగనే పరిగణింపబడుదురట.

ద్రవ్యమును కోరిగాని, కష్టకాలము వచ్చినప్పుడుగాని ఆతని యొద్దకు వెళ్ళినవారి నాతడు తప్పక రక్షింపగలడు. భక్తులు నిరంతర మును తనను కీర్తించుటకొరకే ఆతని అవతారములని భాగవతము చెప్పినది. ఇక్కడ ఆంధ్రభాగవతరత్నము నొకదానిని మీ చేతి కందింతును.

'ఒకమా టెవ్వనిపేరు కర్ణములలో నొయ్యారమై సోకినన్
సకలాఘంబులు పల్లటించి తొలగున్ సంభ్రాంతితో నట్టి ను
త్యుకరున్ మంగళతీర్థపాదు హరి విష్ణున్ దేవదేవేశు దా
రకలంకస్థితి గొల్చుభక్తులకు లేదడ్డంబు రాజాగ్రణీ'

ఇట్లు పరమప్రేమానురాగపూర్ణమగు భక్తి ఉదయించుటకే గీతాచార్యులుపదేశించిన యోగమును, ఆహారాది నియమములును, ఓంకారోపాసనయు భక్తికి అంగమే కాగలదు. ఇది మీకు సంగ్రహ రూపమున వివరించిన భక్తియోగము. భక్తియోగసాధకులగువారికి తమ యందు గల కామాదిగుణములన్నియు భగవానుని ఆరాధించుటకై వినియోగించగా ఆ గుణసముదాయముగూడ మోక్షకారణము కాగలదు.

ఏ గుణములు మనకు బంధహేతువులో ఆ గుణములే భగవానునియం దైక్యమగుటకును పనికివచ్చును. ఒకే ఒక తాళపుచెవి తాళము వేయుటకును తీయుటకును పనికివచ్చును.

'కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులుం
బ్రేమన్ మీరలు భక్తి నేము విదె చక్రింగంటి మెట్లైనను
ద్దామధ్యాన గరిష్ఠుడైనహరిజెందన్వచ్చు ధాత్రీశ్వరా!'

భక్తియోగమున ఉద్దామధ్యానగరిష్ఠత్వము కావలెను. ఇది భక్తియోగములోని రహస్యము. మలిన కామము బంధమునివ్వగా విశుద్ధ కామము మోక్షమునిచ్చును.

ఇట్లు గోపాంగనలవలె రాధామాయివలె భగవానుని దివ్యలీలా వైభవములోని మాధుర్యమును గ్రోలుట కందనివారు నిరంతరమును ఆతని నామగానమును చేసియు కృతకృత్యులు కావచ్చును.

'సతతం కీర్తయంతోమాం'

నిరంతరనామస్మరణమున ప్రాయశ్చిత్తములకు సాధ్యముకాని మహాపాతకములుకూడ నశింపగలవు.

భారతీయవిజ్ఞానమున తరించుట కవకాశములేనివారు లేనేలేరు. భగవంతున కర్పించుటకు ఒక్కపత్రము చాలును. పుష్పము చాలును. ఒక్కపండు చాలును. చివరకు భక్తిరసముతో కలసిన మంచినీరైనను నాకు చాలునని భగవానులే సెలవిచ్చినారు. తులసిదళముతో మోక్షమును సంపాదింపవచ్చును.

'పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యాప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృతం అశ్నామి ప్రయతాత్మనః'

భగవానులు భక్తులందించు స్వల్పపదార్థమునైనను ప్రయత్నపూర్వకముగ పరిగ్రహించుట భక్తిలోని విశేషము. భక్తియోగసాధనము

నేను నీ వాడనే అనుభావమున నడచును. అనగా కర్మయోగమున భగవంతునిమాటలు వినబడగా భక్తియోగమున ఆతనికెదురై నేను నీవాడనని శరణాగతినొందును. ఇదియే భక్తియోగము యొక్క ప్రాశస్త్యకము. గీతలోని విభూతియోగమును, విశ్వరూపమునుగూడ ఈ భక్తియోగమునకు సంబంధించినవే. ఈ జగత్తునందు కనబడు పదార్థములలో ముఖ్యమగు సత్వగుణపదార్థములందు భగవంతుని చూచుట విభూతియోగము. ఈ కనంబడు చేతనాచేతన ప్రపంచమంతయు, భగవంతునకంటె వేరుగాదని చూడగలుగుట విశ్వరూపమును చూచుట. ఇక జ్ఞానయోగమున కేగుదము.

## జ్ఞానయోగము

గీతాశాస్త్రమున జ్ఞానయోగము మూడవసోపానము. గీతాశాస్త్ర మీ జ్ఞానయోగమున కొక మహోన్నత స్థానము నిచ్చినది. ఈ జ్ఞానయోగము నకు 'రాజవిద్యయనియు, రాజగుహ్యమనియు, చక్కని నామములను నిర్వచించినది. అంతేకాదు. దీనికంటె పరమపవిత్రమగు యోగము మరియొకటి లేదన్నది.

'న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే'

కాని, ఈ జ్ఞానయోగసాధకునకు మొదటి సోపానమేమి? ఈ జననమరణ ప్రవాహరూపమగు సంసారమునందలి దోషమేమియో ఈతడు గుర్తెరుగవలెను. ఇంద్రియార్థములగు విషయసుఖములయం దనిత్యత్వబుద్ధి కలుగవలెను. దారాపుత్రాదులయందనురాగము తొలగి, నిత్యమగు సుఖమెట్లు నాకు లభించును? అని ఆర్తుడు కావలెను. ఈ విషయములను గీతాశాస్త్రము పదమూడవ అధ్యాయమున వివరించినది.

'ఇంద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ
జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషానుదర్శనం
అసక్తిరనభిష్వంగః పుత్ర దార గృహాదిషు.'

సంసారసుఖ మనిత్యమని తెలియగా నిత్యసుఖమేదియో తెలియవలెను. దీనిని తెలుసుకొనుటకు గురువుల కడకేగుట రెండవసోపానము. అద్వైతాచార్యులగు శంకరులుకూడ ఈ వరుసనే మన కందించినారు.

'భవసుఖే దోషోనుసంధీయతాం'

'ఆత్మేచ్ఛా వ్యవసీయతాం'

జ్ఞానయోగమున గురువు ముఖ్యస్థానము నలంకరించును.

కావున గురుకడ కేగుట చాల అవసరము. కాని గురువులగువారెట్లుండవలెను ? వారికడకేగి సాధకు డేమిచేయవలెను ? అను విషయము తెలియుట సాధకునకు చాల అవసరము. ఆ విషయమును గీతాశాస్త్రమిట్లు చెప్పినది.

'తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః'

గురువులగువారు శాస్త్రమును తెలిసిన పండితులును, అనుభవము కలిగిన మహనీయులునుకూడ అయియుండవలెనట. కేవలం అనుభవజ్ఞులే యగుటకాక శాస్త్రజ్ఞానము చాలఅవసరము. శాస్త్రములేక బ్రహ్మతత్త్వము తెలియబడదని వ్యాసులు శాస్త్రయోనిత్వాధికరణమున చెప్పినారు.

'శాస్త్రయోనిత్వాత్'

శాస్త్రమే పరబ్రహ్మనుగురించి మనకు బోధించగలదనినారు.

కేవలమగు శాస్త్రజ్ఞానము పరోక్షజ్ఞానమే యగును కావున అనుభవజ్ఞానము అవసరము. కావున 'జ్ఞానిన స్తత్త్వదర్శినః' అని గురువుల అధికారమును గీత వివరించినది. గురువులవద్దకు వెళ్ళినవాని కర్తవ్యములను ఇట్లు చెప్పినది. ప్రణిపాతము, పరిప్రశ్న, సేవ - అనునవి చాల ముఖ్యములన్నది. తత్త్వమును ఉపదేశించు ఉపదేష్టలవద్దకేగి 'ప్రణిపాతము' చేయవలెను. ప్రణిపాతమనగా వందనము. ఈ వందనము

వీని వినయమును సూచించును. తరువాతది 'పరిప్రశ్న' పరిప్రశ్న యనగా తనకు కలిగిన సందేహములను వారికి విన్నవించుకొని, తగు సమాధానములను వారివ్వగా ఆ సమాధానములచే తనకు తృప్తి కలుగు వరకును వినయపూర్వకముగా ఆ విషయములను అడిగి తెలుసుకొనుటకు పరిప్రశ్న అనిపేరు. ఈ సమాధానములకై ఆ గురువులను సేవించవలెను. వారి అనుగ్రహమునకై నిరీక్షించుటకు సేవయని గీత వాడినది. అట్టి సేవచేత గురువర్యుల హృదయమును ద్రవింపజేసిన శిష్యునకీ జ్ఞానయోగామృత భాండము కరతలామలకము కాగలదు.

## జ్ఞానమననేమి ?

మోక్షపురుషార్థమును నిర్ణయించుటలో ద్వైతాద్వైతములు రెండును చీలి ప్రాక్పశ్చిమములైనవి. ద్వైతవాదమున జీవుడెప్పుడును భగవంతుడు కాడు. అద్వైతమున జీవుడను వాడొకడు ప్రత్యేకముగలేడు. పరబ్రహ్మవస్తువే అజ్ఞానావరణమున జీవుడగును. ఆ పరబ్రహ్మవస్తువును అజ్ఞానము సూర్యునిపై మేఘము ఆవరించినట్లావరించగా జ్ఞానభాస్కరుడా మబ్బును తొలగించుకొని తన ప్రకాశమును లోకమునకందించినట్లే ఆత్మజ్ఞానమున జీవుడు అజ్ఞానావరణను తొలగించుకొని తన నిజరూపమును గుర్తెరుగుటతో ముక్తుడగును. ఇది పూజ్యపాదులగు శంకరుల సమన్వయము. తానెవ్వరో తెలుసుకొనుటతో మానవుని కర్తవ్యము సమాప్తము.

గీతాశాస్త్రమున తత్త్వజ్ఞానమును ప్రతిపాదించినది మూడవ షట్కము. అనగా పదమూడునుండి జ్ఞానమునుపదేశించినారు. పదమూడవ అధ్యాయమున క్షేత్రమన శరీరమనియు, ఆ శరీరమును తెలుసుకొను ఆ శరీరికే క్షేత్రజ్ఞుడనియు పేర్లనుపెట్టి, ఆ క్షేత్రజ్ఞుడెవ్వరోకాదు నేనే అని భగవానులు బల్లగ్రుద్ది చెప్పినారు. అన్ని క్షేత్రములందును ప్రకాశించు

ప్రకాశమొక్కటేనని అద్వైతామృతమును బోధించినారు. కర్మయోగ భక్తియోగములయందు జ్ఞానమువేరై, జ్ఞేయమువేరై యుండగా జ్ఞానయోగమున జ్ఞానమును జ్ఞేయమునను భేదములేదు. జ్ఞానయోగమున బ్రహ్మమే రజ్జువునందలి సర్పమువలె వివర్తరూపముకలదై సమస్తలోకములను ప్రకాశింపజేయు సూర్యునివంటిదై ఆత్మరూపమున వెలుగొందునని భగవద్గీత గానము చేసినది. ఆత్మ పరిమితమై కర్మయోగమునందుండగా భక్తియోగమున ఆత్మ సర్వవ్యాపకమై నిర్దోషమై స్ఫటికమణివలె భాసించును. అట్టి ఆత్మస్వరూపమును గుర్తెరిగిన జ్ఞానికిలోకమంతయు తనకంటె వేరుకాదని గీతచెప్పును. అజ్ఞానిని స్థితప్రజ్ఞుడని పిలుచును. త్రిగుణాతీతుడనికూడా పిలుచును. జ్ఞానియను వాడొకడు వేరుగలేడట. తానే జ్ఞానియనుపేర నుండునట. 'జ్ఞానీత్వాత్మైవ మే మతం' అనినారు భగవానులు. గీతాశాస్త్రసార మేమన ? 'ఆత్మైవేదం సర్వం' 'సర్వం ఖల్విదం బ్రహ్మ' 'అయమాత్మా బ్రహ్మ' అను ఉపనిషద్వాక్యములే నని పూజ్యపాదులు వ్యాఖ్యానించినారు. ఈ యోగమున నేనే నీవని సాధకుడు భావించును భగవానుని. కావుననే అర్జునుని మనసున యుద్ధము చేయుట పాపమను భావముపోయినది. నాకు మోహము నష్టమైనది స్మృతికలిగినది ఇక యుద్ధము చేతుననినాడు. ఇదియే గీతాసారము.

'నష్టో మోహః స్మృతిర్లబ్ధా'

ఇక్కడ స్మృతియన తన స్వరూపమును తాను గుర్తెరిగి తాను తానై యుండుట. తరువాతది యుద్ధారంభమే. అర్జునుడు ధనుర్ధారియై నిలిచినాడు. అతనినిచూడగా కౌరవసైన్యమును యుద్ధారంభమున కుద్యుక్తమైనది. ఆకసమున దేవతలందరును చూడముచ్చటగు ఆ యుద్ధదృశ్యమును చూడవచ్చినారు. దేవేంద్రుని దివ్యస్యందనమును ఆకసమున నిలిచినది. భేరీభాంకారములును యుద్ధప్రారంభమును సూచించినవి. ఇక

ఒకరిపై నొకరు బాణముల ప్రయోగించుకొనుటే మిగిలినది. ఈ ఘట్టమునందొక చిత్రమగు సన్నివేశము జరిగినది.

ధర్మజుడు కవచమును విప్పికొనినాడు. బాణములను వదలినాడు. పాదచారియై దోసిలియొగ్గి, మౌనముద్రతో కౌరవసైన్యమున ప్రవేశించినాడు. ఆతడక్కడెందుకు పోవుచుండెనో ఎవ్వరెరుగుదురు ? అర్జునుడు రథమును దిగ్గి ఆతనిని వెంటనంటెను. శ్రీకృష్ణుడును ధర్మజుని వెనుక వెళ్ళెను. అర్జునుడు ధర్మనందనుని నీవేల శత్రుమధ్యమున కేగుచుంటివని అడిగినాడు. ధర్మజుడు మౌనమును వీడి ఆతనికి సమాధానమివ్వలేదు. భీముడును నకులసహదేవులునుగూడ ధర్మజుని అనుసరించి ప్రశ్నించిరిగాని ఆత డెవ్వరకిని సమాధాన మివ్వలేదు.

ఆ సమయమున శ్రీకృష్ణుని ముఖమండలమున చిరునవ్వు మొలకెత్తినది. ధర్మజుని హృదయమా హృషీకేశున కర్థమైనది.

గురువర్యులను యుద్ధమునం దెదుర్కొనవలసివచ్చినప్పుడు వారి యనుమతిని కోరిగాని యుద్ధారంభమును చేయరాదనునది సనాతన సిద్ధాంతము. ఆతడందుకొరకే వెళ్లుచుండెనని శ్రీకృష్ణులు చెప్పినారు.

ధర్మజుడు కవచమును విప్పి, ధనుర్ధారికాక, తమ్ములును శ్రీకృష్ణుడును వెంటనంటగా శత్రుసైన్యమున ప్రవేశించు ఆ వింతదృశ్యమును చూచిన కౌరవసైన్యమంతయు ఏమనుకొనవలెను ?

ధర్మజుడు పిరికిపందయయ్యే శరణాగతుడగుటకు శత్రుసైన్యమున ప్రవేశించుచుండెననియే చాలామంది యూహించినారు. ధర్మజుని క్షాత్రతేజము అస్తమించినదని వెక్కిరించుచు అవహాస్యము చేసినవారే పెక్కుమంది యుండిరిగాని, ఆతని గంభీరహృదయమును గుర్తెరిగిన వారా సైన్యమున కానరాలేదు.

ధర్మజుడు సరాసరి భీష్మునియొద్దకేగి పితామహుని పాదములపై వ్రాలినారు. తన గోత్రనామములతో వందన మాచరించిన ధర్మజుడు

భీష్మునితో తమ అనుజ్ఞయగుచో యుద్ధమున కియ్యకొందునని భీష్ముని అనుజ్ఞనుకోరి, యుద్ధవిజయమున కాశీస్సుల నర్థించినాడు.

భీష్ముని హృదయముప్పొంగినది. యుధిష్ఠిరుని వినయవిధేయతా ధర్మ గౌరవములు పితామహుని ఆకర్షించినవి. అతడా సమయమున తన సత్యహృదయమును విప్పిచెప్పినాడు.

ఏమని ? నీ విప్పుడు నా దగ్గరకు రానిచో నీవీ యుద్ధమున పరాభవము నొందునట్లు శపించెడివాడనని.

భీష్మునికింత ఆత్మాభిమానమా ? ఇది ఆత్మాభిమానము కాదు. ధర్మభంగము కలిగించువారికి కలుగు ఫలమిది యని నిరూపించి, రాబోవు కాలమునగూడ ఇట్లే ధర్మసూక్ష్మముల గుర్తెరిగి యుండుమని మనుమనికి బోధించినాడు.

మహనీయులగు వారియెడ చూపదగిన వినయవిధేయతల చూపుచో ఆ ఫలము వ్యర్థముకాదు. భీష్ముడు ధర్మజుని రాకకు సంతసించి వేరొక వరమునేమైన కోరుకొమ్మని ధర్మజునకు తన సంతోషమును వెలిబుచ్చినాడు. కాని భీష్మునకొక బాధ యున్నది. అతడు దుర్యోధనుని పక్షముననే యుద్ధము చేయవలెను. పాండవుల పక్షమున కాతడు రాకూడదు. కావున ధర్మజుని నీకేవరము కావలసిన ఆ వరమునే కోరుకొమ్మని సర్వసమర్థుడై పలుకలేక నన్ను నీ పక్షమున కాహ్వానించుటకాక ఇక ఏ వరమునైనను కోరుకొమ్మని హృదయవేదనతో చెప్పినాడు. ధర్మపక్షమును వదలి అధర్మపక్షము నాశ్రయించి ధర్మమున కెదురై యుద్ధము చేయవలసివచ్చుట కాతడెంతయు బాధపడినాడు. తన బాధను చెప్పుటలో 'క్లీబుడనై' ఇట్లు పలుకుచుంటినని చెప్పి, తానట్లు పడియుండుటకు కారణమును ప్రతిపాదించినాడు. ఇప్పుడు భీష్ముడు చెప్పు కారణము సార్వకాలీనము. ఇది సృష్టితత్త్వము.

'అర్థస్య పురుషోదాసో దాసస్త్వర్థో న కస్యచిత్'

ప్రతివాడును ధనమునకు దాసుడగునట. ధనముమాత్ర మెవ్వరికిని దాసత్వము నొందదట. ఈమాట నాటికిని నేటికినికూడ సత్యము కదా!

ధర్మజు డిప్పుడు భీష్మని కోరవలసినది యుద్ధమునకు తనవైపుకు రమ్మని ఆహ్వానించుటకాదు. అంతకంటె నూరురెట్లు గొప్పదగు కోరిక యున్నది. దానికి తగిన తరుణము వచ్చినది. ధర్మజుని గంభీర హృదయమున దాగియున్న భయమున కీనాడు విముక్తికాల మాసన్నమైనది. ధర్మజుని భయ మేమి? స్వచ్ఛందమరణము కలిగిన ఈ లోకైక వీరశిఖామణిని యుద్ధరంగమున గెలుచు టెట్లని. అది త్రికాల సత్యము. భీష్మని యుద్ధరంగమున మూర్ఛిల చేయువా డీలోకమునలేడు. పరశురామునే ఓడించిన దిట్టగదా! కావున ధర్మజు డీఘట్టమున భీష్మనితో ఒక గంభీరమగు పలుకును పలికినాడు.

'మంత్రయస్వ మహాబాహో హితైషీ మమ నిత్యశః
యుధ్యస్వ కౌరవస్యార్థే మమైష సతతం వరః'

ఓ! వీరశిఖామణీ! కౌరవపక్షముననే యుద్ధమును కొనసాగింపుము. కాని, ఏ క్షణమునందును నాకు కావలసిన హితమును మాత్ర మాలోచింపుమనినాడు. ఇదియే నా వరమనినాడు. ఇది ఏమిమాట? ఇది ఎట్లు కుదురును? ఈమాటలోని అంతరార్థమేమి? భీష్ముడు ధర్మజుని వ్యంగ్యహృదయమును బహిర్గతము చేయదలచినాడు. నేనీ కౌరవపక్షమున యుద్ధము చేయుచు నీకెట్లు హితమాచరింతును? అని ప్రశ్నించినాడు. ధర్మజునకు తన హృదయమును విప్పిచెప్పక తప్పలేదు. అతడు యమనందనుడు. అతని కేమిభయము? రెండుచేతుల జోడించి, భీష్మనకు నమస్కరించి నిన్ను వధించు ఉపాయ మేమియో చెప్పుమని భీష్మనే అడిగినాడు.

వధోపాయం బ్రవీహి త్వమాత్మనస్సమరేపరైః.

భీష్ము డాతని కిచ్చిన సమాధాన మేమియో తెలియునా ? నా కింకను మరణకాల మాసన్నము కాలేదు కావున నీవు నన్ను మరియొక మారు కలియుచో నా మరణ రహస్యమును చెప్పుదు ననినాడు.

ఇచ్చటనుండి ద్రోణాచార్యునివద్ద కేగి ఆతని అనుజ్ఞను కోరగా ఆతడును సంతసించి భీష్మునివలెనే వరమును కోరుకొమ్మనెను. ధర్మజుడు గురువర్యులనుగూడ మరణరహస్యమునే కోరెను. ఆతడు మాత్రము తన మరణరహస్యమును అప్పుడే చెప్పినాడు. కృపాచార్యునకు చావులేదు. ఆయనను అనుజ్ఞయే కోరినాడు. ఆతడు జయము కలుగునని ఆశీర్వదించెను. తరువాత శల్యునివద్ద కేగి, ఆతని అనుజ్ఞను తీసికొని తనకు పూర్వముననే శల్యు డిచ్చిన మాటను ఆతనికి జ్ఞాపకమునకు తెచ్చినాడు. కృపాచార్యునివద్దగాని, శల్యునివద్దగాని వేరొక వరములు ప్రత్యేకములై లేవు. అంతతో ధర్మజుడు తన స్థానమును చేరికొనినాడు.

మరియొక చిత్రమగు సంఘటనము.

శ్రీకృష్ణు డాసమయముననే కర్ణునియొద్ద కేగినాడు. కర్ణునితో ఆతనికి జరిగిన సంభాషణ యిది —

కృష్ణ - కర్ణా ! నీవు భీష్ముని యుద్ధము పూర్తియగువరకును దుర్యోధనుని పక్షమున నీవు రణరంగమున నిలువవని వింటిని నిజమేనా ?

కర్ణు - అవును.

కృష్ణ - అటులైన భీష్ముడు చచ్చువరకును మావైపున యుద్ధముచేసి మరల దుర్యోధనునికి సాయ మొనర్చవచ్చునుగదా ?

కర్ణు - కేశవా ! నా కంఠమున ప్రాణమున్నంతవరకును దుర్యోధనునకు అప్రియమాచరించుట జరుగదు.

అంతతో శ్రీకృష్ణులు మరలినారు. ఇక పాండవాగ్రజుడును సేనామధ్యమున నిలిచి, ఎవ్వరైన నాకు సాయము చేయవచ్చుచో వారిని

నేను స్వీకరింతుసని ఎలుగెత్తి ముక్తకంఠమున పిలిచినాడు.

యుయుత్సుడు ధృతరాష్ట్రునికి వైశ్యస్త్రీయందు జన్మించినవాడు. ఆతడు పాండవులవైపుకు మరలుట జరిగినది.

భయంకర సింహగర్జనలతో భీష్ముని సేనానాయకత్వమున కౌరవ సైన్యము ముందుకు నడవగా నీ పుత్రులగు దుర్యోధన దుశ్శాసన ప్రభృతులును, పాండవబలమున దృష్టద్యుమ్నాది వీరవరులతో భీమార్జునులును యుద్ధమునకు తలపడినారు. సంకులసమరము సాగినది. ద్వంద్వయుద్ధములును నడచినవి. నాటి ఆహవరంగమున పాండవ బలములోవి ప్రముఖ వీరవరు లిద్దర స్తమించినారు. వా రిద్దరును విరాటుని పుత్రులు. శంఖుడు, శ్వేతుడు ననువారు. శంఖుడు శల్యుని చేతిలో తన ప్రాణముల కోల్పోవగా అతని జ్యేష్ఠసోదరుడు శ్వేతు డనువాడు భీష్ముని చేతిలోనే అస్తమించుట జరిగినది.

నేటి యుద్ధమున విశేషమేనగా శ్వేతుని మరణకాలమును దేవదూత భీష్మునకు తెలిపినాడు. దీనినిబట్టి కొందరి మరణరహస్యములు దేవతల కెరుకలై యున్నవని తెలియుచున్నది. ఇది భీష్ముని మొదటిరోజు యుద్ధము. నాటికి సూర్యు డస్తమించగా ఆనాటి యుద్ధము ముగిసినది. ఉభయసైన్యములందును తమ తమ సైనికులతో సేనానాయకులు యుద్ధ గుడారముల ప్రవేశించినారు.

ఆది రాత్రికాలము. మొదటిరోజు యుద్ధమున భీష్ముడు ధరించిన మృత్యురూపము ధర్మజుని గజగజలాడించినది. ఆత డీయుద్ధమును విరమింప నిశ్చయించినాడు. తా నీ యుద్ధమును కొనసాగించుట కియ్యకొనుటయే పొరపాటైనదని గతమును తలచి చింతించినాడు. నేటి కర్తవ్య మాతనికి నిశ్చయమైనది. తానిక వనమున ప్రవేశించుటయే మంచిదనిపించినది. ఎందరు వీరభటులను భీష్మునకు బలియిత్తును? నా సోదరుల శరీరములు భీష్ముని శరపరంపరల నొచ్చగా నాకీ యుద్ధము

వలన కలుగు సుఖమేమి? ఇట్లెన్నియో భావపరంపర లాతని ఆవరించగా శ్రీకృష్ణమందిరమున కేగినాడు. శ్రీకృష్ణుడే ఆతనికి దిక్కు. భగవానునకు తెలియజేయక ఆత దేనిశ్చయమునైనను నిశ్చయించడు. కావున తన భావమును శ్రీకృష్ణున కెరింగించినాడు.

భగవానుని యూహాప్రపంచమున ధర్మజుని వనప్రవేశము లేదు. అతనిని సింహాసనారూఢుని గావించి పట్టముకట్టుటే యున్నది. ధర్మజుని పిరికితనము నాతడు నిలవనిచ్చునా? శ్రీకృష్ణులు ధర్మజునకు ధైర్యమును పురిగొలిపినారు. భీష్ముని సంహారమునకు శిఖండి నిర్ణీతుడై యుండగా నీకేల భయమని – నాకీ యుద్ధమునందపజయము కలుగునేమో నను పిరికితనమును, యుద్ధమున చచ్చు సైనికులచూచి సహించలేని ఆతని దయనుగూడ ధర్మజునివద్దనుండి పారద్రోలినారు.

ధర్మజుడు రెండవరోజు యుద్ధమునకు తలయూపి, సేనానాయకుల ప్రోత్సహించగా, నాటిరాత్రియే పాండవపక్షమున క్రౌంచారుణ వ్యూహమున సైన్యము నిలుపబడినది.

నాడు పాండవులు రచించిన వ్యూహము ఒకానొకప్పుడు దేవాసుర యుద్ధమున బృహస్పతి ఇంద్రునకుపదేశించిన వ్యూహము. అది సర్వ శత్రునిబర్హణము.

నేటి క్షత్రమండలమా వ్యూహము నెరుగదు. అయ్యును ఆ వ్యూహమునకు ప్రతియైనిలుచునట్టి మహావ్యూహ మొకటి కౌరవపక్షమున భీష్మునిచే నిర్మింపబడినది. పాండవపక్షమున క్రౌంచారుణవ్యూహమునకు శిరోభాగమున ద్రుపదుడు నిలవగా కౌరవుల మహావ్యూహమందగ్ర నాయకుడై నిలచిన భీష్ముని ద్రోణాచార్య కృపాచార్యులును, దశార్ణ కుంతల, మాగధ విదర్భదేశములును వెంటనంటి, నాడు పాండవుల కెదురై నిలిచినారు.

కాలచక్రమున కిరుసువలెనున్న సూర్యభగవాను లుదయాద్రి

నధిరోహించినారు. పాండవబలమున పాంచజన్య దేవదత్తములు పూరింప బడినవి. కౌరవసైన్యమునందును శంఖపూరణములుకాగా రెండు పక్షము లందును యుద్ధభేరులు మ్రోగినవి. పదాతులతో పదాతులు ఢీకొనగా రథికులు రథికులపైకి యుద్ధమునకేగి, తమతమ వీరాలాపముల సింహ గర్జనల గావించుచు ప్రతివీరుల యుద్ధమున కాహ్వానించుచుండిరి. ద్వంద్వయుద్ధముల కొందరును, సంకులసమరమున కొందరును పాల్గొనగా గగనమండలమున చరించు సూర్యుని కిరణసహస్రములు నాడు భాసించుటలేదు. నాటి యుద్ధమున కౌరవసైన్యమునం దేడువందలమంది వీరశిఖామణులను భీముడు మొదటిముద్దగావించుకొనగా అతనికే రెండవ కబళము రెండువేలమంది కాళింగులు బలియగుట చూపరుల కాశ్చర్య మును గొలిపినది. రెండవరోజు యుద్ధమున కళింగరాజును, అతని పుత్రు డగు కేతుమంతుడును శక్రదేవుడుగూడ భీమునిచేతిలోనే మడసినారు. నేటి మహావ్యూహమునకు కళింగుల బలము ప్రధానముకాగా భీము డొక్కడే ఆ సైన్యమునంతను కూల్చుటకు సాత్యకి ఆశ్చర్యమునొంది, తన రథమునుండి భీముని రథముమీదికి దుమికి ఆతనిని కౌగలించు కొనినాడు.

అప్పటికి మొదటిజాము గడచినది. అంతలో కృష్ణార్జునుల రథము గూడ కౌరవసైన్యముపైపుకు తిరిగినది. ఇక అర్జుని గాండీవమున కెదురెక్కడ ? అర్జునుని అక్షయతూణీరములనుండి పుంఖానుపుంఖములై వచ్చు బాణసహస్రములు కౌరవసైన్యముల చించి చెండాడగా సైన్యము పలాయనమును చిత్తగించుచుండగా దేవవ్రతుడు కృష్ణార్జునుల వీరరస విజృంభణమున కాశ్చర్యచకితుడై ద్రోణాచార్యులకు అర్జునుని పరాక్రమ మును చూపుచు తన ఆనందమును వెలిబుచ్చినాడు. రెండవరోజు యుద్ధమున భీష్ముడు తన సైన్యమును రక్షింపలేని స్థితికిరాగా అంతలో సూర్యభగవానులానాడును అస్తమించినాడు. యుద్ధమానాటికి ముగిసినది.

మన యుపన్యాసమును ఈనాటికి ముగింతము.

# మూడవ రోజు

మహాశయులారా !

మనమీనాడు మహాభారతామ్నాయ కథాప్రపంచమునం దెక్కడ యుంటిమి ? యుద్ధరంగమునందుంటిమి. పదునెనిమిదిరోజుల యుద్ధరంగములో రెండురోజులు గడచినవి. నేడు మూడవరోజు. భీష్ముని యపార బలపరాక్రమములెట్లు పాండవబలముల నుగ్రరూతలూగించెనో క్రిందటి రోజులచరిత్ర మీకు చెప్పినది. మొదటిరోజు యుద్ధమునకే ధర్మజుడు వనములకు పయనముకాగా భగవానులు నివారించినారు. నిన్నటిరోజున పాండవులొకవిధముగ జయచిహ్నముల చూచినను అది పరిపూర్ణమగు జయముకాదు. ఆరోజులట్లు గడవగా నేడు భీష్ముని ప్రభావము భగవంతుని పైకి ప్రసరింప నుద్యుక్తమైనది. అతడీనాడు ఉగ్రమూర్తియై యుద్ధమును చేయదలచినాడు. కౌరవులకు జయలక్ష్మిని చేతికందింప దలచినాడు. తన యశశ్చంద్రికల దిగంతముల వ్యాపింపజేయుటకై అత డీనాడొక యద్భుత సంకల్పమును సంకల్పించినాడు. ఈనాడు భీష్ముని ప్రభావ మత్యద్భుతము. భీష్ముడీనాటి యుద్ధమున భక్తశేఖరుడగు వీరశిఖామణి యెట్లుండునో ఆదర్శమూర్తియై మీ కన్నులయెదుట నిలుచును. పరిపూర్ణ వీరరసమున శృంగారరసము మిశ్రమముకాగా భగవానుని దివ్యమంగళ విగ్రహ మెట్లుండునో నేటి రణరంగము మీకు ప్రత్యక్షము కావింప గలదు. నేటి రణరంగములోని విశేషములను మీరు వినుట కాదు. చూచుట చాల అవసరము.

సూర్యోదయమైనది. రెండుపక్షములందలి వ్యూహములను తీర్చి దిద్దబడినవి. కౌరవుల పక్షమున భీష్ముడు గరుడవ్యూహమున సైన్యమును నిలిపినాడు. పాండవపక్షమున అర్ధచంద్రమండల వ్యూహ మమర్చబడినది. గరుడవ్యూహమున తుండమునందు భీష్ముడే నిలిచినాడు. నేత్ర స్థానముల ద్రోణాచార్య కృతవర్మల నిలిపినాడు. శిరోభాగమున కృపాచార్య అశ్వత్థామలనుంచి మెడయందు త్రిగర్త, కేకయ, శల, శల్య

భూరిశ్రవ, భగదత్త, సైంధవులను నిలిపినారు. దుర్యోధనుని ఆతని సోదరులను ఆ వ్యూహమునకు వెనుకభాగమునయుంచి, విందానువింద, కాంభోజ శకసైన్యములు ఆ వ్యూహమునకు తోకయై యుండునట్లుంచబడినది. ఆ వ్యూహమున కొకప్రక్క రెక్కగా మగధ కళింగులనుంచి, రెండవప్రక్క బృహద్బలుని ఆధారముతో కారూష వికుంజ ముండ కుండి వృషసైన్యమునంతను నిలిపి ఎంతటి వీరయోధులకైనను చూడ భయంకరమై యుండునట్లు గరుడవ్యూహమును పరిపూర్ణముగా వించినాడు.

కౌరవుల వ్యూహమట్లు భయంకరమై కన్పట్టగా దృష్టద్యుమ్నుని సాయమున అర్జునుడును అర్ధచంద్రవ్యూహము నట్లే కూర్చినాడు. కాని గరుడవ్యూహమును నిర్మించిన భీష్ముని హృదయ మేమియై యుండవచ్చును ?

గరుడుడు దేవేంద్రుని జయించిన పక్షిరాజు. కశ్యప సంతతియందగ్రగణ్యుడు. సర్వవ్యాపకుడగు విష్ణువునకీ పక్షిరాజు వాహనము. ఒకవిధముగ గరుడుడు వేదరాశి 'ఛందోమయేన గరుడేన' అని భాగవత ప్రయోగము. గజేంద్రుని రక్షింపనేగు శ్రీమహావిష్ణువు ఛందోమయుడగు గరుడుని అధిరోహించెనట.

నేడు భగవానునిచేత చక్రము పట్టింపదగు వ్యూహ మిదియే కావచ్చును భీష్ముడు వేదరూపముగల వ్యూహమున నిలచి భగవంతు నెదుర్కొనెననుటకు సందేహ మేమున్నది ? ఇది నా యూహాప్రపంచము. భీష్ముడీనాడు వేదరాశియందే నిలిచెను.

పాండవుల అర్ధచంద్ర వ్యూహమును సామాన్యమైలేదు.

దక్షిణశృంగమున భీమసేను డగ్రనాయకుడై నిలిచినాడు. మధ్యభాగమున విరాట ద్రుపదులును ధృష్టద్యుమ్న శిఖండులును రక్షకులై యుండిరి. గజబలముతో యుధిష్ఠిరుడును మధ్యభాగమునకే రక్షకుడై యుండెను. ఇక వామశృంగ మెట్లుండెనో తెలియునా ?

వామశృంగమున ఘటోత్కచుడును, సాత్యకియు, ఉప పాండవులును, అభిమన్యుడును, ఇరావంతుడునుకూడ నిలిచినారు. ఈ బల మిట్లుండగా జగద్రక్షకుడగు శ్రీకృష్ణుడు రక్షకుడై యుండ పాండవబల మంతయు అర్ధచంద్రాకారమున నిలిచినది. ఇక యుద్ధము కొనసాగవలెను.

యుద్ధము ప్రారంభమైనది. సంకులయుద్ధ ద్వంద్వయుద్ధములు తీవ్రరూపముల దాల్చినవి. అర్జునుని పరాక్రమము విజృంభించినది. కౌరవసైన్యసాగర మల్లకల్లోలమై కొందరు పారిపోవ ప్రయత్నించు చుండగా, కొందరు దిగ్భ్రాంతులై నిలిచిరి. ఆ సందర్భమున దుర్యోధనుడు అర్జునుని పరాక్రమాటోపములను ఎదుర్కొనవలెనని ప్రయత్నించకపోలేదు. ప్రయత్నించెను. కాని అతడు నిలువలేక పోయెను. పరుగెత్తు సైన్యము నాతడు మరల ఒకచో కూర్చుచుండెను. అయ్యును సముద్రమువలె నుప్పొంగి విజృంభించిన అర్జునుని యుద్ధ వాతావరణము దుర్యోధనుని భీతిల్లజేసినది. ఇప్పుడు దుర్యోధనుని కర్తవ్యమేమి ?

అతడు భీష్మునియొద్ద కేగినాడు.

'నానురూపమహంమన్యే త్వయి జీవతి కౌరవ'

నీవు బ్రతికి యుండగా యుద్ధరంగ మిట్లుండుట తగదు. ద్రోణ కృపాశ్వత్థామలును, నీవునుగూడ పాండవులపై దయచూపుచుంటిరని పైన నిందారోపణ చేసినాడు. అంతేకాదు, నేను కర్ణుని సేనానాయకుని చేయకపోతినని చింతించినాడు. భీష్మునకు నవ్వు వచ్చినది. అసమర్థ దుర్జనుల సంభాషణ లిట్లే యుండును.

భీష్ముడు కండ్లురిమి చూచి దుర్యోధనా ! నేనును, ద్రోణాచార్య, కృపాచార్యులునుకూడ పాండవులను జయించుట సాధ్యముకానిపని యని ఇదివరకే నీకు చెప్పితిమని 'సమాధాన మిచ్చి నా యథాశక్తిగ యుద్ధము చేయుదును. అయ్యును నేటి నా విజృంభణను చూడుమని యుద్ధమునకు

పూనుకొనినాడు. దుర్యోధనున కొక నూతనచైతన్యము కలిగినది. భీష్ముడు విజృంభించుచో పాండవులను జయించుటొక లెక్కకాదని ఆతని నమ్మకము. ఇదియే దుర్యోధనుని మూర్ఖత్వము. పాండవులను జయించుట మాకు సాధ్యముకాదని చెప్పిన భీష్మాదులను తరిమి తరిమి పాండవులపై మీకు పక్షపాతమున్నదని వారిపై నిందారోపణచేయుట కంటె మూర్ఖత్వమేమున్నది ?

భీష్ముడు దుర్యోధనుని మాటపై ప్రతినగావించి యుద్ధమునకు పూనుకొనుటను సంజయునివలన విన్న ధృతరాష్ట్రుని ముఖమండలమునం దొకవిధమగు సంతోషచిహ్నము పొడసూపినది. తరువాతేమయ్యెనని సంతోషమున ప్రశ్నించినాడు. ధృతరాష్ట్రుడు దుర్యోధనుని తండ్రియే గదా ! అసంభవమగు ఫలమును ఆశించుటయే మూర్ఖత్వము.

కథలోనికి పోదము.

భీష్ముడట్లు ప్రతినగావించుట తడవుగా కౌరవసైన్యమున శంఖ ధ్వానములు చెలరేగినవి. పాండవసైన్యమునందును దానికి ప్రతిధ్వనులు ప్రతిధ్వనించినవి.

ఇప్పటికి మొదటిజాము గడచినది. సూర్యుడు పడమటిదిక్కునకు నడచినాడు.

భీష్ముని యుద్ధరంగమునందిదియొక నూతనాధ్యాయము. భీష్ముడుగ్రమూర్తియై పాండవబలముపైకు తిరిగినాడు. ఆతనితో దుర్యోధనుడును ఆతని తమ్ములును మిగిలినసైన్యమును వెంటనంటినది.

ఇప్పుడు భీష్ముడొక్కడై యుద్ధరంగమున యుద్ధము చేయుటగాదు. ఆతడు విశ్వరూపుడై కొన్నివేలమంది భీష్ములయ్యెను. పాండవ సైన్యమునందెక్కడ చూచినను భీష్ముడెదురై సాక్షాత్కరించుచుండెను. ప్రాక్పశ్చిమ దక్షిణోత్తరముల నలుదిక్కులయందును భీష్ముడు లేనిచోటు

లేదు. అతని బాణసహస్రములు లెక్కకు మిక్కిలిగాగా అతడు విశ్వ రూపుడై యుద్ధము చేయుటచే భీష్ముని యుద్ధాగ్నియందు పాండవసైన్యము మిడుతలై ఆహూతి యగుచున్నది. పాండవసైన్యమునం దెక్కడ చూచి నను ఆర్తవినాదములే వినవచ్చుచున్నవి. ఇప్పుడు వారి ఆర్తనినాదముల విని వారిని రక్షింపదగినవా డెవ్వడు ? అర్జునుడొక్కడే.

అంతలో కృష్ణార్జునుల దివ్యస్యందనము భీష్మున కెదురై నిలచినది. భీష్ముని పరాక్రమము రెట్టింపుగా పెరిగినది. ఒక్కక్షణకాలముననే కృష్ణార్జునులిద్దరును, వారధిష్ఠించిన రథమునుకూడ భీష్ముని బాణవర్షమున మునిగిపోయినవి. కాని సారథియగు శ్రీకృష్ణుడుమాత్రము భీష్ముని బాణవర్షము నకు భ్రాంతుడుకాలేదు అతని సారథ్య మతిధైర్యమున సాగుచున్నది రథికుడగు అర్జునుడును భీష్ముని ఎదిరించియే యుద్ధమును కొనసాగించు చుండెను.

భీష్ముడు లోకైకవీరుడగుటచే పార్థుని హస్తలాఘవ మాతనికి విస్మయమును కల్పించినది. 'ప్రీతోస్మి సుభృశంపుత్ర' అని తన సంతో షమును వెలిబుచ్చుచు యుద్ధమును కొనసాగించినారు. చూచువారలకు మాత్రము వారిద్దరి యుద్ధమును రెండాబోతులు పోరాడుకొన్నట్లున్నది. కాని అర్జునుని యుద్ధము మందగించినది. భీష్ముని శరవర్షము కృష్ణార్జు నుల ముంచగా వారి దివ్యదేహములు రెండును వినూత్నాలంకారముల యలంకృతములై కన్పట్టినవి.

అర్జునుని యుద్ధమాంద్యమును శ్రీకృష్ణుడు గ్రహించినాడు. అర్జునునికిగల బాహువీర్యమును స్మృతికి తెచ్చినగాని అర్జునుడు భీష్ము నెదుర్కొనజాలడని ఆత డీయుద్ధమును గురించి పూర్వము పలికిన పలుకుల నిప్పుడు జ్ఞప్తికి తెచ్చినాడు. అంతతో కొంత యుత్సాహము అర్జునుని వరించినది. అయ్యును భీష్ముని విజృంభణమునం దీతని యుత్సాహము నామమాత్రమైనది. పాండవ సైన్యమున పేరుగొన్న వీరు

లందరును భీష్ముని యుద్ధాగ్నియం దాహుతిగాక తప్పుటలేదు. ఇప్పుడు భీష్ముడు భీష్ముడై కనబడక మృత్యువువలె సైనికులకు సాక్షాత్కరించగా పాండవసైన్యము పలాయనము చిత్తగించక తప్పినదికాదు. అర్జునుని సంరక్షణము మనకిక దుర్లభమని సైనికులు నిశ్చయించుకొనినారు. అట్లు పారిపోవు సైనికుల నెవ్వరైన యుత్సాహపరచి యుద్ధమున కభిముఖుల గావింపవలెను.

సాత్యకి పారిపోవు యుద్ధభీరువులకు ధైర్యమును పురిగొల్పుచు రండు! రండని సైనికుల నాహ్వానింపసాగినాడు. అయ్యును వారు నిలుచుటలేదు.

ఒక్కమారు మనము అర్జునుని రథముపైపుకు మరలుదము.

కృష్ణార్జునుల దివ్యస్యందనమును భీష్ముడు నిలవనిచ్చుటలేదు. యువకుడగు అర్జునుని బాహువీర్య మావృద్ధవీరుని ముందు నిలువలేని ఘట్టము వచ్చినది. శ్రీకృష్ణుని సారధ్యములోని నేర్పరితనమును భీష్ముడు సాగనిచ్చుటలేదు. కృష్ణార్జునుల దివ్యదేహము లిప్పుడు భీష్ముని బాణ పరంపరలచే నిండినవి. కాని అవి వారి కళ్యాణవిగ్రహముల కలంకారములై యుండెనని చెప్పకతప్పదు.

ఈ ఘట్టమున నాకొక పద్యము జ్ఞాపకమునకు వచ్చినది. ఇది భర్తృహరిసుభాషితములలో యమూల్యమగు రత్నరాజము.

ఉ॥ శాణవిఘృష్టరత్నమును శస్త్రహతుండగుశూరుడున్ మద
క్షీణగజంబు సైకతవిశిష్టశరన్నదియున్ నవక్షపా
ప్రాణవిభుండు చండసురతాలసబాలికయున్ ధనైకవి
శ్రాణనశూరుడున్ కడు కృశత్వమునం ప్రభగాంతురిద్ధరన్.

లోకమున కొన్నివస్తువులు చిక్కినచో అలంకారముగలవై ప్రకాశించును. రత్నమును సానబట్టగా సూక్ష్మమై ప్రకాశించును. అట్లే యుద్ధరంగమున వీరుని శరీరమునందలి రక్తస్రావములును

వ్రణములును గూడ ఆ వీరున కలంకారములు కాగలవు. మదపుటేనుగ యొక్క మదము కారిపోగా బలసియున్న దాని శరీరము చిక్కియు అలంకారము నొందును. వర్షాకాలమున పొంగిపారలు నదీప్రవాహము శరదృతువున సన్ననై పారగా బయటపడిన ఇసకతిన్నెలతో ఆ నది చూడముచ్చటై యుండును. నెల బాలుడు పూర్ణచంద్రునివలె ప్రకాశించ కున్నను సూక్ష్మాతిసూక్ష్మమై యుండియు చూపరులకు పూజనీయుడు కాగలడు. ఎలప్రాయమునను న్న జవ్వని నాయకుని చండసురతమున వాడు సూపియు, ఆ యలసత నొందిన ఆ జవ్వని శరీర మా బాలకు అలంకారమగును. అట్లే తనకున్న ధనమునంతను పరులకు దాన మివ్వగా ధనహీనుడగు దాతయు దానాతిశయమున కృశించియు యశోవంతుడై విరాజిల్లును.

ప్రకృతమన కథాంశమున భీష్ముని శరపరంపరలచే వ్రణములై రక్తధారలు కారుచున్నను కృష్ణార్జునుల దివ్యదేహములును నూతనాలంకారములుగలవై యుద్ధరంగమున ప్రకాశించుచుండెనేగాని దీనతను బొందలేదు.

ఇప్పుడు పాండవుల రణరంగ మిట్లున్నది.

ఒకవంక అర్జునుడు భీష్ముని యుద్ధవేగమునం దొకవిధముగ నిలిచినను ఆతనిచే రక్షింపబడదగు సైన్యము రక్షింపబడకపోవుటచే ఆ సైన్యము యుద్ధరంగమునుండి పారిపోవ నారంభించినది. సాత్యకి వారి కొకవిధముగ ధైర్యమును పురిగొలిపి యుద్ధమున కాహ్వానించు చుండెనుగాని వారు ధైర్యమున మరలుటలేదు. భీష్ముని యుద్ధవేగ మంతకంతకు హెచ్చుటయేగాని తగ్గుటలేదు. యథార్థమునకు భీష్ము డిట్లే యుద్ధమును కొనసాగించుచో యుధిష్ఠురునకు జయమెక్కడిది? అర్జునుని యుద్ధమాంద్యమును, భీష్ముని యుద్ధవేగమును భగవానుని హృదయమును కదిలించినది. అతడు భక్తరక్షకుడు. భక్తపరాధీనుడు

కూడ. ఆతనికొక ప్రతిజ్ఞ యనునదిలేదు. భక్తులుచేయు ప్రతిజ్ఞల నెరవేర్పుచే ఆతని లక్ష్యము. ఇప్పుడు భగవానులు శ్రీకృష్ణుచేని చక్రము పట్టింతునన్న భీష్ముని ప్రతినను నెరవేర్పదలచినారు. యుధిష్ఠిరునకు ధర్మరాజ్యము నొసంగ నిశ్చయించినారు. తాను సారథియై యుందునేగాని చక్రము చేతబట్టి యుద్ధము చేయనన్న ప్రతిజ్ఞను తాను వదలుకొన దలచినారు. అర్జునుని రక్షించుటే తన కర్తవ్యము. తన జీవితమునకు అర్జునుడు ప్రాణము. అర్జునుదే తాను. తననుకూడ అర్జును డట్లే భావించును. కృష్ణుల మిద్దరము ఏకరథస్థులమై యుండగా దుర్యోధనునకు సామ్రాజ్యలక్ష్మి చేకూరుటయా? ఇక అర్జునుని యుద్ధ మక్కరలేకయే తా నొక్కడును ఈ కురువీరుల నందర నొక్కక్షణమున హతమార్చి ధర్మజునకు పట్టముగట్ట గట్టిగ సంకల్పించినారు. అంతలో తన భక్తుని శరీరమునందు నాటుకొన్న బాణపరంపరలను చూడగా ఆతని హృదయము కరిగినది. నీరైనది. తన భక్తులపై బాణపు దెబ్బల నాతడు చూడగలడా? అంబరీషునిపై శాపవర్షమును దూర్వాసులు కురిపించగా ఆ శాపముల నన్నిటిని తానే గ్రహించి మత్స్యాద్యవతారముల నెత్తిన దయామయుడు నేటి అర్జునుని శరీరఘాతములచూచి ఎట్లోర్చగలడు? భగవానుని కనుకొలకు లెర్రబారినవి. సాత్యకిని పిలిచి పారిపోవు సైనికుల నాహ్వానించవద్దని గర్జించి పలికినారు. ఉన్నవారినికూడ వెడలిపొమ్మని సాహసముగ చెప్పినారు. నే నొక్కడనే ఈ భీష్ముని సంహరించి అర్జునునకు విజయము చేకూర్తునని తన ధీరత్వమును వెల్లడించి చేతనున్న పగ్గములను వదలి, తన కెదురై వీరరసమునుపొంగించుచు అర్జునుని రథమును తన బాణవర్షమున మునకలువేయించు భీష్ముని సంహరించుటకై సుదర్శనచక్రము నాహ్వానించి, ఆ చక్రము తన్ను సేవించుటకురాగా, ఆ చక్రమును చేతబట్టి అర్జునుని రథముపైనుండి ఒక్కదూకు దూకినారు యుద్ధరంగమునకు.

అప్పుడు భగవానుని గమనవేగ మెట్లుండెనో తెలియునా ?

'సంకంపయన్ గాం చరణై ర్మహాత్మా'

సర్వవ్యాపకమగు ఆ కృష్ణతేజము రథమునుండి దూకినప్పుడు తన గమనవేగముచే భూమిని కంపింపజేసెనట.

అప్పుడు శ్రీకృష్ణున కెదురై యున్న భీష్ముడెట్లుండెను ? మదపుటే నుగువలె నుండగా భగవానుడు సింహమువలె ఆ మదపుటేనుగను చంపనుంకించినారు.

'మదాంధమాజౌ సముదీర్ణదర్పం
సింహో జఘాంసన్నివ వారణేంద్రం'

కాని ఈ ఘట్టమున శ్రీకృష్ణభగవానుని దివ్యమంగళ విగ్రహమును వ్యాసభారతి ఎట్లు వర్ణించినదో దాని ప్రత్యేకతను మీకు చెప్పెదను.

ఈ రథముపైనుండి దూకువాడు సాక్షాన్నారాయణుడని వ్యాసుడు తన వర్ణనాముఖముగ స్పష్టపరచినారు. భగవానుని చేతనున్న సుదర్శన చక్రమును సృష్ట్యాదియందలి ఆదిపద్మమని వర్ణించినారు. అదియు మధ్యాహ్నమార్తాండునివలె దివ్యతేజోవిరాజతమై భగవానుని బాహువు నాళముగా గలిగి, ఆతని నీల దేహమునందలి కాంతియే సరస్సుకాగా ఆ సరమునుండి పుట్టిన ఈ పద్మము శ్రీకృష్ణుని క్రోధమను సూర్యోదయముచే వికసించినదట. అనగా సృష్ట్యాదియందలి పద్మనాభుడే ఈనాటి శ్రీకృష్ణుడని వ్యాసభారతి చక్కగ వర్ణించినది. అంతేగాక చతుర్ముఖుడు జనించిననాటి కమలమే ఈ సుదర్శనచక్రమనియు, ఆ కమలము పుట్టుట కాధారభూతము గు ఉదకములు ఈ నారాయణుడేననియు వ్యాసులు స్పష్ట పరచినారు. అదికాక శ్రీకృష్ణుడు భీష్మునిమీదికి దుముకునప్పు డాతని భుజస్కంధముపైనుండి జారుచున్న పట్టుపీతాంబరము మెరుపు తీగవలె నుండగా అతడు మేఘమువలెనుండెననికూడ వర్ణించినారు. ఆ వర్ణనము కేవలమగు దృశ్యమేకాదు. అందొక అంతరార్థమున్నది. మేఘమెట్లు మెరుపుతీగతోకూడి వర్షమును వర్షించునో ఇచ్చట భగవానుడును

భీష్మునిపై తన అనుగ్రహవర్షమును కురియుచు తాపత్రయనివారకమగు తన మంగళవిగ్రహముయొక్క దర్శనము నందించినారని భావము. అంతేకాదు. సృష్టిస్థితి లయములు మూడును ఇందు వర్ణింపబడి వాటి కాధార మీతడేనని చూపినారు.

శ్లోకము లివ్వి —

'వ్యాలంబిపీతాంత పటశ్చకాశే
ఘనో యథా ఖే తటితావనద్ధః
సుదర్శనం చాస్య రరాజ శౌరేః
తచ్చక్రపద్మం సుభుజోరునాళం'
'యథాదిపద్మం తరుణార్కవర్ణం
రరాజ నారాయణనాభిజాతం
తత్కృష్ణకోపోదయసూర్యబుద్ధం
క్షురాంతతీక్ష్ణాగ్రసుజాతపత్రం
'తస్యైవ దేహోరుసరః ప్రరూఢం
రరాజ నారాయణబాహునాళం'

ఆ సుదర్శన చక్రమును ఆదిపద్మమనుటచే సృష్టియు, అర్జునుని యనుగ్రహించుటచే స్థితియు, భీష్ముని వధింపనుంకించుటచే లయమును, వర్ణింపబడినవి. అతడట్లు భీష్మునిపైకి వెడలునప్పుడు సమస్తభూతములును హాహాకారములు చేసినవి. ఆ భగవానుని విజృంభణము ఒక మహాప్రళయము వచ్చినట్లున్నది. కాని ఆ సమయమున భీష్మడెట్లుండెను ?

భీష్మ డాసమయమున యుద్ధవీరుడై లేడు. అతడు మహాభక్తుడై జ్ఞానియైయుండెను. భీష్ముడు శ్రీకృష్ణుని తనను చంపుటకై రమ్మని ఆహ్వానించెను.

భగవానుని సార్థక నామములతో పొగిడి కృతార్థునిచేయుమనెను. భీష్ముని ఆహ్వానమెట్లుండెనో వినుడు.

ఏహ్యేహి దేవేశ జగన్నివాస
నమోస్తు తే మాధవ చక్రపాణే
ప్రసహ్య మాం పాతయ లోకనాథ
రథోత్తమాత్ సర్వశరణ్యసంఖ్యే.
త్వయా హతస్యాపి మమాద్య కృష్ణ
శ్రేయః పరస్మిన్నిహ చైవ లోకే.
సంభావితోస్మ్యంధక వృష్ణినాథ
లోకై స్త్రిభిర్వీర తవాభియానాత్.

‘హే, మాధవ, హే చక్రపాణే! హే లోకనాథ! హే సర్వశరణ్య! హే దేవేశ, జగన్నివాస, రమ్మురమ్ము. నన్నీ లోకము నుండి ఉద్ధరింపుము. నీచేత చచ్చుట ఈ లోకమున కీర్తికాగా పరమున శ్రేయస్సును చేకూర్చునుగదా, మూడు లోకములలోని మహనీయులందరను నన్నాదరింపగా నీ చేత మరణమునొందెదనని భగవానుని ఆహ్వానించినాడు. ఇప్పుడీ యుద్ధవిశేషము నేమని వర్ణించవలెను? భౌతిక చరిత్రలలోని యుద్ధరంగమిట్లుండునా? భీష్ముడిప్పుడు అర్జునుని దివ్య స్యందనమను దేవాలయమునందలి పార్థసారథిని ధనుర్వేదమంత్రములచే అర్చించగా, వీరరసమును భక్తిరసమున కలిపి భగవానుని అభిషేకింపగా సాక్షాత్కరించిన నారాయణుని అనుగ్రహమునకు పాత్రుడయ్యెను. ఆతనిచేత చచ్చుట శ్రేయస్సని తలంచెను. యదార్థమునకు భీష్ముడు కౌరవ పక్షమందుండి యుద్ధముగావించిన దిందుకొరకేనేమో?

తరువాతి కథాఘట్టమిట్లు నడచినది.

అట్లు పరుగెత్తుకొనిపోవు శ్రీకృష్ణుని అర్జునుడు వెంటనంటి తన బాహుయుగ్మమున బంధించి తన గౌరవమును నిలుపుమని ప్రార్థించినాడు.

శ్రీకృష్ణుని వేగము ఆగలేదు. భగవానుని పరుగును అర్జునుడు పదియవ అడుగుననగాని ఆపలేకపోయెను. అక్కడనే ఆతని కాళ్ళపైబడి

నీ కోపము నుపసంహరింపుమని ప్రార్థించినాడు. నేను తప్పక భీష్ముని చంపుదునని అర్జునుడు తన పుత్రులపైనను సోదరులపైనను ఒట్టు పెట్టుకొనినాడు. అంతతో భగవానుఁడు మరల అర్జునుని రథము నెక్కినారు.

అర్జునుడు భీష్మునితో కొనసాగించదగు యుద్ధము ప్రజ్వలించినది. అప్పుడాతని యుద్ధమును శత్రువులుకూడ ప్రశంసించినారు. దుర్యోధనుని సైన్యము చాల నష్టపడినది. అంతతో సూర్యుడస్తమించగా మూడవనాటి యుద్ధము ముగిసినది.

ఈనాటి యుద్ధరంగములోని భగవానుని దృశ్యమునే పోతనామాత్యులు భాగవతమున చక్కగా చిత్రించినారు. ఆ చిత్రణము భీష్ముని హృదయపుండరీకమున ధ్యానగమ్యమై వెలువడినది.

సీ. కుప్పించి యెగసిన గుండలంబులకాంతి
గగనభాగం బెల్ల గప్పికొనగ
నురికిన నోర్వక యుదరంబులో నున్న
జగముల వ్రేగున జగతి గదల
జక్రంబుజేబట్టి చనుదెంచురయమున
బై నున్న పచ్చని పటము జార
నమ్మితి నాలావు నగుబాటు సేయకు
మన్నింపు మని క్రీడి మరలదిగువ

తే. గరికి లంఘించుసింహంబుకరణి మెరసి
నేడు భీష్ముని జంపుదు నిన్నుగాతు
విడువు మర్జునయనుచు మద్విశిఖవృష్టి
దెరలి చనుదెంచు దేవుండు దిక్కునాకు.

ఈనాటి యుపన్యాసము పోతనామాత్యుని భాగవతరత్న పఠనముతో ముగిసినది —.

మహాశయులారా !

మనమిప్పుడు మహాభారతమున యుద్ధరంగమునం దుంటిమిగదా ! నిన్న మూడవనాటి యుద్ధము ముగిసినది. భక్తులపై భగవానుని అనుగ్రహమెంత గొప్పదో మీకు అర్థమైనది. భీష్ముని వీరరసము భక్తిరస ప్రపూరితమై ఎట్లు లోకోత్తరమయ్యెనో నిన్న మీరు గ్రహించినారు. నేడు నాల్గవరోజు. నేడును ఘటోత్కచుని ప్రభావము కౌరవులపై ప్రభావితము గాగా దుర్యోధనునకు జయము కలుగలేదు. సూర్యాస్తమయ కాలమునకు ఈనాటి యుద్ధమును ముగిసినది. దుర్యోధనుని మనస్సు క్రుంగినది. రాత్రికాలమున దుర్యోధనుడు భీష్ముని మందిరమున కేగినాడు. ఎందుకు ?

పాండవులకంటె బలాఢ్యులై యున్న భీష్మద్రోణులుండగా పాండవులకు దిగ్విజయమెట్లు కలుగుచున్నది ? ఈ సందేహము భీష్ముని ముఖముననే తేల్చుకొనదలచినాడు. భీష్మునివద్దకేగి సూటిగ ప్రశ్నించినాడు. 'మీరింత బలాఢ్యులైయుండియు పాండవులనేల దయతలచు చుంటి'రని.

దుర్యోధనుని మూర్ఖత్వమునకు భీష్ముడు చింతించి, కృష్ణార్జును లెవ్వరో దుర్యోధనునకు చెప్పినాడు.

గంధమాదన పర్వతముపై ఒకానొకప్పుడు నారదాది మునీంద్రులతో భగవానులు కూడియుండగా బ్రహ్మాది దేవతలు భూభారహరణార్థముగ భగవానుని అవతరింపమని ఆ బ్రహ్మణ్యుని విశ్వరూపునిగ ధ్యానించి, ప్రార్థించుటయు ఆతడట్లే అవతరింతునని బ్రహ్మాదులకు వరమిచ్చుటయు నను ఉపాఖ్యానమును చెప్పి, సాక్షాత్పరమేశ్వరుడగు శ్రీకృష్ణుడటు ఉండగా నీకు జయము కలుగదని స్పష్టపరచినాడు.

దుర్యోధనుడా యుపాఖ్యానమును వినమ్రుడై వినెనుగాని యుద్ధమును మాత్రము మానలేదు. మరునాడు యుద్ధము తప్పలేదు.

అయిదవరోజు యుద్ధమును, ఆరవరోజు యుద్ధమును, ఏడు యెనిమిదిరోజుల యుద్ధములుకూడ ఘోరాతిఘోరములై నడచినను దుర్యోధనుని పక్షమున జయసూచనలేవియు పొడసూపలేదు సరిగదా: ఏడుగురు సోదరులుగూడ భీమునిచేతిలో చచ్చినారు. దీనికి కారణము భీష్మునికి పాండవులపైనగల పక్షపాతమేనని దుర్యోధనుని నిశ్చయము.

మరల ఎనిమిదవనాటి రాత్రి దుర్యోధనుడు భీష్మునియొద్దకేగి పాండవపక్షపాతమున నీవు యుద్ధము చేయుచుంటివని పొడుపుమాటలతో చాల నొప్పించి పలికినాడు. భీష్ముని హృదయమున దుర్యోధనుని పలుకులు నారాచములై గ్రుచ్చుకొన్నవి. కాని ఆతడు రేపు నా ప్రభావము చూడుమని దుర్యోధనుని తృప్తిపరచి పంపినాడు.

తొమ్మిదవనాటి యుద్ధము ప్రారంభమైనది. ఈనాడు భీష్ముడు సర్వతోభద్ర వ్యూహమును నిర్మించినాడు. పాండవులు మహా వ్యూహమును నిర్మించినారు. యుద్ధము సాగినది. పాండవబలమును భీష్ముడు నిలువనిచ్చుటలేదు. సైన్యము పారిపోవ నారంభించినది. శ్రీకృష్ణులు అర్జునుని ఉత్సాహపరచెనుగాని అర్జునుని పరాక్రమము విజృంభింప సమర్థముకాలేదు. ఒకవిధముగ అర్జునునకు పూజ్యార్హుడగు భీష్ముని నేనెట్లు కొట్టుదునన్నభావ మంకురించి ఆతనిని వెనకంజ వేయుచున్నదికూడ. మరల ఆరోజున శ్రీకృష్ణుడు చక్రము పట్టక తప్పలేదు. అదియే భీష్మునకు కావలసిన మహాఫలము. ఆతని దర్శనమును కాంక్షించియే భీష్ముని ఈనాటి యుద్ధముకూడ. తనపై క్రోధతామ్రేక్షణుడై దూకుచున్న శ్రీకృష్ణుని దివ్యమంగళవిగ్రహమును భీష్ముడు దర్శించగా ఆ మహనీయు డాతనికి పుండరీకాక్షుడయ్యే కనబడెనుగాని క్రోధతామ్రేక్షణుడై కనబడలేదు. రమ్ము! రమ్ము! పుండరీకాక్ష! అని సంబోధించినాడు. కొట్టుము! కొట్టుము! నేను నీకు దాసుడను అని శరణు పొందినాడు.

'ఏహ్యేహి పుండరీకాక్ష దేవ దేవ నమోస్తు తే
ప్రహరస్వ యథేష్టంవై దాసోస్మి తవచానఘ'

అయ్యును శ్రీకృష్ణునిచేతి చక్రమున భీష్మునిపాతము జరుగలేదు. అంతతో అర్జును డుత్సాహపూరితుడై యుద్ధమును చేయసాగెను. నిజమునకు అర్జునుని యుద్ధమునకు పురిగొల్పుటే శ్రీకృష్ణుని ముఖ్యోద్దేశ్యము. తొమ్మిదవనాటి యుద్ధమును ముగిసినది.

యుద్ధవర్ణనము చాల సంగ్రహమైనదని మీరు భావించవద్దు. యుద్ధపర్వము లందలి ముఖ్యవిషయముల ప్రపంచించుటే మన ప్రవచన విధానము. నేటి యుద్ధమున యుధిష్ఠిరుని సైన్యమునందలి వీరవరుల నందరిను భీష్ముడు ఏరి యేరి చంపినాడు. ధర్మజు డీనాటితో యుద్ధమును విరమింప నిశ్చయించినాడు. విరమించుటకాదు. అరణ్యములకు మరల పయన మగుటకుకూడ సిద్ధమై శ్రీకృష్ణునకు తన అభిప్రాయమును తెలుపదలచినాడుకూడ.

అది అర్ధరాత్రిసమయము. ధర్మజునకు నిద్రపట్టలేదు. కౌరవుల శిబిరములు చాల ప్రశాంతముగనే యున్నవి. నేటి యుద్ధము దుర్యోధనునకు తృప్తిని కల్పించినది. రేపటిదినమున పాండవ రాజ్యలక్ష్మి తనను వరించుననియే తలచినాడు.

దైవము చాల చిత్రమైనది. ధర్మజుని నీతివైశద్యము లోకోత్తరము. ఆనాటి అర్ధరాత్రి సమయమున తన ముఖ్యుల నందర నొక్కచో చేర్చినాడు. శ్రీకృష్ణుడును అందుండెను. వృష్ణివీరులను సృంజయులనుకూడ అందుండిరి. భీష్ముని జయించు టెట్లు ? అందరును ఆలోచించిరి. శ్రీకృష్ణునివలనగాని, అర్జునునివలనగాని సమాధాన మేమియు రాలేదు. ఇతరుల సంగతి చెప్పెడి దేమున్నది ? ధర్మజు డొక నిశ్చయమునకు వచ్చినాడు. ప్రస్తుతమున తాను మరల అరణ్యముల కేగుటే యుక్తమని నిర్ణయించుకొనినాడు. ఇప్పటికి తాను చేసిన తప్పుకు

చాల చింతించినాడు. తాను చేసిన దోషమేమి? భీష్మునితో యుద్ధమునకు పూనుకొనుటయే తన దోషమని అతని నిర్ణయము. ఈ విషయములనే శ్రీకృష్ణునకు విన్నవించుకొనినాడు. వనమునకు వెళ్ళుటచే కలుగు లాభ మేమన? ఆత్మశ్రేయము యుద్ధమున కలుగదుగాన అరణ్యమున కేగి శ్రోయోమార్గము నవలంబించుట అతని ఆశయము. కృష్ణునితో అతడు చెప్పినమాట యిది —

'ఆత్మనోబుద్ధిదౌర్బల్యాద్భీష్మమాసాద్య సంయుగే
వనం యాస్యామి దుర్ధర్ష శ్రేయోవై తత్ర మే గతం'

బ్రతుకుపైన ధర్మజునకు చాల యిష్టమున్నది. కాని బ్రతుకుట అతని దృక్పథమున భోగానుభవములకు కాదు. ధర్మాచరణమునకే తన బ్రతుకని అతని లక్ష్యము. సోదరుల బాధలను, ద్రౌపది పడినపాట్లు తలచితలచి అతడు బాధపడినాడు.

శ్రీకృష్ణుడు ధర్మజుని కదలనిచ్చునా! భీష్ముని తానొక్కడనే చంపెదనని వాగ్దానముచేసి ధర్మజునకు ధైర్యమును పురిగొలిపినాడు. మరి నేను యుద్ధమును చేయను. అని తాను ప్రతిజ్ఞను చేసెగదా! ఆ ప్రతిజ్ఞ యేమగును?

భగవానునకా ప్రతిజ్ఞ లెక్కలేదు. పాండవుల కెవ్వడు శత్రువో వాడు తనకును శత్రువే. ఎవ్వరు పాండవులకు హితులో వారందరును తనవారే. తనవారందరును పాండవులకు బంధువులు. పాండవులకు బంధువులందరును తన బంధువులు. ఇదియే భగవానులమాటను వినుడు.

'యశ్శత్రుః పాండుపుత్రాణాం మచ్ఛత్రుస్స నసంశయః
మదర్థాభవదీయాయే యే మదీయాస్తథైవ తే'

ఇది పాండవులందరగురించి చెప్పినమాట. అర్జునుని ప్రత్యేకత వేరుగనున్నదట.

'తవ భ్రాతా మమ సఖా సంబంధీ శిష్యఏవ చ
మాంసాన్యుత్కృత్యదాస్యామి ఫాల్గునార్థే మహీపతే'

ధర్మజా ! నీ సోదరుడు నాకు స్నేహితుడును, బంధువును శిష్యుడు కావున అతనికొరకై శరీరమును కోసియిత్తును-అనినాడు. కావున అతని ప్రతిజ్ఞను వదలుకొనియే భీష్ముని చంపుటకు వాగ్దాన మిచ్చినారు. భక్తరక్షణమొక్కటే అతనికి త్రికాలసత్యమగు ప్రతిజ్ఞ. కావున ధర్మజుని వనమునకేగవద్దనినారు. అర్జునుడు దేవతలనైనను జయింపసమర్థుడై యుండగా భీష్మునేల వధింపడు ? భీష్ముని తప్పక చంపును ధర్మజా ! అని బల్లగ్రుద్దినాడేగాని ధర్మజుని యుద్ధత్యాగమున కాతడొప్పుకొనలేదు. ధర్మజుడును శ్రీకృష్ణుడు యుద్ధము చేయుట కిష్టపడలేదు.

భీష్ముని మరణరహస్యమును భీష్ముడే చెప్పగలడు. ఇందుకాతడు మొదటిరోజుననే వరమిచ్చినాడుగదా ! మనమందరమును భీష్ముని మందిరమున కేగుదమని తన ఆలోచనను శ్రీకృష్ణునకు విన్నవించినాడు. శ్రీకృష్ణునకు ధర్మజుని ఆలోచన బాగనచ్చినది. అందరును ఆరాత్రియే భీష్ముని మందిరమునకు వెళ్ళనిశ్చయించుకొనినారు.

అది భీష్ముని నివాసమందిరము. పాండవులును శ్రీకృష్ణుడుకూడ చేత విల్లును ధరించక, కవచముల విప్పి భీష్మునియొద్దకు వెళ్ళగా ధర్మజుడు తాతగారి పాదములకు ప్రణమిల్లినాడు. అది శరణాగతిగాని సామాన్యమగు ప్రణామముకాదు.

భీష్ముడు శ్రీకృష్ణపాండవులకు స్వాగతముపలికి, ధర్మజా ! మీ కేమికావలసిన దానిని కోరుకొమ్మని సర్వస్వతంత్రుడై వర మిచ్చినాడు.

'సర్వాత్మనాపి కర్మాస్మి యదపిస్యాత్సుదుష్కరం'

ఇప్పుడు ధర్మజునకు వేరొక వరమేమికావలెను ? ప్రకృతమున భీష్ముని ప్రాణదానమునకై వచ్చిన ప్రతిగ్రహీత. కావున వినయపూర్వకముగా మిమ్ముల వధించుటకు తగు నుపాయమును మీరే చెప్పవలెనని అర్థించినాడు. ఎంతమాట ! ధర్మజునికెంత గుండె ! న్యాయ ధర్మములిట్లుండునా ? పాండవులకిది న్యాయమేనా ? అందురా ? ఇదియే న్యాయము. ఇదియే ధర్మము. మహనీయులగువారల అనుగ్రహమునకు పాత్రులయ్యే వారిని జయింపవలెను. అహంకారముచే వారిని జయించుట సాధ్యముకాదు. భగవంతుని అనుగ్రహముతోడనే ఆతని మాయనుదాటి భగవంతుని జయించవలెను. భీష్ముడు పాండవులకు శత్రువు కాదు. వారికతడు పూజ్యుడు.

అందును భీష్ముడు స్వచ్ఛందమరణము కలవాడుగదా ! ఆతడెప్పుడు తన దేహమును వదలదలచెనో ఏవిధముగ వదలదలచెనో ఎవ్వడెరుగును ? కావున ఆతనినే ధర్మజుడు ప్రశ్నించినాడు, యథార్థమున దుర్యోధనునకు భీష్మద్రోణులు స్థూలశరీరమునిచ్చి, పాండవులకు తమ మనోమయదేహమును పంచినారు. సత్యమునకు దుర్యోధనుడు కోరినది కూడ వారి దేహదార్ఢ్యమునేగాని వారి అనుగ్రహమునుకాదు. కావున ధర్మజుడు మీ అనుగ్రహమును నాకిమ్మని కోరినాడు. వారట్లే తమ ప్రేమపూర్వకమగు హృదయమును ధర్మజునకొసంగి తమ బాధ్యతను మాత్రము దుర్యోధనున కందించినారు. కాకున్నచో ధర్మజుడు నీ మరణరహస్యమును చెప్పుమన్నచో వారేల చెప్పుదురు ? వారీ భూలోకమునుండి మనుష్యదేహమును విసర్జించవలెనన్న పాండవుల సాయము వారికి తప్పక కావలెను. భీష్ముని దేహపాతమునకు శిఖండి వచ్చెను. ద్రోణునకు దృష్టద్యుమ్నుడుండెను. కాని వారును నిమిత్తమాత్రులే. భీష్మద్రోణుల బలములట్టివి. ఇప్పుడు భీష్ముడు ధర్మజునకేమి సమాధానము నిచ్చెనో తిలకింపుడు. ధర్మజా ! నన్ను జయింప సమర్థులగు

వారు ఇద్దరే. ఒకడు కృష్ణుడు. రెండవవాడు ధనుంజయుడు. వేరొకరు సమర్థులుకారు. కావున శిఖండిని మీరు ముందుంచుకొని ఈనాడు యుద్ధమును సాగింపుడు. అతడు మొదట స్త్రీగా జన్మించి తరువాత పురుషత్వమునొందినవాడు. అతనిపై నేను బాణముల ప్రయోగింపను. కావున అతనిని ముందుంచుకొని అర్జునుడు అతని వెనుకనుంచి బాణముల వేయుచో నేను జయింపబడుదును. అంతియే. వేరొకరి బాణములు నన్నొంపజాలవు. ఇది భీష్ము డిచ్చిన సమాధానము. దీనివలన తేలిన దేమి ? నేను నా పరాక్రమమును చూపని సమయమున నన్ను కొట్ట వలసినదేగాని నా పరాక్రమముచూపువరకును నన్ను జయించలేరని చెప్పినట్లు తేలినది. అంతేకాదు. అప్పుడును నా దేహము కూలిపోవలె నన్న సామాన్యుల బాహుబలము చాలదనిచెప్పి, గాండీవ వినిర్ముక్తము లగు నారాచములే నా శరీరమును పడవేయగలవనినాడు. ఇంతేకాదు యుద్ధరంగమున భీష్ముని దేహపాతమెట్లైనదో కూడ మీరు గమనించి నచో పాండవుల న్యాయము మీ కర్థము కాగలదు.

కథకు రండు.

ఆరాత్రి శ్రీకృష్ణుడును, పాండవులును వారివారి శిబిరములకు జేరినారు. తెల్లవారినది. భీష్ము డానాటితో దేహమును విసర్జింప దలచినాడు. అయ్యును అతడింక కొంతమంది వీరులను పరలోకమునకు పంపవలెను. వారినికూడ ఈ పుణ్యక్షేత్రమున కూల్చి, వారికిని వీర స్వర్గమును కల్పించిగాని అతడు యుద్ధవిరమణను గావింపడు.

ఒక్కమాట.

ఈనాడు మరల అర్జునునకు భగవానులు గీతాసారమును బోధింప వలసి వచ్చినది. కారణ మేమందురా ? భీష్ముని తన చేతులారా చంపుట కర్జును డియ్యకొనలేదు. భీష్ముని నేను చంపజాలనని శ్రీకృష్ణునితో మొర పెట్టుకొని కన్నీరు గార్చినాడు. శ్రీకృష్ణుడు మరల క్షత్రియధర్మమును జ్ఞాపకము చేయగా అర్జునుడు యుద్ధమునకు పూనుకొనినాడు.

# శిఖండితో యుద్ధం

కురుక్షేత్ర సంగ్రామరంగమున యుద్ధభేరులు మ్రోగినవి.

నాడు పాండవసైన్యమున కగ్రభాగమున నిలిచినది శిఖండియే. విరాటుడును, శతానీకుడునుగూడ ఈ నా దగ్రగణ్యులై రణరంగమున నిలిచినారు. శతానీకుని యుద్ధము ఈనాటితో సమాప్తము కావలెను.

ద్వంద్వయుద్ధ సంకులయుద్ధములు కొనసాగినవి. దుర్యోధనుని సైన్యమునందనేక ఉత్పాతములు తోచుటచే ఈనాడు ద్రోణాచార్యులు భీష్ముని మరణమునుగూర్చి శంకించినారు. శంకించుట గాదు. అశ్వత్థామను పిలచి ఈ విషయములను చెప్పినారుకూడ. ఆ ఉత్పాతములలో కౌరవేంద్రుని దేవతాయతనములందలి విగ్రహములు నృత్యముల సలుపుట, నవ్వుట, ఏడ్చుట మొదలగువాటిని అతడు గమనించినాడు.

పాండవసైన్యమున భీముడొకవంక తానొక్కడై విజృంభించుట కాక అర్జునునితోకూడ కలసి వారిద్దరుమ విజృంభించుట జరిగినది. మరియొకవంక భీష్ముడు విజృంభించి తానీనాడు నెరవేర్చదగు యుద్ధకర్తవ్యమును అతివేగమున నెరవేర్చుచుండెను. ఇట్లు కొంత సమయము గడచినది. విరాటుని తమ్ముడు శతానీకుడు భీష్మునిచేతిలో మరణించినాడు. శిఖండియు విజృంభించియే యుద్ధమును కొనసాగించుచుండెను. ఇక భీష్ముడు తన కర్తవ్యము ముగిసినదని తలచినాడు. అతడిట్లు భావించినాడు.

నేనిక రాజశ్రేష్ఠుల సంహరింపను అని. అంతియే. వెంటనే యుద్ధరంగమున ధర్మజుని ఆహ్వానించినాడు.

'యుధిష్ఠిర మహాప్రాజ్ఞ సర్వశాస్త్రవిశారద'

ఓ పండితప్రకాండుడవగు ధర్మజా ! అని సంబోధించి పిలిచినాడు. ఇచ్చట భీష్ముడు ధర్మజుని నీవు సర్వశాస్త్రవిశారదుడవగు పండితుడవని సంబోధించుట గమనార్హము. సంబోధించి ఏమనెను ?

'నిర్విణ్ణోస్మి భృంశం తాత దేహేనానేన భారత'

ధర్మజా ! ఈ శరీరమును ధరించుటకు నేను బాధపడుచున్నాను.

'ఘ్నతశ్చ మే గతః కాలః సుబహూన్ ప్రాణినోరణే'

అనేకప్రాణులను బలిగొనుటతో కాలము గతమైనది. కావున-

'పార్థం పురోధాయ పంచాలాన్ సృంజయాంస్తథా
మద్వధే క్రియతాం యత్నో మమచేదిచ్ఛసి ప్రియం'

అర్జునుని పురస్కరించుకొని పాంచాలురను సృంజయులను తోడు తీసుకొని నా వధకు యత్నము గావింపుమనినాడు. అట్లనుటలో కూడ నాకు నీవు ప్రియము చేయదలచినచో తప్పక ఈ యత్నమును చేయుమని స్పష్టపరచినాడు.

ఇట్లు ధర్మజుని ఆహ్వానించుటలోని అంతరార్థమేమి ? నా దేహముతో కావింపదగుకర్మ పరిపూర్ణమైనది. ఇక ఈ ప్రారబ్ధదేహమును నేను వదలదలచినాను. క్షత్రియదేహము యుద్ధరంగముననే పతనము కావలెను. ఆ సంగతి నీకు తెలియును. నీవు శాస్త్రజ్ఞుడవు. కావున నన్ను వధింపదగు యత్నమున బంధుభావమునొందక క్షత్రియధర్మము నవలంబింపుమనియు, నేనే యనుజ్ఞ నిచ్చుచుంటిననియు, ఇందు నీ స్వార్థముకాక నాకు సహాయముచేయుట అవసరమనియు భీష్ముడు ప్రబోధించినాడు. ఈ ఘట్టము ఆంధ్రమునలేదు. తన మరణకాలమును భీష్మడే నిర్ణయించి యుద్ధరంగమున ధర్మజుని ఆహ్వానించుట జరిగినది. యుద్ధమున పాండవుల అన్యాయమును పరిశీలించువారీ ఘట్టములనుకూడ పరిశీలించుట చాల అవసరము.

తరువాతి కథాఘట్టమిది.

భీష్ముని ఆహ్వానమునందుకొని ధర్మజుడు సత్యదర్శనుడై భీష్ముని పైకి యుద్ధమున కేగినాడు.

అర్జునుని సాహాయ్యముతో శిఖండి భీష్మునిపైకి చెలరేగగా సాత్యకి చేకితాన ద్రుపదులును భీష్మునిపైకిపోగా భీష్ముడును వారిని నివారించుచుండెను. యుద్ధము సాగుచునే యుండెను. భీష్ముడింకను తన బాణవేగమును తగ్గించలేదు. అట్లు కొంతసమయము గడచినది. ప్రచండ మార్తాండుని కిరణసహస్రముల వేడిమియు తగ్గుదలయైనది. భీష్ముడిట్లు చింతించినాడు.

'కృష్ణభగవానుని సాయము లేకున్న నేనీ పాండవులనందర ఒక్కబాణమున త్రుంపగలను. భగవానుని సాయము వారికి సంపూర్ణమై యున్నది. అంతేకాదు. పాండవులవధ్యులుకూడ. వారి దేహములు రణరంగమున కూలునవి కావు. ఇక నా కర్తవ్యము యుద్ధము కాదు. నేనును అవధ్యుడనే. ఇది నాతండ్రి యిచ్చినవరము. కావున నేనిక మృత్యువును ఆహ్వానించెదను.

ఇది భీష్ముని నిర్ణయము. కాని ఈతని నిర్ణయమునకు ఋషులును, దేవతలునుగూడ అనుమతించవలెను. ఇది దేవకార్యము. అంతలో ఋషులును అష్టవసువులును ఆకాశమున నిలిచి భీష్ముని సంకల్పమును దృఢపరచినారు. అప్పుడే దేవదుందుభులు మ్రోగినవి. మలయ మారుతములు వీచినవి. పుష్పవర్షములు కురిసినవి. ఇదంతయు రణ రంగమున నిలిచినవా రెవ్వరును ఎరుగరు. సంజయుడు మాత్ర మెరుగును. మహర్షు లందరును భీష్ముడు పడిపోవును, పడిపోవునని పలుకుటయు సంజయుడు వినెను.

కాని ఒక్క సంగతి.

భీష్ముడు ఋషుల ప్రసంగములను విని యుద్ధమును మానలేదు. చూచువారల కాతడు యుద్ధము చేయుచునే కనంబడెను. అది నిమిత్త మాత్రమగు యుద్ధము. ఇవియే దేవరహస్యములు. మహనీయుల కర్తవ్యము లిట్లే యుండును. భీష్ముని మరణకాలము సన్నిహితమైనది.

దుశ్శాసనుడు భీష్ముని రక్షించుటకై ఆతనికి సహాయకుడుగ ఉండెను.

ఆసమయమున భీష్ముడు దుశ్శాసనునితో పాండవులను జయింప లేమని తన అపజయమును సూచించుచుండెను. అంతియే.

భీష్మునిపై అప్పుడే బాణసహస్రములు వర్షధారలై కురిసినవి. అవి శిఖండినుండి వచ్చునట్లు చూచువారలకు కన్పట్టినను భీష్ముడు ఆ బాణము లెవ్వనివో గుర్తెరిగినాడు.

శిఖండి బాణము లింత తీవ్రములై యుండవు. ఇవి అర్జునుని నారాచములు. ముసలములవలె నా ప్రాణముల తీయుచున్నవని వేదన నొందినాడు. అయ్యును ఒక శక్తిబాణము నాతడు చివరసారిగా ప్రయోగించినాడు. అది అర్జునునిచేత ఖండించబడగా మిగిలినవా రందరును ఒక్కమారుగ భీష్మునిపై బాణవర్షముల కురిపించినారు. భీష్ముని శరీరముపైన బాణములు గ్రుచ్చుకొనని ప్రదేశము రెండంగుళములైనను లేదు.

'నతస్యాసీదనిర్భిన్నం గాత్రే ద్వ్యంగుళమంతరం'

అప్పటి కిక సూర్యు డస్తాద్రిని గ్రుంకుటకు కొద్దికాలమే యున్నది. ఇక భీష్ముడు రథముపై తల వాల్చినాడు. దేవతల హాహాకారములను యుద్ధభూమి యందలి వీరవరుల హాహాకారములను చెలరేగగా భీష్ముని దేహము పదియవరోజున రథముపై కూలినది.

ఇందు ఒక పెద్ద చిత్రమున్నది. భారతీయుల రణరంగములు ధర్మప్రధానము లని మీరు మరువరాదు. కేవల భౌతికవాదుల దృక్పథమునం దివి చరిత్రాత్మకములు కావచ్చును. అది వారి దుర దృష్టము. కర్మ భూమియందు పుట్టిన విజ్ఞులకు మాత్రము భారత వీరులు ధర్మప్రధానులగు మహిమాన్వితు లగుటలో సందియముండదు.

## అంపశయ్య

భీష్ముడు తన శరీరమును రథమునందు వంచుకొనెనేగాని ప్రాణములను కోల్పోవలేదు. ప్రాణము లాతని అనుజ్ఞ లేక పయనించవు. అప్పు డాతడు 'భీష్ముడను నేను' అను భావమున లేడు. రథమున కూలుటయే తడవుగా ఆతడు దేవభావము నొందినాడు. కావుననే ఆతడు తన దేహమును భూమిపై ఆనించలేదు.

'రథాత్ప్రతిపతితం చైనం దివ్యోభావ స్సమాదిశత్'

అప్పుడు ఆ రథముపైనున్న భీష్మ దేమి చింతించుచుండెను? దేహ బాధ ననుభవించుచుండెనా? లేదు ఆత డుపనిషత్ప్రతిపాద్యమగు బ్రహ్మమును చింతించుచుండెను. ఆ మహనీయుని ప్రాణవాయువు లాతని స్వాధీనము లగుటచే ఆ ప్రాణవాయువుల ప్రభావమగు దేహాత్మ భావమును అతడు నిగ్రహించగలిగినాడు. వ్యాసభారతి ఆ బ్రహ్మణ్యుని మనోభావము నిట్లు వర్ణించినది ___

'మహోపనిషదం చైవ యోగమాస్థాయ వీర్యవాన్
జపన్ శాంతనవో ధీమాన్ కాలాకాంక్షీ స్థితోభవత్'

మహోపనిషత్తును స్మరించుచుండెనట.

ఎట్లు? యోగముచేత.

మహోపనిషత్తనగా ఓంకారము. భగవద్గీతయం దెనిమిదవ అధ్యాయమునకు ఈతని వర్ణనమే వ్యాఖ్యానము.

యోగులు 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మవ్యాహరన్ మా మనుస్మరన్' ఓంకారమును స్మరించుచు తమ ప్రాణములను విడిచెదరట. అట్టివారు వెళ్ళు లోకములు గీతయందు వర్ణింపబడినవి.

కాని ఇక్కడ భీష్ముడు ఓంకారమును జపించుచుండెనేగాని ప్రాణములను విడువలేదు. కారణమేమి? ఇది దక్షిణాయనము. కావున తా నిప్పుడు లోకాంతరములకు పయనించదలచలేదు. ఆయన అట్లుండగా, గంగయు హంసరూపములతో ఋషులను పంపినది, ఈవిషయమును గుర్తు చేయుటకు.

అతడే గుర్తుగలిగి ప్రాణముల నిలిపికొన్నందుకు ఋషులును, పితృదేవతలును అతని ప్రశంసించినారు.

ఇంతవర కిది భీష్ముని ప్రభావము. ఈ ఘట్టముననే అర్జునుని ప్రభావ మొకటి వర్ణనీయమై యున్నది. కొన్ని యీనాటి విజ్ఞులకు నమ్మరాని సత్యములుగ తోచవచ్చును. వారి సంగతి మనకు వద్దు.

భీష్ముడు రథమున క్రుంగగా యుద్ధ మాగిపోయినది. రెండు పక్షము లందలి వీరులును భీష్ముని ఆశ్వాసింపవచ్చినారు. భీష్ముడు వారందరకును స్వాగతములు పలికినాడు. అంతలో అత డొకవిధముగ భావించినాడు. అర్జునుని ప్రభావమును దుర్యోధనునకు చూపి అతడేమైన బుద్ధిమంతుడు కాగలడేమో ప్రయత్నింతమని.

భీష్ముని శిరము రథముపైనుండి వ్రేలాడుచుండగా శిరమున కాధారము కావలెనని భీష్ముడు కోరినాడు. దుర్యోధనుడు వెంటనే మూదిదిండును తేగా, దానిని కాదని అర్జునునివంక చూచినాడు భీష్ముడు.

వెంటనే అర్జునుడు మూడుబాణములను శిరమున కాలంబనము గావించి, కొన్ని బాణములతో శయ్య నమర్చినాడు. ఆవిధముగ అర్జునుడు చేయకున్నచో భీష్ము డాతని శపింపదలచినాడు. భీష్ముడు దేహమునందలి వ్రణముల మాన్పుటకై వైద్యసహాయమును అందుకొనలేదు. వైద్యులకు ధనము నిచ్చి పంపమనినాడు.

ఆరాత్రి గడచినది.

రెండవరోజున భీష్మునకు పానీయము కావలసివచ్చినది. దుర్యోధనుడు తెచ్చిన పానీయముల నాతడు గ్రహించలేదు. అర్జునుని పిలవగా ఆతడు పర్జన్యాస్త్రముచేత పాతాళగంగను తెచ్చి, భీష్ముని ముఖమునం దాజలధారలు పడునట్లు చేసినాడు. భీష్ము డాసమయమున దుర్యోధనుని పిలిచి దుర్యోధనా! చూచితివా? అర్జునుని ప్రభావ మనినాడు.

అట్లెందుకు చెప్పెను?

భీష్ముని దృష్టియందింకను దుర్యోధను డేమైన పాండవుల ప్రభావమునకు మెచ్చి, సంధి చేసుకొనునేమోయని ఆశ యున్నది. కావున అర్జునుని ప్రభావమును ప్రకటింపజేసినాడు.

శ్రీకృష్ణుని విశ్వరూపమే ఇంద్రజాలమనుకొన్న దుర్యోధనునకిది యొక లెక్కయా? కాక ఆ దుర్యోధనుని దృష్టి అంతయు కర్ణునిపై నున్నదిగదా! ఆతడా యర్జునుని ప్రభావమును లెక్కచేయలేదు.

ఇక పాండవుల సంగతి చూతము.

శ్రీకృష్ణుడు ధర్మజునివద్ద అర్జునుని ప్రభావమును వర్ణించి భీష్ముని జయించుటను ప్రశంసించినారు.

ఇక్కడనే మనమొక ముఖ్యమగు విషయమును గమనింపవలెను.

ధర్మజుడు శ్రీకృష్ణునకిచ్చిన సమాధానమిది —

'తవ ప్రసాదాద్విజయః క్రోధాత్తవ పరాజయః
త్వం హి నశ్శరణం కృష్ణ భక్తానామభయంకరః.'

నీ అనుగ్రహముచేత విజయమును, నీ ఆగ్రహముచేత పరాజయమును కలుగును. నీవే మాకు రక్షకుడవు. నీ భక్తులకు నీ విచ్చు అభయదానమే వారికి రక్ష. అని తన శరణాగతిని తెలిపినాడు.

చూచితిరా ? ఇదియే మహాభారతముయొక్క సారము.

భీష్మునియుద్ధము ముగిసినది. భీష్ముడిప్పుడు అంపశయ్యపైనుండెను. ఆతనిని అందరును పరామర్శించుటగూడ జరిగినది. ఇక భీష్మునివద్దకు వచ్చి, తన ఆదరవాక్యముల విన్నవించదగినవాడు కర్ణుడొక్కడే.

## కర్ణ, భీష్ముల సంభాషణము

కర్ణుడు భీష్ముని దర్శించుటకై వేగిరపడుచునే భయభ్రాంతులతో అంపశయ్యకడకేతెంచినాడు. పెద్దలకు నమస్కారము చేయునప్పుడు తన గోత్రనామములను చెప్పి వందనము చేయవలెను.

కర్ణుడు 'నేను రాధేయుడను. మీకు ద్వేషినై నిత్యమును మీ దృక్పథమున పడుచున్నవాడను' అనుచు భీష్మునకు నమస్కరించినాడు. నిజమునకు కర్ణుడు భీష్మునకు ద్వేషికాడు. కర్ణునిపై భీష్మునకు ద్వేషమెందుకు ? దుర్యోధనునికిని కర్ణునకును భేదము కల్పించుచో దుర్యోధనుడు పాండవులతో యుద్ధమును మానుకొనునను తలంపుతో కురువంశనాశము కాకుండుటకై తన శక్తివంచనలేక యత్నించిన భీష్ముడు కర్ణునిపై ద్వేషమును చూపవలవచ్చినది. ఈ విషయము సామాన్య దృక్పథమున మనకు గోచరింపదు. ఇప్పుడు భీష్మునకును కర్ణునకును జరిగిన సంభాషణను మీరు వినుచో భారతములోని భీష్ముని ప్రవృత్తి బాగుగ తెలియగలదు.

కర్ణుడు భీష్మునకు నమస్కరించగనే భీష్ముడు తనకు రక్షకులై యున్నవారినందరను అవ్వలకు పంపి, ఏకాంతమున కర్ణునితో ఇట్లు మాట్లాడినాడు -

కర్ణా! నీపైన నాకు ద్వేషములేదు. ఇది యథార్థము. నిన్ను నిరుత్సాహపరచుట నా ముఖ్యోద్దేశము. అందుకై నిన్ను పరుషముగ మాటాడినాను. నీవెంతటి వీర్యవంతుడవో ఎరుగక కాదు. నీవు బ్రహ్మణ్యుడవని నాకు తెలియును. నీ దయా సత్య శౌచములు నాకు శంకనీయములు కావు. నీవంటి యుత్తమ పురుషుడు లేడనియు నాకు తెలుసును. వంశనాశమగుటకు ఓర్వ లేక నిన్ను దుర్యోధనునినుండి విడదీయుటకై అట్లు మాట్లాడితి నని చెప్పి, కర్ణుని దగ్గరకుతీసుకొని కౌగలించి, అతని జన్మచరిత్రను చెప్పి, నీ విప్పుడైనను పాండవుల దరిజేరుట నాకిష్టము.

అని తన అభిమతమును చెప్పినాడు.

ఇవి భీష్ముడు కర్ణునితోచెప్పిన మాటలు.

ఇక కర్ణుడు భీష్మునితో చెప్పినమాటలుకూడ మన కవసరములే.

కర్ణుని జవాబిది ___

తమరు చెప్పినమాటలు త్రికాలసత్యములు. అయ్యును నేను దుర్యోధనునిమాత్రము విడిచివెళ్ళను. దైవము చాల బలవత్తరము. మానవశక్తి దైవశక్తిని ఎదుర్కొనజాలదు. ఇప్పుడు జననాశము తప్పదు. పాండవులబలము అపారవారమని నాకును తెలియును.

కాని యుద్ధము మానను. శ్రీకృష్ణు డెవ్వడో, పాండవు లెవరో నేనెరుగుదును. క్షత్రియుడనైన నేను వ్యాధిచే మరణించుట

ధర్మముకాదు. కావున యుద్ధరంగమున కేగియే - యుద్ధము చేసియే - నా సేవాధర్మమును నిర్వర్తించుకొనెద గావున యుద్ధమున కనుజ్ఞ యిమ్మని కోరినాడు.

భీష్ముడో ? ...

'అనుజానామి కర్ణ త్వాం యుధ్యస్వ స్వర్గకామ్యయా
క్షత్రధర్మజితాన్ లోకాన్ అవాప్స్యసి ధనంజయాత్'

కర్ణా ! నీవు యుద్ధమున కేగుట కనుజ్ఞ యిచ్చుచుంటిని. కాని నీవు అర్జునుని చేతిలో స్వర్గమున కేగెదననియే యుద్ధము గావించి వీర స్వర్గమనుభవించుము. నిరహంకారమున యుద్ధము జేసి కృతార్థుడ వగుము.

'ధర్మ్యాద్ధి యుద్ధాత్ శ్రేయోన్యత్
క్షత్రియస్య న విద్యతే'

యుద్ధమున కంటె వేరొకధర్మము క్షత్రియునకు లేదు. అని ఆజ్ఞాపించినాడు.

కర్ణుడు భీష్మునిదగ్గరనుండి వెళ్ళినాడు.

— ఇది భీష్మపర్వము —

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః



# విన్నతి



భక్తులారా!

భారతీయ సంస్కృతిని పెంపొందించు నుద్దేశ్యమున స్థాపించిన మా ఆర్షవిజ్ఞాన గ్రంథమాల ప్రచురించుచున్న మహాభారతోపన్యాసముల ముద్రణకై తగు సహాయము చేయువారికి మా మనవి.

| | |
|---|---|
| మహారాజపోషకులు | రు 1116/- లు |
| రాజపోషకులు | 516/- లు |
| పోషకులు | 116/- లు |

మహారాజ, రాజపోషకులకు వారి చిత్రపటములతో మా కృతజ్ఞతను తెలుపుకొనుచు మాచే ముద్రితమగు పదునెనిమిది పర్వములను వారికి పంపుకొందుము. మొదటి ముద్రణముననే వారి చిత్రపటములు ముద్రించబడును.

పోషకులకు పదిపర్వములు అనగా ధర్మరాజు పట్టాభిషేకము వరకునగు పర్వములు పంపబడును. మొదటిసారి మాత్రము వీరి పేర్లు ప్రకటింపబడును.

కావున భక్తాగ్రేసరులు మా గ్రంథమాలకు తోడ్పడుదురుగాక యని మనవి చేసుకొనుచున్నాము.

ఆర్షవిజ్ఞాన గ్రంథమాల

సత్యనారాయణపురం - విజయవాడ - 520 011

ఈ గ్రంథప్రచురణకు రు. 116/- లు దయచేసిన పోషకులు (తరువాయి)

| | |
|---|---|
| శ్రీ ఆర్. శేషగిరిరావుగారు, ఇ. ఇ., | దరూర్ క్యాంపు (జగిత్యాల) |
| శ్రీ యమ్. వెంకట్రాములుగారు | ,, ,, |
| శ్రీమతి గాపగి ధనలక్ష్మమ్మగారు | పాతపెదపాడు |
| శ్రీ గుండా సత్యనారాయణగారు | చింతలపూడి |
| శ్రీ బండి సదానందమూర్తిగారు | ,, |
| శ్రీమతి ఘంటా వరలక్ష్మమ్మగారు | వేమండ |

అవ్యవధానము కారణంగా ముద్రణసౌలభ్యందృష్ట్యా పై యుదారులను స్థలాంతరమున ప్రకటింపవలసివచ్చినందుకు చింతిస్తున్నాము —

అట్లే XV పేజీలోని చివరిపేరును శ్రీ యన్. వి. సుబ్బయ్యచెట్టి (ఎ. ఇ.) గా సవరించి చదువుకొన ప్రార్థన. — ప్రకాశకులు.